# జె. కృష్ణమూర్తి



## ఈ విషయమై ఆలోచించండి




సోల్ డిస్ట్రిబ్యూటర్స్:-

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, అబిడ్స్, హైదరాబాదు-500 001.

**EE VISHAYAMAI ALOCHINCHANDI**
Telugu Transaltion of the book appearing in Two titles:
in England as *This Matter of Culture* &
in U.S.A. as *Think on These Things.*
Translation into Telugu by C. Hanumantha Rao.


ప్రతులు : 1000

తొలి ముద్రణ : కృష్ణమూర్తి ఫౌండేషన్ ఇండియా, 1991

ద్వితీయ ముద్రణ : జనవరి, 1999





వెల: రూ. 75-00





ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001

విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్, హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: **శ్రీ కళాంజలి గ్రాఫిక్స్** హైదరాబాద్ - 29. ఫోన్: 3229831

# ప్రస్తావన

జె. కృష్ణమూర్తి (1895 – 1986) విశ్వవిఖ్యాత తత్త్వవేత్త. ప్రపంచంలోని వివిధ దేశాలను పర్యటిస్తూ, అరవయి సంవత్సరాలపాటు ప్రజలకు జీవనసందేశాన్ని తమ ప్రసంగాల ద్వారా అందజేశారు.

"ఒక నిర్దిష్టమైన మార్గం ద్వారా 'సత్యా'న్ని చేరలేము. 'సత్యం' అనేది మార్గంలేని ప్రదేశం. సంస్థల ద్వారా, నమ్మకాల ద్వారా, పూజా పునస్కారాల ద్వారా, గురువుల ద్వారా దాని చెంతకు చేరలేము. ఆధ్యాత్మిక బోధనలవల్ల, మానసిక వికాసానికై చేసే ప్రక్రియల వల్ల దానిని అందుకోలేము. ఇతరులతో గల సంబంధాలు అనే దర్పణం సహాయంతో మనలను మనము పరిశీలిన చేసుకొని అర్థం చేసుకొనడం ద్వారా మాత్రమే యీ పని సాధ్యం అవుతుంది" – అని వక్కాణించారు.

కృష్ణమూర్తి ఉపన్యాసాలు, రచనలు అన్నీ ఇంగ్లీషులోనే సాగాయి. భారతీయ భాషలు కొన్నింటిలోకి కొన్ని ప్రసంగాల, పుస్తకాల అనువాదం యిప్పటికే జరిగింది. కృష్ణమూర్తి ఆలోచనా ప్రవంతిని యథాతథంగా, యితర భారతీయ భాషలలో సరళమైన శైలిలో అందించాలనే వుద్దేశ్యంతో కృష్ణమూర్తి ఫౌండేషన్ యిండియా స్వయంగా అనువాద కార్యక్రమాలను ఆరంభించింది. ఆ ప్రయత్నంలో భాగంగా తెలుగు, తమిళం, మలయాళం, కన్నడ భాషలలో అనువాదాల ప్రచురణను మద్రాసు కేంద్రంగా చేసుకొని నిర్వహిస్తున్నాము.

ఈ పుస్తకాల సహాయంతో కృష్ణమూర్తి ఆశించిన నవ మానవ ఆవిర్భావం, నవ్య సమాజ అవతరణ గురించి చదువరులు తమ తమ భాషల్లోనే చదివి అర్థంచేసుకొనడానికి వీలవుతుందని ఆశిస్తున్నాం. కృష్ణమూర్తి తత్త్వదర్శనాన్ని తరచి చూసుకొని, అవగాహన చేసుకొనడానికి, ఆచరణలోనికి తీసుకురావడానికి యీ పుస్తకాలు దోహదం చేస్తాయి. పాఠకులు వీటిని ఆదరిస్తారని నమ్ముతున్నాము.

ఎ. గజాననరావు

సమన్వయకర్త

దక్షిణభాషల అనువాద విభాగం

కృష్ణమూర్తి ఫౌండేషన్, ఇండియా

వసంత విహార్,

గ్రీన్ వేస్ రోడ్డు,

మదరాసు – 600 028.

# అనువాదకుని తొలిపలుకు

జిడ్డు కృష్ణమూర్తి ప్రతి సంవత్సరము తాను చేసెడి ప్రపంచ పర్యటనలో ఒక భాగముగా నవంబరు–ఫిబ్రవరి నెలల మధ్య షుమారు మూడు నెలలపాటు భారతదేశములో పర్యటిస్తూ వుండేవారు. వారి ప్రసంగాలు సాధారణంగా ఢిల్లీ, వారాణసి, మద్రాసు, రిషివ్యాలీ, బొంబాయిలలో జరుగుతూ ఉండేవి. వారాణసిలోను, రిషివ్యాలీలోను వారు చేసిన ప్రసంగాలు ప్రధానంగా అక్కడున్న తమ పాఠశాలలలోని విద్యార్థుల నుద్దేశించి చేసినవి.

వారాణసిలోని తమ రాజఘాట్ బెసంట్ స్కూలు విద్యార్థుల నుద్దేశించి 1954 వ సంవత్సరము డిసెంబరు నెల 27 వ తేదీ మొదలుకొని 1955 వ సంవత్సరము ఫిబ్రవరినెల 8 వ తేదీ వరకు ఆయన మొత్తం 27 ప్రసంగాలు చేసియుండిరి. ఇంత దీర్ఘకాలము వారొకేచోట నిలిచి ప్రసంగించిన సందర్భము లరుదు. ఆ 27 ప్రసంగాలున్ను పరిష్కరింపబడి This Matter of Culture అనే పేరుతో ఇంగ్లండులోను, Think on These Things అనే పేరుతో అమెరికాలోను ప్రచురింపబడినవి. వాటి కనువాదమే యీ పుస్తకము.

ఒక భాషలో నుండి మఱియొక భాషలోనికి సరియైన అనువాదము సుకరము కాదని అందరికిని తెలిసిన విషయమే. అందులోను కృష్ణజీ రచనలు అనువాదానికి సులభముగా లొంగునవి కావు. అయినా ఈ ప్రస్తుతానువాదములో మూలమునకు న్యాయము చేకూర్చడానికై యథాశక్తి ప్రయత్నింపబడినది.

ఈ ప్రసంగాలు పేరుకు విద్యార్థులనుద్దేశించి చేసినవే యైనప్పటికిన్ని పెద్దలకు గూడ, కృష్ణజీని అర్థము చేసికొనడంలో మిక్కిలి తోడ్పడగలవు. సోదరులైన తెలుగుదేశ ప్రజలు ఈ యనువాదమువలన ప్రయోజనము పొందగలరని ఆశిస్తున్నాను.

* * *

# విషయసూచిక


| | | | పేజీ |
|---|---|---|---|
| 1. | చదువు – దానియొక్క ప్రయోజనము | ... | 1 |
| 2. | స్వతంత్రము – విముక్తి | ... | 9 |
| 3. | స్వతంత్రము – ప్రేమ | ... | 16 |
| 4. | వినడం | ... | 25 |
| 5. | సృజనాత్మకమైన అసంతుష్టి | ... | 32 |
| 6. | జీవిత సమగ్రత | ... | 40 |
| 7. | పేరాశ | ... | 47 |
| 8. | క్రమబద్ధమైన ఆలోచన | ... | 54 |
| 9. | విముక్తమగు మనస్సు | ... | 62 |
| 10. | అంతస్సౌందర్యము – ప్రేమ | ... | 69 |
| 11. | ధ్యానము | ... | 77 |
| 12. | అభయ భావన | ... | 85 |
| 13. | సమానత్వము | ... | 93 |
| 14. | క్రమశిక్షణ – ఒక పెద్ద సమస్య | ... | 101 |
| 15. | పరస్పర సహకారము | ... | 109 |
| 16. | జరామరణములు లేని మనస్సు | ... | 121 |
| 17. | జీవితప్రవాహము | ... | 130 |
| 18. | మనస్సులోని ఆకాశము | ... | 140 |
| 19. | రెండువిధములైన జ్ఞానము | ... | 150 |
| 20. | సత్యము – సౌందర్యము | ... | 159 |
| 21. | నేర్చుకొనడము | ... | 167 |
| 22. | సున్నితమైన మనస్సు | ... | 176 |
| 23. | ఏకాంత వాసము | ... | 186 |
| 24. | క్రమశిక్షణ – శక్తిక్షీణత | ... | 196 |
| 25. | జీవితములోని ఆనందము | ... | 205 |
| 26. | సత్యము – మనస్సునకందనిది | ... | 214 |
| 27. | ధార్మిక జీవనము | ... | 223 |


★ ★ ★

N.B చాల మెల్లగా, ఒక్కొక్క వాక్యమునే అర్థము చేసికొంటూ చదివితేనేగాని కృష్ణజీ రచనలు బోధపడవు. గబగబా చదివి దూరంగా పెట్టివేయదగినవి కావివి.

# ప్రశ్నల సూచిక


| వ.నెం. | | | పేజీ |
|---|---|---|---|
| 1. | 1. | అందరు మనుష్యులు ఎదురుతిరిగితే ప్రపంచంలో అల్లకల్లోల మేర్పడదంటారా మీరు? ... | 5 |
| | 2. | ఎదురు తిరిగి ప్రశ్నించడం, నేర్చుకోవడం, ప్రేమించడం – ఈ మూడున్ను మూడు వేర్వేరు ప్రక్రియలా, లేక ఒకే సమయంలో జరిగేడివా? ... | 6 |
| | 3. | సంగ్రహణ శీలతమీద, ఆశలు ఆకాంక్షలమీద నేటి మానవ సంఘం ఆధారపడివున్నమాట నిజం. కాని, అట్టి కోరికలే లేకపోతే మనము క్షయించిపోమా? పెరుగుదల ఆగిపోదా? ... | 6 |
| | 4. | పెక్కు ఇతర దేశములలో వలె, ఇండియాలోను విద్యా విధానము ప్రభుత్వాధీనంలో వున్నది. అట్టి పరిస్థితిలో, మీరు చెప్పేరకం ప్రయోగములను కొనసాగింపవలెనంటే సాధ్యమా? ... | 8 |
| 2. | 1. | 'తెలివి' అంటే ఏమిటి? ... | 12 |
| | 2. | మొరటు మనస్సు సున్నితమైన మనస్సుగా మారగలదా? ... | 13 |
| | 3. | తల్లిదండ్రులు మరియు ఉపాధ్యాయుల సహాయం లేకుండా పసిపిల్లవాడు తానెవరో ఎట్లు తెలిసికోగలడు? ... | 14 |
| | 4. | పల్లెలలో దెయ్యం పట్టడం లాంటి విషయాలను చూచినా మని, తమకు దెయ్యాలు భూతాలు అంటే భయమని పిల్లలు చెప్పతూ వుంటారు. 'చావు' అంటే యేమి టని కూడ వారడుగుతారు. దీని కంతకు ఏమని సమాధానమివ్వాలి? ... | 15 |
| 3. | 1. | కోరికకు మూలమేమి? దాని నెట్లు తొలగించగలను? ... | 19 |
| | 2. | సమాజంలో ఉన్నంతకాలం ఒకరిమీద నొకరు ఆధార పడకుండా ఎట్లా ఉండగలం? ... | 20 |
| | 3. | మనుషులెందుకు కొట్లాడుకొంటారు? ... | 22 |
| | 4. | అసూయ అంటే యేమిటి? ... | 22 |
| | 5. | నేను దేనికిని ఎప్పుడును తృప్తిపడను, ఎందువలన? ... | 23 |
| | 6. | మేమెందుకు చదువుకోవాలి? ... | 24 |
| | 7. | సిగ్గంటే యేమిటి? ... | 24 |

| | | | |
|---|---|---|---|
| 4. | 1. దేవున్ని పూజించడం నిజమైన మతము కాదా? | ... | 28 |
| 5. | 1. అసంతుష్టి గనక వుంటే సరళంగా స్పష్టంగా ఆలోచింపలేము. ఈ అవరోధాన్ని మనమెట్లు అతిక్రమించగలము? | ... | 35 |
| | 2. ఆత్మజ్ఞాన మనగానేమి? అది మనకెట్లు లభిస్తుంది? | ... | 37 |
| | 3. ఆత్మ లేదా జీవాత్మ అంటే యేమిటి? | ... | 38 |
| 6. | 1. కీర్తిప్రతిష్ఠలు పొందాలని మనమెందుకు కోరుకొంటాము? | ... | 42 |
| | 2. మీ చిన్నప్పుడు మీరు వ్రాసిన ఒక పుస్తకంలో, "ఇవి నా మాటలు కావు, ఇవి నా దివ్యగురువు యొక్క మాట" లని వ్రాసినారు. కాని, యిప్పుడు ఎవరికి వారాలోచించుకోవలసిందేనని పట్టు బట్టుతున్నారు. ఎందువలన? మీ దివ్య గురువు ఎవరు? | ... | 42 |
| | 3. మనిషికి గర్వమెందుకు? | ... | 44 |
| | 4. ఏది అందమైనదో, ఏది కాదో పిల్లలమైన మాకు ముందు గానే చెప్పడంచేత ఇక జీవితమంతా 'ఇది అందమైనది, యిది కాదు' అని చెప్పుకొంటూ పోతాం. నిజంగా అందమైనదేదో, కానిదేదో ఎట్లా తెలిసికోవడం? | ... | 45 |
| | 5. క్షమించండి. ఇంతకున్నూ మీ దివ్యగురు వెవరో చెప్పనే లేదు. | ... | 45 |
| 7. | 1. మీరెందుకు సిగ్గుపడతారు? | ... | 50 |
| | 2. మన దైనిక జీవితంలో సత్యము నెట్లు తెలిసికొనగలము? | ... | 50 |
| | 3. ప్రతిమలు, గురువులు, మహాత్ములు, ఋషులు మనకు సరియైన ధ్యానమార్గమును చూపరా? | ... | 52 |
| | 4. విద్యార్థి యొక్క కర్తవ్యములేమిటి? | ... | 52 |
| | 5. గౌరవమునకు ప్రేమకు గల భేదమేమి? | ... | 53 |
| 8. | 1. కోపమనగా నేమి? ఎవరికైనా కోపమెందుకు వస్తుంది? | ... | 57 |
| | 2. మనం మన తల్లులను ఎందుకెక్కువగా ప్రేమిస్తాము? | ... | 58 |
| | 3. నానిండా అసహనము, ద్వేషము. ప్రేమించడమెట్లో దయచేసి నాకు నేర్పుతారా? | ... | 58 |
| | 4. జీవితంలో సుఖమంటే యేమిటి? | ... | 59 |
| | 5. నిజమైన జీవితమనగా నేమి? | ... | 61 |
| 9. | 1. భోగమయ జీవితము నడుపవలెనని మనమెందుకు కోరుకొంటాము? | ... | 64 |

|  |  |  |  |
|---|---|---|---|
|  | 2. | మనం మన పరిసరాలతో పోరాటం సల్పుతూ వున్నంత కాలం జీవితంలో శాంతి వుంటుందా? ... | 65 |
|  | 3. | మీరు సుఖంగా వున్నారా లేదా? ... | 66 |
|  | 4. | మనమెందుకు ఏడుస్తాము? దుఃఖమంటే యేమిటి? ... | 67 |
|  | 5. | ఘర్షణ లేకుండ మనమెట్లు సమగ్రతను సాధింపగలము? ... | 67 |
| 10. | 1. | మరణానంతరం గూడ ఆత్మ జీవిస్తుందా? ... | 71 |
|  | 2. | మేము జబ్బుపడినప్పుడు మా తల్లిదండ్రులు మా గురించి ఎందుకంతగా చింతిస్తారు? ... | 72 |
|  | 3. | దేవాలయములలో పూజ కొఱకై అందరికిని ప్రవేశార్హత వుండవలెనా? ... | 73 |
|  | 4. | మన జీవితంలో క్రమశిక్షణకు గల స్థానమేమి? ... | 74 |
|  | 5. | ఇంతకుముందు దేవాలయములను గూర్చి మాట్లాడేటప్పుడు మీరు దేవుని యొక్క ప్రతీకను మనిషి నీడతో పోల్చినారు కదా! అసలు మనిషే లేనిచో అతని నీడ యెట్లా వుంటుంది? ... | 75 |
|  | 6. | ధనవంతుల పిల్లలకు భవిష్యత్తు ఎట్లాగూ నిశ్చితమే. కాబట్టి వారికి పరీక్షలు అనవసరము కావచ్చు; కాని బీద పిల్లలు తమ జీవనాధారమును తాము వెదకుకోవలసి వస్తుంది కాబట్టి వారికి పరీక్షలు అవసరం కాదా? ముఖ్యంగా ఇప్పుడున్న సంఘ పరిస్థితిని బట్టి చూస్తే వారికి వాటి అవసరమేమైనా తక్కువా? ... | 75 |
|  | 7. | బీదవారికోసం ధనవంతులు తమకున్నదానిలో పెద్ద మొత్తం ఇవ్వడానికి ఎప్పటికైనా సిద్ధపడతారా? ... | 76 |
| 11. | 1. | మీరు మాట్లాడుతున్న విషయాలన్నీ మీకెట్లా తెలిశాయి? అవి మాకెట్లా తెలుస్తాయి? ... | 80 |
|  | 2. | మనమెవరి గురించియైనా ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవచ్చునా, ఏర్పరచుకోగూడదా? ... | 80 |
|  | 3. | మానసికమైన అనుభూతి యనగానేమి? మనమెట్లా దానిని పొందుతాము? ... | 81 |
|  | 4. | భారతీయ సంస్కృతికిని అమెరికా సంస్కృతికిని గల భేదమేమి? ... | 82 |
|  | 5. | భారతీయుల గురించి మీ అభిప్రాయమేమి? ... | 84 |
| 12. | 1. | కృష్ణజీ, మనకెవరైనా తోడువుండాలని యెందుకు కోరుకొంటాము? ... | 88 |

| | | | |
|---|---|---|---|
| | 2. | మీరు ఉపన్యాసాలివ్వడం సరదా కోసమా? కాల క్షేపం కోసమా? మాట్లాడి మాట్లాడి అలసిపోరా? మీరెందుకోసం ఈ పని చేస్తున్నారు? ... | 89 |
| | 3. | నేను ప్రేమించే మనిషికి కోపం వస్తే ఆ కోపమెందుకంత తీవ్రంగా వుంటుంది? ... | 89 |
| | 4. | మనస్సు తనకున్న అడ్డంకులనెట్లు అతిక్రమించిపోగలదు? ... | 90 |
| | 5. | ప్రపంచంలో ఇంతమంది స్త్రీ పురుషులను దేవుడెందుకు సృష్టించినాడు? ... | 91 |
| 13. | 1. | మాకు ఆటలమీద వున్నంత ప్రీతి చదువు మీద ఎందుకుండదు? ... | 95 |
| | 2. | ఏదైనా ఒక విషయం తప్పని గ్రహిస్తే ఇక ఆ తప్పు మనలో నుండి తొలగిపోతుందని మీరు చెప్పివున్నారుగదా! పొగ త్రాగడం తప్పని నేను ప్రతిదినము గ్రహిస్తూనే వున్నాను కాని, ఆ యలవాటు పోవడంలేదు! ... | 96 |
| | 3. | మా పెద్దలలో కొందరు చాల గంభీరంగా ముఖం పెట్టినప్పుడు మేమెందుకు భయపడతాము? వాండ్లెందుకట్లా గంభీరంగా కనబడతారు? ... | 98 |
| | 4. | విధినిర్ణయము లేదా కర్మఫలమనగానేమి? ... | 99 |
| 14. | 1. | మనమెందుకు బీదవారిని అసహ్యించుకొంటాము? ... | 104 |
| | 2. | సత్యము, సౌజన్యము, సమగ్రత (Integration)ల గురించి మీరు మాట్లాడుతున్నారు. అంటే వాటికి భిన్నంగా అసత్యము, అసౌజన్యము, అసమగ్రతలున్నట్లే కదా? కాబట్టి క్రమశిక్షణ లేనిదే మనిషి సత్యవంతుడు, సౌజన్యవంతుడు, సమగ్రతగలవాడెట్లు కాగలడు? ... | 105 |
| | 3. | శక్తి యంటే యేమిటి? అధికారమంటే యేమిటి? ... | 106 |
| | 4. | కీర్తి ప్రతిష్ఠల కోసం మనమెందుకు ప్రాకులాడుతాము? ... | 107 |
| 15. | 1. | మన మానసిక చింతలకు కారణములైన పరిస్థితులను తొలగించుకోలేకపోతే, ఆ చింతలు మనలనెట్లా వదిలిపోతాయి? ... | 112 |
| | 2. | మనలను మనమెట్లు తెలిసికొనగలము? ... | 114 |
| | 3. | మనకు ప్రేరణనిచ్చే వ్యక్తి లేకుండా, మనలను మనము తెలిసికోగలమా? ... | 116 |
| | 4. | తనలో ఎన్నో పరస్పర వైరుధ్యములుంటూ వుండగా అస్తిత్వము, ఆచరణము రెండును ఒకేసారి ఎట్లా సాధ్యములౌతాయి? ... | 117 |

| | | | | |
|---|---|---|---|---|
| | 5. | మాకిష్టమైన పనిని మేము చేయడంకోసం తల్లిదండ్రుల యెడ మాకుగల బాధ్యతలను వారియెడ మాకుగల కర్తవ్యాలను మేము వదులుకోవలెనా? | ... | 118 |
| | 6. | ఇంజనీరును కావాలని నేనెంత కోరుకున్నా, మా తండ్రికది యిష్టంలేకపోతే, ఆయన నా చదువుకు సహాయపడడు. అప్పుడు నేనెట్లు ఇంజనీరింగు చదువగలను? | ... | 119 |
| 16. | 1. | మీరు చెప్పే విషయాలను మేమేవిధంగా ఆచరణలో పెట్టగలము? | ... | 123 |
| | 2. | మనకోరికలెన్నటికిని పూర్తిగా నెరవేరవు, ఎందువలన? పూర్తిగా మన యిష్టానుసారమే పనిచేయవలెనంటే ఎప్పుడూ ఏవో ఆటంకాలు వస్తూనే వుంటాయి, ఎందువలన? | ... | 125 |
| | 3. | నేను మందమతినని నాకు తెలుసు. కాని నేను తెలివిగలవాణ్ణని ఇతరులు అంటారు. దేని ప్రభావం నామీద ఎక్కువగా వుంటుంది? నేను చూడడమా, వారు చెప్పడమా? | ... | 126 |
| | 4. | మే మెందుకు కొంటెపనులు చేస్తూవుంటాము? | ... | 128 |
| | 5. | నాకు తేనీరు (టీ) త్రాగే అలవాటున్నది. అది చెడ్డ అలవాటని ఒక ఉపాధ్యాయుడు అంటాడు. మరియొక ఉపాధ్యాయుడు పర్వాలేదులే అంటాడు. | ... | 129 |
| 17. | 1. | ఎందువలన మనం మృత్యువంటే భయపడతాము? | ... | 134 |
| | 2. | మనందరిలోను సత్యమున్నదని, అది శాశ్వతమని, త్రికాలా బాధితమని అంటారు. కాని మన జీవితమే అశాశ్వతమైనప్పుడు అందులో శాశ్వతమైన సత్యమెట్లా వుంటుంది? | ... | 135 |
| | 3. | సమగ్రత లేక పరిపూర్ణత (Perfection) అంటే యేమిటో మేము మనస్సులో ఒక అభిప్రాయం ఏర్పఱచుకోగలమా? | ... | 136 |
| | 4. | మనలను కొట్టినవాణ్ణి మళ్ళీ కొట్టి, వాడిమీద పగ తీర్చుకొందామని మనమెందుకు కోరుకొంటాము? | ... | 137 |
| | 5. | ఇతరులను ఏడ్పించడమంటే నాకెంతో సరదా. కాని అదే పని యితరులు చేస్తే నాకెంతో కోపం వస్తుంది. | ... | 137 |
| | 6. | మానవుని కర్తవ్యమేమిటి? | ... | 137 |
| | 7. | దేవుని మనమెందుకు పూజిస్తాము? | ... | 138 |

| | | | |
|---|---|---|---|
| 18. | 1. | నిన్న మనం కలిసికొని విడిపోయిన తరువాత మీరక్కడ రోడ్డు ప్రక్కన ఆడుకొంటూ వున్న యిద్దరు పాలంకాపు పిల్లలను – బీదతనానికి దృష్టాంతములన్నట్లు వున్నవారిని – గమనిస్తూ నిలబడడం మేము చూసినాము. వాండ్లను చూస్తూవున్న సమయములో మీ మనస్సులో ఎటువంటి భావాలు ఉద్భవిల్లినాయో తెలిసికొందామని కోరిక. ... | 143 |
| | 2. | మన మనస్సు ఒకేసారి అనేక విషయాలను ఎట్లా వినగలదు? ... | 144 |
| | 3. | ఏమీ పని చేయకుండ, సోమరితనంగా వుండాలని మనకెందుకు బుద్ధి పుడుతుంది? ... | 144 |
| | 4. | సంఘానికి వ్యతిరేకంగా విప్లవం తీసికొని రావాలని మీరంటారు. కాని కోరిక పనికిరాదని గూడ మీరే అంటారు. అయితే సంఘాన్ని బాగుపరచవలెననే కోరిక కోరిక కాదా? అది పేరాశ కాదా? ... | 146 |
| | 5. | నేను చదువుకోనప్పుడు నా మీద నాకెందుకు అసహ్యము కలుగుతుంది? ... | 147 |
| | 6. | ఒకవేళ ప్రస్తుతమున్న సమాజానికి విరుద్ధంగా తిరుగుబాటుచేసి నూతన సమాజాన్ని నిర్మించినా ఈ నూతన సమాజ నిర్మాణము పేరాశ యొక్క మరియొక రూపము కాదా? ... | 149 |
| 19. | 1. | అల్లరిపిల్లవానిలో మార్పు, ప్రేమ ద్వారా వస్తుందా లేక దండనము ద్వారా వస్తుందా? ... | 153 |
| | 2. | మేము తెలివిగలవారము ఎట్లు కాగలము? ... | 155 |
| | 3. | నేను మహమ్మదీయుడను. మా మత సంప్రదాయాలను నేను ప్రతిదినము పాటించకపోతే మా తల్లితండ్రులు నన్ను మా యింట్లోనుండి బయటికి వెళ్ళగొడతామని బెదిరిస్తున్నారు. అందుకు నేనేమి చేయాలి? ... | 156 |
| | 4. | అవధానములో దేనినీ నిరోధించడం పనికిరాదని మీరంటారు. అది యెట్లా సాధ్యమవుతుంది? ... | 157 |
| | 5. | ప్రశ్నలు వేయడమంటే మాకెందుకంత ఆసక్తి? ... | 158 |
| 20. | 1. | బాల్యంలో నాకేదైనా పెద్ద కోరిక వున్నట్లయితే దానిని పెద్దైన తరువాత తీర్చుకోగలనా? ... | 162 |
| | 2. | నేటి సంఘ వ్యవస్థలో మీరు చెప్పే విషయాలను ఆచరణలో పెట్టడం ఎంతో కష్టం కాదా? ... | 163 |
| | 3. | సంపూర్ణ పరివర్తనమనగా మీ యుద్దేశమేమి? దానిని వ్యక్తి తన జీవితంలో ఎట్లు అనుభూతికి తెచ్చుకోగలడు? ... | 164 |

| | | | |
|---|---|---|---|
| | 4. ఏమండి, ఆత్మ విస్తరణమనగా నేమి? | ... | 165 |
| | 5. ధనవంతునికి గర్వమెందుకు? | ... | 165 |
| | 6. మేమెల్లప్పుడును 'నేను' 'నాది' అనే భావనలో ఎందుకు చిక్కుకొని వుంటాము? ఇటువంటి మానసిక స్థితిలో పుట్టెడి సమస్యలను మీతో జరిపెడి సమావేశాలలో మాటిమాటికి ఎందుకు తెస్తూవుంటాము? | ... | 166 |
| | 7. స్త్రీలు తమ దుస్తులు మీద ఎందుకంత శ్రద్ధ చూపిస్తారు? ఎందుకంతగా సింగారించుకొంటూ వుంటారు? | ... | 166 |
| 21. | 1. నేర్చుకోవడానికి కష్టంగా తోచినదేదైనా సరే, మేమెందుకంత త్వరగా మరిచిపోతాము? | ... | 170 |
| | 2. ప్రగతి అనే మాటకు గల అర్థమేమి? | ... | 170 |
| | 3. నేను దగ్గరకు పోగానే పక్షులు ఎగిరిపోతాయి. ఎందుకని? | ... | 172 |
| | 4. మీకును మాకును మధ్యగల భేద మేమి? | ... | 172 |
| | 5. నేను పొగత్రాగుతూ వుంటే మా ఉపాధ్యాయునికి నామీద కోపమెందుకు రావాలి? | ... | 173 |
| | 6. ప్రజలు పులులను ఎందుకు వేటాడుతారు? | ... | 174 |
| | 7. మనము దుఃఖభారముచే క్రుంగిపోవడానికి కారణమేమి? | ... | 174 |
| 22. | 1. పాఠశాలలోని ఉత్సవములకు ఎల్లప్పుడును ఎక్కువగా ధనవంతులను, ఇతర ప్రముఖులను మాత్రమే ఆహ్వానిస్తూ వుంటారు, ఎందువలన? | ... | 179 |
| | 2. చెక్కిన విగ్రహంలో దేవుడు లేడని మీరంటారు. కాని అక్కడే వున్నాడని, మీ హృదయాలలో నమ్మక మున్నట్లయితే ఆ దేవుని శక్తి ప్రకటితమవుతుందని ఇతరులంటారు. మరి పూజలోని సత్యమేమి? | ... | 181 |
| | 3. ప్రశాంతంగా కూర్చుండి మన మనస్సు పనిచేసే తీరును గమనిస్తూ వుండమని మీ రొకనాడు చెప్పి యున్నారు. కాని మనం మన ఆలోచనలను జాగ్రత్తగా గమనించడం మొదలుపెట్టగానే అవి అంతర్ధానమై పోతున్నాయి – ఆగిపోతున్నాయి. మనస్సే ద్రష్ట (చూచేది), మనస్సే దృశ్యము (చూపబడేది) అయినప్పుడు, మన మనస్సును మనమెట్లు దర్శింపగలము? | ... | 182 |
| | 4. మనిషంటే కేవలం మనస్సు, మెదడు లేక బుద్ధి – ఇంతేనా? లేక ఇంకేమైనా అదనంగా వున్నదా? | ... | 183 |
| | 5. ఆవశ్యకతకును అత్యాశకును గల తేడా యేమిటి? | ... | 184 |

6. మనస్సున్నూ బుద్ధిన్నీ (brain) ఒకటే అయినట్టయితే, ఏదైనా ఒక తలంపో లేదా ఒక తీవ్రమైన కోరికయో తలెత్తినపుడు, బుద్ధి అది మంచిది కాదని, అసుందరమైనదని హెచ్చరిస్తూవున్నా, మనస్సు వాటివెంబడే మామూలుగా పోతూ వుంటుంది. ఎందువలన? ... 184

23. 1. ఎఱుక (awareness) కును, సంవేదనశీలత (sensitivity) కును గల భేదమేమి? ... 189

2. ఎవరైనా కాలుజారి పడితే మనమెందుకు నవ్వుతాము? ... 191

3. మా ప్రొఫెసరుగారు మీరు చెప్పే విషయాలు బొత్తిగా ఆచరణ యోగ్యములు కావని అంటారు. 120 రూపాయల జీతంమీద ఆరుగురు మగపిల్లలను, ఆరుగురు ఆడపిల్లలను పెంచి పెద్ద చేయమని మిమ్మల్ని సవాలు చేస్తున్నారు. ఈ విమర్శకు మీ సమాధానమేమి? ... 191

4. ఆధునిక ప్రపంచంలోని విలాస వస్తువుల ప్రభావము చేత మేము విద్యను పొందుతున్న సమయంలోనే వినాశనమును గూడ పొందుతున్నట్లయితే, అట్టి విద్య వలన గలుగబోవు ప్రయోజనమేమి? 193

5. నా ఒడలి చర్మము చాల నల్లగా వుంటుంది. కనీసం చామన చాయ రంగైనట్టయితే చాలమంది మెచ్చుకొంటారు. నేను వాండ్ల మెప్పును ఎట్లు పొందగలను? ... 194

24. 1. బ్రిటిషువారు భారతదేశమును పాలించడానికై ఎందువలన వచ్చిరి? ... 200

2. ధ్యాన సమయములోనైనా సత్యమును దర్శింపగలమని మాకు తోచదు. అందువలన సత్యమంటే యేమిటో మీరు దయచేసి చెప్పగలరా? ... 200

3. మన మొక తప్పు చేసి, ఎవరైనా మన తప్పును మనకు చూపించినా, మళ్ళీ మనమదే తప్పును ఎందుకు చేస్తాము? ... 201

4. జీవితమంటే యేమిటి? మనమెట్లు సుఖంగా జీవింపగలము? ... 202

5. మనలో మనము ఎందుకు కొట్లాడుకొంటాము? ... 203

6. మనస్సు ఇతర మానవులనే గాకుండా తన్ను తానుగూడ దురుపయోగం చేసికొంటుంది, ఎందువలన? ... 204

7. సాఫల్యము నన్వేషించు మనస్సు, సత్యము నన్వేషించు మనస్సు కంటె వేరైనదా? ... 204

| | | | | |
|---|---|---|---|---|
| 25. | 1. | నే నొక పని చేయదలచినాను. అందుకోసమై చాలసార్లు ప్రయత్నించినప్పటికిన్ని విజయం పొందలేక పోయినాను. ఇప్పుడందుకోసమై ప్రయత్నం చేయడం మానివేయనా, లేక పట్టుదలతో ప్రయత్నం చేస్తూనే వుండనా? | ... | 208 |
| | 2. | మౌలికంగా మనమేల స్వార్థపరులము? మన మెంత నిస్వార్థంగా వుందామని ప్రయత్నించినా, మన స్వప్రయోజనములు అడ్డువచ్చేటప్పటికి కేవలం స్వార్థపరాయణులమై ఇతరుల ప్రయోజనములను లెక్క చేయము; వారి అభిరుచుల యెడ ఉదాసీనత వహిస్తాము. | ... | 210 |
| | 3. | పుట్టినది మొదలు చచ్చిపోవువరకు వ్యక్తి యెల్లప్పుడు ప్రేమ కోసం పరితపిస్తూ వుంటాడు. అతని కా ప్రేమ లభ్యం కాకపోతే అతడు తక్కిన తన తోడివారివలె గుండె నిబ్బరము కలిగి ధైర్య విశ్వాసములతో శాంతంగా వుండలేడు. ఎందువలన? | ... | 212 |
| | 4. | పెద్దవాండ్లు దొంగతనమెందుకు చేస్తారు? | ... | 212 |
| 26. | 1. | మనిషికింత జ్ఞానం ఎట్లా లభించింది? అతడు భౌతికంగా ఎట్లు పరిణతి చెందినాడు? ఇంత గొప్ప శక్తి సామర్థ్యాలు అతనికెక్కడి నుండి వచ్చినవి? | ... | 218 |
| | 2. | నేను మతం మార్చుకొంటానని అంటే మా తల్లి దండ్రులకెందుకని అంత కోపం వస్తుంది? | ... | 220 |
| | 3. | శీలనిర్మాణమునకు నిజమైన మార్గమేది? | ... | 221 |
| | 4. | దేవుని సాక్షాత్కరింప జేసికొనడంలో వయస్సునకు గల ప్రాధాన్యమేమి? | ... | 222 |
| 27. | 1. | సంఘ సేవ చేయవలెనని నా కోరిక. కాని దానినెట్లా ఆరంభించవలెనో తెలియదు. | ... | 225 |
| | 2. | మనిషి ఎందువలన మొండిదేలి, దయావిహీనుడౌతాడు? | ... | 227 |
| | 3. | మనస్సున కేదితోస్తే అది చేయకుండా నిగ్రహించు కొంటూనే, మనిషి తన స్వతంత్రమునకు దారి వెదకికొనగలడా? | ... | 227 |
| | 4. | పవిత్రమైన జీవితం గడిపేవారు మాత్రమే భయరహితులుగా వుంటారనేది నిజమా? | ... | 228 |
| | 5. | మనిషి తన కోరికలకు తాను బలి అవుతున్నాడు; అవి అనేక సమస్యలను సృష్టిస్తుంటాయి. అతడు కోరికలు లేని స్థితిని ఎట్లు సాధించుకొనగలడు? | ... | 230 |

★ ★ ★

# 1. చదువు - దానియొక్క ప్రయోజనము

చదువంటే యేమిటో మనలో మనమెప్పుడైనా ప్రశ్నించుకొని వుంటిమా? అని నా అనుమానము. మనం బడికి ఎందుకు పోతున్నానము? అక్కడ రకరకాలైన విషయాలు ఎందుకు నేర్చుకొంటున్నాము? పరీక్ష లెందుకు పాసవుతున్నాము? మంచి మార్కుల కోసం, మంచి గ్రేడులకోసం ఎందుకు పోటీ పడుతున్నాము? ఈ చదువు అనే మాటకు అర్థమేమిటి? ఇదంతా దేనికి? ఇది చాలా ముఖ్యమైన ప్రశ్న – విద్యార్థులకే కాదు, వారి తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు, మఱి యీ భూమిని ప్రేమించే ప్రతి ఒక్కరికిన్ని. చదువుకోడం కోసం ఎందుకింత శ్రమ పడుతున్నాము? కేవలం ఏవో పరీక్షలు పాసై, ఏదైనా వుద్యోగం సంపాదించుకోవడం కోసమేనా యీ శ్రమంతా? లేక చదువుయొక్క వుద్దేశం యీ మన జీవిత గమనాన్ని – జీవితము కొనసాగే రీతిని అంతను సరిగా అర్థం చేసికోగల శక్తిని చిన్నప్పుడే మనలో కలిగించడమా? ఉద్యోగం సంపాదించుకోవడం, లేదా ఏదైనా జీవనాధారాన్ని కల్పించుకోవడం అవసరమే. కాని మనం చదువుకొనేది కేవలమందుకేనా? నిజానికి జీవితమంటే కేవలం ఉద్యోగం చేయడం లేదా ఏదైనా వృత్తిని అవలంబించడం మాత్రమే కాదు. జీవిత మనేది అసాధారణమైనది, అతి విశాలమైనది, లోతైనదిన్ని. ఇది చాలా అద్భుతమైనది. దీని విశాలమైన పరిధిలో మనం మానవులం జీవిస్తున్నాము. మనం కేవలం జీవనాధారం కోసమే ప్రయత్నిస్తూ వుంటే అసలు జీవితాన్నే జారవిడుచుకొన్న వాండ్లమౌతాము. జీవితాన్ని అర్థం చేసుకోవడం అన్నిటికంటె ముఖ్యం. పరీక్షలు పాసవడం, గణితము, భౌతిక శాస్త్రము మొదలైనవాటిల్లో నైపుణ్యం సంపాదించడం దాని తరువాతనే.

కాబట్టి ఉపాధ్యాయులెందుకు బోధిస్తున్నారో, విద్యార్థులెందుకు చదువుకొంటున్నారో అనే విషయమై మనం, ఉపాధ్యాయులం గాని విద్యార్థులం గాని ప్రశ్నించుకోవడం చాలా అవసరం కాదా? మఱి, జీవితమంటే అర్థమేమిటి? జీవితమంటే ఒక అద్భుతమైన విషయంకాదా? పక్షులు, పుష్పాలు, ఏపుగా ఎదుగుతున్న వృక్షాలు, అకాశము, అందులోని నక్షత్రాలు, నదులు, వాటిల్లోని చేపలు – ఇదంతా జీవితమే. బీదవాండ్లు, ధనికులు జీవితములోని భాగమే. సంఘాల మధ్య, తెగల మధ్య, జాతుల మధ్య గల ఎడతెగని పోరాటాలు జీవితమే. ధ్యానము జీవితమే. మతమనే పేరుతో పిలవబడేది జీవితమే. అంతేకాదు – మనస్సులో అతిసూక్ష్మమై నిగూఢముగా దాగియున్న ఈర్ష్యాసూయలు, రాగద్వేషాలు, ఆశలు ఆకాంక్షలు, ఆవేశ కావేషాలు,

భయాలు ఆందోళనలు, సాఫల్య వైఫల్యాలు – ఇవన్నీ జీవితమే. జీవితమంటే ఇంతేకాదు, ఇంకా, ఎంతో! కాని సాధారణంగా దానిలోని ఏ అత్యల్ప భాగమునో అర్థం చేసికోడానికి మాత్రమే మనం చేసే ప్రయత్నమంతా. ఏవో కొన్ని పరీక్షలు పాసై, ఉద్యోగం సంపాదించుకొని, పెండ్లి చేసికొని, పిల్లలను కని, రానురాను యంత్రాలవలె తయారవుతాము. జీవితమంటే భయపడతాం, ఆందోళన చెందుతాం. కాబట్టి చదువుయొక్క ప్రధానోద్దేశము జీవితగమనాన్ని పూర్తిగా అర్థం చేసికోవడంలో సహాయపడడమా లేక కేవలం ఏదైనా ఒక వృత్తికిగాని, మంచి ఉద్యోగానికి గాని మనలను తయారు చేయడమా?

మనం పెరిగి పెద్దవాండ్లమైనప్పుడు, మనందరికి ఏమౌతుందో తెలుసా? పెద్దవాండ్లైన తరువాత ఏమి చేయబోతున్నారో ఎప్పుడైనా మీలో మీరు ప్రశ్నించుకొన్నారా? బహుశా మీరు పెండ్లి చేసికొని, మీ పరిస్థితి యేమిటో మీరు గ్రహించే లోపలనే తల్లులు, తండ్రులు అవుతారు. అంతట మీరొక ఉద్యోగానికో లేక వంటగదికో కట్టుబడిపోయి, క్రమక్రమంగా వాడి వత్తలై క్షయించిపోతారు. అదేనా మీ జీవితలక్ష్యం? మీలో మీరీ ప్రశ్నను ఎన్నడైనా వేసికోలేదా? తప్పకుండా వేసికోవలసిన ప్రశ్నకాదా యిది? మీ కుటుంబము ధనవంతమైన కుటుంబ మయినట్టయితే సంఘంలో మీకొక మంచి హోదా, మంచి స్థానం ముందే నిశ్చితము. మీ తండ్రి మీకన్ని సౌకర్యాలుండే ఉద్యోగమొకటి ఇప్పించవచ్చు. గొప్ప ధనవంతుల కుటుంబంతో మీకు పెండ్లి సంబంధం కుదిర్చి, ఘనంగా పెండ్లి చేయవచ్చు. కాని అక్కడైనా మీరు క్షయం పొందుతారు, మీ జీవితము వ్యర్థమైపోతుంది; ఏమి, నేను చెప్పేది అర్థమవుతున్నదా?

అతి విశాలమైన యీ జీవితాన్ని, అందలి సూక్ష్మాంశాలను, అందలి అసాధారణ సౌందర్యాన్ని, అందలి సుఖాలను, దుఃఖాలను, అర్థం చేసికోవడంలో మీరు చదివిన చదువు ఉపయోగపడకపోతే ఆ చదువు నిరర్థకము. మీరేవేవో డిగ్రీలు సంపాదించుకోవచ్చు, మీ పేరు తరువాత ఏవేవో అక్షరాలను ఎన్నింటినో చేర్చుకోవచ్చు, ఎంతో పెద్ద వుద్యోగాన్ని చేజిక్కించుకోవచ్చు, అయినా ఫలితమేమి? వీటిని సంపాదించుకొనే లోపల మీ మనస్సు మొద్దుబారి చులుకుదనం పోగొట్టుకొని అలసి సొలసి, తెలివి లేనిదై పోయినట్లయితే ఇక ఎన్ని వుండి యేమి లాభము? అందువలన మీరు మీ బాల్యంలోనే – అంటే విద్యార్థులుగా వున్న దినములలోనే – ఈ జీవితమంటే యేమిటో గ్రహించడానికి ప్రయత్నించవద్దా? ఈ సమస్యల కన్నింటికిని సమాధానాలను కనుగొనగల తెలివిని మీలో పెంపొందించుకోవద్దా? అదేకదా చదువు యొక్క నిజమైన వుద్దేశము?

మరి, 'తెలివి' అంటే యేమిటో మీకు తెలుసునా? 'తెలివి' అంటే స్వతంత్రంగా, భయంలేకుండా, ఏదో యొక పద్ధతి ప్రకారం గాకుండా ఆలోచింపగల సామర్థ్యం. అదిగనక వుంటే సత్యమేదో, వాస్తవమేదో మీయంతట మీరు తెలిసికో నారంభిస్తారు. కాని మీలో భయం గూడుకట్టుకొని వుంటే మీ రెన్నటికిని తెలివిగలవారు కాలేరు. ఎటువంటి వాంఛలైనను – ఐహికములుగాని, ఆధ్యాత్మికములుగాని – వ్యాకులతను

కలిగిస్తాయి, భయమును కలిగిస్తాయి. కాబట్టి అట్టి వాంఛలు – ఏవేవో సాధింపవలెననే పెద్ద పెద్ద కోరికలు – గలవాని మనస్సు నిర్మలముగా, నిరాడంబరముగా, ఋజువుగా వుండజాలదు, అంటే అట్టి మనస్సు తెలివిగలది కాదు.

భయరహితమైన వాతావరణంలో మీరు మీ బాల్యమును గడపడం చాల అవసరము, తెలుస్తూవున్నదా? మనలో చాలామందికి వయస్సు పెరిగేకొలది భయంకూడా పెరుగుతూ వుంటుంది. మనకు జీవించడమంటే భయం, ఉద్యోగం పోతుందేమో అని భయం, సంప్రదాయమంటే భయం, ఇరుగుపొరుగువారు లేదా భార్యగాని భర్తగాని ఏమంటారో అని భయం, మృత్యువంటే భయం. ఇటువంటి యేదో ఒక భయమంటూ లేనివారు చాలా అరుదు. ఎక్కడ భయముంటుందో అక్కడ తెలివి వుండదు. మరి మనం చిన్నపిల్లలమై వున్నప్పుడు భయరహితమైన స్వాతంత్ర్య పూరితమైన వాతావరణంలో వుండడానికి వీలుపడదా? మనకు స్వాతంత్ర్యం, మన యిష్టారాజ్యంగా నిర్లక్ష్యంగా ప్రవర్తించడం కోసంకాదు, జీవితగమనాన్ని అంతను పూర్తిగా గ్రహించడం కోసం కావాలి. అన్ని వత్తిడులనుండి, అన్ని బంధములనుండి విముక్తమైన మనస్సే, దానిని – అంటే పూర్తి జీవితవిధానాన్ని – గ్రహింపగలదు. జీవితం నిజంగా చాలా అందమైనది. దానిని మనమే చెడగొట్టి అందవికారంగా చేసికొన్నాము. దాని అసాధారణ సౌందర్యాన్ని, గాంభీర్యాన్ని, పరిపూర్ణత్వాన్ని గ్రహించి మెచ్చుకోవలెనంటే మీరు ప్రతిదానిని ఎదురుతిరిగి ప్రశ్నించవలసి వుంటుంది. వ్యవస్థీకృతమైన మతాన్ని, సంప్రదాయాన్ని, కుళ్ళిపోయిన నేటి యీ సంఘాన్ని – ప్రతిదానిని మీరు ఎదిరించవలసి వుంటుంది. అప్పుడే సత్యమనగానేమో మీకు మీరే తెలిసికొనగలుగుతారు. మనం చేయవలసిన పని ఇతరులను అనుకరించడం కాదు, స్వయంగా విచారణ చేసి కనుగొనడం – అదే చదువంటే, కాదా? మీరున్న సంఘముగాని, మీ తల్లిదండ్రులుగాని, ఉపాధ్యాయులుగాని నడిపినట్లు నడుచుకోవడం, వారు చెప్పినట్లే చేయడం చాల తేలిక. అది చాలా సులభం, సురక్షితమైన మార్గం. కాని అందులో భయము, క్షయము, మృత్యువు ఉంటాయి. జీవించడమంటే అదికాదు. జీవించడమంటే మీయంతట మీరు సత్యమేదో తెలిసికోవడం. దాని కోసం ఎటువంటి వత్తిడులు లేని మానసిక స్వాతంత్ర్యముండాలి, లోలోన ఎడతెగని జిజ్ఞాస – ప్రతిదానిని ఎదురుతిరిగి ప్రశ్నించడం – కావాలి.

కాని యిందుకు మిమ్మెవ్వరును ప్రోత్సహించరు. ప్రతి దానిని ప్రశ్నించుడని, దేవుడంటే యేమిటో మీయంతట మీరే తెలిసికొండని మీకెవరున్ను చెప్పరు. కారణమేమంటే, మీరు తిరుగబడేటట్లయితే, యీ ప్రపంచంలోని మిథ్యాత్వమున కంతటికిని అసత్యాని కంతటికిని, మీరొక ప్రమాదకరమైన వ్యక్తిగా పరిణమిస్తారు. మీ తల్లిదండ్రులున్ను మీరున్న సంఘమున్ను మీరు సురక్షితంగా జీవించవలెనని కోరుకొంటారు. మీరున్ను అదే కోరుకొంటారు. సురక్షితంగా జీవించడమంటే మామూలుగా ఇతరులను అనుకరిస్తూ, వారి అడుగుజాడలలో – అంటే భయంతో – జీవించడమే. కాని వాస్తవానికి చదువు యొక్క ఉద్దేశం అదికాదు. మనలో ప్రతి యొక్కరును స్వేచ్ఛగా, స్వంతంత్రంగా, నిర్భయంగా జీవించడానికి సహాయపడడమే దాని ఉద్దేశం, అవునా, కాదా? అందుకు మరి, భయరహితమైన వాతావరణాన్ని

కల్పించడానికి మీరు, మీతోబాటు మీ ఉపాధ్యాయులూ ఎంతో దూరం లోతుగా ఆలోచించి పనిచేయవలసి వుంటుంది.

అంటే అర్థమేమిటో తెలుసునా? భయరహితమైన వాతావరణాన్ని కల్పిస్తే అదెంత అద్భుతంగా వుంటుందో మీకు తెలుసునా? అట్టి వాతావరణాన్ని తప్పక కల్పించవలసి వుంది. ఈ ప్రపంచం అంతులేని యుద్ధాలలో ఎట్లు తగుల్కొని వున్నదో మనము చూస్తూనే వున్నాము. అధికార దాహంతో తపించే రాజకీయ నాయకులచేత ఈ ప్రపంచం నడుపబడుతూ వున్నది. హోదాను, అధికారాన్ని కోరుతూ దానికోసమై ఒకరితో నొకరు పోరాడే న్యాయవాదులది, రక్షక భటులది, సైనికులది మరియు అత్యాశలు పెట్టుకొన్న స్త్రీ పురుషులదిన్ని యీ ప్రపంచము. వీరితోబాటే సాధువులు మహాత్ములనబడేవారున్ను, మతగురువులు వారి అనుయాయులున్ను వుంటారు. వారికి గూడ అధికారం కావాలి, హోదా కావాలి – అది యిహలోకంలోనైనా సరే, పరలోకంలోనైనా సరే. ఇది ఒక పిచ్చి ప్రపంచం, పూర్తిగా అయోమయమైన ప్రపంచం. ఇందులో సామ్యవాది (communist) పెట్టుబడిదారుతో (capitalist) పోరాడుతుంటాడు. సమాజవాది (socialist) వారిద్దరిని ఎదిరిస్తూ వుంటాడు. ప్రతివాడున్ను మరియొకడితో పోటీపడుతూ, ఎదిరిస్తూ వుంటాడు. ఇంతకున్ను అందరి గమ్యస్థానము ఒకటే – ఒక సురక్షితమైన ప్రదేశము, అధికారము మరియు అన్ని అనువులు గల ఒక పదవి. పరస్పర విరుద్ధములైన నమ్మకాలతో, కులమతభేదాలతో, వర్గభేదాలతో, వేర్వేరు జాతీయతలతో, అన్నివిధాలైన మూర్ఖతలతో, క్రౌర్యములతో ఈ ప్రపంచము ముక్కలు ముక్కలుగా చీల్చబడియున్నది. ఇటువంటి ప్రపంచంలో ఒక భాగంగా ఇమిడి పోవడం కోసమేనా మీరు చదువుకోవడం? ఇట్టి భయంకరమై వినాశకరమైన సంఘమనే చట్రంలో ఒక భాగమైపోవడానికై, అందులో ఇమిడిపోవడానికై మీరు ప్రోత్సహింపబడుతున్నారు. మీ తల్లిదండ్రులు కోరేది అదే, మీరు కోరుకొనేదిన్నీ అదే.

చదువుయొక్క ఉద్దేశము ఈ క్రుళ్ళిపోయిన సంఘ వ్యవస్థకు లొంగి, అందులో ఒక భాగమైపోవడానికి సహాయపడడమా? లేక ఉత్తమ మానవులుగా పెరిగి పెద్దవారై, క్రొత్త సంఘమును, క్రొత్త ప్రపంచమును నిర్మించడం కోసం మిమ్మ పూర్ణ స్వతంత్రులను చేయడమా? మనకీ స్వతంత్రము ఎప్పుడో భవిష్యత్తులోకాదు, ఇప్పుడే, ఇక్కడే కావాలి. లేనిచో మనకు వినాశమే. కాబట్టి స్వేచ్ఛాపూరిత వాతావరణమును మనము వెంటనే కల్పించుకొనవలె. అందులో మాత్రమే జీవిస్తూ, మీయంతట మీరు సత్యమును కనుగొనగలరు, తెలివి పొందగలరు; ప్రపంచాన్ని ఎదుర్కొని, – దానికి లొంగిపోకుండ – దానిని అర్థము చేసికోగలరు; లోతుగా మీ మనస్సులో నిరంతరము ప్రతిదానిని ఎదిరించి ప్రశ్నిస్తూ ఉండగలరు. అట్లు నిరంతరము ప్రతిదానిని ప్రశ్నించేవాడే సత్యమును కనుగొనగలడు, గ్రుడ్డిగా లొంగిపోయి సంప్రదాయము ననుసరించేవాడు కాదు. నిరంతరము ప్రశ్నిస్తూ, నిరంతరము పరిశీలిస్తూ, నిరంతరము గ్రహిస్తూ వుండేవాడే సత్యమును, లేదా దేవుని లేదా ప్రేమను కనుగొనగలడు. భయపూరితుడు ఎదిరించి ప్రశ్నించలేడు, పరిశీలించలేడు, గ్రహించలేడు, పూర్ణమగు

జాగృతిని పొందలేదు. కాబట్టి చదువుయొక్క ప్రధానోద్దేశము భయమును - అంటే ఏదైతే మానవుల ఆలోచనా సరళిని, మానవుల పరస్పర సంబంధమును, ప్రేమను నశింపజేస్తుందో ఆ భయమును - అది అంతర్గతముగా మనస్సులోనున్నను లేక బహిర్గతముగా వ్యక్తమగుచున్నను - దానిని నిర్మూలించడమే.

1. **ప్రశ్న:- అందరు మనుష్యులు ఎదురుతిరిగితే ప్రపంచంలో అల్లకల్లోల మేర్పడ దంటారా మీరు?**

**కృష్ణమూర్తి:-** మొట్టమొదట ప్రశ్నను సరిగా వినండి. ఎందుకంటే - ప్రశ్నను అర్థం చేసికోవడం చాలా ముఖ్యం, సమాధానం కోసం వేచియుండడం కాదు. ప్రశ్న యేమంటే, అందరు మనుష్యులు ఎదురు తిరిగితే ప్రపంచంలో అల్లకల్లోల మేర్పడదా? అని. ప్రతివాడూ ఎదురు తిరిగితే అల్లకల్లోల మేర్పడడానికి, ప్రపంచమిప్పుడేమైనా సరియైన తీరులో నడుస్తూ ప్రశాంతంగా వున్నదంటారా? ఇప్పుడు లేదా ఆ అల్లకల్లోలము? ప్రతిది అందంగాను, న్యాయంగాను నడుస్తున్నదా? ప్రతివాడూ సుఖంగా, సంతోషంగా, నిండుగా జీవిస్తున్నాడా? ఒకడు మరియొకనికి విరుద్ధంగా ప్రవర్తించడం లేదా? ఏవో సాధించవలెననే మితిమీరిన కోరికలు లేవా? దయాదాక్షిణ్యాలు లేకుండా ఒకరితో నొకరు పోటీపడడం లేదా? కావున ఇప్పటికే ప్రపంచమంతా అల్లకల్లోలంగా వుండడం ఖాయం. ఈ విషయం ముందుగా గ్రహించి తెలిసికోవాలి. ఇది నిజంగా క్రమబద్ధమైన సంఘమని భావించవద్దు. మాటలతో మిమ్ము మీరు మోసగించుకోవద్దు. ఇక్కడ గాని, ఐరోపాలోగాని, అమెరికాలోగాని, రష్యాలోగాని ప్రపంచ మిప్పుడు వినాశ మార్గమున పయనిస్తూ వున్నది. మీ రా క్షయమును చూడగల్గితే అదే మీకొక సవాలు. ఈ తక్షణ సమస్యను పరిష్కరించడానికి మార్గమును కనుగొనుడని మీరు సవాలు చేయబడుతున్నారు. ఈ సవాలు నెట్లా ఎదుర్కొంటారో అది ముఖ్యము, కాదా? మీరొక హిందువుగా గాని, బౌద్ధునిగా గాని, క్రైస్తవునిగా గాని లేక ఒక సామ్యవాదిగా గాని మీ రా సవాలు నెదుర్కొంటే అది సరియైన పద్ధతిలో ఎదుర్కొనడం కాదు. ఆ యెదుర్కొనడం అసంపూర్ణము. అది దానికి పరిష్కారమార్గము కానేకాదు. మీరు దానిని సంపూర్ణంగాను, తృప్తికరంగాను ఎదుర్కొనవలెనంటే, మీలో భయముండరాదు; మీరు హిందువుగా గాని పెట్టుబడిదారుగా గాని గాక సమస్యను పరిష్కరింప యత్నించే ఒక సంపూర్ణ మానవునిగా మిమ్ము మీరు భావించుకొన్నప్పుడు మాత్రమే అది సాధ్యము. మీరు దీనికంతకు విరుద్ధంగా, ఈ సంఘమున కాధారభూతముగా నున్న లోభగుణమునకు విరుద్ధంగా, అంతా మనకే వుండాలి అనే దురాశకు విరుద్ధంగా మీరు తిరుగబడినప్పుడే మీ రా సమస్యకు పరిష్కారమును కనుగొనగలరు. అసలు మీలో మీకు పేరాశలు లేనప్పుడే, లోభబుద్ధి లేనప్పుడే, మీ క్షేమము మీ భద్రత మాత్రమే ప్రధానంగా చూచుకోకుండా, మీరు వాటిని అంటిపెట్టుకోకుండా వున్నప్పుడే మీ రా సవాలును సరియైన రీతిని ఎదుర్కొనగలరు, క్రొత్త ప్రపంచమును సృష్టింపగలరు.

**2. ప్రశ్న:- ఎదురు తిరిగి ప్రశ్నించడం, నేర్చుకోవడం, ప్రేమించడం - ఈ మూడున్నూ మూడు వేర్వేరు ప్రక్రియలా, లేక ఒకే సమయంలో జరిగేడివా?**

**కృష్ణమూర్తి:-** నిజమే, అవి మూడును వేర్వేరు ప్రక్రియలు కావు. అవి మూడును ఒకే ప్రక్రియ. ఈ ప్రశ్నకు అర్థమేమిటో తెలిసికోవడం చాలా ముఖ్యం. గమనించితిరా, ఈ ప్రశ్న అనుభవం మీద ఆధారపడినది కాదు. ఇది కేవలం మాటల కూర్పు; ఊహాగానం మీద ఆధారపడిన ప్రశ్న. కాబట్టి దీనికి విలువలేదు. భయరహితుడైన వ్యక్తి నిజంగా తిరుగబడి నేర్చుకోవడమంటే యేమిటో, ప్రేమించడమంటే యేమిటో తెలిసికోడానికై ప్రయత్నిస్తూ వుంటే అటువంటి వ్యక్తి అవి మూడును ఒకటేనా లేక వేర్వేరా అని అడుగడు. మాటల గారడీలో మనకు తెలివితేటలు ఎక్కువ. మాటలకు అర్థమును వివరించడంతో సమస్యాపరిష్కారమైనట్లే భావిస్తాము.

నేర్చుకోవటమంటే యేమిటో మీకు తెలుసునా? నిజంగా మీరు నేర్చుకొంటూ వున్నట్లయితే, ఆ నేర్వడం జీవితమంతా వుంటుంది. పైగా దీనికొక గురువంటూ ప్రత్యేకంగా వుండడు. మీరు ప్రతిదాని నుండి నేర్చుకొంటూ వుంటారు. అంటే, ఎండిన ఆకు, ఎగురుతున్న పిట్ట, వాసన, కన్నీరు, ధనికులు, బీదవారు, ఏడుస్తున్నవారు, స్త్రీ ముఖముమీది చిరునవ్వు, పురుషుని ధార్ష్ట్యము – ప్రతిదిన్ని మీకు గురువే. అందువలన దీనికోసమై ప్రత్యేకంగా ఒక మార్గదర్శిగాని, వేదాంతిగాని, గురువుగాని అక్కరలేదు, ఉండడు. స్వయంగా జీవితమే మీకు గురువు. మీరు నిరంతరము నేర్చుకొంటూనే వుంటారు. మీ మనస్సు నిరంతరము జీవితమిచ్చే బోధలను గ్రహించే స్థితిలోనే వుంటుంది.

**3. ప్రశ్న:- సంగ్రహణ శీలతమీద, ఆశలు ఆకాంక్షలమీద నేటి మానవ సంఘం ఆధారపడివున్నమాట నిజం. కాని అట్టి కోరికలే లేకపోతే మనము క్షయించి పోమా? పెరుగుదల ఆగిపోదా?**

**కృష్ణమూర్తి:-** ఇది నిజంగా చాలా ముఖ్యమైన ప్రశ్న. దీనిని సావధానంగా పరిశీలించవలసి వుంటుంది.

దేనిమీదైనా మనస్సు నిల్పడమంటే యేమిటో మీకు తెలుసునా? అదేమిటో చూద్దాం. తరగతి గదిలో మీరు కిటికీ గుండా బయటికి అదేపనిగా చూస్తున్నారనుకోండి లేదా ఎవరి జుట్టునైనా పీకుతున్నారనుకోండి. అప్పుడు ఉపాధ్యాయుడేమంటాడు? పాఠంమీదికి మనస్సు మరల్చమంటాడు. అంటే యేమిటి? మీకు చదువుతున్న పాఠం మీద అభిరుచి లేదని, అందువలన దాని మీదికి మనస్సును మరల్చమని ఉపాధ్యాయుడు మిమ్ములను హెచ్చరిస్తాడు, బలవంత పెడతాడు. కాని నిజానికావిధంగా చేయడం మనస్సు నిల్పడం కాదు. దేనిమీదనైనా మీకు బాగా అభిరుచి వున్నప్పుడే మనస్సు నిల్పడం – అంటే అవధానము – సాధ్యమవుతుంది. అటువంటి సందర్భంలోనే దాని గురించి పూర్తిగా తెలిసికోవడానికై ప్రేమతో ప్రయత్నిస్తారు. అప్పుడే మీ

మనస్సంతా మీ ప్రాణమంతా దానిమీదనే వుంటుంది. అదే విధంగా "పెద్ద పెద్ద కోరికలు లేకపోతే, మనము క్షయము పొందమా?" అనే ప్రశ్న నిజంగా చాల ముఖ్యమైనదని మీరు గ్రహించినప్పుడు, మీకందులో అభిరుచి కలిగి, అందలి సత్యమును కనుగొన గోరుతారు.

ఇక, పెద్ద పెద్ద కోరికలు పెట్టుకొన్న మనిషి – అంటే ఆశాపరుడు – తనకుతాను నష్టం కలుగజేసికోవడం లేదా? ఇది మొదట తెలిసికోవలసిన విషయం. పెద్ద పెద్ద కోరికలుండడం మంచిదా చెడ్డదా అని అడగడం కాదు కావలసింది. మీ చుట్టూ చూడండి. కోరికలు పెట్టుకొన్న మనుష్యులను బాగా గమనించండి. మీకు కోరికలున్నప్పు డేమవుతుంది? మీ గురించే మీరు ఆలోచించుకొంటూ వుంటారు. ఇతరులను గురించి పట్టించుకోరు, కాదా? మీలో క్రూరత్వము చోటు చేసికొంటుంది. ఇతరులను పక్కకు త్రోసివేసి ముందుకు పోజూస్తారు. ఏలయన మీ కోరికను తీర్చుకోవడం మీకు ముఖ్యం. మీరు చాలా గొప్పవారు కావాలని ప్రయత్నిస్తూ వుంటారు. ఆ ప్రయత్నంలో సఫలత పొందే వారికిని, సఫలత పొందక వెనుకబడిపోయే వారికిని మధ్య – సంఘంలో – పోటీని పోరాటాన్ని కల్పిస్తారు. మీకును మీమాదిరి కోరికలే పెట్టుకొన్న వారికిన్ని మధ్య పోటీ పెరుగుతుంది, పోరాట మారంభమవుతుంది. ఇట్టి పోరాటము నిర్మాణాత్మకమైన జీవితము నడపడానికి దోహదమిస్తుందా? నేను చెప్పేది మీకేమైనా అర్థమవుతున్నదా, లేక చాలా కష్టంగా వున్నదా?

ఏదైనా పనిని ప్రేమతో చేయదలిస్తే అందులో అత్యాశ వున్నట్లా? మీరు ఏదైనా ఒక పనిని మనస్ఫూర్తిగా చేస్తున్నట్లయితే, ఏదో పెద్ద స్థితికి చేరుకోనవలెననిగాని, ఇంకా ఎక్కువ లాభాలు పొందవలెనని గాని, గొప్ప ఫలితములను సాధించవలెనని గాని కోరక, కేవలం ఆ పని చేయడం మీది కోరికచేతనే చేస్తున్నట్లయితే అందులో అత్యాశ లేదు; ఉన్నదంటారా? అందులో పోటీలేదు. అగ్రస్థానమును పొందడానికై మీరెవరితోనూ పోటీ పడడంలేదు, పోరాడడంలేదు. అందుకని మీ దృష్టిలో చాలా ముఖ్యమైనదని చేయదగినదని అనుకొన్న పనిని జీవితమంతా చేస్తూ వుండవలెనంటే మీ మనస్సుకు నిజంగా నచ్చని పని యేదో, మీరు ప్రేమతో చేయగల పని యేదో తెలిసికోవడంలో మీరు చదివిన చదువు మీకు తోడ్పడవలె నంటారా లేదా? అట్లా గాకపోతే మీ శేషజీవితమంతా అధ్వాన్నమై పోతుంది, దైన్యంతో కాలం గడుపుతూ వుంటారు. నిజంగా మీకు నచ్చిన పని యేదో తెలిసికోలేక మీ మనస్సు అర్థంలేని ఒక అలవాటులో పడిపోతుంది. అందులో మీకు లభించేది విసుగుదల, క్షయము, మృత్యువున్ను. అందువలన నిజంగా మీకు నచ్చిన పనియేదో, మీరు ప్రేమతో చేయగల పనియేదో మీ చిన్నతనంలోనే మీరు తెలిసికోవడం చాలా అవసరము. నవసమాజ నిర్మాణాని కదియే మార్గము.

4. ప్రశ్న:- పెక్కు ఇతర దేశములలో వలె, ఇండియాలోను విద్యావిధానము ప్రభుత్వాధీనంలో వున్నది. అట్టి పరిస్థితిలో, మీరు చెప్పేరకం ప్రయోగములను కొనసాగింపవలెనంటే సాధ్యమా?

కృష్ణమూర్తి:- ప్రభుత్వ సహాయం లేకపోతే ఇటువంటి పాఠశాలలు స్వతంత్రంగా నిలబడడం సాధ్యమా? ఇది యీ పెద్ద మనిషి అడిగే ప్రశ్న. ప్రపంచమంతటా రానురాను ప్రతి చిన్న విషయం ప్రభుత్వం యొక్క చేతులలోనికి, రాజకీయనాయకుల చేతులలోనికి పోవడం ఆయన చూస్తున్నాడు. అధికారంలో వున్నవారు మన మనస్సులను, హృదయాలను తమ కనుగుణంగా మలచివేసికో జూస్తున్నారు. వారు ఉద్దేశించిన తీరులోనే మనచేత ఆలోచింప జేస్తున్నారు. రష్యాలోగాని, మరింకే దేశంలోనైనా విద్య ప్రభుత్వము యొక్క అధీనంలోనికి పోవడం ఇప్పటి ప్రవృత్తి. అందుకని యీ పెద్దమనిషి అడిగేదేమంటే నేను మాట్లాడుతున్నరకం బడి ప్రభుత్వ సహాయం లేకుండా అస్తిత్వములోనికి రాగలదా? వచ్చినా అది మనగలదా? యని.

సరే, మీ రేమంటారు? ఏదైనా విషయం చాలా ముఖ్యమైనదని మీరు తలిస్తే, నిజంగా చేయదగినదని మీరు భావిస్తే, ప్రభుత్వములు అవునన్నా కాదన్నా సంఘమర్యాదలు అనుకూలమైనా కాకపోయినా మీరు మీ హృదయమంతా దానికై అర్పిస్తారు. అప్పుడది విజయవంత మవుతుంది. కాని మనలో చాల మందిమి మన మనోహృదయములను దేనికిని అంకితము చేయము. అందువల్లనే యిటువంటి ప్రశ్నలు వేస్తూ వుంటాము. మనలో ప్రతి యొక్కరము అంతర్గతంగా, మానసికంగా, ఆధ్యాత్మికంగా పూర్తిగా ఎదురుతిరిగి నిలబడితే అప్పుడే నవసమాజ నిర్మాణము జరుగుతుందని, క్రొత్త ప్రపంచము వెలుగులోనికి వస్తుందని దృఢంగా భావిస్తే అప్పుడు మనము మన హృదయాలను, మన మనస్సులను మన శరీరాలను అర్పించి, భయంగాని దానివలన గలిగే ఫలితాలు గాని లేని బడిని స్థాపించడానికై పని చేయగలము.

అయ్యా, సత్యమేదో తెలిసికొని, ఆ సత్యమున కనుకూలంగా నడువ నిశ్చయించుకొన్నట్టి యేకొద్దిమంది ద్వారానే నిజమైన విప్లవము రాగలదు. కాని సత్యమేదో తెలిసికోడానికి సంప్రదాయము నుండి విముక్తి, అంటే అన్ని విధములైన భయాలనుండి విముక్తి చాలా అవసరము.

*27 డిశంబరు, 1954*

★ ★ ★

# 2. స్వతంత్రము - విముక్తి

ఈ రోజు మీతో స్వతంత్రత లేదా ముక్తావస్థ అనే విషయం గురించి చర్చించుదామని వున్నది. ఇది చాలా క్లిష్టమైన విషయం. దీనిని చాలా లోతుగా పరిశీలించి అర్థం చేసికోవలసి వుంటుంది. స్వాతంత్ర్యం గురించి – అంటే మత స్వాతంత్ర్యం గురించి, మన యిష్టం వచ్చినట్లు చేయడానికి గల స్వాతంత్ర్యం గురించి – చాలా మంది చెప్పడం వింటాము. పండితులు ఈ విషయమై ఎన్నో గ్రంథాలు వ్రాసి వున్నారు. కాని మన మా అనవసరపు చర్చలు, వాదముల జోలికి పోకుండా, నేరుగా ఈ విషయాన్ని పరిశీలిద్దాం. బహుశా అట్లా చేస్తేనే ఈ సమస్యకు సరియైన సమాధానం లభింపవచ్చు.

పడమటి దిక్కున, సూర్యుడు అస్తమించేటప్పుడు కనబడే అద్భుతమైన సంధ్యారాగాన్ని అదే సమయంలో చెట్ల మీదుగా తొంగి తొంగి చూస్తూ వుండే బాలచంద్రుణ్ణి చూడడం కోసం మీ రెన్నడైనా క్షణ కాల మాగినారా? నా కనుమానమే. సాధారణంగా, ఆ సమయాన నది చాల ప్రశాంతంగా ప్రవహిస్తూ వుంటుంది. వంతెన, దానిపై పోతున్న రైలు, లేత జాబిల్లి, యింతలో చీకటి పడగానే నక్షత్రాలు – ఇవన్నీ అందులో ప్రతిఫలిస్తూ వుంటాయి. ఈ దృశ్యము చాల మనోహరంగా వుంటుంది. అయితే అట్టి అందమైన దాన్ని దేనినైనా బాగా గమనించి చూడవలె నంటే, మీ మనస్సంతా దానిమీద నిల్పవలె నంటే ఆ మనస్సును ఆక్రమించుకొని వున్న ఆలోచనలన్నీ లేకుండా పోవాలి, కదా? సమస్యలతో, చింతలతో, ఊహలతో నిండిపోకుండా మనస్సు చాల ప్రశాంతంగా వున్నప్పుడు మాత్రమే, మీరు దేనినైనా నిజంగా పరిశీలించి చూడగలరు. అప్పుడే మీ మనస్సు అసాధారణ సౌందర్యాన్ని గ్రహింపగల స్థితిలో వుంటుంది. బహుశా యిందులోనే వుంటుంది. మన స్వాతంత్ర్య సమస్యకు కీలకం.

స్వేచ్ఛగా, స్వతంత్రంగా వుండడమంటే అర్థమేమిటి? మీ కేది అనుకూలమో దానిని చేయడమా? మీ యిష్టం వచ్చిన చోటికి పోవడమా? మీ యిష్టం వచ్చినట్లు ఆలోచించడమా? ఇదంతా మీ రెట్లాగూ చేస్తూనే వుంటారు. ఇతరుల మీద ఆధారపడకుండా వుంటేనే స్వతంత్రులైనట్లా? ప్రపంచంలో చాలామంది పరతంత్రులు కారు. కాని వారిలో స్వతంత్రులు చాల తక్కువ మంది మాత్రమే. స్వాతంత్ర్యంలో తెలివి వున్నది; స్వతంత్రంగా వుండడమంటే తెలివి కలిగి వుండడమే. అయితే, స్వతంత్రులం కావలెనని కేవలం కోరుకొంటూ వుంటే తెలివి రాదు. మీ పరిసరాలను, నిరంతరము మిమ్ము లోబరచుకొంటున్న సాంఘిక ధార్మిక పరిస్థితులను, తల్లి తండ్రుల మరియు సంప్రదాయముల ఒత్తిళ్ళను అర్థం

చేసికోవడం ఆరంభించినప్పటినుండి మీలో తెలివి వికసించడం ఆరంభమవుతుంది. అయితే రకరకాలైన యీ ఒత్తిళ్ళను అర్థం చేసికోవలెనంటే – మీ తల్లిదండ్రుల యొక్క, మీ ప్రభుత్వము యొక్క, మీరున్న సంఘముయొక్క, సంస్కృతి యొక్క, దేవతలయొక్క, వివిధములైన అంధవిశ్వాసముల యొక్క, రకరకాలైన నమ్మికల యొక్క మరియు అనాలోచితంగా మీరు అనుసరిస్తూ వున్న సంప్రదాయము యొక్క ఒత్తిళ్ళను అన్నిటిని అర్థము చేసికొని, వాటినుండి విడివడవలెనంటే – ఎంతో లోతైన అంతర్దృష్టి కావాలి. కాని, అది లేనందున వాటికన్నిటికీ మామూలుగా మీరు త్వరగా లొంగిపోతారు. ఎందుకంటే, లోలోపల మీలో రకరకాల భయాలు నిండివుంటాయి. జీవితంలో మీకొక మంచి స్థానం లేదని భయం. మీ పురోహితుడు లేదా మతగురువు మిమ్మేమంటాడోనని మరొక భయం. సంప్రదాయము ననుసరించ లేదని భయం. సరియైన మార్గమున పోవడం లేదని, సరియైన పని చేయడం లేదని భయం. కాని వాస్తవానికి స్వతంత్రత లేదా ముక్తావస్థ భయముగాని బలవంతముగాని, తన భద్రత గురించిన ఆదుర్దాగాని లేని ఒక విధమైన మానసిక స్థితి.

మనలో చాలమందిమి సురక్షితంగా భద్రంగా వుండాలని కోరుకోమా? మనమెంత గొప్పవాండ్లమో, ఎంత అందంగా కనబడతామో లేక ఎంత అసాధారణ ప్రజ్ఞావంతులమో అని అందరూ మెచ్చుకోవాలని కోరుకోమా? లేకపోతే మన పేర్ల చివర అక్షరాలు ఎందుకు తగిలించుకొంటాము? అదంతా మనకు ఆత్మవిశ్వాసాన్ని, మనం చాల ముఖ్యమైన వాండ్ల మనే భావాన్ని కలిగిస్తుంది. మనమంతా చాల ప్రసిద్ధమైన వాళ్ళం కావాలని కోరుకొంటాము. మన యొక్క స్థితి పెరగాలని ఎప్పుడైతే అనుకొంటామో ఆ క్షణం నుండే మనము బద్ధులమై పోతాము, బంధములలో చిక్కుకొంటాము.

బంధ విముక్తిని గూర్చిన సమస్యను అర్థం చేసికోవడానికి ఇదే నిజమైన కీలకము–మీరును చూడండి. రాజకీయ నాయకులు, అధికారము, పదవి హోదాలున్న యీ లౌకిక ప్రపంచంలోగాని, ధర్మాత్ముడు, ఉదారుడు, సాధువు, మహాత్ముడని అనిపించుకోవాలని మీరు కోరుకొనే ఆధ్యాత్మిక ప్రపంచమనే దానిలో గాని, మీరొక ఉన్నత స్థితిని పొందవలెనని కోరుకొన్న క్షణమునుండి మీరు బద్ధులే, బంధవిముక్తులు కారు.

వీటన్నిటిలోని అర్థరాహిత్యమును, అసమంజసత్వమును, తెలివితక్కువ తనాన్ని గ్రహించిన వ్యక్తి యొక్క హృదయము పసిపిల్లల హృదయమువలె అమాయకమైనది, నిర్మలమైనది. ఏదో స్థితిని పొందవలెననే కోరిక అట్టి హృదయములో కలుగదు. అట్టి వ్యక్తియే విముక్తుడు. ఇదెంత సరళమైన విషయమో మీరు తెలిసికొంటే, ఇందలి అసాధారణ సౌందర్యమును, గాంభీర్యమును గూడ తెలిసికొనగలరు.

ఇంతకున్ను మీరు వ్రాయబోయే యీ పెద్ద పెద్ద పరీక్షలన్నీ యెందుకోసం? మీకొక హోదానిచ్చి, మిమ్మొక వ్యక్తిగా – చెప్పుకోదగిన వ్యక్తిగా – చేయడం కోసమే. బిరుదులు, పదవులు, మీరు సంపాదించుకొన్న జ్ఞానము ఇవన్నీ మిమ్మొక విశిష్ట వ్యక్తిగా చేయడానికి తోడ్పడతాయి. మీరు జీవితంలో ఏదో సాధించవలెనని మీరు గూడ మీ పినతండ్రి పెత్తండ్రులవలె, మీ తాత ముత్తాతల వలె జీవితంలో విజయం

పొందవలెనని మీ తల్లిదండ్రులు, ఉపాధ్యాయులున్ను బోధించడం చూడలేదా? ఎవరో యొక మహావీరునివలె, మహాత్ముని వలె, సాధువువలె, సన్న్యాసి వలె కావాలని మీరు మాత్రం కోరుకోరా? అందుచేత మీరున్ను బద్ధులే; స్వతంత్రులు కారు. ఒక మహాత్ముడినో, భక్తుడినో, ఉపాధ్యాయుడినో లేక బంధువునో అనుకరించినా, లేదా ఏదేని ఒక సంప్రదాయాన్ని అంటిపెట్టుకొని వున్నా దాని అర్థము మీరేదో కోరిక పెట్టుకొన్నట్లే, బంధము పెంచుకొన్నట్లే. ఈ విషయాన్ని మీరు బాగా అర్థం చేసికొంటే, అప్పుడే విముక్తులవుతారు.

అందువలన చదువు యొక్క వుద్దేశమేమంటే – చిన్నప్పటినుండి ఎవరినీ అనుకరించకుండా మీరు మీరుగానే ఉండిపోవునట్లు చేయడమే. ఇది చాలా కష్టమైన పని. మీరు అందముగా నున్నా సరే లేకపోయినా సరే, మీలో ఈర్ష్యాసూయలున్నా సరే లేకున్నా సరే మీరు మీరుగానే ఉండాలి. అయితే మీ స్థితిని మీరు అవగాహన మాత్రం చేసికోవాలి, అంతే.

మీరు మీరు గానే వుండడం చాల కష్టం. ఎందుకంటే, మీ దృష్టిలో మీరు ఉత్తములు కారు; మీలో చాల చెడ్డ గుణాలున్నాయి. అందువలన గట్టిగా ప్రయత్నం చేసి చాల ఉత్తములుగా మారినట్లయితే ఎంత బాగుండును? అని అనుకొంటూ వుంటారు. కాని అట్లా ఎప్పటికిని జరుగదు. అట్లుగాక, వాస్తవంగా మీరెవరో ఎట్లున్నారో చూచికొని మీ స్థితిని మీరు అర్థం చేసికొంటే ఆ అర్థం చేసుకొనడంలోనే మీలో మార్పు వస్తుంది. కాబట్టి స్వతంత్రము లేదా విముక్తి అనేది వేరొక విధంగా మారిపోవడానికి ప్రయత్నించడంలో లేదు; ఏమి చేయాలని బుద్ధిపుడితే అది చేయడంలో లేదు; సంప్రదాయంగాని తల్లిదండ్రులు లేక గురువు గాని చెప్పిన దానిని ఆచరించడంలో లేదు. కాని క్షణక్షణము మిమ్ము మీరు ఉన్నదున్నట్లు అర్థం చేసికొనడంలోనే వున్నది.

ఇందుకై మీ చదువు ఉపయోగపడడం లేదు. మీరు మీరుగా ఉండకుండ మరియొక విధంగా మారవలెనని మీ చదువు మిమ్ము ప్రోత్సహిస్తున్నది. అది మిమ్ము మీరు అర్థం చేసికోవడం ఎట్లా అవుతుంది? మీ యాత్మ లేదా మీరు అనబడే వ్యక్తి చాల క్లిష్టమైనది. అది రోజూ బడికి పోయేది, దెబ్బలాడేది, ఆటలాడేది, భయపడేది మాత్రమే కాదు. ఇంకా యెంతో నిగూఢమై, బయటికి తెలియరానిది కూడాను. అందులో మీరు ఆలోచించే ఆలోచనలన్నీ వున్నాయి. పైగా ఇతర మనుషులు, పుస్తకాలు, వార్తాపత్రికలు, నాయకులు – వీరందరు మీలో నింపిన వన్నీ చేరుతాయి. వాటినన్నిటిని అర్థం చేసికోవాలంటే మీరు మరియొకరుగా మారిపోవాలని కోరుకోరాదు. ఇతరులను అనుకరించరాదు, అనుసరించరాదు – అంటే అర్థమేమిటి? మీరు ఇంకొకరుగా మారిపోవాలని చెప్పే సంప్రదాయానికి విరుద్ధంగా మీరు తిరుగబడాలి. అదే నిజమైన తిరుగుబాటు. అందుమూలాన మీకు అసాధారణమైన స్వాతంత్ర్యము అంటే విముక్తి లభిస్తుంది. ఇట్టి బంధముక్తిని కలుగ జేయడమే చదువు యొక్క నిజమైన ఉద్దేశము.

ఏదో విధంగా మీకు గుర్తింపు లభిస్తే అప్పుడే మీకు సుఖ సంతోషాలు, భద్రత లభిస్తాయని మీ తల్లిదండ్రులు, ఉపాధ్యాయులేగాకుండ మీలోని కోరికలు గూడ మీకు

చెప్తూతూ వుంటాయి. కాని మిమ్ము బానిసగా చేసి అణగదొక్కి వేసే ఆ ఒత్తిళ్ళ నన్నిటి నుండి బ్రద్దలు కొట్టుకొని బయటికిరాకపోతే మీకు నిజమైన తెలివి యెట్లు లభిస్తుంది?

సత్యం కానిదేదో గ్రహించి, దానికి విరుద్ధంగా – కేవలం మాటలతో గాకుండా, యథార్థంగా – మీలో ఎవరైతే తిరుగబడతారో వారిమీదనే ఆధారపడివుంది, క్రొత్తప్రపంచం వస్తుందనే ఆశ. అందువల్ల సరియైన విద్యార్జన కోసం మీరు ప్రయత్నించాలి. ఎట్టి ఒత్తిడులులేని వాతావరణంలో పెరిగినప్పుడే, సంప్రదాయం మీద ఆధారపడనటువంటిది, ఎవరో వేదాంతి లేక ఆదర్శవాది యొక్క పిచ్చి ఆలోచనల ప్రకారం నడవనటువంటిది అయిన క్రొత్త ప్రపంచాన్ని మీరు సృష్టింప గలరు. కాని మీరు, ఎవరో మరొకరుగా మార్పు చెందాలని ప్రయత్నిస్తూ వున్నా లేదా ఏదో యొక గొప్ప ఆదర్శాన్ని పెట్టుకొని దాని మాదిరి వుండాలని ప్రయత్నిస్తూ వున్నా మీకు విముక్తి వుండదు, స్వతంత్రముండదు. అది దూరమైపోతుంది.

1. ప్రశ్న:– 'తెలివి' అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:–** ప్రశ్నను మెల్లగా ఓర్పుతో పరిశీలించి తెలిసికొందాం. తెలిసికోడం అంటే ఒక నిర్ణయానికి రావడం కాదు. ఈ రెంటికీ గల తేడా మీకు తెలుసునో తెలియదో? 'తెలివి' అంటే ఏమిటో మీరొక నిర్ణయానికి వచ్చినారంటే, ఆ క్షణం నుండి మీకు తెలివి లేనట్లే! చాల మంది పెద్దవాండ్లు చేసిన పనే అది. వాండ్లొక నిర్ణయానికి వచ్చినారు. దానితో వాండ్లు తెలివిగలవాండ్లు కాకుండా పోయినారు. అంటే దీనిని బట్టి మొట్టమొదటనే మీరొక విషయం తెలిసికొన్నట్లే – అదేమిటంటే తెలివిగల మనస్సు ఎప్పుడూ పరిశీలించి గ్రహిస్తూ వుంటుందేగాని ఎట్టి నిర్ణయాలకున్ను రాదని.

'తెలివి' అంటే ఏమిటి? ఆ పదానికి ఒక నిర్వచనమిస్తే చాల మంది తృప్తిపడతారు. "ఆ నిర్వచనం చాల బాగుంది" అని యైనా అంటారు లేదా తాము సొంతంగా తమ నిర్వచనాన్ని మనకందిస్తారు. నిర్వచనాలతో, వ్యాఖ్యానాలతో వివరణలతో తృప్తి పడే మనస్సు లోతు లేనిది కాబట్టి తెలివి గలదికాదు.

వివరణలతో, నిర్ణయాలతో, సిద్ధాంతాలతో తెలివిగల మనస్సు తృప్తి పడదని మీరు తెలిసికోసాగినారు. అట్లే అది నమ్మకాలమీద ఆధారపడింది కూడా కాదు. ఎందుకంటే నమ్మకమన్నా ఒక విధమైన నిర్ణయమే కదా! తెలివిగల మనస్సు విచారణ చేస్తూ, పరిశీలిస్తూ, నేర్చుకొంటూ, అధ్యయనం చేస్తూ వుంటుంది. అంటే యేమిటి? తెలివి అనేది భయవిముక్తుడవయితేనే వుంటుంది. దేవుడనెవరో లేదా దేనియొక్క మూల తత్త్వము నైనా తెలిసికొనడానికై సత్యాన్ని తెలిసికొనడానికై సంఘపు కట్టుబాట్లకు విరుద్ధంగా పోవ సిద్ధమైతేనే, తిరుగబడడానికి ఇష్టపడితేనే, తెలివియున్నట్లు.

తెలివి అనేది కూడబెట్టుకొన్న జ్ఞానరాశి కాదు. ప్రపంచంలోని పుస్తకాలనన్నిటినీ చదివినా అది మీకు తెలివి నీయదు. తెలివనేది చాల సూక్ష్మమైనది. అది

దేనిమీదను ఆధారపడదు. దేనినీ అంటిపెట్టుకొని వుండదు. మనస్సు పని చేసెడి తీరునంతను మీరు అర్థం చేసికొంటే - ఎవరో వేదాంతిగాని, గురువు గాని చెప్పినట్లు గాక (వారి యుద్దేశం ప్రకారంగాక) మీ మనస్సును మీరు అర్థం చేసికొంటే, అప్పుడే తెలివి జాగృతమవుతుంది, ప్రస్ఫుటమవుతుంది. మీ మనస్సు అనాదికాలము నుండి వున్న మానవత యొక్క ఫలితము. దానిని మీరు అర్థం చేసికొంటే, మీరు వేరే యే పుస్తకాన్ని గూడ చదువనక్కరలేదు. ఏలయన భూతకాలమందలి జ్ఞానమంతా ఆ మనస్సులో చేరివున్నది. అందుకని మిమ్ము మీరు అర్థం చేసికొనడంతో తెలివి అభివ్యక్తమవుతుంది. అయితే యీ ప్రపంచంలోని మానవులు, వస్తువులు, ఆలోచనలు, ఉద్దేశములు - వీనితో మీకు గల సంబంధము ద్వారానే మిమ్ము మీరు అర్థము చేసికోగలరు. తెలివి యనేది చదువు మాదిరిగానే సంపాదించి కూడబెట్టుకొనేది కాదు; ఎదిరించి ప్రశ్నింపసాగినపుడు అంటే మీలో భయము లేనప్పుడు - అంటే నిజానికి, మీలో ప్రేమభావమున్నప్పుడు మాత్రమే - తెలివి ఉద్బుద్ధమవుతుంది. భయము లేనప్పుడే కదా ప్రేమ వుండేది.

మీకు వివరణలు వ్యాఖ్యానాలే కావలసి వుంటే మీ ప్రశ్నకు నేను జవాబివ్వనట్లే! తెలివి అంటే యేమిటి అని అడగడం, జీవితమంటే యేమిటి అని అడిగినట్లే. జీవితమంటే చదువూ సంధ్యా, ఆటా పాటా, కామవాంఛ, సుఖం సంతోషం, పని చేయడం, తగవు లాడడం, ఈర్ష్య, అసూయ, తృష్ణ, ప్రేమ, సత్యం, సౌందర్యం - ఇట్లా ప్రతిదీ జీవితమే కాదా? కాని మనలో చాలామందికి దీని గురించి లోతుగా నిలకడగా విచారణ చేయడానికి తగినంత ఓపిక వుండదు.

2. ప్రశ్న:- మొరటు మనస్సు సున్నితమైన మనస్సుగా మారగలదా?

**కృష్ణమూర్తి:-** ముందు ప్రశ్నను వినండి, మాటల వెనుక గల అర్థాన్ని గమనించండి. మొరటు మనస్సు సున్నితమైన మనస్సుగా మారగలదా? నా మనస్సు మొరటైనది కాబట్టి దానిని సున్నితమైన దానినిగా మార్చడానికై ప్రయత్నిస్తే, ఆ చేసే ప్రయత్నమే మొరటుతన మనిపించుకొంటుంది. ఇది విని తెల్లపోవద్దు. జాగ్రత్తగా గమనించండి. అట్లుగాక నేను మొరటుగా వున్నానని గ్రహించి మారవలెననే కోరికలేకుండా, సున్నితమైన మనస్సు కొరకు ప్రయత్నించకుండా, మొరటుతనమంటే యేమిటో అర్థం చేసికోడం ఆరంభిస్తే, ప్రతిదినము నాలోని మొరటు తనాన్ని గమనిస్తూ వుంటే - ఆబగా తినడం, త్రాగడం, మొరటుగా ఇతరులతో ప్రవర్తించడం, నా గర్వాన్ని, నా అహంకారాన్ని, నా అలవాట్లు నా ఆలోచనలలోని మోట తనాన్ని గమనిస్తూ వుంటే - ఆ గమనికయే వస్తుస్థితిని మార్చివేస్తుంది.

అదే విధంగా నేను మందబుద్ధిని సూక్ష్మబుద్ధిగా మారవలెనని చెప్పి, అందుకోసమై ప్రయత్నించసాగితే ఆ ప్రయత్నమే మీలోని మితిమీరిన మందబుద్ధితనాన్ని సూచిస్తుంది. ఏలయన, మీరు మీ మందబుద్ధితనాన్ని అర్థం చేసికోడం ప్రధానంగాని దానిని మార్చ ప్రయత్నించడం కాదు. బుద్ధిమంతుణ్ణి కావాలని ఎంతగా ప్రయత్నించినా నా బుద్ధిమాంద్య మదెక్కడికిని పోదు. విద్యావంతులలో వుండే పైపై లక్షణాలను

సాధింపవచ్చు, పైపై సొగసులను అలవరచుకోవచ్చు, అనేక పుస్తకాలలో నుండి మాటలను వాక్యములను ఉటంకించవచ్చు. గొప్పగొప్ప రచయితలు రచించిన గ్రంథాలలో నుండి పేజీలకు పేజీలు వల్లెవేసి అప్పగించవచ్చు. కాని మూలమందున్న బుద్ధి మాంద్యమును మాత్రము పోగొట్టలేము – అది పోదు. అట్లుగాక నా దైనిక జీవితంలో – క్షణ క్షణము – నా బుద్ధిమాంద్య మెట్లా ప్రతిఫలిస్తున్నదో గ్రహించగల్గితే – నా పనిమనుషుల యెడ నేనెట్లా ప్రవర్తిస్తున్నానో, నా యిరుగు పొరుగువారి యెడ నా భావములెట్టివో, బీదవాడు, ధనికుడు, గుమాస్తా – వీరినెట్లా ఆదరిస్తున్నానో గమనింపగలిగితే, ఆ గమనికయే నా బుద్ధి మాంద్యమును బ్రద్దలు చేసి పోగొట్టుతుంది.

ప్రయత్నించి చూడండి – మీరు మీ పనిమనిషితో ఎట్లా మాట్లాడుతున్నారో, గవర్నరును ఎంత ఎక్కువగా గౌరవిస్తారో, మీ కివ్వడానికేమిన్నీ లేని బీదవానిని ఎంత తక్కువగా చూస్తారో గమనించండి. అప్పుడు మీ కర్థమవుతుంది మీరెంత అల్పబుద్ధులో! ఆ విధంగా మీరు మీ బుద్ధి మాంద్యమును అర్థం చేసికోడంలోనే తెలివియున్నది, బుద్ధిసూక్ష్మత యున్నది. వేరే బుద్ధిమంతునిగా మారవలసిన అవసరం లేదు. ఏదో విధంగా మారవలెనని కోరుతూ అందుకోసమై ప్రయత్నించేవాడే మొరటు మనిషి, కురూపి, కొరడు పారిన మనస్సు గలవాడు.

### 3. ప్రశ్న:- తల్లిదండ్రులు మరియు ఉపాధ్యాయుల సహాయం లేకుండా పసిపిల్లవాడు తానెవరో ఎట్లు తెలిసికోగలడు?

**కృష్ణమూర్తి:-** తెలిసికోగలడని నేను చెప్పితినా? లేక నేనన్న మాటలకు మీ సొంత వ్యాఖ్యానమా యిది? పిల్లవానికి అతడున్న వాతావరణము పరిసరములున్ను సహకరిస్తే అతడు తనంతట తానే తన్ను గురించి తెలిసికోగలడు. తల్లిదండ్రులు గాని ఉపాధ్యాయులు గాని పిల్లలు తమ్ము గురించి తాము తెలుసుకోవలెనని నిజంగా – వారి మీది ప్రేమతో – భావిస్తే వారిని ఏవిధంగాను నిర్బంధించరు. అందుకు తగిన వాతావరణాన్ని మాత్రం వారు కల్పిస్తారు – అంతే!

మీరీ ప్రశ్నను అడిగినారు. బాగానే వుంది. కాని మీకిది అంతముఖ్యమైన సమస్యా? పిల్లవాడు తన గురించి తాను తప్పక తెలిసికోవాలని మీరు నిజంగా మీ అంతస్సులో భావించి వుంటే, ఆ పిల్లవానిపై అధికారము, జబర్దస్తీ చూపించినట్టయితే వాడా పని చేయలేడని మీరు నిజంగా తలిస్తే దానికి తగిన మంచి వాతావరణాన్ని కల్పింపజూడరా? ఇక్కడ మళ్ళీ పాతపాటే – "ఏమి చేయాలో చెప్పు, చేస్తాను" అని. అంతేగాని "మనందరం కలిసి పనిచేద్దాం" అని అనము. పిల్లవాడు తన్ను గూర్చిన జ్ఞానము తనంతట తాను సంపాదించుకోవాలంటే దానికి తగిన వాతావరణాన్ని ఎట్లా కల్పించాలి అనే సమస్య ప్రతియొక్కనికిన్ని సంబంధించినది – తల్లిదండ్రులకు, ఉపాధ్యాయులకు, స్వయంగా పిల్లలకున్ను. అయితే, ఆత్మజ్ఞానము – అంటే తన్ను గురించిన జ్ఞానము – తన కితరులు కల్గించేదికాదు. ఒకరు తెచ్చి యిచ్చేది కాదు. ఈ అవగాహన నిర్బంధం చేస్తే వచ్చేదికాదు. ఈ సమస్య మీకు నాకు

తల్లిదండ్రులకు ఉపాధ్యాయులకు అందరికిన్నీ సంబంధించినది, అత్యావశ్యకమైనదిన్ని అని అనుకొంటే, మనందరం కలిసి దానికి తగిన సరియైన పాఠశాలలను నిర్మిస్తాం.

**4. ప్రశ్న:- పల్లెలలో దెయ్యం పట్టడం లాంటి విషయాలను చూచినామని, తమకు దెయ్యాలు భూతాలు అంటే భయమని పిల్లలు చెప్పుతూ వుంటారు. 'చావు' అంటే యేమిటని కూడా వారడుగుతారు. దీని కంతకు ఏమని సమాధానమివ్వాలి?**

**కృష్ణమూర్తి:-** చావు అంటే యేమిటో తరువాత చర్చిద్దాం. కాని భయమనేది చూశారా, చాల విలక్షణమైన విషయం. దెయ్యాల గురించి మీకు–(పిల్లలకు)–మీ తల్లిదండ్రులు, ఇంకా యితర పెద్దలు చెప్పి వుంటారు. లేకపోతే మీరు బహూశా వాటిని చూడరు. దెయ్యం పట్టడం గురించి యెవరో మీకు చెప్పి వుంటారు. ఈ విషయాలు తెలిసికోడానికి మీరింకా చాలా చిన్న పిల్లలు. ఇది మీ స్వానుభవంలోని విషయంకాదు. మీ పెద్దలు చెప్పిన దాని ఫలితమిది. మరి ఆ పెద్దలకైనా మామూలుగా ఈ విషయాల గురించి యేమిన్నీ తెలియదు. ఏదో పుస్తకంలో వారీ విషయమై కేవలం చదివి వుండి, అంతా తమకు అర్థమైనట్లే భావిస్తారు. ఇందులో నుండి యింకొక క్రొత్త ప్రశ్న పుట్టుకొస్తుంది – భూతకాలపు స్మృతులతో మలినము చేయబడని అనుభవమంటూ వుంటుందా? భూతకాలమందలి జ్ఞానముతో దూషితమైన అనుభవము ఆ జ్ఞానమున కనుబంధము వంటిదేగాని మౌలికమైనది కాదు, సరిక్రొత్తది కాదు.

పిల్లలతో వ్యవహరించుచున్న మీరెవరున్ను మీ మీ భ్రమలను భ్రాంతులను దెయ్యాల గురించిన మీ మీ నమ్మకాలను, ఉద్దేశాలను, అనుభవాలను ఆ పిల్లలమీద రుద్దవద్దు. ఇది చాలా ముఖ్యం. అయితే యిది మాన్పించడం చాలా కష్టం. జీవితానికి బొత్తిగా ఉపయోగపడని యిటువంటి అనావశ్యకమైన విషయాల గురించి వృద్ధులు అతిగా మాట్లాడుతూ వుంటారు. క్రమక్రమంగా వారు తమ ఆందోళనలను, భయాలను, మూఢవిశ్వాసాలను పిల్లలకు సంక్రమింప జేస్తారు. ఇక పిల్లలో, తాము విన్నదానిని సహజంగానే మళ్ళీ మళ్ళీ చెప్పుతూ వుంటారు. జ్ఞాపకం తెచ్చుకొంటూ వుంటారు. అందువలన పెద్దలు తమకే సరిగా తెలియని యీ విషయాల గురించి పిల్లల యెదుట మాట్లాడనే కూడదు. దాని బదులు పిల్లలు స్వేచ్ఛగా భయం లేకుండా పెరగడానికి దగిన వాతావరణాన్ని కల్పించడంలో తోడ్పడడం చాలా మంచిది.

*28 డిశంబరు, 1954*

★ ★ ★

# 3. స్వతంత్రము - ప్రేమ

స్వతంత్రము లేదా విముక్త స్థితిని గురించి నేను చెబుతూ వచ్చినది బహుశా మీలో కొందరు సరిగా అర్థం చేసికోలేక పోవచ్చును. కాని మీరు క్రొత్తక్రొత్త విషయాలను మీ వాడుకలో లేనివాటిని, మీరలవాటు పడని వాటిని గూడ వినడం చాల అవసరం. జీవితంలో అందమైన వాటినే గాదు, అందంగా లేనివాటిని గూడ చూడాలి. ప్రతిదానిని మీరు పరిశీలిస్తూ వుండాలి. అదేవిధంగా మీకు బహుశా సరిగా అర్థం గాని విషయాలను గూడ మీరు వింటూ వుండాలి. ఎందుకంటే, మీ కర్థంగావడానికి కొంత కష్టంగా కనపడే యీ విషయాల గురించి మీరు ఆలోచన సాగించే కొలది మీరు మీ జీవితాన్ని ఎక్కువ సార్థకంగా, ఆనందంగా గడపగల్గుతారు.

సూర్యోదయ సమయంలో నీళ్ళమీద పడే సూర్యకాంతిని మీరెవరైనా యెప్పుడైనా గమనించారా? ఆ కాంతి యెంత మృదువుగా, ఎంత అందంగా వుంటుందో! ఆకాశంలో ఒంటరిగా చెట్లమీదుగా కనబడే వేగుజుక్కతో బాటు క్రిందనున్న నల్లటి నీళ్ళు ఎట్లా ఆడుకొంటూ వుంటాయో యెప్పుడైనా చూచారా? లేక మీ దినచర్యలో మీరు మునిగిపోయి, బొత్తిగా తీరుబడి లేక, మనం నివసించే యీ భూమి యొక్క అందాన్ని మరచిపోయినారా? లేదా మన భూమి చాల అందంగా వుంటుందని కూడ మీ రెరుగరా? మనము సామ్యవాదులమైనా, భూస్వామ్యవాదులమైనా, హిందువులమైనా, బౌద్ధులమైనా, మహమ్మదీయులమైనా, క్రైస్తవులమైనా, గ్రుడ్డివారమైనా, కుంటివారమైనా లేక అంతా బాగున్నవారమైనా – ఎవరమైనా సరే యీ భూమి మనందరిదిన్నీ. మీ కర్థమౌతోందా? ఈ భూమి మనది, మరింకెవరిదో కాదు. ఇది కేవలం ధనవంతులదిగాని, బలవంతులైన రాజులదిగాని, భూస్వాములది గాని కాదు. ఇది మీది, నాది, మనందరిదీని. మనకు ఊరూపేరూ లేకపోవచ్చుగాక, అయినా మనం గూడ ఈ భూమి మీదనే నివసిస్తున్నాము. దీనిమీదనే మనందరం కలిసి జీవించాలి. ఈ ప్రపంచం ధనవంతులదే కాదు, బీదవారిది కూడ; చదువుకొన్నవారిదేకాదు, చదువురానివారిది కూడా. ఈ ప్రపంచం మనది. ఈ విధంగా మనం మనసార భావించి మన యీ భూమిని ప్రేమించాలి – ఎప్పుడో యొకనాడు, ప్రశాంత ప్రభాత కాలంలోనే కాదు, ఎప్పుడూ, ఎల్లప్పుడున్నూ. అయితే యిది మన ప్రపంచమేయని మనసార భావించి దానిని ప్రేమించాలంటే, మనకు స్వతంత్రమంటే యేమిటో అర్థమైయుండాలి.

ప్రస్తుతం మనకు స్వతంత్రమనేదే లేదు. దాని అర్థమే మనకు తెలియదు. మనం స్వతంత్రంగా వుండాలని కోరుకొంటాము. కాని గమనించి చూస్తే ప్రతివాడూ – ఉపాధ్యాయుడు, తల్లి, తండ్రి, న్యాయవాది, రక్షకభటుడు, సైనికుడు, రాజకీయనాయకుడు, వ్యాపారి – ఇట్లా అందరూ తమతమ చిన్న చిన్న పరిధులలో ఆ స్వతంత్రానికి అడ్డుకట్టలు వేస్తూ వున్నారు. స్వతంత్రంగా వుండడమంటే మీ

యిష్టం వచ్చిన పని, యిష్టం వచ్చినట్లు చేయడం కాదు. లేదా, మిమ్ము బంధించే బాహ్య పరిస్థితులనుండి త్రెంచుకొని పారిపోవడం కాదు. మీరు మీ పరాధీనతను అర్థం చేసికోవడంలోనే స్వతంత్రమున్నది. పరాధీనత అంటే యేమిటో మీకు తెలుసునా? మీరు మీ తల్లి తండ్రులమీద ఆధారపడతారు, కదా? మీ ఉపాధ్యాయుల మీద ఆధారపడతారు. మీకు వండిపెట్టే వానిమీద ఆధారపడతారు. జాబులు తెచ్చి యిచ్చే తపాలా వానిమీద, పాలు తెచ్చిపోసే పాలవానిమీద – ఇట్లా యెందరిమీదనో ఆధారపడతారు. ఈ విధమైన పరాధీనతను సులువుగా అర్థం చేసికోవచ్చు. కాని యింతకంటే చాల లోతైన పరాధీనత యొకటి వున్నది. స్వతంత్రులం కావాలంటే ఆ పరాధీనతను తప్పక అర్థం చేసుకోవాలి. అదేమంటే, తన సుఖసంతోషాల కోసం ఇతరులమీద ఆధారపడడం. అంటే అర్థమేమిటో తెలుసునా? బాహ్యంగా ఒకరిమీద ఆధారపడడం కాదు, మిమ్ము అంతగా బంధించేది; సుఖమనబడే దానిని పొందడం కోసం, లోలోపల, అంతరంగంలో – (మానసికంగా) – ఇతరులమీద ఆధారపడడం మిమ్ము బంధించి వేస్తుంది. అట్టి పరాధీనత వలన మీరు బానిసలై పోతారు. మీరు పెరిగి పెద్దవారయ్యేకొలది భావాత్మకంగా మీ తల్లిదండ్రులమీద, మీ భార్య లేక భర్తమీద, గురువు మీద లేక ఏదేని యొక భావన మీద లేక ఒక నమ్మకం మీద ఆధారపడితే, దానితో మీకు బంధ మారంభమవుతుంది. మనమిది గ్రహించము – మనలో చాల మందిమి, ముఖ్యంగా మనం చిన్న పిల్లలంగా వున్నప్పుడు, స్వతంత్రంగా వుందామని కోరుకొన్నప్పటికిన్ని.

స్వతంత్రం కోసమై మనం మన ఆంతరంగిక పరాధీనతకు విరుద్ధంగా తిరుగబడవలసి వుంటుంది. అయితే మనం ఎందువలన పరాధీనులమైనామో తెలిసికొనకపోతే మనం తిరుగబడలేము. ఆంతరంగిక పరాధీనత అంటే యేమిటో అర్థం చేసికొని, దానినుండి త్రెంచుకొని బయటికి రాకపోతే మనకు స్వతంత్ర మెన్నటికిని రాదు. దానిని అర్థం చేసికోవడంలోనే స్వతంత్రమున్నది. స్వతంత్ర మనేది కేవలం ప్రతిక్రియ లాంటిది కాదు. ప్రతిక్రియ (Reaction) అంటే యేమిటో తెలుసునా? మీ మనస్సుకు నొప్పి కలిగించే మాట ఏదైనా అంటే, లేదా మిమ్ము చెడ్డపేరు పెట్టి పిలిస్తే, మీకు నామీద కోపం వస్తుంది. అదే ప్రతిక్రియ అంటే. అది పరాధీనతలో నుండి పుట్టుకొని వస్తుంది. పరాధీనత వలెనే స్వాధీనత (Independence) కూడ ఒక ప్రతిక్రియయే. కాని స్వతంత్రమనేది (Freedom) ప్రతిక్రియకాదు. ప్రతిక్రియను అర్థం చేసికొని దానిని అతిగమించిపోనియెడల మన మెన్నటికిని స్వతంత్రులము కాలేము.

ఎవరినైనా ప్రేమించడమంటే అర్థమేమిటో మీకు తెలుసునా? ఒక చెట్టును గాని, పిట్టనుగాని, పెంపుడు జంతువును గాని ప్రేమించడమంటే ఏమిటి? మీ ప్రేమకు బదులుగా అది మీకేమీ యివ్వకపోయినప్పటికిన్నీ, మీకు నీడ యివ్వక పోయినప్పటికిన్నీ, మీ వెనువెంట తిరుగక పోయినప్పటికిన్నీ, మీమీద ఆధారపడక పోయినప్పటికిన్నీ మీరు దాని గురించి అన్ని జాగ్రత్తలు తీసుకొంటారు. దానికి తిండి పెడతారు. దానిని లాలిస్తారు, పాలిస్తారు. మనలో చాలామందిమి ఆవిధంగా ప్రేమించము. అటువంటి ప్రేమసంగతినే మనమెరుగము. మన ప్రేమ యెల్లప్పటికిన్ని

చింత, అసూయ, భయము – ఈ అడ్డుగోడల మధ్యనే చిక్కుకొని వుంటుంది. అంటే దాని అర్థం మనం లోలోపల పరులపై ఆధారపడి వున్నామన్నమాట. మనము ప్రేమించి, అంతటితో వూరుకోము; దానికి బదులుగా మనకేదైనా లభించాలి. ఇతరులనుండి కూడ మనకు ప్రేమ కావాలి. మన ప్రేమకు బదులు కావాలని కోరడంతోటే మనము పరాధీనులమౌతున్నాము.

కాబట్టి స్వతంత్రము, ప్రేమ – రెండున్ను తోడుగా పోతుంటాయి. ప్రేమ యనేది ఒక ప్రతిక్రియ కాదు. మీరు నన్ను ప్రేమిస్తే నేను మిమ్ము ప్రేమిస్తాను అని యంటే అది వ్యాపారమన్నమాట, మారు బేరమన్నమాట. ఈ ప్రేమ బజారులో కొనదగిన వస్తువన్నమాట – అట్టిది నిజమైన ప్రేమ కాదు. ప్రేమించడమంటే దాని బదులు మరియొకదానిని అడగడం కాదు. అసలు మీరేదో యిస్తున్నట్టి భావనే వుండరాదు. అట్టి ప్రేమకే స్వతంత్రమంటే యేమిటో తెలుస్తుంది. కాని మీకీవిధమైన చదువు బోధింపబడడం లేదు. మీకెంత సేపటికిని గణితము, రసాయన శాస్త్రము, భూగోళ శాస్త్రము, దేశ చరిత్ర – యిటువంటి వాటిని మాత్రమే బోధిస్తారు. అంతటితో చదువు సరి. ఎందువల్లనంటే, మీ తల్లిదండ్రుల వుద్దేశము మీ రొక మంచి ఉద్యోగం సంపాదించుకొని, ఆ విధంగా జీవితంలో సఫలురు కావాలని మాత్రమే. వాండ్ల దగ్గర డబ్బుంటే మిమ్ము వాండ్లు విదేశాలకు గూడ బంపవచ్చు. కాని ప్రపంచంలోని అందరి మాదిరే వారి లక్ష్యమంతా మీరు ధనవంతులై సమాజంలో ఒక గౌరవనీయమైన స్థానమును పొందవలెనని మాత్రమే. అయితే మీరు పైపైకి వెళ్ళుకొలది మీ వలన ఇతరులకు ఎంతో యిబ్బంది, కష్టము కలుగుతూ వుంటుంది. ఎందుకనగా, మీరు పై స్థానానికి పోవలెనంటే ఎంత మందినో పోటీలో క్రూరంగా అణగద్రొక్కవలసి వుంటుంది గదా! అందుచేత ఇతరులకంటే ఘనమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించ వలెననే కోరికను, పోటీలను ప్రోత్సహించే బడులకే తల్లిదండ్రులు తమ పిల్లలను బంపుతుంటారు. అట్టి బడులలో ప్రేమకు తావు లేదు. అందువల్లనే మన యీ మానవ సమాజము ఇట్లా ఎడ తెగని సంఘర్షణతో నలిగి నలిగి నిరంతరము క్షీణించి పోతూనే వున్నది. రాజకీయ నాయకులు, న్యాయాధిపతులు మరియు దేశములోని పెద్దలనబడే వారందరు శాంతిని గురించి యేమేమో మాట్లాడుతారు కాని, అదంతా బూటకం, అర్థరహితము.

ఇక మన మీ స్వతంత్రమంటే లేదా, బంధరాహిత్యమంటే యేమిటో పూర్తిగా అర్థం చేసికోవలసి యున్నది. ప్రేమించడమంటే యేమిటో మనం తెలిసికోవలసి యున్నది. మనలో గనక ప్రేమ లేకపోతే అప్పుడు మనం ఇతరులను గురించి పట్టించుకోము, ఇతరుల అవసరాలను చూడము, ఇతరుల యిబ్బందులను గమనించము. అంటే యేమిటో తెలుసునా? చెప్పులు లేకుండా చాలమంది నడిచే చోట దారికడ్డంగా ఒక పదునైన రాయి వుందనుకోండి, దానిని మీరు వెంటనే తీసివేస్తారు – తీయమని మిమ్మెవరును అడుగక పోవచ్చు. కాని ఎవరికైనా గ్రుచ్చుకొంటుందేమోయని తలచి దానిని తీసిపారవేస్తారు – ఆ మనిషి యెవరైనా గానీ; ఆ మనిషిని మీ రెన్నటికిని కలియక పోవచ్చు. ఒక మొక్కను నాటి దానిని పెంచుతారు. నదిని చూచి

భూమియొక్క నిండుదనానికి ఆనందిస్తారు. పక్షి యెగరడం చూచి, ఆ యెగరడంలోని అందాన్ని గమనిస్తారు. సున్నితమై ప్రేమార్ద్రమైన బుద్ధితో అద్భుతమైన యీ జీవిత మనబడే చైతన్య ప్రవాహాన్ని విముక్తమైన మనస్సుతో పరికిస్తుంటారు. దీనికంతకును స్వతంత్రముండడం అవసరం. స్వతంత్రం కావాలంటే ప్రేమించాలి. ప్రేమ లేనిదే స్వతంత్రం లేదు, బంధరాహిత్యము లేదు. ప్రేమలేని స్వతంత్రము కేవలం భావన మాత్రమే; దానికి విలువ లేదు.

కాబట్టి మానసికమైన పరాధీనతను అర్థం చేసికొనడం ద్వారా దాని నుండి విడివడిన వారే ప్రేమ అంటే యేమిటో తెలిసికోగలరు. వారికే స్వతంత్రముంటుంది. అట్టివారే బంధ రహితులు. వారే క్రొత్తనాగరికతను తేగలరు, క్రొత్త ప్రపంచాన్ని సృష్టింపగలరు.

## 1. ప్రశ్న:- కోరికకు మూలమేమి? దాని నెట్లు తొలగించగలను?

**కృష్ణమూర్తి:-** ఈ ప్రశ్నను అడిగే మనిషి ఒక యువకుడు. అతడెందుకని కోరికలు లేకుండ చేసికోవలెనో? వింటున్నారా? అతడు యువకుడు, పూర్తిగా జవసత్త్వములున్నవాడు. అతడెందుకోసమై కోరికలు లేకుండా చేసికోవలెను? కోరికలు లేకుండా వుండడం గొప్ప సుగుణమని, మిక్కిలి శ్రేయోదాయకమని, ఎట్టి కోరికలు లేని వానికి దైవము సాక్షాత్కరిస్తాడని, మోక్షము లభిస్తుందని చెప్పగా వినియున్నాడు. అందువల్లనే "కోరికలకు మూలమేమి? వానినెట్లు లేకుండ చేసికోగలను?" అని అడుగుతున్నాడు. కాని 'కోరికలు లేకుండ చేసికోవాలి,' అనేది కూడ ఒక విధమైన కోరికయే గదా? నిజానికి కోరిక భయము వలన కలుగుతుంది.

కోరికకు మూలమేది? ఉత్పత్తి స్థానమేది? దానికి ఆరంభమేది? మీ మనస్సున కింపైన దానిని దేనినో చూస్తారు, అది కావాలని కోరుకొంటారు. ఒక కారునో పడవనో చూస్తారు. దానిని పొందాలని కోరుకొంటారు. లేదా ఒక ధనవంతుని కుండే హోదాను సాధించాలని కోరుకొంటారు, లేదా సన్న్యాసి కాగోరుతారు. కోరికకు మూల మేమంటే, మొదట చూడడము, పిదప దానితో సంపర్కము, దానివలన సంవేదన, అనగా ఇంద్రియ జ్ఞానము, అందుండి కోరిక పుట్టుతుంది.

కోరికల వలన విరోధములు, ఘర్షణలు కలుగుతాయని గ్రహించి "మేమీకోరికలనుండి యెట్లు విడుదల పొందగలము?" అని మీరడుగుతారు. కాని నిజంగా మీరు కోరేది కోరికలనుండి విడుదల కాదు. కోరికల వలన కలిగే చింతలు చికాకులు, ఆందోళనలు, బాధలు మొదలైన వాటినుండి విడుదలను కోరుతారు. అంటే కోరికల వలన కలిగే దుష్టఫలితాల నుండి మాత్రమే విడుదలను కోరుతారు, కాని కోరికలనుండి కాదు. ఇది అర్థం చేసికొనడం చాల ముఖ్యం. కోరికలతో బాటు వచ్చే బాధలు, కష్టాలు, ఘర్షణలు, రకరకాల చింతలు, భయాలు లేకుండ కేవలం సుఖం మాత్రమే వచ్చేటట్లయితే అప్పుడు గూడ మీరు కోరికల నుండి విడుదల పొందగోరుతారా? కోరరు.

ఏదైనా లాభం పొందాలని, దేనినైనా సాధించాలని, ఏదో యొక స్థితికి చేరుకోవాలని, బాగా వృద్ధి చెందాలని కోరుకొంటూ వున్నంత కాలము చింత,

దుఃఖము, భయమున్ను తప్పవు. ధనవంతుణ్ణి కావాలని, యింకా ఏమేమో సాధించాలని కోరుకొనే పెద్ద పెద్ద కోరికలన్నీ – ఆ కోరికలలో వుండే క్రుళ్ళును, వాటి దూషిత స్వభావాన్ని చూచినప్పుడు తొలగిపోతాయి. ప్రధానమంత్రిగాగాని, న్యాయాధిపతిగాగాని, మతబోధకుడుగా గాని, గురువుగా గాని మరియే విధంగానైనా సరే – అధికారం చెలాయించాలని కోరే కోరిక మౌలికంగా దుష్టమైనదని మనం గ్రహించినప్పుడే ఆవిధంగా అధికారం కోసం ప్రాకులాడడం మానివేస్తాము. కాని అట్టి పేరాశలు మనుషులను చెడగొడతాయని, అధికారదాహం దుష్టమైనదని మన మనస్సుకే తట్టదు. పైగా అధికారాన్ని సద్వినియోగం చేస్తామని ప్రగల్భాలు పలుకుతాం. అది అర్థరహితమైన ప్రేలాపన. సన్మార్గాన పోతేనే సత్ఫలితం కలుగుతుంది; దుర్మార్గాన పోతే దుష్ట ఫలితమే కలుగుతుంది. మంచి చెడ్డలు ఒకదాని కొకటి వ్యతిరేకము కాదు. చెడ్డ అనేది పూర్తిగా లేకుండా పోయినప్పుడు మాత్రమే మంచి అనేది బహిర్గతమవుతుంది.

కాబట్టి కోరిక అనగా నేమిటి? దానివలన కలిగే ఫలితా లేమిటి? వాటితోబాటు వచ్చే ఆనుషంగిక ఫలితా లేమిటి? ఇవన్నీ తెలిసికోకుండా కేవలం కోరికలను తొలగించుకొందామని చేసే ప్రయత్నానికి అర్థము లేదు.

**2. ప్రశ్న:- సమాజంలో ఉన్నంతకాలం ఒకరిమీద నొకరు ఆధారపడకుండా ఎట్లా ఉండగలం?**

**కృష్ణమూర్తి:-** సమాజమంటే యేమిటో మీకు తెలుసునా? సమాజమంటే మనిషికీ మనిషికీ మధ్య గల అన్యోన్య సంబంధము – కాదా? ఈ విషయాన్ని జటిలం చేయకండి. ఏవేవో పుస్తకాలనుండి అనుకూలంగానో ప్రతికూలంగానో ప్రమాణ వాక్యాలను ఉటంకించకండి. దీని గురించి మీరు తిన్నగా, సరళంగా ఆలోచిస్తే మీకు, నాకు, ఇతరులకు మధ్య గల అన్యోన్య సంబంధమే సమాజమని, సంఘమని గుర్తించ గలుగుతారు. మానవుల మధ్యగల అన్యోన్య సంబంధము వల్లనే సమాజ మేర్పడుతుంది. ఈనాటి మన సమాజము సంగ్రహణశీలతా సంబంధము మీద ఆధారపడి నిర్మింపబడినది. అంటే మన యీనాటి సమాజములోని వ్యక్తులమధ్య గల సంబంధము ఒకరినిజూచి మరియొకరు అంతకంతకెక్కువగా వస్తువాహనాదులను కూడబెట్టుకొనడంపై ఆధారపడి వున్నది, కాదా? మనలో చాలామందికి డబ్బు, అధికారము, ఆస్తి, పలుకుబడి – యివన్నీ కావాలి. ఏదో యొక స్థాయిలో మనకు హోదా, పదవి, పేరు, ప్రతిష్ఠా కావాలి. ఈ విధంగా మనం నిర్మించుకొన్న యీ సమాజము కూడబెట్టుకొనే స్వభావాన్ని ప్రోత్సహించే సమాజము. అందువలన మనం రకరకాలైన వాటిని కూడబెట్టుకుంటూ వున్నంతకాలము; హోదా, ప్రతిష్ఠ, అధికారము మొదలైన వాటికోసం ప్రాకులాడుతూ వున్నంతకాలము మన మీ సంఘానికి చెందిన వారమవుతాము. దానిమీద ఆధారపడిన వారమౌతాము. ఇవేవీ అక్కర లేదనుకొని తాను తానుగానే వినయంగాను, నిరాడంబరంగాను వుండిపోతే అట్టివానికి ఈ సంఘముతో పని లేదు; దానికి ఎదురు తిరిగి దాని కట్టుబాట్లను త్రెంచుకొని బయటికి వచ్చివేస్తాడు.

దురదృష్టవశాత్తు స్వార్థపూరితమై వివిధ వస్తు సంగ్రహణ శీలమైన యీ సంఘమునకు లోబడి దానిలో ఒక భాగమై పోవడానికి, దానితో సమాధానం పొందటానికి మాత్రమే నేటి చదువు మీ కుపయోగపడుతున్నది. మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు, మీ పుస్తకాలు – అన్నింటి వుద్దేశమదే, అందరి ఉద్దేశమదే. మీరు అందుకనుకూలంగా వుంటూ వున్నంతకాలం, పెద్ద పెద్ద కోరికలతో అన్నింటిని కూడబెట్టుకొంటూ అవినీతి పరులై, హోదాను అధికారాన్ని సంపాదించుకొంటూ, ఆ సంపాదనా క్రమంలో ఇతరులను నాశనం చేస్తూ వుంటున్నంతకాలం మీరు గౌరవనీయులైన పౌరులుగా లెక్కింప బడతారు. ఆ విధంగా సంఘంలో ఇమిడి పోవడం కోసమే మీరు చదివింపబడుతున్నారు. కాని అది నిజమైన చదువు కాదు. సంఘమర్యాదకు అనుకూలంగా మీ మనస్సును మార్చివేయడానికి మాత్రమే ఆ చదువు ఉపయోగపడుతుంది. నిజానికి చదువుయొక్క ఉద్దేశము మిమ్ము గుమాస్తాలుగానో, న్యాయాధిపతులుగానో, ప్రధాన మంత్రులుగానో చేయడం గాదు; ఈ క్రుళ్ళిపోయిన మానవ సమాజము యొక్క నిర్మాణ మెట్టిదో మీ కవగాహన గావించి, యెట్టి నిర్బంధములు లేని స్వేఛ్ఛాపూరిత వాతావరణంలో మీరు పెరుగునట్లు చేయడమే చదువుయొక్క ప్రధానోద్దేశము. అప్పుడే మీరీ సమాజమునుండి బయటపడి క్రొత్త సమాజాన్ని, క్రొత్త ప్రపంచాన్ని సృష్టింపగలరు. పాతకట్టుబాట్లకు విరుద్ధంగా – అంశికంగా గాకుండా, సంపూర్ణంగా – తిరుగ బడగలవారు కొందరైనా వుంటే, వారే క్రొత్త ప్రపంచాన్ని – సంగ్రహణ బుద్ధి, స్వార్థము, అధికారము, ప్రతిష్ఠ వీటి మీద ఆధారపడని క్రొత్త ప్రపంచాన్ని – సృష్టించగలరు.

అయితే, "అట్లెన్నటికిని జరుగబోదు; మానవ స్వభావము మారేదికాదు; మీరు చెప్పేదంతా అర్థరహితము"– అని కొందరు పెద్దలనడం నేను వినియున్నాను. కాని యువకుల మనస్సులలో నుండి అందు నాటుకొనిపోయిన సంస్కారముద్రలను తొలగించడం, శిశువుల మనస్సులను సంస్కారబద్ధములు చేసి చెడగొట్టకుండా యథాతథంగా వుంచడం – ఈ విషయమై మనమెప్పుడున్ను ఆలోచింప లేదు. నిజానికి విద్య అనేది వ్యాధి హరము, వ్యాధి నివారకము కూడ. మీలో పెద్ద పిల్లలు ఇప్పటికే మారిపోయినారు. మీ మనస్సులు ఇప్పటికే మలచబడిపోయినాయి. ఇప్పటికే మీలో పెద్ద పెద్ద కోరికలు పుట్టడం ఆరంభమైంది. మీరు మీ తండ్రుల మాదిరిగానో, లేదా గవర్నరు మాదిరిగానో, లేక మరియొకరి మాదిరిగానో జీవితంలో విజయం పొందాలని, ఏదో సాధించాలని కోరడం మొదలుపెట్టినారు. అందువలన విద్యయొక్క ప్రధానోద్దేశమేమంటే – మీ మనస్సులలో నాటుకొనిపోయిన ఇట్టి సంస్కారములనెడి కలుపు మొక్కలను తీసివేసి మరల వాటిని నిర్మలము చేసికోడంలోను, దిన దినమును మీరు జీవించు ప్రక్రియనంతను అర్థం చేసికోడంలోను మీకు సహాయ పడడమే. అప్పుడే మీరు స్వేచ్ఛా వాతావరణంలో పెరుగుతూ క్రొత్త ప్రపంచాన్ని సృష్టింప గలరు – ఆ ప్రపంచము నేటి యీ మన ప్రపంచానికి పూర్తిగా భిన్నమైనది. దురదృష్టవశాత్తు, మీ తల్లి తండ్రులకు గాని ఉపాధ్యాయులకు గాని, మామూలు ప్రజలకు గాని, యీ విషయంలో అభిరుచి లేదు. అందుచేత ఇట్టి విద్యాబోధన

కేవలం విద్యార్థులకే గాకుండ వారి ఉపాధ్యాయులకు గూడ అవసరమవుతున్నది.

3. ప్రశ్న:- మనుషులెందుకు కొట్లాడుకొంటారు?

**కృష్ణమూర్తి:-** చిన్న పిల్లలెందుకు కొట్లాడుకొంటారు? ఒక్కొక్కసారి మీరు మీ అన్నతోనో, తమ్ములతోనో లేదా యితర పిల్లలతోనో తగవులాడుతారు కదా, ఎందుకని? ఏదో చిన్న ఆటబొమ్మకోసం మీరు కొట్లాడుకొంటారు. ఆ రెండో పిల్లవాడు బహుశా మీ బంతినో, మీ పుస్తకాన్నో తీసికొంటాడు. అందుకు మీరు వాడితో కొట్లాడుతారు. పెద్దవాండ్లు కూడ సరిగ్గా యిటువంటి కారణాలమీదనే కొట్లాడుకొంటారు. అయితే వాండ్ల ఆటవస్తువులు హోదా, సంపత్తి, అధికారమున్ను. మనిద్దరికిని అధికారం కావాలి. దానికోసం మనిద్దరం కొట్లాడుకొంటాము. వివిధ జాతులు పరస్పరం కలహించుకోవడానికి కూడ ఇదే కారణము. ఇదంతా సులభంగా తెలిసే మామూలు విషయం. కాని వేదాంతులు, రాజకీయనాయకులు, ధార్మిక పురుషులనబడే వారున్ను దానిని క్లిష్టపరుస్తారు, పెద్ద సమస్యగా మారుస్తారు. ఎంతో జ్ఞానము, అనుభవము కలిగి వుండడంతో బాటు, జీవిత సంపదను, సృష్టి సౌందర్యమును, పోరాటములు, సుఖ దుఃఖాలు, నవ్వులు, కన్నీళ్ళు – వీటినన్నిటిని ఎఱిగి యుండడంతో బాటు మనస్సును నిర్మలంగా, శాంతంగా వుంచుకో గల్గడం ఒక గొప్ప కళ. ప్రేమించడమెట్లో తెలిస్తేనే మీ మనస్సును మీరు నిర్మలంగా శాంతంగా వుంచుకోగలరు.

4. ప్రశ్న:- అసూయ అంటే ఏమిటి?

**కృష్ణమూర్తి:-** అసూయ అంటే మీరున్న స్థితితో మీరు తృప్తి పడకపోవడం. ఇతరులను చూచి ఓర్చుకోలేక పోవడం, కాదా? మీరున్న స్థితితో మీరు తృప్తి పడకపోవడంతో అసూయ ఆరంభమౌతుంది. మీకంటె ఎక్కువ జ్ఞానము గలవానిని, ఎక్కువ అధికారము గలవానిని, ఎక్కువ హోదా గలవానిని, పెద్ద యిల్లు గలవానిని, లేదా ఎక్కువ అందమైన వానిని చూచి, వారి వలె ఉండాలని మీరు అనుకొంటారు. ఇతరుల కంటే మించి ధర్మాత్ములనిపించుకోవాలని కోరుకొంటారు. ఇంతకంటే బాగా ధ్యానమెట్లా చేయవలెనో తెలిసికొనగోరుతారు. దేవుని సన్నిధికి పోగోరుతారు. మొత్తం మీద మీరు మీరుగా వుండకుండ మరియొకరుగా మారగోరుతారు. దానితో మీలో ఈర్ష్యాసూయలు ఆరంభమౌతాయి. మీరెవరో యేమిటో తెలిసికోడం చాల కష్టమైన పని. అది తెలిసికోవాలంటే మీరు మరియొకరుగా మారిపోవాలనే కోరిక పూర్తిగా తొలగిపోవాలి. మిమ్ము మీరు మార్చుకోవాలని, వేరొకరుగా మారిపోవాలని కోరే కోరికనుండియే ఈర్ష్యాసూయలు పుట్టుకొని వస్తాయి. అట్లు గాకుండ మిమ్ము మీరు ఉన్నదున్నట్లుగా అర్థం చేసికోవడంతో సహజంగానే మీలో పరివర్తనము కల్గుతుంది. ఆ పరివర్తనము ప్రయత్నము ద్వారా సాధింపబడేది కాదు. కాని చూచారూ, మీరు చదివిన చదువంతా వేరొక క్రొత్త మనిషిగా మారిపోవడానికి ప్రయత్నించుడని మిమ్ము ప్రోత్సహిస్తుంది, ప్రేరేపిస్తుంది. కాని మిమ్ము మీరెవరో తెలిసికొండని చెప్పదు. మీలో అసూయ కలిగినట్లయితే "అసూయపడవద్దు, అది

మంచిది కాదు, చాల చెడ్డది" అని మీకు చెప్పుతుంది. అందువలన అసూయపడకుండా వుండాలని ప్రయత్నిస్తారు. కాని ఆ ప్రయత్నం కూడ అసూయలో ఒక భాగమే. ఎందువల్లనంటే, మీరు మరియొకరుగా మారిపోవాలని కోరుకొంటున్నారు కదా!

అందమైన గులాబీ (యెప్పటికైనా, ఎక్కడనైనా) అందమైన గులాబీయే. మనకు – మానవులకు – ఆలోచించే శక్తి ప్రసాదింప బడినది. కాని మనం సరిగా ఆలోచించము. మనం చేసే ఆలోచన అంతా తప్పుమార్గాననే పోతూ వుంటుంది. 'ఎట్లా' ఆలోచించాలో తెలిసికోవాలంటే ఎంతో లోతుగా పోయి చూడాలి. అవగాహన చేసికోవాలి. కాని 'దేనిని' గురించి ఆలోచించాలో తెలిసికోవడం చాల సులభం. మన ప్రస్తుత విద్యా విధానం ఏమి ఆలోచించాలో తెల్పుతుంది, ఎట్లా ఆలోచించాలో, ఎట్లా లోతుగాపోయి విషయవిచారణ చేయాలో తెల్పదు. ఉపాధ్యాయునకున్ను విద్యార్థికిన్ని ఇద్దరికిని ఎట్లా ఆలోచించాలో తెలిస్తేనే యీ బడికి గల మంచిపేరు సార్థకమౌతుంది.

## 5. ప్రశ్న:- నేను దేనికిని ఎప్పుడును తృప్తిపడను, ఎందువలన?

**కృష్ణమూర్తి:-** ఈ ప్రశ్నవేసింది ఒక చిన్న ఆడపిల్ల. ఈ ప్రశ్న వేయమని ఆ పిల్లనెవరైనా ప్రేరేపించి వుంటారని నేను అనుకోను. ఇంత లేతవయస్సులో ఈ పిల్ల తనకు దేనిమీదను ఎందుకు తృప్తికలుగడం లేదో తెలిసికొనగోరుతూ వున్నది. దీనికి మీ పెద్దవాండ్ల సమాధానమేమి? ఇదంతా మీరు చేసిన పని. చిన్నపిల్లలు తమ కెందుకు తృప్తి లేదని ప్రశ్నించే ప్రపంచాన్ని సృష్టించినవారు మీరు. ఉపాధ్యాయులమని విద్యాబోధకులమని పేరు పెట్టుకొన్న మీరు ఇందులోని విషాద పరిణామాన్ని గమనించరు! మీరు ధ్యానం మాత్రం చేస్తారుగాని ఉపయోగం లేదు. మీరు మందబుద్ధులు, శ్రాంతచిత్తులు. మీ అంతరాత్మ మృతప్రాయము.

మానవ మాత్రులకెందుకని సంతృప్తి అంటూ లేదు? సుఖంకోసం ప్రాకులాడుతూ వుండడం వలన కదా? మాటి మాటికి మారిపోతూ వుంటే సుఖంగా వుంటామని వారి తలంపు. వారు ఒక ఉద్యోగాన్ని వదిలి మరియొక వుద్యోగానికి, ఒక సంబంధాన్ని వదిలి మరియొక సంబంధానికి, ఒక మతాన్ని లేదా ఒక వాదాన్ని విడిచి పెట్టి మరియొక దానికి మారుతూ వుంటారు. ఆ విధంగా ఎప్పుడూ మారుతూ వుంటే సుఖం పొందవచ్చునని వారనుకొంటారు. అట్లాగాకపోతే, జీవిత ప్రవాహానికి దూరంగా ఎక్కడనో ఒకచోటు చూచుకొని అక్కడే వుండిపోయి నిలకడ నీటివలె మురిగిపోతారు.

అయితే, సంతుష్టి అనేది మాత్రం దీనికి పూర్తిగా భిన్నమైనది. సంతృప్తి (satisfaction) వేరు, సంతుష్టి (contentment) వేరు. మారాలని కోరిక పెట్టుకోకుండా; మిమ్ము మీరు పొగడుకోవడం గాని, తెగడుకోవడం గాని లేదా ఒకరితో పోల్చుకోవడం గాని లేకుండా మీ యథార్ధ స్వరూపాన్ని మీరు చూచుకోగల్గితే అప్పుడు కలిగేది సంతుష్టి. అంటే దాని అర్థం మీరు చూచిన దానిని "బాగానే వుందిలే" అని సమాధానపడి నిద్రపొమ్మని కాదు. ఎప్పుడైతే మనస్సు పోల్చడం, నిందించడం, ప్రశంసించడం, విలువనీయడం మానుతుందో అప్పుడే సత్యస్వరూపాన్ని – దానిని

మార్చవలెననే కోరిక లేకుండా – ప్రతిక్షణము సాక్షాత్కారము చేసికొనగల్గుతుంది. ఆ దర్శనంలోనే ఆద్యంతరహితమైనది, అనంతమైనదేదో అది వున్నది.

6. ప్రశ్న:- మేమెందుకు చదువుకోవాలి?

కృష్ణమూర్తి:- మీరెందుకు చదువుకోవాలి? శాంతంగా వినండి. మేమెందుకు ఆడుకోవాలి? మేమెందుకు తినాలి? ఏటివైపు ఎందుకు చూడాలి? ఎందుకని క్రూరంగా వున్నాము? – ఇట్లా మీ రెప్పుడున్నూ అడుగరు. ఏదైనా యెందుకు చెయ్యాలి అని, అది చెయ్యడానికి ఇష్టము లేనప్పుడే ఎదిరించి అడుగుతారు. కాని చదవడం, ఆడడం, నవ్వడం, క్రూరంగా వుండడం, మంచిగా వుండడం, ఏటిని మబ్బులను చూడడం – ఇదంతా జీవితంలో ఒక భాగం. మీకు చూచి చదవడం రాకపోతే, నడవడం చేతకాకపోతే, ఆకు ఎంత అందంగా వుందో మెచ్చుకోలేకపోతే మీరు జీవిస్తున్నట్టు కాదు. జీవితాన్నంతను మీరు అవగాహన చేసికోవాలి; అందులోని ఒక చిన్న భాగాన్ని మాత్రమే కాదు. అందుకోసం మీరు చదవాలి, అందుకోసం మీరు ఆకాశంవైపు చూడాలి, అందుకోసం మీరు పాట పాడాలి, నృత్యం చెయ్యాలి, పద్యాలు వ్రాయాలి, కష్టపడాలి, అర్థం చేసికోవాలి. ఎందుకంటే – అదంతా జీవితమే.

7. ప్రశ్న:- సిగ్గంటే యేమిటి?

కృష్ణమూర్తి:- కొత్త మనిషిని ఎవరినైనా కలిసికొన్నప్పుడు మీరు సిగ్గుపడరా? నన్నా ప్రశ్నను అడిగేటప్పుడు మీరు సిగ్గు పడలేదా? నా మాదిరి యీ వేదికమీద గూర్చుండి మాట్లాడాలంటే సిగ్గుపడరా? అనుకోకుండా ఒక మంచి అందమైన చెట్టునుగాని, మృదువైన పూవునుగాని, తన గూటిమీద కూర్చున్న పక్షిని గాని చూడడం తటస్థిస్తే సిగ్గుతో క్రీగంట చూడరా? సంభ్రమముతో అట్లే నిలబడిపోరా? అందువలన సిగ్గుపడడం మంచిదే. కాని మనలో చాలామందికి సిగ్గుపడడమంటే తన్ను జూచి యెవరేమనుకొంటారో యని సంకోచించడం. ఎవరినైనా ఒక పెద్ద మనిషిని – నిజంగా అటువంటి మనిషేగనక వుంటే – మనం కలిసినప్పుడు మనలను మనం చూచుకొని సిగ్గు పడతాం. మనలో మనం అనుకొంటాం గదా – "ఆ మనిషి యెంత గొప్పవాడు? ఎంత పేరు ప్రఖ్యాతులు గలవాడు? ఆయన ముందు నేనెంతపాటి? నేనొక నలుసును" – అట్లా అనుకొని సిగ్గు పడతాం. అంటే మనస్థితి మనకు గుర్తుకు రావడమన్నమాట. ఇటువంటి సిగ్గుగాకుండా, మరియొక విధమైన సిగ్గున్నది. అందులో మనస్సు చాల సున్నితమై, ప్రేమార్ద్రమవుతుంది. అది మన స్థితిని మనము చూచుకొని జంకడముకాదు, మనలను జూచుకొని మనం సిగ్గుపడడం కాదు.

*29 డిశంబరు, 1954*

★ ★ ★

# 4. వినడం

నేను చెప్పే మాటలు మీరు ఎందుకు వింటున్నారు? అసలు ఒకరు చెప్పే మాటలను మరియొకరు ఎందుకు వింటారో మీరు ఎప్పుడైనా ఆలోచించారా? ఎవరు చెప్పేదైనా వినడమంటే అర్థమేమిటి? నేను మాట్లాడుతూ వుంటే మీరందరు నాముందు ఇక్కడ కూర్చుండి వింటున్నారు గదా, మీ అభిప్రాయాలను బలపరచే మాటల కోసం గాని మీ అభిప్రాయాలతో నేను చెప్పేదానిని సరిపోల్చి చూచుకోడం కోసం గాని వింటున్నారా లేక తెలిసికొందామనే కోరికతో వింటున్నారా? ఈ రెండింటికీ గల తేడాను గమనించండి. మీ యాలోచనలను దృఢపరచుకోవడం కోసం వినడానికిన్ని, కేవలం తెలిసికొందామనే కోరికతో వినడానికిన్ని చాల వ్యత్యాసమున్నది. మీ యాలోచనలను దృఢపరచుకోవడం కోసంగాని మీ యాలోచనలకు ప్రోత్సాహం లభిస్తుందనే వుద్దేశంతోగాని మీరిక్కడ వున్నట్లయితే అప్పుడు నా మాటలను మీరు వినడం నిరర్థకం. అట్లుగాక తెలిసికొందామనే వుద్దేశంతో వింటూవున్నట్లయితే అప్పుడు మీ మనస్సు విముక్తము; దేనికిన్ని కట్టుబడినది కాదు. అట్టి మనస్సు దర్భమొనవలె తీక్ష్ణమైనది; అది సునిశితము, సజీవము, విచారణ శీలము మరియు జిజ్ఞాసాయుతము. అట్టి మనస్సే సత్యమును గ్రహించే శక్తి గలిగి వుంటుంది. అందువలన మీరెందుకు వింటున్నారో ఏమిటి వింటున్నారో తెలిసికోవడం చాల ముఖ్యం కాదా?

మీరెప్పుడైనా చాల నిశ్శబ్దంగా కూర్చున్నారా? మీ మనస్సును దేనిమీదనైనా స్థిరంగా నిలపడంగాని, ఏకాగ్రతకోసం ప్రయత్నం చేయడంగాని లేకుండా, యథార్థంగా ప్రశాంతమై నిశ్చలమైన మనస్సుతో ఎప్పుడైనా కూర్చున్నారా? అటువంటప్పుడు మాత్రమే మీరు ప్రతిది చక్కగా వినగలరు. ఏమంటారు? చాల దూరమునుండి వినబడెడి ధ్వనులే గాకుండా దగ్గరలోనున్న ధ్వనులను, ఇంకా దగ్గరగా మీ ప్రక్కనే వున్న ధ్వనులను గూడ వినగలరు. అంటే మీరు ప్రతిదిన్నీ వినగలరన్నమాట. అప్పుడు మీ మనస్సు విశాలమవుతుంది, ఏదో యొక యిఱుకైన మార్గమునకు పరిమితమై యుండదు. మీరీ విధంగా, అనాయాసంగా, ఎట్టి ప్రయత్నము లేకుండా వినగలిగితే, అప్పుడు మీలోపల అసాధారణమైన పరివర్తనము సంభవించడం కనుగొనగలరు. ఆ పరివర్తనము మీ సంకల్పము లేకుండా, మీరు కోరుకోకుండానే జరుగుతుంది. ఆ పరివర్తనములో గొప్ప అందమున్నది, ఆనందమున్నది, లోతైన అంతర్దృష్టి వున్నది.

ఒకసారి ప్రయత్నించి చూడండి; ఇప్పుడే ప్రయత్నించండి. నా మాటలు వినేటప్పుడు, నా మాటలనే కాకుండా మీ చుట్టూరా వున్న ధ్వనుల నన్నిటిని వినండి. గుడి గంటలు, ఆవుల మెడగంటలు – అన్నిటిని వినండి. దూరంగా

పోతున్న రైలుబండిని, రోడ్డుమీద పోతున్న యెద్దుల బండిని వినండి. ఇంకా దగ్గరి దగ్గరివి వింటూ వచ్చి నా మాటలున్ను వినండి. అప్పుడు వినడంలో లోతువుందని గమనిస్తారు. ఇట్లా వినాలంటే మీ మనస్సు చాల ప్రశాంతంగా నిశ్శబ్దంగా వుండాలి. నిజంగా మీరా విధంగా వినడం మొదలుపెట్టితే, మీ మనస్సు సహజంగానే నిలకడ పొంది ప్రశాంతమవుతుంది, కాదా? అప్పుడు మీ ప్రక్కన ఏమి జరుగుతున్నా దానికి మీ మనస్సు విక్షిప్తము కాదు, చలించదు. ప్రతిదీన్నీ మీరు చాల లోతుగా వింటూ వుండడం చేత మీ మనస్సు సహజంగా శాంతిస్తుంది. ఈ విధంగా మీరు అనాయాసంగా, ఆనందంతో – పరమానందంతో వినగల్గితే, అప్పుడు మీ హృదయంలో, మీ మనస్సులో అద్భుతమైన పరివర్తనము వస్తున్నట్లు గమనింపగలరు. ఇట్టి పరివర్తనము మీరెన్నడును ఊహించనిది. ఇది యేవిధంగాను ఉత్పాదితము కాదు, ప్రయత్నసాధ్యము కాదు.

ఆలోచన చాల విచిత్రమైనది, కాదా? ఆలోచన అంటే యేమిటో మీకు తెలుసునా? ఆలోచన లేదా ఆలోచించడమనేది చాలమంది విషయంలో కేవలమొక మనోవ్యాపారం. వారు తమ ఆలోచనలతో సతమతమవుతూ వుంటారు. కాని మీరు ప్రతిదానిని నిజంగా వినగల్గితే – నదిలోని నీరు ఒడ్డుకు తపతప కొట్టుకోవడం, పక్షులు పాటలు పాడడం, బిడ్డ యేడవడం, మిమ్ము మీ అమ్మ తిట్టడం, మీ స్నేహితుడు మిమ్ము ఏడిపించడం, మీ భార్యగాని, భర్తగాని మిమ్ము దెప్పిపొడుస్తూ సాధించడం – ఇవన్నీ నిజంగా వినగలిగితే అప్పుడు మీరు, మిమ్ము చీల్చివేస్తూ పీడిస్తూ వున్న ఆ మాటలను దాటి, యింకా ముందుకు పోవడం గమనిస్తారు.

ఇట్లా పైపై నోటి మాటలను దాటి యింకా ముందుకు పోవడం చాల అవసరం. ఇంతకు, మనందరికి కావలసిందేమిటి? మనం పిల్లలమైనా, పెద్దలమైనా మన కనుభవమున్నా లేకపోయినా మనందరము సుఖంగా వుండాలని కోరుకోమా? విద్యార్థులంగా వున్నప్పుడు మన ఆటలపాటలతో, వ్రాయడం చదవడంతో, ఇంకా రకరకాలైన చిన్న చిన్న విషయాలతో సుఖంగా వుండాలని కోరుకొంటాము. మనం పెద్దవాండ్లమైన తరువాత ఆస్తిపాస్తులు సంపాదించుకోవడంలో, డబ్బు కూడబెట్టుకోవడంలో, మంచి యిల్లు కట్టించుకోవడంలో, మనయెడ సానుభూతి గల భార్యనుగాని భర్తనుగాని కలిగివుండడంలో, మంచి ఉద్యోగం చేయడంలో సుఖాన్ని అన్వేషిస్తాము. ఇవన్నీ మనకు తృప్తినీయకపోతే మనం వేరే విషయం వైపు దృష్టి మరలిస్తాం. అప్పుడంటాము గదా, "వీటన్నిటితో సంబంధం వదులుకొని, వైరాగ్యం సాధిస్తేగాని సుఖంగా వుండము" అని. అందుచేత వైరాగ్యాన్ని అభ్యాసం చేయడం ప్రారంభిస్తాము. మనం కుటుంబాన్ని వదిలివేస్తాం; ఆస్తిని వదలుకొంటాం; సంసార బాధ్యతలను వదులుకొని అడవులకు పారిపోతాం లేదా సన్యసిస్తాం. అట్లాగాకపోతే యేదైనా మత సంప్రదాయంలో జేరిపోతాం. మనలాంటి మరికొందరితో కలిసి ఒక నాయకుణ్ణో, ఒక గురువునో, ఒక మహాత్మున్నో లేదా ఒక ఆదర్శాన్నో నమ్ముకొని అనుసరిస్తాం. ఇదంతా వాస్తవానికి ఆత్మవంచన, భ్రాంతి, మూఢ విశ్వాసము. కాని యిందులోనే సుఖమున్నదని భావిస్తాం.

నేను దేనిగురించి మాట్లాడుతున్నానో అర్థమౌతున్నదా? తల దువ్వుకోవడం,

శుభ్రమైన బట్టలు వేసికోవడం, నీటుగా కనబడాలని ప్రయత్నించడం – ఇదంతా సుఖాభిలాషలో ఒక భాగమే కదా! మీరు పరీక్షలు పాసై మీ పేరు తరువాత వర్ణమాలలోని కొన్ని పొడి అక్షరాలు తగిలించుకొంటే, ఏదైనా వుద్యోగాన్ని సాధించుకొంటే, ఇల్లు ఆస్తి సంపాదించుకొంటే, పెండ్లి చేసికొని పిల్లలను కంటే, మనకంటికి కనబడనటువంటి దివ్యర్షులనుండి సందేశాలు తీసికొని వచ్చినామని చెప్పకొనే పెద్దలను, వారి నాయకత్వములోని మత సంప్రదాయాలను అనసరించడం ప్రారంభిస్తే – వీటన్నిటి వెనుక సుఖం పొందడం కోసం మనం పడే పాట్లు, తాపత్రయం, అసాధారణమైన ప్రేరణ అంతర్లీనమై కనిపిస్తాయి.

కాని, చూశారా, సుఖం అంత సులువుగా రాదు. ఎందుకంటే, సుఖమనేది వీటిలో దేనిలోను లేదు. వీటివలన తాత్కాలికంగా ఇంద్రియ సుఖాన్ని, కొంత తృప్తిని మీరు పొందవచ్చు; కాని తుదకదంతా కేవలం ఆయాసపాటుగా పరిణమిస్తుంది. ఎందువల్లనంటే, మనకు తెలిసిన విషయాలలో వేటిలోను శాశ్వత సుఖమంటూ లేదు. ముద్దుతోబాటు కన్నీరు, నవ్వుతోబాటు ఏడుపు, మఱియు నిరాశతో కూడిన ఏకాకితనమున్ను అవినాభావములు. ప్రపంచంలో ప్రతిదిన్నీ విశీర్ణమై క్షయించేదే. కాబట్టి చిన్నతనంలోనే మీరు సుఖమనే యీ వింత పదార్థమేమిటో విచారించి తెలిసికోవాలి. మీరు చదివే చదువులో అదియొక ముఖ్యభాగము.

సుఖమనేది దానికోసం తంటాలుపడుతూ వున్నంతకాలము రాదు. అదే అందులోని గొప్ప రహస్యం. అయితే అది చెప్పడం మాత్రం తేలిక. నేనిదంతా క్లుప్తంగా మామూలు మాటలలో చెప్పగలను. కాని కేవలం నేను చెప్పేది వినడం చేతగాని, విన్నదాన్ని మీరు మళ్ళీ మళ్ళీ వల్లించడం చేతగాని మీకు సుఖం రాదు. సుఖమనేది చాల వింత వస్తువు. మీరు దానికోసం ప్రయత్నిస్తూ వున్నంతకాలం అది మీకు లభించదు. సుఖంగా వుండాలనే ప్రయత్నమే మానివేసినప్పుడు, అనుకోకుండా, అతి నిగూఢంగా సుఖం మీకు లభిస్తుంది. దాని జన్మస్థానము పవిత్రత, ప్రాణిసిగల సహజ రమణీయత. దాని లబ్ధికి ఎంతో అవగాహన అవసరము – ఏదో సంఘంలోనో సమాజంలోనో చేరడంగాని, లేదా ఒక విశిష్టవ్యక్తిగా మారప్రయత్నించడంగాని అవసరము కాదు. సత్యమనేది ప్రయత్నించి సాధింపదగిన వస్తువుకాదు. మీ మనో హృదయములలో నుండి సాధించడమనే భావనయే లేకుండ తుడిచి వేయబడినప్పుడు, మీరొక విశిష్ట వ్యక్తిగా మారుటకై చేయు ప్రయత్నము పూర్తిగా మాని వేసినప్పుడు సత్యము సాక్షాత్కరిస్తుంది. మనస్సు మిక్కిలి ప్రశాంతముగా నుండి, చుట్టూ జరుగుతున్న ప్రతిదానిని, కాలస్మృతి లేకుండా, వింటూ వున్నప్పుడు 'సత్యము' అభివ్యక్తమవుతుంది. నేను చెప్పే యీ మాటలను మీరు వినవచ్చు. కాని సుఖప్రాప్తి కావాలంటే మాత్రం మీ మనస్సును సర్వభయ విముక్తమెట్లు చేయనగునో మీరెరిగి యుండవలెను.

మీరెవరికైనా దేనికైనా భయపడుతూ వున్నంతకాలము మీకు సుఖమంటూ వుండదు. మీ తల్లిదండ్రులకుగాని ఉపాధ్యాయులకుగాని, పరీక్షలు పాసు కాలేమేమో యనిగాని, సరిగా అభివృద్ధి చెందడం లేదనిగాని, మహాత్ములగు దివ్య గురువుల సమీపమునకు పోలేకపోతిమనిగాని సత్యమును సాక్షాత్కారము చేసికొనలేకపోతిమనిగాని,

మీరు చేసే పని బాగున్నదని యెవరున్ను మీ వీపు తట్టి మెచ్చుకొనలేదనిగాని మీరు బాధపడుతూ వున్నంతకాలము మీకు సుఖముండదు. కాని మీరు నిజంగా దేనికినీ భయపడనిచో, అప్పుడు – ప్రొద్దుటి పూట మీరు నిద్రనుండి మేల్కొనగానే లేదా ఒంటరిగా నడుస్తున్నప్పుడో లేదా మరొకప్పుడో హఠాత్తుగా ఒక వింత అనుభవం కలుగుతుంది. మీ పిలుపుగాని, ప్రార్థనగాని, ఎదురు చూడడంగాని ఇట్టివేమీ అక్కరలేకుండా ప్రేమ, సత్యము, పరమ సుఖము, ఆనందము – ఇట్లనేక నామములతో పిలువబడునదేదో అది తటాలున, హఠాత్తుగా అభివ్యక్తమవుతుంది.

అందువలన చిన్నప్పుడే సరియైన మార్గమున మీరు చదువుకోవడం – మిమ్ము చదివించడం – చాల అవసరం. ఇప్పుడు మనం చదువు అని దేన్ని పిలుస్తున్నామో అది నిజంగా చదువుకాదు. ఎందుకంటే ఈ విషయాలన్నిటి గురించి యెవ్వరున్ను మీతో మాట్లాడరు. పరీక్షలు పాసవడం కోసం ఉపాధ్యాయులు మిమ్ము తయారుచేస్తారు కాని జీవించడమంటే యేమిటి అనే అతి ముఖ్యవిషయం గురించి యేమీన్నీ చెప్పరు. అసలు వారికే చాలమందికి తెలియదు జీవించడ మెలాగో! మనలో చాలమందిమి ఎల్లాగో బ్రతికి ప్రాణంతో వుంటాము; ఏదో విధంగా శ్రమపడి జీవిత శకటాన్ని లాగుతూవుంటాము. అందువలన మనకు జీవితమంటేనే భయం. నిజానికి జీవించాలంటే ఎంతో ప్రేమ, ఎంతో ప్రశాంతమైన మనస్సు, దానితోబాటు మౌనంగా వుండడంలో అభిరుచి, ఎంతో అనుభవంతో గూడిన నిరాడంబరత కావాలి. స్పష్టంగాను సరళంగాను ఆలోచింపగలిగినదై, దురాగ్రహము చేతగాని, అంధ విశ్వాసము చేతగాని, ఆశ చేతగాని, భయం చేతగాని మలినము కాని మనస్సు కావాలి. ఇదీ జీవితమంటే. ఇట్టి జీవితం కోసం మిమ్ము చదివించనిచో ఆ చదువు నిరర్థకము. మీరు చాలా నీటుగా వుండడం నేర్చుకోవచ్చు, ఎక్కడ ఎట్లా నడచుకోవాలో, ఆ మర్యాదలన్నీ తెలిసి యుండవచ్చు – శిష్టాచారాలను పాటించవచ్చు, అన్ని పరీక్షలలో పాసుకావచ్చు, కాని సంఘ వ్యవస్థ యంతా శిథిలమై కూలబడిపోతూ వున్న యీ సమయంలో ఈ పైపై విషయాలకు ప్రాధాన్యమివ్వడం ఎల్లాగున్నదంటే, ఇల్లు తగలబడిపోతూ వున్న సమయంలో చేతివ్రేళ్ళ గోళ్ళకు మెరుగుబెట్టుకొంటూ వున్నట్లున్నది.

ఈ విషయాల గురించి మీతో యెవ్వరున్ను మాట్లాడరు, మీతో బాటు ఎవ్వరున్ను వీటి గురించి లోతుగా చర్చించరు. ఏవో పాఠ్య విషయాలను – గణితము, దేశ చరిత్ర, భూగోళ శాస్త్రము ఇట్లాంటి వాటిని – ప్రతిదినం వదలక చదువుతూ వున్నట్లే, యీ లోతైన విషయాల గురించి చర్చించడానికి గూడ తగినంత సమయాన్ని మీరు వెచ్చించాలి. అప్పుడే మీ జీవితం సుందరము, సుసంపన్నము అవుతుంది.

### 1. ప్రశ్న:- దేవుణ్ని పూజించడం నిజమైన మతము కాదా?

కృష్ణమూర్తి:- మొట్టమొదట మతం కానిదేదో చూద్దాం. అదికదా సరియైన పద్ధతి? మతం కానిదేదో ముందు తెలిసికొంటే అప్పుడు బహుశా మనకొక క్రొత్త

విషయం తెలుస్తుంది. అది దుమ్ము గొట్టుకొన్న కిటికీని శుభ్రం చేయడం లాంటిది; అప్పుడే దానిగుండా స్పష్టంగా చూడగలం. అందువలన మనం ముందు మతం కానిదేదో అర్థం చేసికొని, దానిని మన మనస్సులోనుండి తుడిచి పారవేద్దాం. "దాని గురించి తరువాత ఆలోచిద్దాంలే" యని, ఉపయోగంలేని మాటలతో కాలక్షేపం చేయవద్దు. బహుశా మీరు దాని గురించి ఆలోచింపవచ్చునేమో గాని చాలమంది పెద్దలు మాత్రం ఇప్పటికే ఊబిలో చిక్కుకొని బయట పడలేకున్నారు. వారు మతంకానిదేదో దానిలో బాగా స్థిరపడిపోయినారు. దానిలో నుండి వారు బయటికి రావడానికి కిష్టపడరు.

ఇంతకు, మతం కానిదేది? మీరు ఎప్పుడైనా దాని గురించి ఆలోచించారా? మతమంటే యేమిటో ఎవరెవరో మీకెన్నో పర్యాయాలు, ఎన్నో విధాలుగా నూరిపోసి వుంటారు – దేవునిమీద నమ్మకముంచడం, ఇంకా ఎన్నో చాలా విషయాలు. కాని యెవ్వరున్ను మతం కానిదేదో కనుక్కోమని మిమ్మల్ని అడుగలేదు. అది యిప్పుడు మనం చేయబోతున్నాం..

నేనేకాదు, ఎవరైనా ఏదైనా చెప్పుతూ వుంటే ఆ చెప్పిందెల్ల సత్యమని గ్రుడ్డిగా నమ్మవద్దు. ఆ చెప్పిన దానిలో సత్యమెంతవరకో వివేచించడం కోసం ముందు జాగ్రత్తగా వినండి. మతం కానిదేదో ఒకసారి మీరు స్వయంగా తెలిసికోగల్గితే, యిక మీ జీవితంలో మళ్ళీ పూజారులుగాని, పురోహితులుగాని, ధార్మిక గ్రంథాలుగాని, ఎవరుగాని మిమ్ము వంచించలేరు. ఎట్టి భయమున్ను మీలో భ్రాంతిని పుట్టించి గ్రుడ్డిగా అనుసరించేటట్లు చేయదు. మతం కానిదేదో తెలిసికోవడం కోసం మొదట మనం ప్రతిదినం చేసే పనులతో ఆరంభించి, క్రమంగా పైకి పోదాం. దూరం పోవలసినవాడు దగ్గరలో ఆరంభించాలి కదా! అందులోను మొట్టమొదట వేసే అడుగు చాల ముఖ్యమైన అడుగు. ఇంతకు మతం కానిదేది? జాతకర్మ, వివాహము మున్నగు నిత్యనైమిత్తిక కర్మకలాపము మతమా? మాటిమాటికి పూజలు చేయడం మతమా?

ఎట్లా ఆలోచించాలో నేర్చుకోవడమే చదువు, ఏమిటి ఆలోచించాలో నేర్చుకోవడం కాదు. ఎట్లా ఆలోచించాలో మీకు తెలిస్తే, నిజంగా అట్టి శక్తి మీకున్నట్లయితే అప్పుడు మీరు స్వతంత్రులు; అప్పుడు మీరు స్వమతమునందు దురభిమానమును జూపరు. అంధ విశ్వాసములు, జాతకర్మాది కర్మకాండలనుండి విముక్తులవుతారు. అందువలన అప్పుడే మీరు నిజమైన మతమేదో కనుగొన గలుగుతారు.

కర్మకాండ నిజమైన మతము కాదన్నది స్పష్టము. ఎందువల్లనంటే, ఆ కర్మకాండను జరపడంలో తరతరాలుగా మీ కందజేయబడిన ఏదో ఒక విధానమును, ఒక పద్ధతిని గ్రుడ్డిగా అనుసరిస్తూ వుంటారు, దానినే మళ్ళీ మళ్ళీ చేస్తూ వుంటారు. దానిని జరపడంలో ఒక విధమైన ప్రీతిని, ఉల్లాసాన్ని మీరు పొందుతూ వుండవచ్చు. అయితే అటువంటి ప్రీతినే ఉల్లాసాన్నే పొగ పీల్చడంలోను, కల్లు సారాయి త్రాగడంలోను గూడ పొందుతూవుంటారు గదా! కాని అది నిజమైన మతమా?

కర్మకాండను జరిపేటప్పుడు మీరు చేసే పనుల గురించి మీకేమీ తెలియదు. మీ తండ్రులు, తాతలు చేసినారు కాబట్టి మీరున్ను చేస్తారు. చేయకపోతే వాండ్లు తిడతారు కాబట్టి చేస్తారు. అటువంటిది నిజమైన మతమనిపించుకొంటుందా?

ఇక గుడిలో నేమున్నది? ఒక మానవుడు తన కల్పనాశక్తి నుపయోగించి ఒక రాతి విగ్రహాన్ని చెక్కుతాడు. దానిని అక్కడ గుడిలో పెడతారు. ఆ విగ్రహము దేనికో 'సంకేతము' కావచ్చును; 'ప్రతిరూపము' కావచ్చును. అయినా అది కేవలం విగ్రహమే గాని మరేమీ కాదుగదా! సంకేతము లేదా పదము, దానిచేత సూచింపబడే వస్తువు ఒకటికాదు. తలుపు అనేమాట అసలు తలుపు కాదు గదా! పదము వేరు, దానిచేత సూచింపబడు వస్తువు, అంటే పదార్థము వేరు. మనము పూజించడానికై గుడికి పోతాము – దేనిని పూజించడానికి? దేనికో సంకేతముగా నున్న విగ్రహాన్ని పూజించడానికి పోతాము. కాని సంకేతము అసలు వస్తువు కాదుగదా? అందుకని అక్కడికే యెందుకు పోవాలి? ఇది నిజమైన స్థితి. నేను దేనినీ ఖండించడం లేదు. యథార్థ పరిస్థితి యిది. కాబట్టి గుడికి ఎవరు పోతేనేమి? స్పృశ్యులు పోయినా, అస్పృశ్యులు పోయినా, బ్రాహ్మణులు పోయినా అబ్రాహ్మణులు పోయినా, ఎందుకు పట్టించుకోవాలి? ఇదంతా ఎవరికి కావాలి? పెద్దవాండ్లు ఆ సంకేతాన్నే, ఆ విగ్రహాన్నే మతమన్నారు. దానికోసం పోరాడడానికి, చంపుకోడానికి గూడ వారు వెనుదీయరు. కాని యింతకు దేవుడక్కడ లేడు. దేవుడెన్నడును ఒక విగ్రహంలో లేడు. అందువలన ఒక సంకేతాన్ని లేక ఒక విగ్రహాన్ని పూజించడమనేది నిజమైన మతము కాదు.

ఇక నమ్మకమనేది మతమా? ఇది యింకా చిక్కు సమస్య. మనం దగ్గరలో మొదలు పెట్టాం, ఇప్పుడు కొంచెం లోతుకు పోతున్నాం. నమ్మకమనేది మతమా యని ప్రశ్న. క్రైస్తవులు ఒక విధంగా నమ్ముతారు, హిందువులు మరియొక విధంగా నమ్ముతారు, మహమ్మదీయులు మరియొక విధంగాను, బౌద్ధులు ఇంకొక విధంగాను నమ్ముతారు. వాండ్లందరు గూడ ఎవరికి వారు గొప్ప ధార్మిక పరులమనే చెప్పుకొంటారు. వారి కందరికీ తమ తమ గుడులు, అందులో దేవుళ్ళు లేదా సంకేతములు, లేదా చిహ్నములు, నమ్మకాలున్ను ఉన్నాయి. అదంతా నిజమైన మతమేనా? దేవునిలో, రామునిలో, సీతలో, ఈశ్వరునిలో ఇంకా అటువంటి వాటిల్లో నమ్మకమున్నట్టయితే అది నిజమైన మతమా? అట్టి నమ్మకము మీకెట్లా కలిగినది? మీ తాతలు, ముత్తాతలు నమ్మినారు కాబట్టి మీరున్ను నమ్ముతారు. లేదా శంకరుడో బుద్ధుడో ఎవరో చెప్పినారని అనుకొనే విషయాలను మీరు చదివి వాటిని నమ్ముతారు. అవన్నీ నిజమేనంటారు. భగవద్గీత చెప్పినది నమ్మడంలో ఇక ప్రశ్నేలేదు, దానిని చాలమంది యథాతథంగా, ఎట్టి శంక పెట్టుకోకుండా నమ్ముతారు. అందుచేత ఏ యితర పుస్తకాన్నైనా విమర్శిస్తూ చూచినట్లుగా మీరా పుస్తకాన్ని విమర్శనా దృష్టితో చూడలేరు. సత్యమేదో కనుక్కోడానికి మీరసలు ప్రయత్నమే చేయరు.

ఇంతవరకు మనం తెలిసికొన్న దానినిబట్టి కర్మకాండ చేయడంగాని, గుడికి పోవడంగాని, నమ్మకాలు పెట్టుకోవడంగాని నిజమైన మతము కాదని తేలినది. అసలు

నమ్మకమనేది మనుష్యులను వేరు చేస్తుంది. క్రైస్తవులలో కొన్ని నమ్మకాలున్నాయి; అందువలన వారితరులతో విభేదిస్తున్నారు. వారిలో వారికిన్ని విభేదాలున్నాయి. హిందువులలోని విభేదాలు ఈనాటివి కావు; అనాది కాలమునుండి వస్తున్నాయి. వీటికంతము లేదు. బ్రాహ్మణులని, అబ్రాహ్మణులని, యింకా ఇదని అదని ఎన్ని విభేదాలో! కాబట్టి నమ్మకమనేది విరోధాన్ని, విభేదాన్ని, నాశనాన్ని తెస్తుంది. అందువలన అది నిజమైన మతం కాదనే మాట స్పష్టము.

అయితే యింతకున్ను నిజమైన మతమేది? మీరు కిటికీ అద్దాన్ని బాగా శుభ్రం చేస్తే – అంటే, కర్మకాండలు చేయడం నిజంగా మాని వేస్తే, అన్ని విధాలైన నమ్మకాలను వదిలిపెడితే, ఏ గురువునుగాని, నాయకుణ్ణిగాని అనుసరించడం మానుకొంటే అప్పుడు మీ మనస్సు కిటికీ అద్దం వలె శుభ్రంగా నిర్మలంగా వుంటుంది; దాని గుండా మీరు స్పష్టంగా చూడగలరు. ఎప్పుడైతే మనస్సు అన్ని విధాలైన సంకల్పముల నుండి, కర్మకాండలనుండి, నమ్మకములనుండి, సంకేతములనుండి, అన్నివిధాలైన మాటల మంత్రములు జపములనుండి, వివిధములైన భయములనుండి విముక్తమై శుభ్రము చేయబడి నిర్మలముగా నుంటుందో అప్పుడు సాక్షాత్కరించునదే సత్యము. అది నిత్యము, అనంతము, త్రికాలా బాధితము. దానినే దేవుడని పిలువ వచ్చును. కాని దీనికి ఎంతో అంతర్దృష్టి – లోచూపు – కావాలి, అవగాహన ఉండాలి, ఓరిమి ఉండాలి. నిజమైన మతమంటే యేమిటో లోతుగా విచారణ చేస్తూ దినదినమును వదలక ఆ విచారణను తుదివరకు కొనసాగిస్తూ వుంటే అట్టివారికే అది సాధ్యము.

అట్టివారే నిజమైన మతము నెఱుగ గల్గినవారు. తక్కిన వారు చెప్పేడివన్నీ కేవలం పుక్కిటి పురాణాలు, సారములేని పలుకులు. వారు పెట్టుకొనే ఆభరణ ములు, శరీరమునకు చేసికొనెడి అలంకరణలు, వారి పూజలు, పురస్కారములు, ఘంటానాదములు – ఇవన్నీ అంధ విశ్వాసములు; వాటి కెట్టి అర్థమును లేదు ప్రాధాన్యమును లేదు. మతమని పిలువబడే దానికి విరుద్ధముగా మనస్సు తిరుగబడి ప్రశ్నిస్తే, అప్పుడే దానికి సత్యము గోచరిస్తుంది.

*30 డిశంబరు, 1954*

★ ★ ★

# 5. సృజనాత్మకమైన అసంతుష్టి

మీరెప్పుడైనా బొత్తిగా కదలకుండా – చాల శాంతంగా కూర్చున్నారా? ప్రయత్నం చెయ్యండి. నిశ్చలంగా కూర్చోండి, మీ వీపును నిటారుగా నిలపండి. అంతట మీ మనస్సు ఏమి చేస్తూ వున్నదో గమనించడం మొదలు పెట్టండి. దానిని వశం చేసికొందామని అందుకోసం ప్రయత్నించకండి. ఒక ఆలోచన నుండి మరియొక ఆలోచనకు గాని, ఒక అభిరుచి నుండి మరియొక అభిరుచికిగాని మనస్సు దుముకుతూ వుంటే దానిని ఆపడానికి ప్రయత్నించకండి. మీ మనస్సు ఎట్లా దుముకుతూ వున్నదో అది మాత్రం గమనించండి. అంతకంటే మించి మరేమీ చేయవద్దు. నది గట్టున నిలబడి నదిలో నీరెట్లా ప్రవహిస్తూ వున్నదో చూస్తున్నట్లే మనస్సులోని ఆలోచనలను గమనిస్తూ వుండండి. ఆ ప్రవహించే నీటిలో చేపలు, ఆకులు, చచ్చిన జంతువులు – ఇట్లా ఏవేవో వుంటాయి. కాని ఆ నది మాత్రము ఎల్లప్పుడు సజీవమే, ఎల్లప్పుడు ప్రవహిస్తూనే వుంటుంది. మీ మనస్సు గూడ అటువంటిదే, ఎగురుతున్న సీతాకోక చిలుక మాదిరి ఒకదానిమీది నుండి మరియొక దాని మీదికి ఎగిరిపోతూ వుంటుంది. దాని కెన్నటికిని విశ్రాంతి అంటూ లేదు.

ఏదైనా పాట వినేటప్పుడు మీరెట్లా వింటారు? ఆ పాట పాడే వాడంటే మీకిష్టముండవచ్చు, అతని ముఖం అందంగా వుండవచ్చు, ఆ పాటకు అర్థం మీకు తెలిసియుండవచ్చు. కాని వీటన్నిటి వెనుక, మీరు పాట వినేటప్పుడు, స్వరములను, వాటి మధ్యగల నిశ్శబ్దతను వింటూ వుంటారు గదా! అదే విధంగా కాళ్ళు చేతులు కదిలించకుండా ప్రశాంతంగా కూర్చుండి మనస్సును గమనించడం మొదలు పెట్టండి. అది యొక తమాషాగా వేడుకగా వుంటుంది. అట్లా దానినొక తమాషాగా, ఒక వినోదంగా మీరు ప్రయత్నిస్తే దానితో మనస్సు తేటపడడం ఆరంభమవుతుంది. అందుకోసం మీరేమీ ప్రయత్నం చేయనక్కరలేదు. దానిని లొంగదీసికోవడం కోసం తంటాలు పడనక్కరలేదు. అటువంటప్పుడు మీ మనస్సులో ఇది మంచి పని, ఇది కాదు, ఇది చేయవచ్చును, ఇది చేయరాదని విమర్శించే ధర్మాధ్యక్షుడు, న్యాయ నిర్ణేత, విలువ నిర్ణయించేవాడు ఉండడు. అట్లా మనస్సు దానంతటనదే శాంతించినప్పుడు, ఎట్టి ప్రయత్నం లేకుండా తనకుదానే నిలకడ పొందినప్పుడు, ఉల్లాసంగా వుండడమంటే యేమిటో అర్థమౌతుంది. ఉల్లాసమంటే యేమిటో మీకు తెలుసా? ఉల్లాసమంటే ఆహ్లాదము, ఆనందము, నవ్వు. దేనిని జూచినా ఆనందమే, చూడకపోయినా ఆనందమే. అప్పుడే జీవించడంలో ఆనందముంటుంది. దానితోబాటు ముఖంమీద చిరునవ్వు వుంటుంది. అప్పుడే ఎట్టి భయం లేకుండా ఇతరుల ముఖంలోకి నేరుగా చూడగలరు.

నేరుగా ఎవరి ముఖంలోకైనా మీ రెప్పైడైనా నిజంగా చూచివున్నారా? మీ ఉపాధ్యాయుని ముఖంలోకిగాని, మీ తల్లిదండ్రుల ముఖంలోకిగాని, పెద్ద ఉద్యోగస్థుని ముఖంలోకిగాని, సేవకుని ముఖంలోకిగాని, పేద కూలివాని ముఖంలోకిగాని మీరెన్నడైనా చూశారా? చూస్తే యేం జరిగింది? మనలో చాలమందిమి మరియొకరి ముఖంలోకి నేరుగా చూడడానికి జంకుతాము. అట్లే వాండ్లు గూడ వాండ్ల ముఖంలోకి మనం చూడడం ఇష్టపడరు. ఎందుకంటే, మన మాదిరి వాండ్లకున్ను భయమే, సంకోచమే. ఎవరున్ను తమకు తాము బయటపడిపోవాలని కోరుకోరు. ఎవరికి వారు చాల జాగ్రత్తగా చాల మెలకువగా వుంటారు. పొరలుపొరలుగా గడ్డకట్టిపోయిన తమ తమ దుఃఖాలను, బాధలను, కోరికలను మరియు ఆశలను వెనుకకు దాచిపెట్టి, బయటికి తెలియనీయరు. మీ ముఖంలోకి నేరుగా చూచి చిరునవ్వుతో పలుకరించగల వారరుదు. ఇంతకు చిరునవ్వుతో సంతోషంగా ఉండడం చాల అవసరం. ఎవరి హృదయవీణ మూగపోయినదో అట్టివాని జీవితం నీరసం, నిరర్థకం. ఒక గుడి నుండి మరియొక గుడికి ఒక భర్తనో భార్యనో విడిచి మరియొక భర్తలేక భార్యవద్దకు, ఒక ఉపాధ్యాయుని లేదా గురువును వదలి మరియొకని వద్దకు పోవచ్చు. కాని హృదయంలో ఆనందమే లేనిచో అట్టి జీవితము నిష్ప్రయోజనము, అర్థరహితము. అయితే యీ అంతరికానందమును పొందడం సులువు కాదు. ఎందుకంటే, మనకున్న అసంతుష్టి పైపైననే గాని లోతుగా లేదు.

మరి అసంతుష్టిగా వుండడమంటే అర్థమేమిటో తెలుసునా? దానిని అర్థం చేసికోవడం చాల కష్టం. ఎందుకంటే, మనలో చాలమందిమి మన అసంతుష్టిని ఏదో యొక దిశకు మరలించి, ఆ విధంగా అది అణగారి పోయేటట్లు చూస్తాము. అంటే, ఒక సురక్షితమైన స్థానంలో, స్థిరమైన అభిరుచులతోను, పేరు ప్రతిష్ఠలతోను పదిలంగా నిలద్రొక్కుకొని, యేవిధంగాను మన స్థితికి భంగం కలుగకుండా చూచుకోడంలోనే మన శ్రద్ధ అంతా. ఇట్లా మన ఇండ్లలోనే గాకుండ, మన స్కూళ్ళలో గూడ జరుగుతుంది. ఉపాధ్యాయులు తమ పదవికి ముప్పు వాటిల్లాలని యెన్నడును కోరుకొనరు. అందువల్లనే వారు తమ పాత పద్ధతులను వదలక వాటినే పాటిస్తూ వుంటారు. ఎప్పుడైతే మనిషి నిజంగా అసంతుష్టి పొంది, ప్రతిదానిని గురించి విచారణ చేయడం, ప్రశ్నించడం మొదలుపెడతాడో అప్పుడే అతనిలో కదలిక ఆరంభమౌతుంది. అతని శాంత జీవితము భగ్నమౌతుంది. అయితే నిజమైన ఆ యసంతుష్టి నుండియే వినూత్న ప్రయత్నముల కుత్సాహము కలుగుతుంది, క్రొత్తదారి త్రొక్కాలని కోరిక గలుగుతుంది. చొరవ పుడుతుంది.

మరి చొరవ అంటే యేమిటి? ఎవరిచేతను బోధింపబడకుండ, ఎట్టి ప్రేరణ లేకుండ, ఏదైనా పనిని మీయంతట మీరు పూనుకొని చేయసాగితే అప్పుడు మీలో చొరవ వున్నట్లు. అదేదో ఘనకార్యము, అసాధారణ కార్యము కానక్కరలేదు. అట్టి ఘనకార్యాలు ముందుముందు చేయవచ్చును. కాని మొదట్లో మీయంతట మీరు ఒక మొక్కను నాటితే, అవ్యాజమైన అనురాగాన్ని, దయను చూపితే, ఏదైనా పెద్ద భారం మోస్తున్న మనిషిని జూచి సానుభూతితో చిరునవ్వు నవ్వితే, దారికడ్డంగా నున్న రాతిని తొలగిస్తే, దారిన బోతున్న పశువు వీపుపై ప్రేమతో

తట్టితే మీలో చొరవ ఏ కొంచెమో వున్నట్లే. బ్రహ్మాండమగు చొరవ కిది నాంది. అట్టి చొరవ మీలో ఉన్నప్పుడే అసాధారణమైన సృజనాత్మకత అంటే యేమిటో మీరు తెలిసికొన గలుగుతారు. సారాంశమేమనగా – లోతుగా అత్యధికమైన అసంతుష్టి లేనిచో నూతనారంభములం దుత్సాహముగాని అభిలాషగాని కలుగదు. దానిలోనుండియే సృజనాత్మకత – ఉపజ్ఞ – పుట్టుకొనివస్తుంది.

కాబట్టి అసంతుష్టికి భయపడకండి. దానికి తగిన దోహద మివ్వండి. అప్పుడే అగ్నికణము పెరిగి పెద్దదై జ్వాల అవుతుంది. మీరు చేసే ఉద్యోగము, మీ కుటుంబము, ధనమును, పదవిని, అధికారమును సంపాదించడం కోసం పారంపర్యంగా చేస్తూ వచ్చిన ప్రయత్నములు – వీటన్నింటి యెడల మీకసంతుష్టి పెరుగుతుంది. అంతట మీరు నిజంగా ఆలోచించడం మొదలు పెడతారు, క్రొత్త విషయాలను కనిపెట్టడం మొదలు పెడతారు. కాని మీరు పెద్దవారయ్యే కొలది యీ అసంతుష్టిని యిట్లే కొనసాగించడం చాల కష్టమైపోతుంది. దాని తీవ్రత తగ్గిపోసాగుతుంది. మీరు మీ పిల్లల బాగోగులు చూచుకోవలసి వుంటుంది. ఉద్యోగములోని బాధ్యతలు ఎక్కువౌతాయి. మీ యిరుగుపొరుగువారి అభిప్రాయాలకు, మీరున్న సంఘము యొక్క అభిప్రాయాలకు మీరు లొంగిపోవడం మొదలు పెడతారు. క్రమక్రమంగా యీ మండుచున్న అసంతుష్టి జ్వాల చల్లారడం మొదలు పెడుతుంది. ఎప్పుడైనా యీ అసంతుష్టి జ్వాల మరల తలయెత్తితే రేడియో పెట్టుకొంటారు, గురువు దగ్గరికి పోతారు, పూజలు చేస్తారు, ఏదేని క్లబ్బులో జేరతారు, త్రాగుడు అలవాటు చేసికొంటారు లేదా ఆడవాండ్ల వెంటబడతారు – ఏమైనా చేస్తారు ఆ జ్వాలను చల్లార్చడానికై. కాని, చూశారా, ఆ జ్వాలయే లేకపోతే నూతనారంభంములందు మీ కభిరుచియే కలుగదు, ఉత్సాహమే ఉండదు, చొరవ వుండదు. మరి ఆ చొరవయే స్వయం కల్పనాశక్తికి, సృజనాత్మకతకు మూలము.

సత్యమేదో తెలిసికోవాలంటే స్థిరంగా నాటుకొనిపోయిన యీ సంఘ వ్యవస్థకు విరుద్ధంగా మీరు తిరగబడవలసి వుంటుంది. కాని మీ తల్లిదండ్రులయొద్ద డబ్బెంత ఎక్కువగా వుంటుందో, మీ ఉపాధ్యాయులు తమ యుద్యోగాలలో ఎంతగా స్థిరపడిపోయి సురక్షితంగా వుంటారో అంత తక్కువగా వారు మిమ్ము తిరగబడడానికి ప్రోత్సహిస్తారు.

స్వయం కల్పనా శక్తి లేదా సృజనాత్మకత (creativity) అంటే కేవలం బొమ్మలకు రంగులు వేయడం గాని పద్యాలు వ్రాయడం గాని కాదు. అవి మంచి పనులే కాని, అవికాదు ముఖ్యము. మరి, ముఖ్యమైన దేమిటంటే – సంపూర్ణమైన అసంతుష్టి. దానివల్లనే నూతనారంభములం దభినివేశము (initiative) కలుగుతుంది. చొరవ పుడుతుంది. అదియే రానురాను సృజనాత్మక శక్తిగా పరిణమిస్తుంది. అది మాత్రమే సత్యమును లేదా దైవమును కనుగొనడానికి గల ఏకైక మార్గము. ఏలయన, సృజనాత్మకతయే దైవము.

అందువలన ఇట్టి సంపూర్ణమైన అసంతుష్టి చాలా అవసరము. అయితే దానితోబాటు ఆనందముండవలె. ఏమి, అర్థమవుతున్నదా? పూర్తి అసంతుష్టి వుండవలసినదే గాని దాని గురించి మొరబెట్టుకొంటూ, బాధపడుతూ వుండరాదు.

ఆనందంగా, ఉల్లాసంగా, ప్రేమగా వుండాలి. అసంతుష్టి గలవారు చాలమంది మన ప్రాణాలు తోడేస్తారు, మనలను విసిగిస్తారు. అది బాగా లేదని, ఇది బాగా లేదని, యింతకంటె మంచి స్థితిలో తాముండవలసిన వారమని, పరిస్థితులు మారిపోవాలని అదే పనిగా ఆక్రోశిస్తూ వుంటారు. అదెందువల్లనంటే, వారికున్న అసంతుష్టి పైపైన వుండేది మాత్రమే, లోతుగా వుండేదికాదు. ఇక అసంతుష్టి బొత్తిగా లేనివారో, మృతప్రాయులే.

మీరు మీ చిన్నతనంలోనే అసంతుష్టితో తిరుగబడి, వయస్సు పెరుగుకొలది ఆ యసంతుష్టిని అణగారిపోకుండా చూచుకోగలిగితే, దానితోబాటు ఆనందమయ చైతన్యము, అత్యధిక వాత్సల్యము, ప్రేమ ఉండినట్లయితే అప్పుడా అసంతుష్టి జ్వాల అత్యధికమైన మహత్త్వము కలదై, అపూర్వ సృష్టికి కారణమవుతుంది; నూతనములైనవాటిని కనిపెడుతుంది. ఇందుకోసం మీకు సరియైన విద్యాబోధన జరగవలసి యున్నది. కేవలం ఏదో ఉద్యోగాన్ని సంపాదించుకోవడానికి, విజయ సోపానాన్ని అధిరోహించడానికి సాయపడే విద్య కాదు. ఆ విద్య మీకు మీ ఆలోచనా విధానంలో తోడ్పడాలి, మీకు ఎదగడానికి చోటివ్వాలి. అంటే, విశాలమైన పడక గదిని గాని, ఎత్తైన కప్పుగల యింటినిగాని యివ్వడం కాదు; మీ మనస్సు ఎదగడానికి తగిన యెడము కల్పించాలి. నమ్మకాలు, భయాలతో మనస్సు సంకుచితము గాకుండ, విశాల మవడానికి తగిన అవకాశము కల్పించగల విద్యయే విద్య. అట్టి విద్య మనకు కావాలి.

1. **ప్రశ్న:- అసంతుష్టి గనక వుంటే సరళంగా స్పష్టంగా ఆలోచింపలేము. ఈ అవరోధాన్ని మనమెట్లు అతిక్రమించగలము?**

**కృష్ణమూర్తి:-** నేను చెప్పినదానిని మీరు సరిగా విన్నారని అనుకోను. బహుశా మీరు వేయదలచిన ప్రశ్న గురించి, అదెట్లా వేయవలెనా యనే ఆలోచనలో మునిగియుంటారు. ఇంతకు మీమీ ధోరణులలో మీరందరున్నూ చేసేది అదే. ప్రతివాడూ, ఏదో యొక ఆలోచనలో మునిగి వుంటాడు. మీ మనస్సంతా మీ సమస్యలతోనే నిండివుంటుంది గనుక, మీరు వినదలచుకొన్న దేదో అది నేను చెప్పకపోతే దానిని మీరిక వినిపించుకోరు, ప్రక్కకు త్రోసివేస్తారు. అట్లే నేను చెబుతూవున్న విషయాన్ని యీ పృచ్ఛకుడు సరిగా వినియుండినట్లయితే; అసంతుష్టి, ఉల్లాసము, సృజనాత్మకత – వీటి అంతర్గత నైజాన్ని తాను మనసా గ్రహించి వున్నట్లయితే అసలీ ప్రశ్ననే వేసి యుండేవాడు కాదు.

ఇంతకు, అసంతుష్టి స్పష్టమైన ఆలోచనను అడ్డగిస్తుందా? స్పష్టమైన ఆలోచన అంటే యేమిటి? మీ యాలోచనకు ఫలితంగా మీరు దేనినైనా పొందగోరితే అప్పుడు మీ యాలోచన సరళంగా, స్పష్టంగా సాగుతుందా? రాబోయే ఫలితంమీదనే మీ మనస్సంతా లగ్నమై వుంటే సక్రమంగా, స్పష్టంగా ఆలోచింపగలరా? లేక ఒక ప్రయోజనాన్నిగాని, ఫలితాన్నిగాని కోరనప్పుడు మాత్రమే – ఏదో లాభం కోసం ప్రయత్నించనప్పుడు మాత్రమే – మీరు సరిగా ఆలోచింపగలరా?

మీకు దేనియందైనా దురభిమానం గాని లేదా విశేషమైన నమ్మకం గాని వుంటే - అనగా హిందువుగానో, కమ్యూనిష్టుగానో లేక క్రైస్తవుడిగానో మీరు ఆలోచిస్తూ వుంటే – మీ యాలోచన సరళంగా, సక్రమంగా సాగుతుందా? వాస్తవానికి ఒక త్రాటితో మేకుకు కట్టబడిన కోతి వలె మీ మనస్సు ఏదో యొక నమ్మకానికి కట్టుబడి యుండకపోతే అప్పుడు మాత్రమే మీరు సరియైన మార్గమున ఆలోచింపగలరు. ఏదైనా ఫలితాన్ని ఆశించనప్పుడు మాత్రమే మీరు స్పష్టంగా ఆలోచింపగలరు. దేనియందైన దురభిమానము, పక్షపాతము లేనప్పుడు మాత్రమే మీరు స్పష్టంగా ఆలోచింపగలరు. ఇంతకు సారాంశమేమంటే, ఏ విధమైన భద్రతకోసమున్ను ప్రాకులాడక, భయవిముక్తమై యున్నప్పుడు మాత్రమే మీ మనస్సు స్పష్టంగా, సరళంగా ఋజు మార్గమున ఆలోచింపగలదు. ఒకవిధంగా చూస్తే, అసంతుష్టి స్పష్టమైన ఆలోచనకు తప్పక అడ్డు పడుతుంది. అసంతుష్టి మూలాన మీరేదేని ఫలితం కోసం ప్రాకులాడుతూ వుంటే లేదా మీరు మీ మనస్సులో శాంతి భంగాని కిష్టపడక, ఏవిధంగానైనా ప్రశాంతంగా సుఖంగా వుండగోరడంచేత మీ అసంతుష్టిని అణచివేయగోరినట్టయితే, అప్పుడు మీ యాలోచన సక్రమంగా, స్పష్టంగా సాగదు. అట్లుగాక, మీరు మీకున్న దురభిమానాలతో, పక్షపాతాలతో, నమ్మకాలతో, భయాలతో – ప్రతిదానితోను అసంతుష్టి చెందియుండి, అదే సమయంలో ఎట్టి ఫలితం కోసమైనా ప్రాకులాడకుండా వుంటే అప్పుడా యసంతుష్టి మీ యాలోచనను ఏదో యొక విశేష విషయం మీదికిగాని, ఏదో యొక విశేష దిశకుగాని పోనీయకుండా తన వెలుగులోనికి తీసికొంటుంది. దానితో మీ యాలోచనా ప్రక్రియ చాల సరళము, ఋజువు, స్పష్టమున్ను అవుతుంది.

పెద్దవాళ్ళంగాని, చిన్నవాళ్ళంగాని మనలో చాల మందికి అసంతుష్టి తప్పకుండా ఉంటుంది. కాని అది యెందుకుంటుంది? ఇప్పటికంటె ఇంకా ఎక్కువ జ్ఞానము, మంచి ఉద్యోగం లేదా ఇంతకంటె మంచి కారు, మంచి జీతము, ఇంకా ఏవేవో కావాలని కోరుకుంటాము కాబట్టి అసంతుష్టి చెందుతూ ఉంటాము. మన అసంతుష్టి అంతా మనకున్నదానికంటె ఎక్కువ కావాలనే కోరిక మీదనే ఆధారపడి ఉంటుంది. అందువలన సరళమైన ఆలోచనకు అవరోధమును కల్పించేది "ఇంతకంటె మించికావా"లనే మన కోరికయే గాని మరొకటి కాదు. దాని గురించి నేను మాట్లాడడం లేదు. మనకేదో కావాలని గాక, మనకేమి కావాలో తెలియక మనము అసంతుష్టి జెంది వున్నట్లయితే; మన యుద్యోగాలతో, మన ధనసంపాదనతో, అధికారం కొరకై, హోదా కొరకై మనము చేసే ప్రయత్నాలతో, మన సంప్రదాయంతో, ఇప్పుడు మనకున్న దానితో మరియు ఇకముందు మనకుండబోయే దానితో ఇట్లా ఏదో యొక దానితో గాకుండా, ప్రతియొక్క దానితోను అసంతృప్తి జెంది వున్నట్లయితే; అప్పుడు మాత్రమే మన అసంతుష్టి స్పష్టతకు దారితీస్తుందని అనుకొంటాను. ప్రతి దానిని గ్రుడ్డిగా అంగీకరించడంగాని, అనుసరించడంగాని చేయకుండా దాని బదులు ప్రశ్నించడం, విచారణ చేయడం, లోతుకు పోయి పరిశీలించడం చేస్తూ వుంటే, అప్పుడు అంతర్దృష్టి యేర్పడి, దానినుండి సృజనాత్మక శక్తి, ఆనందమున్ను కలుగుతాయి.

## 2. ప్రశ్న:- ఆత్మజ్ఞాన మనగానేమి? అది మనకెట్లు లభిస్తుంది?

**కృష్ణమూర్తి:-** ఈ ప్రశ్న అడిగేవాని మనస్సు ఎట్లా పనిచేస్తుంటుందో తెలుసునా? అతని యెడ నిరాదరణతో నేను మాట్లాడడం లేదు. కాని "నాకది యెట్లా లభిస్తుంది? దాని నెంతకు కొనవచ్చు? దానికోసమై నేనేమి చేయవలె? నేనేమి త్యాగం చేయవలె? ఎట్టి నియమాలను పాటించవలె? ఎట్టి క్రమశిక్షణ పాటించవలె? ఎట్టి ధ్యానపద్ధతిని అవలంబించవలె?" ఈ విధమైన ప్రశ్నలు అడిగేవాని మనస్స్వభావం ఎట్టిదో చూద్దాం. "దానిని పొందడం కోసం, దీనిని చేస్తాను" అని చెప్పే మనస్సు యాంత్రికమైనది, మట్టమైనది. ధార్మిక పరుల మనుకొనేవారు ఇట్లే ఆలోచిస్తారు. కాని ఆత్మజ్ఞాన మెవరికైనా యీ విధంగా కలుగదు. అది ప్రయత్నం చేతగాని, అభ్యాసం చేతగాని కొనబడేది కాదు. మీ తోడి విద్యార్థులతోను, మీ ఉపాధ్యాయులతోను, మీ చుట్టూరా వున్న జనులందరితోను మీకు గల సంబంధములో మిమ్ము మీరు పరిశీలించి చూచుకొంటుంటే అప్పుడు మీ కాత్మజ్ఞానము లభిస్తుంది. ఆత్మజ్ఞానమంటే మీ గురించిన, మీ వ్యక్తిత్వమును గురించిన జ్ఞానము. ఎదుటివాని ప్రవర్తన, అతని చేష్టలు, అతడు ఉడుపులు ధరించిన తీరు, మాట్లాడే విధము, అతడు చేసే పొగడ్తలు లేక తెగడ్తలు, వాటికి మీ బదులు సేతలు – వీటినన్నిటిని గమనిస్తుంటే మీ వ్యక్తిత్వమును గూర్చిన జ్ఞానము మీకు లభిస్తుంది. మీలోను, మీ చుట్టుపట్లను గల ప్రతి చిన్న విషయాన్ని మీరు పరికిస్తుంటే, అద్దంలో మీ ముఖాన్ని మీరు చూచుకొన్నట్లే మిమ్ము మీరు చూచుకొంటుంటే మీకు మీ వ్యక్తిత్వ జ్ఞానము లభిస్తుంది. అద్దంలోకి చూచుకొన్నప్పుడు మిమ్ము మీరు ఉన్నదున్నట్లు చూచుకొంటారు కదా! మీ తల యింకొక విధంగా ఉంటే బాగుంటుందని, యింకొంత జుట్టుంటే బాగుంటుందని, మీ ముఖం ఇంకొంత అందంగా వుంటే బాగుంటుందని బహుశా మీరు కోరుకోవచ్చు. కాని యధార్థ స్వరూపాన్నే అద్దం ప్రతిఫలింపజేస్తుంది కాని, మీరు కోరుకొన్న రూపాన్ని కాదు గదా! అద్దాన్ని ప్రక్కకు నెట్టివేసి, "ఆహా! నేనెంత అందమైనవాణ్ణి!" అని చెప్పుకోలేరు గదా.

మామూలు అద్దంలో చూచుకొన్నట్లే, మీకును ఇతరులకును గల పరస్పర సంబంధమనే అద్దంలో మిమ్ము మీరు చూచుకొంటున్నట్లయితే అప్పుడు కలిగే వ్యక్తిత్వ జ్ఞానానికి అంతము లేదు. ఇది యెట్లుంటుందంటే అంతము లేని అగాధమైన సముద్రములోనికి ప్రవేశించినట్లుంటుంది. మనలో చాలమందిమి గట్టుకు చేరాలని, "నాకు నా వ్యక్తిత్వ జ్ఞానము పూర్తిగా లభించినది, నేను హాయిగా వున్నాను" అని చెప్పగలిగితే బాగుండునని అనుకొంటాము. కాని అది అట్లా జరుగనే జరుగదు. చూచిన దానిని నిందించకుండా, మరొకరితో మిమ్ము మీరు పోల్చుకోకుండా, ఇంకొంత అందంగా వుండాలని గాని, యింకను గొప్ప ధర్మపరుల మనిపించుకోవాలని గాని కోరుకోకుండా, మిమ్ము మీరు చూచుకోగల్గితే, కేవలము మీ యథార్థ స్వరూపాన్ని మాత్రం చూచుకొంటూ పోతే, అనంతదూర మిట్లాగే పోతూ వుండగలరని తెలిసికొంటారు. అప్పుడా ప్రయాణానికి అంతము లేదు. అదే దానిలోని వింత, దానిలోని అందము!

## 3. ప్రశ్న:- ఆత్మ లేదా జీవాత్మ అంటే యేమిటి?

**కృష్ణమూర్తి:-** మన సంస్కృతి, మన నాగరికత ఈ ఆత్మయనే పదాన్ని కల్పించినవి. నాగరికత అంటే యేమిటి? అనేకుల యొక్క సాముదాయికమైన ఇచ్ఛ మరియు సంకల్పము. భారతీయుల నాగరికతనే చూడండి, అది చాలమంది భారతీయుల యిచ్ఛ మరియు సంకల్పముల ఫలితము కాదా? ఏ నాగరికతయైనా అంతే. సాముదాయిక లేదా సమష్టి సంకల్పము యొక్క ఫలితమేయది. ఈ భారతీయ సంస్కృతిలో సాముదాయిక సంకల్ప మేమన్నదంటే, యీ మరణశీలము క్షయశీల మయిన భౌతిక శరీరమున కంటె గొప్పది, విశాలమైనది, క్షయము పొందనిది మరియు మరణము లేనిదొకటి – ఆత్మ అనబడేది – తప్పక వుండవలెనని అన్నది. ఈ విధంగా ఆత్మభావన మనుషులలో స్థిరపడి పోయినది. అప్పుడప్పుడు ఏ యొకరిద్దరో అసాధారణమైన యీ మృత్యురహిత స్థితిని – అంటే అమృతత్వమును గురించి తమకు దాము కనుగొని వుండవచ్చు. అప్పుడు తక్కిన సామాన్య బుద్ధిగల వారందరు, "అవును, అది సత్యమేయై యుండవలెను; అతడు చెప్పినది నిజమేయై యుండును" అని అనుకొన్నారు. వారికందరికిన్ని అమృతత్వము కావాలి కాబట్టి, యీ 'ఆత్మ' అనేపదాన్ని గట్టిగా వదలకుండ పట్టుకొన్నారు.

ఈ భౌతిక శరీరమున కంటె మించిన దేదైనా ఉన్నదా యని మీరు గూడ తెలుసుకొన గోరుతారు. నిజమేనా? ప్రతిదినము ఆఫీసుకు పోవడం, అక్కడ మీ కంతగా ఇష్టంలేని పని యేదో చేస్తూ వుండడం, ఇతరులతో కలహించడం, ఈర్ష్యాసూయలు, బిడ్డలను కనడం, ఇరుగు పొరుగువారితో వారిమీదను, వీరిమీదను చాడీలు చెప్పకోవడం, ఉపయోగం లేని మాటలు ఆడుకోవడం ఇవన్నీ గాకుండా యింతకంటె వేరే యేమైనా వున్నదా? అని మీరున్ను తెలిసికొన గోరుతారు. ఆత్మ అనే పదం అవినాశ్యమై, త్రికాలాబాధితమైన ఒకానొక స్థితిని సూచిస్తుంది. కాని అట్టి స్థితి వున్నదో లేదో మీ యంతట మీరు ఎన్నటికిని తెలిసికొనగోరరు. "ఏసుక్రీస్తు గాని, శంకరుడు గాని, మరెవరైనా సరే – యేమి చెప్పినారో మాకు అక్కరలేదు. ప్రాచీన సంప్రదాయంగాని, ఆర్య వ్యవహారంగాని యేమి చెబుతున్నదో దానితో గూడ మాకు సంబంధము లేదు. మా యంతట మేమే అట్టి త్రికాలాతీతమైన స్థితి నిజంగా ఉన్నదో లేదో తెలిసికొంటాము" అని మీరు అనరు. లోక వ్యవహారంగాని సాముదాయిక సంకల్పంగాని వ్యక్తము చేసిన దానికి విరుద్ధముగా మీరు తిరుగబడరు. పైగా, మీరు దాని కంగీకరించి "నిజమే, ఆత్మ యనేది ఉన్నది" అని అంటారు. మీరు దానినొక పేరుపెట్టి పిలుస్తారు, మరియొకరు మరియొక పేరుపెట్టి పిలుస్తారు. అప్పుడు మీ యిద్దరి మధ్య భేదాభిప్రాయము లేర్పడి, మీ మీ విభిన్న విశ్వాసాల కారణంగా విరోధులౌతారు.

కాలచక్రమున కతీతంగా ఏదైనా స్థితి ఉన్నదో లేదో నిజంగా కనుగొన దలచినవాడు ముందుగా లోక వ్యవహార మనబడే దానినుండి విముక్తి పొందవలసి వుంటుంది. అంటే, సాముదాయిక సంకల్పమునకు వశీభూతుడుగాక, స్వతంత్రుడై తనంతట తాను ఏకాకిగా నిలబడగల్గి యుండవలె. ఇది మీ చదువులో నొక ముఖ్య భాగము – అనేకుల యొక్క సంకల్పమునకుగాని లేదా ఏ యొక్కని సంకల్పమునకుగాని

లొంగిపోకుండా, స్వతంత్రంగా నిలబడగలగడం నేర్చుకోవాలి. అప్పుడే యేది సత్యమో మీ యంతట మీరు తెలిసికొనగలరు.

ఎవరిమీదను ఆధారపడవద్దు. నేనుగాని మరియొకరుగాని త్రికాలాతీతమైన స్థితి యొకటి ఉన్నదని చెప్పవచ్చు. దానివలన మీకేమి ప్రయోజనము? మీకు ఆకలిగా వుంటే తిండి తింటారు, అంతేగాని వట్టి మాటలతో మీ కడుపు నిండుతుందా? ఇంతకును ప్రధాన మేమంటే – మీ యంతట మీరు తెలిసికోవడం. మీ చుట్టూ వున్నదెల్ల క్షయించిపోతూ వుండడం, నాశనమవడం మీరే చూస్తున్నారు గదా! నాగరికత అని పిలువబడేది క్షయించి పోకుండా సమాజం యొక్క సంకల్పము నిలబెట్టలేకపోతూ వున్నది. ఆ నాగరికత ముక్కలు ముక్కలై పోతూ వున్నది. అడుగడుగునా జీవితము మిమ్ము సవాలు చేస్తూ వున్నది. దానిని మీ అలవాటు ప్రకారం ఎదుర్కొనేటట్లయితే – అంటే, దానికి మీరు తలవొగ్గుతూ వుంటే, అది సమంజసమైన పనికాదు. అందులో "ఇతరులు చెప్పేదానినెల్ల మే మంగీకరించము, వారిమీద మే మాధారపడము; మేము స్వయంగా విమర్శించి చూచి, లోతుగా పరిశీలించి తెలిసికొంటాము" అని మీరు చెప్పగలిగితే – అనగా, మీకు ఒంటరిగా నిలబడగల ధైర్యముంటే, త్రికాలాతీతమైన స్థితి యున్నదా లేదా, ఎక్కువ తక్కువ లనెడి భేదములు లేని స్థితి యున్నదా లేదా యనే విషయం కనుగొనగలరు.

*31 డిశంబరు, 1954*

★ ★ ★

# 6. జీవిత సమగ్రత

మనలో చాలమందిమి జీవితంలోని ఏదోయొక చిన్నభాగాన్ని అంటిపెట్టుకొని వుండి, దాని ద్వారానే సంపూర్ణ జీవిత మర్మాన్ని తెలిసికో గలమని అనుకొంటాము. మనముండే గదిని వదిలి పెట్టకుండానే నదియొక్క పొడవు వెడల్పులను పరిశోధించగలమని, దాని తీరమందలి పచ్చని బయళ్ళ సౌందర్యమును చూడగలమని అనుకొంటాము. ఒక చిన్న గదిలో వుంటూ ఏదో చిన్న పరదా గుడ్డమీద రంగులు వేసి, జీవితాన్ని చేతిలో నుండి జారిపోకుండ గట్టిగా పట్టుకొన్నామని, మృత్యురహస్యమును తెలిసికొన్నామని తలుస్తాము. కాని, మనమట్లా చేయలేము. అట్లా చేయవలెనంటే మనం బయటికి రావాలి. అయితే మనమున్న గదిని, అందులోని చిన్న కిటికీని వదిలిపెట్టి బయటికి రావడం, బయటికి వచ్చి, మంచి చెడ్డలు విమర్శించకుండా, దేనినీ ఖండించకుండా, "ఇది నా కిష్టము, అది నాకిష్టముకాదు" అని చెప్పకుండా చూడడం చాల కష్టమైన పని. దానికి కారణం దేనిలోనైనా ఒక భాగం గురించి తెలిసికొంటే అంతా తెలిసికొన్నట్లే యని చాలమంది భావించడం. చక్రము యొక్క ఒక ఆకు ద్వారా చక్రమునంతను అర్థము చేసికోగలమని అనుకొంటారు. కాని, ఒక్క ఆకుతో చక్రమవుతుందా? చక్రమంటే చాల ఆకులుండాలి, మధ్యలో కుండ ఉండాలి, చుట్టూ అంచు వుండాలి. ఇవన్నీ కలిస్తేనే చక్రమవుతుంది. అందువలన చక్రమునంతను ఆకళింపు చేసికోవాలంటే, దానినంతను ఒకేసారి పూర్తిగా చూడాలి. అదే విధంగా జీవితాన్ని నిజంగా అర్థం చేసికోవాలంటే జీవించు ప్రక్రియ నంతను పూర్తిగా పరిశీలించి చూడాలి.

ఇదంతా మీకర్థమవుతున్నదని అనుకొంటాను. మొత్తం జీవితాన్ని అర్థం చేసికొనడంలో మీరు చదివిన చదువు తోడ్పడాలి గాని, కేవలం ఉద్యోగం సంపాదించుకోవడంలోను, పెండ్లి, పిల్లలు, జీవిత భీమా, పూజలు పురస్కారములు, మీ చిల్లరదేవుళ్ళు – వీటితో మామూలు జీవితం గడపడంలోను తోడ్పడడం కాదు. కాని, ఇందుకు సరియైన విద్యాబోధన జరుగవలెనంటే ఎంతో తెలివి, లోచూపు వుండాలి. అందువల్ల జీవించు విధానము నంతటిని అర్థం చేసికొనడం కోసం ముందుగా విద్యాబోధకునికే విద్యగరపడం చాల అవసరమవుతున్నది. అంతేకాని, పాత పద్ధతిలోనో, క్రొత్త పద్ధతిలోనో – ఏదో యొక పద్ధతిలో మీకు కేవలం పాఠాలు చెప్పడం కోసం కాదు.

జీవితమనేది ఒక నిగూఢ తత్త్వము. అది పుస్తకాలలో దొరికేది కాదు, మనుషులు మాట్లాడుకొనేది కాదు. దాని రహస్యమును ఎవరికి వారు తెలిసికోలసినదే. అది చాల గంభీరమైన విషయము. కాబట్టి ముందు అల్పము, సంకీర్ణము, క్షుద్రమునైన

దానిని గ్రహించిన పిదప అంతకంటే లోతుగా పోయి దాని రహస్యమును గ్రహింపవలసి వుంటుంది.

చిన్నవారుగా నున్నప్పుడే మీరు జీవితాన్ని అర్థం చేసికో నారంభించకపోతే, తుదకు పెద్దవారయ్యేటప్పటికి మీ మనస్సు అందవికారంగా, భయంకరంగాను తయారవుతుంది. బయటికి చూడడానికి మీ వద్ద చాల డబ్బుండవచ్చు, చాల ఖరీదుగల కార్లలో మీరు ప్రయాణం చేయవచ్చు, ఆడంబరంగా కనబడవచ్చు, లేనిపోని బడాయీలకు పోవచ్చు. కాని, మీలోపల చూస్తే డొల్ల, ఏమీ సారముండదు, దయాదాక్షిణ్యాలుండవు. అందువలన మీరున్న చిన్న గదిని వదిలిపెట్టి బయటికి రండి. ఈ విశాలాకాశాన్ని పరికించండి. అయితే, మీలో ప్రేమలేకపోతే ఆ పని మీరు చేయలేరు. అది శారీరక ప్రేమాకాదు, దివ్యమైన ప్రేమాకాదు; కేవలం ప్రేమ - అంతే! అంటే - పక్షులను, వృక్షములను, పువ్వులను, ఉపాధ్యాయులను, తల్లిదండ్రులను - అంతేగాదు, అంతకు మించి మానవతనే ప్రేమించడం.

ప్రేమించడమంటే యేమిటో మీయంతట మీరు కనుగొన లేకపోతే, అది చాలా విషాదకరమైన విషయం కాదా? ప్రేమ అంటే యేమిటో యిప్పుడే మీకు తెలియకపోతే పెద్దైన తరువాత అసలే తెలిసికోలేరు. అప్పుడు ప్రేమ కొనడానికి, అమ్మడానికి పనికి వచ్చే ఒక వ్యాపార వస్తువుగా లేదా మీకున్న ఆస్తిలో భాగంగా మారిపోయి అందవికారంగా తయారవుతుంది. కాని, యిప్పుడే గనుక మీ హృదయంలో ప్రేమ అనేది వుంటే, - మీరు నాటిన మొక్కను మీరు ప్రేమిస్తే, దారితప్పి వచ్చిన జంతువును ప్రేమతో తట్టితే - అటువంటప్పుడు పెద్దవారైన తరువాత మీరు చూచే చిన్న కిటికీని, మీరున్న యిఱుకైన గదిని వదిలి పెట్టి బయటికి వచ్చి సమస్తప్రాణికోటినే ప్రేమించడం మొదలుపెడతారు.

ప్రేమ అనేది ఒక యథార్థమైన తత్త్వము. అది కంటనీరు తెప్పించే భావోద్రేకము కాదు. అది భావుకతయూ కాదు, శృంగారాదిభావమునూ కాదు. మీరు చిన్న వారుగా నున్నప్పుడే యీ ప్రేమ అంటే యేమిటో తెలిసికోవాలి. ఇది చాల ముఖ్యమైన మరియు గంభీరమైన విషయము. బహుశా మీ తల్లిదండ్రులకుగాని, ఉపాధ్యాయులకుగాని ప్రేమ అంటే యేమిటో తెలియక పోవచ్చు. అందువల్లనే యిటువంటి దారుణమైన ప్రపంచాన్ని సృష్టించారు; ఇటువంటి సమాజాన్ని - అంటే తనలో తానే గాకుండ, యితర సమాజాలతోను నిత్యమూ కలహించే సమాజాన్ని - సృష్టించారు. వాండ్ల మతములలో, వేదాంతములలో, వాదములలో ప్రేమ అనేది లేదు; అందువలన అవియన్నీ బూటకాలు. వారొక వైపే చూస్తారు; వారు చూచే సన్నని కిటికీ గుండా కనబడే దృశ్యము చాల మనోహరంగా, విశాలంగా కనబడవచ్చు. కాని, సంపూర్ణమై అతి విశాలమైన జీవితమదికాదు. ఈ ఆత్యంతికమైన ప్రేమభావము లేకుండా సంపూర్ణత్వాన్ని దర్శించలేరు. మీకది ప్రత్యక్షానుభవము కాబోదు. అట్టి ప్రేమ భావము లేనిచో మీకు నిరంతర దైన్యము తప్పదు. జీవితాంతమున మీకు మిగులబోయేది కేవలం బూడిద, వట్టి మాటల ప్రోగు మాత్రమే.

1. ప్రశ్న:- కీర్తిప్రతిష్ఠలు పొందాలని మనమెందుకు కోరుకొంటాము?

కృష్ణమూర్తి:- కీర్తి ప్రతిష్ఠలు పొందాలని మీరెందుకు కోరుకొంటారు? నేను మీకు వివరించి చెప్పవచ్చు. కాని, చివరికి అంతా విని మీరా కోరికను మానివేస్తారా? సమాజంలో మీ చుట్టూ వున్నవారందరు పేరు ప్రఖ్యాతులు కోరుకుంటూ వుంటారు. కాబట్టి, మీరున్ను అట్లే కోరుకొంటారు. మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు, గురువు, యోగి – అందరికిన్ని పేరు ప్రఖ్యాతులు కావాలి. అట్లే మీకున్ను.

దీనిని గురించి మనందరం కలిసి ఆలోచిద్దాం. ఎందువలన ప్రజలు పేరుకోసం ప్రాకులాడుతారు? మొదటి కారణం, దానివలన కొంత లాభముంటుంది. దాని వలన మన మనస్సున కెంతో తృప్తి కలుగుతుంది. కదా? ప్రపంచమంతా మిమ్మెరిగి వున్నట్లయితే, 'మేము చాల ముఖ్యమైన వాండ్లము, గొప్పవాండ్లము' అని అనుకొంటారు. 'మా పేరు శాశ్వతము కాన మేము శాశ్వతము – మాకు చావు లేదు' అనే భావన కలుగుతుంది. కాని, నిజానికి పేరుప్రఖ్యాతులు కావాలని, అందరికి మీరు తెలియాలని, ప్రపంచంలో అందరూ మీ గురించి చెప్పుకోవాలని మీరెందుకు కోరుకుంటున్నారో తెలుసునా? లోలోపల మీరు వట్టి అనామకులు, మీలో ఆంతరిక సంపదా లేదు, ఆత్మ సౌందర్యమూ లేదు, అసలు ఏమీ లేదు, ఖాళీ! అందువల్లనే బయటి ప్రపంచంలో పేరుకోసం ప్రాకులాడుతున్నారు. అట్లుగాక మీలో గనుక ఆత్మసౌందర్య ముండియున్నట్లయితే, బయటి ప్రపంచంలో మీకు పేరున్నా లేకపోయినా ఒకటే.

బాహ్యసంపదను, కీర్తిప్రతిష్ఠలను కల్గియుండడం కంటె ఆంతరిక సంపదను, ఆత్మ సౌందర్యమును కల్గియుండడం మిక్కిలి కష్టసాధ్యమైన పని. దీనికి శ్రద్ధాసక్తులును, అవధానతయు (attention) మరింత అవసరము. మీలో ఏమాత్రమైనా నైపుణ్యముండి, యితరులనెట్లు మీ సొంతానికి ఉపయోగించుకొనవచ్చునో తెలిసివుంటే, యితరుల నెట్లు దోపిడీ చేయవచ్చునో తెలిసివుంటే మీరు ప్రసిద్ధులై పోతారు. కాని యింత సులువుగా ఆత్మసౌందర్యము లభ్యము కాదు. అది కావాలంటే మీ మనస్సు కీర్తి ప్రతిష్ఠలు మొదలగు అముఖ్యములైనవానిని అర్థము చేసికొని వాటిని దూరంగా విడిచిపెట్టవలసి వుంటుంది. ఆత్మసౌందర్యమంటే (లేక ఆత్మసంపద అంటే) ఒంటరిగా స్వతంత్రంగా నిలబడగలగడం. కాని, కీర్తి ప్రతిష్ఠలు పొందగోరినవాడు ఒంటరిగా నిలబడడానికి భయపడతాడు. ఎందుకంటే, మరి అతడు ప్రజల పొగడ్తల మీదను, వారి మంచి అభిప్రాయాలమీదను ఆధారపడి వుండాలి కదా!

2. ప్రశ్న:- మీ చిన్నప్పుడు మీరు వ్రాసిన ఒక పుస్తకంలో, "ఇవి నా మాటలు కావు, ఇవి నా దివ్యగురువు యొక్క మాట"లని వ్రాసినారు. కాని, యిప్పుడు ఎవరికి వా రాలోచించుకోవలసిందేనని పట్టుబట్టుతున్నారు. ఎందువలన? మీ దివ్య గురువు ఎవరు?

కృష్ణమూర్తి:- ఎవరికైనా జీవితంలో ఏదైనా ఒకే అభిప్రాయానికి కట్టుబడి పోకుండా వుండడం చాల కష్టమైన పనులలో నొకటి. కట్టుబడిపోవడాన్నే

స్థిరత్వమంటున్నాము. దౌర్జన్యరాహిత్యము లేదా అహింస అనే ఆదర్శాన్ని మీరు పాటించదలచుకొన్నట్లయితే ఆ యాదర్శాన్ని విడిచిపెట్టకుండా, దానిమీదనే స్థిరంగా వుండిపోవడానికి ప్రయత్నిస్తారు. ఇంతకున్ను ఇప్పుడీ పృచ్ఛకు డడిగేదేమంటే "మాకు మేము ఆలోచించుకోవాలని మీరిప్పుడు చెబుతున్నారు. మీరు చిన్న పిల్లవాడుగా నున్నప్పుడు చెప్పినదానికి ఇది కేవలం విరుద్ధం. మీ రెందుకని అప్పుడొకమాట, ఇప్పుడొకమాట చెబుతున్నారు? మీ కెందుకు స్థిరత్వం లేదు?" అని.

స్థిరబుద్ధితో వుండడమంటే అర్థమేమిటి? ఇది చాల ముఖ్యమైన విషయం. స్థిరబుద్ధితో వుండడమంటే ఒకే విధమైన ఆలోచనా విధానాన్ని, అటునిటు తొలగి పోకుండా, అంటిపెట్టుకొని వుండడం, అంటే పరస్పర విరుద్ధములైన పనులు చేయకుండా వుండడం; ఇవ్వేళ ఒక మాట చెప్పి, రేపు తద్విరుద్ధంగా ఇంకోమాట చెప్పకుండడం. స్థిరమైన మనస్సంటే యేమిటో తెలిసికోడానికై మనమిప్పుడు ప్రయత్నిస్తున్నాం. "నేనొక విధంగా వుండడానికి శపథం చేసికొన్నాను; ఇక నా జీవిత పర్యంతం అట్లే వుంటాను" – ఇట్లా చెప్పే మనస్సు స్థిరమైన మనస్సు అని అంటున్నాం. కాని, నిజానికట్టి మనస్సు వట్టి తెలివి తక్కువ మనస్సు, మొండి మనస్సు. ఎందుకని అంటే, అది యొక నిశ్చయానికి వచ్చి, ఆ నిశ్చయాని కనుకూలంగా జీవిస్తూ వున్నది. ఇది యెట్లాగున్నదంటే, ఒక మనిషి తన చుట్టూర గోడ కట్టుకొని దానిలోపలనే వుంటూ జీవితాన్ని జారవిడుచుకొంటున్నట్లున్నది.

ఇది చాల చిక్కు సమస్య. నేను దీనిగురించి ఎంతో తేలికగా చెప్పవచ్చును. కాని, నిజానికిది అంత తేలిక కాదు. కేవలం ఏకరీతిగా వుండే మనస్సు యాంత్రికమై, తన జీవశక్తిని, వెలుగును, స్వేచ్ఛాగమన సౌందర్యాన్ని పోగొట్టుకొంటుంది. అది ఒకే గాడిలో నడుస్తూ వుంటుంది. అది పూర్వనిశ్చితమార్గాన్నే పట్టుకొని వదలక, దానివెంబడే పోతూ వుంటుంది. అడిగిన ప్రశ్నలో ఇదియొక భాగం.

ఇక రెండవ భాగమేమంటే, "దివ్యగురువనగా నెవరు?" అని. దీనిలో గర్భితమైయున్న యితర విషయాలను మీ రెరుగరు. అయితే, అవి తెలిసినా తెలియకపోయినా ఒకటే. నా చిన్నప్పుడు నేనొక పుస్తకాన్ని వ్రాసినానుట. ఒక దివ్య గురువు దానిని వ్రాయడానికి నాకు తోడ్పడినట్లు అందులో ఉన్నదట! ఆ విషయం యీ పెద్ద మనిషి యెత్తి చూపుతున్నాడు. హిమాలయాలలో మారుమూల దివ్య గురువులు నివసిస్తున్నారని, వారు ప్రపంచాన్ని సరియైన మార్గాన నడుపుతూ సహాయపడుతూ వుంటారని దివ్యజ్ఞాన సమాజమువారు, అటువంటి మరికొందరున్ను నమ్ముతారు. ఆ దివ్యగురువెవరో ఈ పెద్దమనిషి తెలియ గోరుతున్నాడు. జాగ్రత్తగా వినండి, బహుశా మీకు గూడ ఈ సందేహముండవచ్చు.

గురువు లేక మహాత్ముడెవరనేది చాల ముఖ్యమైన విషయమా? జీవితమనేది చాల ముఖ్యమైన విషయమా? ఆ జీవితానికి అర్థమేమిటో వివరించి చెప్పతాననే గురువు గాని, మహాత్ముడుగాని, నాయకుడుగాని, బోధకుడుగాని ముఖ్యులు కాదు. జీవితాన్ని అర్థం చేసుకోవలసింది మీరు; బాధపడేది, దుఃఖంలో వుండేది మీరు; మృత్యువు, జన్మము, ధ్యానము, దుఃఖము – వీటి అర్థమును తెలియగోరేది మీరు. కాని, దీనినెవరునూ ఇతరులు మీకు చెప్పలేరు. ఒకవేళ చెప్పినా, వారు చెప్పిన

వివరణలు సరియైనవనడానికి వీలులేదు. అవన్నీ పూర్తిగా అసత్యములు, తప్పులు కావచ్చును.

అందువలన ప్రతిదానిని శంకించడంలో మేలున్నది. అప్పుడే అసలు మీకొక గురువు అవసరమా అనే విషయాన్ని స్వతహాగా తెలిసికోవడానికి అవకాశముంటుంది. ఇంతకును ప్రధానమైన విషయ మేమంటే మీకు మీరే వెలుగు కావాలి, మీకు మీరే దివ్యగురువులు, మీకు మీరే శిష్యులు. గురు శిష్యులిద్దఱున్ను మీరే. స్వయంగా మీరన్ని విషయాలు గ్రహిస్తూ వున్నంతకాలం గురువు లేడు. అది మానినప్పుడు – అంటే పరిశోధించడం, కనిపెట్టడం, సంపూర్ణ జీవిత విధానాన్ని అర్థం చేసికోవడం మానినప్పుడు – గురువు వస్తాడు. కాని, ఆ గురువుకు విలువలేదు. అటువంటప్పుడు మీరు మృతప్రాయులు, మీ గురువున్ను మృతప్రాయుడే.

### 3. ప్రశ్న:- మనిషికి గర్వమెందుకు?

**కృష్ణమూర్తి:-** మీరు చాల అందంగా వ్రాస్తే, లేక ఏదైనా ఆటలో గెలిస్తే, లేక ఏదైనా పరీక్షలో పాసయితే మీకు మాత్రం గర్వం రాదా? మీరు స్వయంగా ఏదైనా పద్యం వ్రాసిగాని, రంగులతో ఏదైనా బొమ్మ వేసిగాని మీ స్నేహితుని కెన్నడును చూపలేదా? మీ స్నేహితుడు ఆ పద్యాన్నిగాని, బొమ్మనుగాని చూచి చాల బాగున్నదని మెచ్చుకొంటే మీకెంత సంతోషం? ఏదైనా ఒక పని చేసి అది చాల బాగున్నదని ఎవరైనా మెచ్చుకొంటే మీకప్పుడు ఎంతో సంతోషం కలుగుతుంది! అయితే, అంతవరకది మంచిదే, అందులో తప్పేమున్నది? కాని, మళ్ళీ ఇంకోసారి మీరు పద్యాన్ని వ్రాసినప్పుడో లేక రంగు బొమ్మ వేసినప్పుడో, లేక గదిని శుభ్రంగా తుడిచినప్పుడో ఏం జరుగుతుంది? ఎవరైనా మీ వద్దకు వచ్చి మీ రెంత మంచి పిల్లలో అని మెచ్చుకోవాలనిపించదా? అట్లా యెవరూ వచ్చి మిమ్ము మెచ్చుకోకపోతే, మళ్ళీ మీరా పనులు చేస్తారా? చేయరు. అంటే యేమిటన్నమాట? ఇతరులు మిమ్ము పొగడుతూ వుంటే మీకు కలిగే సంతోషం మీకు ముఖ్యమన్న మాట! ఆ సంతోషానికి మీరు లొంగిపోయినారన్నమాట! దానికి దాసులై పోయినారన్నమాట! ఇది అంతా మామూలుగా జరిగే విషయం. తరువాత జరిగే దేమిటి? మీరు పెద్దవారయ్యే కొలది మీరు చేసే ప్రతి పనిని ఇతరులు మెచ్చుకోవాలని తలుస్తారు. "నేనీ పనిని మా గురువుగారికోసం చేస్తాను. నా దేశంకోసం చేస్తాను, మానవ జాతికోసం చేస్తాను, దేవుని కోసం చేస్తాను." అని యనడం మొదలుపెడతారు. కాని నిజంగా మీరు దేనికోసం చేస్తున్నారు? ఇతరుల మెప్పుకోసం చేస్తున్నారు. ఇతరులు మిమ్ము గుర్తించడం కోసం చేస్తున్నారు. అందులో నుండే గర్వం పుట్టుకొస్తుంది. కాబట్టి ఆ విధంగా మీరేమి చేసినా సరే దానికి విలువ లేదు. ఇదంతా మీ కర్థమౌతున్నదాయని నా అనుమానం.

గర్వంలాంటి విషయాన్ని అర్థం చేసికోవాలంటే లోతుగా తుదివరకు ఆలోచింపగల సామర్థ్యముండాలి. అది యెట్లా ఆరంభమవుతుంది, దాని వలన కలిగే చేటు ఏమిటి, యిట్లా దానిగురించి పూర్తిగా ఆలోచించాలి అంటే, మీకావిషయంలో సంపూర్ణమైన

అభిరుచి వుండాలి. అప్పుడే మీ యాలోచన తుదివరకు కొనసాగుతుంది, మధ్యలో ఆగదు. ఆటలో మీ కభిరుచి వున్నట్లయితే, తుదివరకు ఆడతారు. హఠాత్తుగా మధ్యలో ఆపివేసి యింటికి పోరు. మీ మనస్సు ఈ విధంగా ఆలోచించడానికి అలవాటుపడి లేదు. జీవితంలోని ప్రతి విషయాన్ని – జీవించు ప్రక్రియనంతను – పరిశీలించడానికి మీరు చదివే చదువు తోడ్పడాలి. అంతేగాని, యేవో కొన్ని పాఠ్య విషయాలు చదవడంలో మాత్రమే కాదు.

**4. ప్రశ్న:- ఏది అందమైనదో, ఏది కాదో పిల్లలమైన మాకు ముందుగానే చెప్పడం చేత ఇక జీవితమంతా 'ఇది అందమైనది, యిది కాదు' అని చెప్పకొంటూ పోతాం. నిజంగా అందమైనదేదో, కానిదేదో ఎట్లా తెలిసికోవడం?**

కృష్ణమూర్తి:- అర్ధచంద్రాకారంలో కట్టిన ఆ కట్టడము, ఆ 'ఆర్చి' చాల అందంగా వున్నదని మీరన్నారనుకోండి. మరియొకడు అట్లా లేదన్నాడనుకోండి. అప్పుడు మీరేం చేస్తారు? మీరిద్దరు పరస్పర విరుద్ధములైన మీ మీ అభిప్రాయాల మీద దెబ్బలాడుకొంటారా, లేక సౌందర్యమును గాని, అసౌందర్యమును గాని, రెండింటిని సమబుద్ధితో సూక్ష్మంగా పరిశీలించి అవగాహన చేసికొంటారా? ఇందులో ఏది ముఖ్యము? జీవితంలో మలము, మాలిన్యము, కలుషము, కల్మషము, దారిద్ర్యము, అవమానము, అధోగతి, అశ్రుబిందువులు – ఇవన్నీ వున్నాయి. వీటితో బాటు అందము, ఆనందము, నవ్వు, సూర్యరశ్మిలో అందముగా మెరిసే పువ్వు కూడా ఉన్నాయి. అందువలన ప్రతిదానిని సూక్ష్మబుద్ధి నుపయోగించి, సమచిత్తంతో చూడడం ముఖ్యం గాని, "ఇది అందమైనది, ఇది కా"దని ముందుగానే ఒక నిర్ణయానికి వచ్చి, ఆ నిర్ణయానికి కట్టుబడివుండడం కాదు. "నేను అందాన్ని అభివృద్ధి చేస్తాను, అందం కానిదాన్ని త్రోసివేస్తాను, తొలగిం చేస్తాను" అని అంటూ వుంటే ఏమౌతుంది? కేవలం అందాన్ని అభివృద్ధి చేయడమంటే అది నీలోని కొరడుబారిన మనస్తత్వాన్ని తెలియజేస్తుంది. కుడి చేతికి మాత్రమే పుష్టిని బలమును కలిగిస్తూ వుంటే, అప్పుడు ఎడమ చేయి ఏమౌతుంది? అది క్రమంగా క్షయించి పోతుంది గదా! అట్లే యిదిన్నీ. అందువలన మీరు అందమైనదానినే కాదు, అందం కానిదానిని గూడ మెలకువతో గమనిస్తూ వుండాలి. దీనిని తక్కువ చేయరాదు. గాలిలో నాట్యము చేసే ఆకులు, వంతెన క్రిందుగా ప్రవహించే నీళ్ళు, సంధ్యాకాల సౌందర్యము – వీటితో బాటు, వీధినపోవు బిచ్చగానిని కూడ మీరు చూడాలి. తలమీది బరువుతో తడబడుతూ పోయే పేదరాలికి సహాయం చేయడానికి సిద్ధపడాలి, ఆమెకు చేతి నందివ్వాలి. ఇదంతా అవసరమే. ఈ విధంగా ప్రేమార్ద్రమైన మనస్సుతో ప్రతిదానిని గమనింప సాగినప్పుడే మీరేదైనా పని చేయగల్గుతారు. ఎవరికైనా సహాయపడగల్గుతారు. దేనినీ నిరాకరించరు, దేనినీ నిందించరు.

**5. ప్రశ్న:- క్షమించండి. ఇంతకున్ను మీ దివ్యగురు వెవరో చెప్పనే లేదు.**

కృష్ణమూర్తి:- ఇది అంత ముఖ్యమా? ఆ పుస్తకాన్ని తగలబెట్టి పారవేయండి. ఎవరా దివ్య గురువు? – ఇలాంటి అత్యల్ప విషయానికి మీరంత ప్రాధాన్యమిచ్చేటట్లయితే,

యీ చరాచర జగత్తునే అత్యల్ప విషయంగా చేస్తున్నారన్న మాట. దివ్యగురు వెవరో, అన్నీ తెలిసిన పండితుడెవరో, బొమ్మకు రంగు వేసిన చిత్రకారుడెవరో మనం తెలిసికొనగోరుతాం. కాని, ఆ బొమ్మను వేసిన చిత్రకారునితో సంబంధం లేకుండ, అందులో చూపబడిన విషయాన్ని స్వయంగా తెలిసికోడానికి ప్రయత్నించం. కవి యెవరో తెలిసికొని, ఆ పిదపనే యీ కవిత్వం బాగున్నదని అంటాం! ఇదంతా కేవలం డంబం, లేనిపోని బడాయీలు చెప్పుకోవడం, ఇతరుల అభిప్రాయాన్ని కేవలం చిలుక పలికినట్లు పలకడం మాత్రమే అవుతుంది. అసలు వాస్తవమేదో లోలోన గ్రహింపగల శక్తిని ఇది నశింప జేస్తుంది. బొమ్మ చాల అందంగా వున్నదనే విషయం మీరు స్వయంగా చూడగల్గితే అందుకు మీరు మీ ఆనందాన్ని వెలిబుచ్చితే, ఆ బొమ్మ నెవరు గీసినారో తెలిసికోవడం అంత ముఖ్యమా? అందులో చిత్రింపబడిన దేమిటో, అది యెంతవరకు సత్యమో – అది మాత్రమే మీరు తెలిసికొనగోరితే దానిమీదనే మీ శ్రద్ధ అంతా వుంటే, అప్పుడు, బొమ్మ తన ప్రాధాన్యమును గురించి స్వయంగానే మీకు తెలుపుకొంటుంది, తన అంతరార్థమును తెలియజేసికొంటుంది.

*5 జనవరి, 1955*

★ ★ ★

# 7. పేరాశ

ప్రేమ అనేది వుండడం ఎంత అవసరమో మనం చర్చిస్తూ వచ్చినాం. దానిని ఏవిధంగాను సంపాదించలేమని, డబ్బు పెట్టి కొనలేమని గూడ తెలిసికొన్నాం. అయితే ఆ ప్రేమే గనక లేకపోతే, దోపిడీ విధానము మితిమీరిన కట్టుబాట్లున్ను లేని చక్కని సంఘవ్యవస్థకై మనం వేసే ప్రణాళికలన్నీ వ్యర్థములైపోతాయి. ఈ విషయాన్ని మనం మన చిన్నతనంలోనే తెలిసికోవడం చాల అవసరమని నే ననుకొంటున్నాను.

ప్రపంచంలో ఏ మూరుమూలలకు పోయినా ఎడతెగని సంఘర్షణతో నిండివున్న సంఘాన్నే చూస్తాము– ఒకవైపు అధికారము, ఐశ్వర్యము కలిగిన సంపన్నులున్ను, మరియొకవైపు కార్మికులు, కర్షకులున్ను. ప్రతి యొక్కడు మరియొకనిని చూచి అసూయతో పోటీ పడుతూ వుంటాడు. ప్రతివానికి పెద్ద పదవి కావాలి, పెద్ద జీతం కావాలి, ఎక్కువ అధికారం ఎక్కువ గౌరవం కావాలి. ఇదీ ప్రపంచస్థితి. కాబట్టి లోపలా, బయటా కూడ నిరంతర సమరము కొనసాగుతూనే వుంటుంది.

ఇటువంటి సంఘవ్యవస్థలో మనిద్దరం కలిసి సంపూర్ణ పరివర్తనాన్ని తేగోరినట్లయితే మొట్టమొదట మనం అర్థం చేసికోవలసింది యీ అధికారం కోసం ప్రాకులాడే లక్షణాన్ని. ఇది అందరికీ పుట్టుకతో వచ్చే గుణం. ఏదో రూపంలో మనలో చాలమందికి అధికారం కావాలి. ఐశ్వర్యమూ అధికారమూ వున్నట్లయితే మనం ఎక్కడికంటే అక్కడికి పోవచ్చు. లేదా అత్యుత్తమమైన సంఘాన్ని నిర్మించడానికై కలలు గనవచ్చు. అధికారం ద్వారా 'మంచి'ని సాధింపవచ్చునని తలుస్తాం. కాని అధికార దాహమనేది–ఆ యధికారం మనకోసమైనా సరే, మన దేశం కోసమైనా సరే, మన ఆదర్శం కోసమైనా సరే – అది చెడ్డది, వినాశహేతువు. ఎందువల్లనంటే, దాని వలన తప్పని సరిగా విరోధ మేర్పడుతుంది. ప్రత్యర్థులు బయలు దేరుతారు. దానివలన నిత్య సంఘర్షణ తప్పదు.

అందువలన లోపలను బయటను సంఘర్షణ లేనట్టి ప్రపంచాన్ని, మీకు మీ పొరుగువానితో గాని లేదా యితర జాతులు, వర్గములతో గాని సంఘర్షణ లేనట్టి ప్రపంచాన్ని సృష్టించడం అవసరం కాదా? ఆ యవసరాన్ని గుర్తించడంలో మీరు మీ చిన్నప్పుడు చదివిన చదువు, పెద్దవారగు కొలది మీకు సహాయపడుతూ వుండవలెను కాదా? మనిషి ఆశకు దాసుడు కాకపోతే, అంటే – పదవీ వ్యామోహము, అధికార వాంఛ రెండున్ను అతనిలో నుండి పూర్తిగా తొలగిపోతే అప్పుడే సమాజములో సంఘర్షణ వుండదు.

ఆ విధంగా అంతరంగికంగాను, బహిరంగంగాను ఘర్షణ లేనట్టి సమాజాన్ని

నిర్మించడం సాధ్యమా? మీకును నాకును మధ్యగల అన్యోన్య సంబంధమే సంఘము. మన ఆ సంబంధము మన మన కీర్తి కాంక్షలమీద ఆధారపడి వుంటే, మనిద్దరం ఒకరికంటె మించి మరియొకరము పైకి రావాలని కోరుకొంటూ వుంటే, మన మధ్య ఘర్షణ తప్పదనుట స్పష్టం కాదా? అందువలన మన మీఘర్షణకు మూలమైన దేదో దానిని తొలగించగలమా? మనలో మనం ఒకరితో నొకరము పోటీ పడకుండా స్పర్థ వహించకుండా వుండడం, ఒకరితో మరియొకరము పోల్చుకోకుండా వుండడం, ఈ పదవి కావాలి ఆ పదవి కావాలి అని కోరుకోకుండా వుండడం నేర్చుకోగలమా? అనగా, ఒక్క ముక్కలో చెప్పాలంటే – ఆశాపరులము కాకుండా వుండగలమా? ఆశను వదలిపెట్టగలమా?

మీరు బడి వదలి పెట్టి, బయటికి పోయి బయటి ప్రపంచాన్ని చూస్తే, వార్తా పత్రికలను చదివితే, ప్రజలతో మాట్లాడితే దాదాపు అందరూ ప్రపంచంలో మార్పు తేవాలని కోరడం గుర్తిస్తారు. కాని, యీ మనుషులే ఏదో ఒకదాని కోసం – తమ అభిప్రాయాల కోసమో, నమ్మకాల కోసమో, ఆస్తిపాస్తుల కోసమో, లేదా తమ జాతి కుల మత భేదాలకోసమో, తమలో తాము నిత్యమూ పోరాడుకొంటూ వుండడం గూడ మీరు గమనిస్తారు. మీ తల్లిదండ్రులు, ఇరుగుపొరుగువారు, మంత్రులు, రాజకీయోద్యోగులు అందరూ పేరాశలు గలవారే; కాదా? అంతకంతకు పెద్ద పెద్ద పదవులు పొందాలని తంటాలు పడుతూ వుండరా? అందుకోసం నిత్యము ఎవరితోనో ఒకరితో ఘర్షణ పడుతూ వుండరా? వాస్తవానికి ఇతరులతో పోటీ పెట్టుకొనే యీ స్వభావం మనలోనుండి పోతేనేగాని శాంతి పూర్ణమైన సమాజ మేర్పడదు. అట్టి సమాజంలో మాత్రమే ప్రతి యొక్కడు సుఖసంతోషాలతో సృజనాత్మక శక్తికలిగి జీవించగలడు.

మరి యిది యెట్లా సాధించాలి? నియమ నిబంధనలు చేసిగాని, ప్రభుత్వ శాసనముల ద్వారాగాని, పేరాశలు పెట్టుకోకుండుటకై మనస్సునకు తగిన శిక్షణ నివ్వడం చేతగాని మనలోని ఆశాపాశమును ఛేదింప గలమా? ఆ విధంగా చేస్తే ఆశ మనలను వదలిపెట్టిపోతుందా? ఆశాపరులు కాకుండుటకై మీకు పైపైన తగిన శిక్షణ నివ్వించవచ్చు. సంఘములోని ఇతరులతో మీరు పోటీపడడం మానివేయవచ్చు. కాని, అంతరంగికంగా ఆశ మిమ్ము వదలిపెట్టి పోతుందా? పోదు. మానవ మాత్రుని కెవరికైనా యింత దుఃఖాన్ని తెచ్చిపెట్టునట్టి ఆశను పూర్తిగా నిర్మూలము చేయగలమా? బహుశా మీరింతకుముందు దీనిగురించి ఆలోచించి వుండరు. ఎవరున్ను మీతో ఈ విధంగా మాట్లాడి వుండరు. ఇప్పుడొకరు మీతో మాట్లాడుతున్నారు కాబట్టి వినాశరకమైన యీ ఆశాప్రేరణకు లొంగకుండా, ఇతరులతో పోటీ పెట్టుకొనే స్వభావం లేకుండా సుసంపన్నమై సుఖవంతమై సృజనాత్మకత గల్గిన నిండైన జీవితాన్ని ప్రపంచంలో జీవించడం సాధ్యమౌనా కాదా యన్నది తెలిసికొనగోరరా? మీ వలన మరియొకరి జీవితము నాశనము కాకుండా, మీ నీలి నీడలు మరి యొకరి దారి కడ్డము రాకుండా జీవించడ మెట్లాగో తెలిసికొనగోరరా?

ఇదంతా అందమైన పగటికలలు కనడమని, వాస్తవిక ప్రపంచానికి సంబంధించిన

విషయాలు కావని మనమనుకొంటాం. నేనట్టి కాల్పనిక జగత్తు గురించి మాట్లాడడం లేదు. అది అర్థం లేనిమాట. మనం మాయ మర్మాలు తెలియని మామూలు మనుషులం. అధికార దాహము, పదవీ వ్యామోహము మొదలైన రూపాలతో అభివ్యక్తమగు ఆశకు లొంగకుండ సృజనాత్మక శక్తి గలిగి యీ ప్రపంచంలో జీవింపగలమా లేదా? దీనికి సరియైన జవాబు మీరు చేసే పనిమీద మీకు ప్రేమ వున్నప్పుడే తెలుస్తుంది. కేవలం జీవనాధారం కోసంగాని లేక మీ తల్లిదండ్రులో సంఘమో చెప్పినారనిగాని మీరు ఇంజనీరింగు వృత్తిని చేపట్టినట్లయితే అది యొక విధమైన నిర్బంధమే. అది యే రూపంలో వున్నను మనస్సులో వైరుధ్యమును, ఘర్షణను కలిగిస్తుంది. అట్లుగాక మీరు ఇంజనీర్లో వైజ్ఞానికులో కావాలని మనస్ఫూర్తిగా కోరుకొన్నట్లయితే, లేదా గుర్తింపు పొందాలనే కోరికతో గాకుండా, కేవలం ప్రేమతో మీరొక మొక్కను నాటితే, ఒక బొమ్మకు రంగు వేస్తే లేదా ఒక పద్యాన్ని వ్రాస్తే అందులో పోటీ పడడమంటూ లేదు. ఇదే దీనికి నిజమైన కీలకమని అనుకొంటాను–మన మేపని చేసినా దానిని ప్రేమతో చేయడం.

అయితే, యే పని మీద మీకు నిజంగా ప్రేమ కలుగుతుందో చిన్నప్పుడే తెలిసికోవడం మామూలుగా చాల కష్టం. ఎందుకంటే, చిన్నప్పుడు మీరు ఎన్నో పనులు చేయాలని కోరుకొంటూ వుంటారు. ఇంజనీర్లు కావాలనుకొంటారు. లేకపోతే రైలింజను నడపాలనుకొంటారు. లేదా నీలాకాశము గుండా జుమ్మని దూసికొనిపోయే విమానాన్ని నడిపే చోదకులు కావాలనుకొంటారు. అదీగాకపోతే పేరు మోసిన వక్తలో రాజకీయ వేత్తలో కావాలనుకొంటారు. లేదా చిత్రకారులో రసాయనశాస్త్రవేత్తలో కవులో అదీకాకపోతే వడ్రంగులో కావాలనుకొంటారు. మెదడు నుపయోగించి పనిచేయడమో లేదా చేతుల నుపయోగించి పనిచేయడమో మీరు కోరుకోవచ్చు. ఇందులో ఏదైనా సరే మీరు ప్రేమతో చేయగలరా? లేక వీటియందు మీకు గలిగిన అభిరుచికి కారణము సంఘము యొక్క ఒత్తిడులా? ఏవిధంగా తెలిసికోగలరు? అది తెలిసికోవడంలో సహాయపడడమే చదువు యొక్క నిజమైన ఉద్దేశము కాదా? అప్పుడు మాత్రమే మీరు పెద్దవారైన తరువాత మీ మనస్సును, హృదయమును, శరీరమును పూర్తిగా వినియోగించి మీరు ప్రేమించిన పనిని చేయడం మొదలుపెడతారు.

ఏ పనిని చేయడం మీద మీకు ప్రేమ కలుగుతుందో అది తెలిసికోవడానికి చాల తెలివి వుండాలి. జీవనాధారం (బ్రతుకు తెరువు) దొరకడం కష్టమౌతుందేమో అన్న భయమున్నా లేక యీ క్రుళ్ళిపోయిన సంఘంలో ఇమడమేమో అనే భయమున్నా మీరు దానిని తెలిసికోలేరు. అట్లుగాక అసలు మీలో భయమంటూ లేకపోతే, మీ తల్లిదండ్రుల చేతగాని ఉపాధ్యాయుల చేతగాని సంఘము యొక్క పైపై ఒత్తిడులు ద్వారాగాని సంప్రదాయపు గాడిలోనికి త్రోయబడడాన్ని మీరు నిరాకరింపగలిగితే అప్పుడు మీరు నిజంగా దేన్ని ప్రేమతో చేయగలుగుతారో బహుశా తెలిసికోగలరు. కాబట్టి, అది తెలిసికోవాలంటే మా బ్రతుకెట్లనా? అనే భయం బొత్తిగా వుండరాదు.

కాని, మనలో చాల మందికి మా బ్రతుకెట్లనా అనే భయముంటుంది. "మా తల్లిదండ్రులు చెప్పినట్లు మేము నడుచుకోకపోతే అప్పుడు మా గతి యేమవుతుంది?

ఈ సంఘంలో మేము ఇమడలేకపోతే మేమేమై పోతాము? ఎక్కడికి పోతాము?"
అని అంటాము. అట్లా భయపడి వారు మనకు చెప్పిన పనులెల్లా చేస్తాము.
అందులో ప్రేమ లేదు. పరస్పర వైరుధ్యమున్నది. అనుకొనేదొకటి, చేసేదింకొకటి.
అంతరంగములోని యీ పరస్పర వైరుధ్యమే, ఒకదానికొకటి పొందిక లేకపోవడమే,
వినాశకరమైన పేరాశలకు మూలకారణము.

అందువలన మీరు నిజంగా దేనిని ప్రేమతో చేయగలుగుతారో తెలిసికోవడంలో మీకు సహాయపడడమే విద్య యొక్క ప్రధాన కర్తవ్యము. అట్లా మీరు ప్రేమతో చేయగల పనియందు మాత్రమే మీ మనోహృదయముల నర్పించి పని చేయగలరు. అప్పుడే మానవునికి గణ్యత లభిస్తుంది. దానితో అల్పబుద్ధి మరియు క్షుద్రమగు బూర్జువా మనస్తత్వము తుడిచిపెట్టుకొని పోతాయి. అందువల్లనే సరియైన ఉపాధ్యాయులు, సరియైన వాతావరణము ఎంతో అవసరము. అప్పుడు మీతో బాటు ప్రేమ కూడ ఎదుగుతుంది. ఆ ప్రేమ మీరు చేసే ప్రతి పనిలోను వ్యక్తమవుతుంటుంది. అది లేకుండా మీరు వ్రాసే పరీక్షలు మీరు సంపాదించుకొన్న జ్ఞానము మీ శక్తిసామర్థ్యాలు మీ పదవి మీ ఆస్తి అన్నీ బూడిదతో సాటి; అర్థ రహితములు. ఇట్టి ప్రేమలేకుండ మీరే పని చేసినా దానివలన ఇంకా యుద్ధము లెక్కువౌతాయి; ఇంకా విరోధమెక్కువౌతుంది; ఇంకా మోసము, నాశము అధికమౌతాయి.

ఇదంతా మీ కిప్పుడు పట్టని విషయము. బయటికి చూడడానికి మీరింకా పసిపిల్లలు. కాని, కనీసం మీ ఉపాధ్యాయులకైనా ఇదంతా కొంత అర్థవంతంగా కనిపిస్తుందని ఆశిస్తాను. మీకు గూడ ఎక్కడో లోలోపల అంతస్సులో నాటుకొంటుందని తలుస్తాను.

## 1. ప్రశ్న:- మీరెందుకు సిగ్గుపడతారు?

**కృష్ణమూర్తి:-** ఒక అనామకుడుగా ఎట్టి పేరు ప్రఖ్యాతులు లేకుండా, గొప్ప పండితుడుగానో బ్రహ్మాండమైన సంస్కర్తగానో లేదా పెద్ద విప్లవవీరుడుగానో కాకుండా కేవలం ఊరుపేరు లేని అనామకుడుగా జీవించడం అసాధారణమైన విషయము. ఒకరావిధంగా ఉండాలని మనస్ఫూర్తిగా కోరుకొంటూ వుండగా అనుకోకుండా అతని చుట్టూ పెక్కుమంది కుతూహలంతో మూగితే, అతని హృదయంలో ఒకవిధమైన సంకోచము సిగ్గు కలుగుతుంది. అంతే.

## 2. ప్రశ్న:- మన దైనిక జీవితంలో సత్యము నెట్లు తెలిసికొనగలము?

**కృష్ణమూర్తి:-** సత్యము వేరు, మీ దైనిక జీవితము వేరని తలచి, మీ దైనిక జీవితంలో సత్యమని దేనిని మీరు తలుస్తున్నారో దానిని అనుభవానికి తెచ్చుకొందామని అనుకొంటున్నారు. కాని, దైనిక జీవితానికి భిన్నంగా సత్యమంటూ వేరే వున్నదా? పెద్దైన తరువాత మీ జీవనాధారాన్ని మీరు సంపాదించుకోవలసి వస్తుంది గదా! ఇంతకు, మీరు పరీక్షలు పాసయ్యేది కూడ అందుకోసమే గదా!

కాని చాలా మందికి తాము డబ్బు సంపాదించగలిగినంత కాలం అందుకోసం ఏ కార్యక్షేత్రంలో ఎక్కడ పని చేస్తున్నా చింత లేదు. ఏదో యొక ఉద్యోగం దొరికితే చాలు- అది సైనికుడుగా గాని, రక్షకభటుడుగాగాని, న్యాయవాదిగా గాని లేదా వక్రబుద్ధిగల ఏ వ్యాపారిగానైనా సరే - ఏదైనా వారి కిష్టమే.

మరి బ్రతుకు తెరువు సంపాదించుకోవడానికి ఏది సరియైన మార్గమో అందులోని సత్యమేమిటో తెలిసికోవడం చాల ముఖ్యం, అవునా కాదా? ఎందుకంటే, సత్యము మీ జీవితంలోనే వున్నది, బయటకాదు. మీరు మాట్లాడే తీరు, చెప్పే విషయం, చిరునవ్వు నవ్వేతీరు, మోసం చేసే బుద్ధి మీలో వుందా లేదా, మీ స్వార్థం కోసం ఇచ్చకాలాడి మనుషులను ఉబ్బిస్తుంటారా లేదా-ఇదంతా మీ నిత్య జీవితంలోని సత్యం. కాబట్టి మీరు సైనికులో రక్షకభటులో న్యాయవాదులో చులుకైన బుద్ధిగల వ్యాపారులో అయ్యేముందు ఆయావృత్తులలోని సత్యమును మీరు పరీక్షించి తెలిసికోవద్దా? నిజానికి మీరు చేసే పనిలోని సత్యమేమిటో చూచి తెలిసికొని దాని ననుసరించి మీరు నడవకపోతే మీ జీవితము అధ్వాన్నమై పోతుంది.

ఇక మీరు సైనిక వృత్తిలో చేరడం గురించి ఆలోచిద్దాం. ఇతర వృత్తులన్నిటికన్నా మరింత క్లిష్టమైనవి. సైనిక వృత్తిని గురించి చేయబడే ప్రచారాన్ని, ఇతరు లెవరెవరో చెప్పే విషయాలను ప్రక్కన పెట్టి ఆ వృత్తికి సంబంధించిన అసలు సత్యమేమిటని కనుక్కొందాం. ఎవడైనా సైనిక వృత్తిని చేపట్టినాడంటే అర్థమేమిటి? అతడు తన దేశరక్షణ కోసం పోరాడవలసి వుంటుంది. అతడు తన మనస్సును ఆలోచించడానికి కాకుండా, అనుసరించడానికి అలవాటు పరచుకోవలసి వుంటుంది. చంపడానికి గాని, చావడానికి గాని సైనికుడు సిద్ధమై యుండాలి. దేనికోసం? కొందరు మనుష్యులు - వారెవరైనాగాని, అల్పులో అధికులో - మంచిదని చెప్పిన ఒక ఆదర్శంకోసం, ఒక లక్ష్యం కోసం. కాబట్టి, స్వయంగా బలి అవడం కోసమో లేదా పరులను బలి చేయడం కోసమో మీరు సైనికులౌతారు. ఇది మంచి వృత్తే నంటారా? ఇతరుల నడుగవద్దు. అందలి సత్యమును మీయంతటు మీరే కనుక్కోండి. ఇక మీదట ఎప్పుడో ఏదో అద్భుతమైన రామ రాజ్యం వస్తుందని చెప్పి దానికోసమై యిప్పుడు చంపమని మీకు చెబుతారు - అట్లా చెప్పే మనిషికి భవిష్యత్తులో జరగబోయేదంతా మహా తెలిసివున్నట్లు! అసలు చంపడం మంచి వృత్తి యని మీరనుకొంటారా? అది తన దేశం కోసమైనా సరే, మతంకోసమైనా సరే - అసలు చంపడమనేది, ఎప్పుడైనా సరే, ఎక్కడైనా సరే, మంచిదేనా?

కాబట్టి, అతి ముఖ్యమైన మీ బ్రతుకుబాటలోని సత్యమును కనుగొనవలెనంటే యీ పై విషయాలనన్నిటినీ క్షుణ్ణముగా విచారించవలసి వుంటుంది. అందుకోసమై మీ మనోహృదయములను అర్పించవలసి వుంటుంది. స్వతంత్రంగా, స్పష్టంగా, ఎటువైపునకును మొగ్గుచూపకుండా ఆలోచించవలసి వుంటుంది. జీవితానికి దూరంగా సత్య మెక్కడనో బయటలేదు; మీ నిత్య జీవితంలోని ప్రతి కదలికలోను అది వున్నది.

3. ప్రశ్న:- ప్రతిమలు, గురువులు, మహాత్ములు, ఋషులు మనకు సరియైన ధ్యానమార్గమును చూపరా?

కృష్ణమూర్తి:- సరియైన ధ్యానమంటే యేమిటో మీకు తెలుసునా? ఇందలి వాస్తవికార్థాన్ని మీయంతటమీరు తెలిసికొనగోరరా? సరియైన ధ్యానమంటే యేమిటో ఇతరులు చెప్పిన దాన్నే మీరు గ్రహించేటట్లయితే అసలు దాని వాస్తవికార్థాన్ని మీయంతట మీరు స్వయంగా కనుగొనడం ఎన్నటికైనా సంభవిస్తుందా?

ఇది యెంతో మహత్తరమైన ప్రశ్న. అద్భుతమగు ఈ ఆలోచనా ప్రక్రియ యొక్క లోతు పాతులను పూర్తిగా తెలిసికొంటేనే తప్ప, ధ్యాన మననేమో కనుగొన లేము. "ఈ విధంగా ధ్యానము చేయం"డని ఎవరైనా చెప్పినదానిని మీరు ప్రమాణంగా అంగీకరిస్తే, దానికి మీరు దాసులైనారన్న మాట. ఆ పద్ధతిని లేదా ఆ భావనను గ్రుడ్డిగా అనుసరిస్తున్నారన్నమాట. ఏదో ఫలితాన్ని పొందగలమనే ఆశ చేతనే ఇతరులు చెప్పిన దానిని ప్రమాణంగా స్వీకరిస్తారు, అందువలన అట్టిది ధ్యానము కాదు.

4. ప్రశ్న:- విద్యార్థి యొక్క కర్తవ్యము లేమిటి?

కృష్ణమూర్తి:- కర్తవ్యమనే మాటకు అర్థమేమిటి? దేనియెడ కర్తవ్యము? రాజకీయ నాయకుని దృష్టి ననుసరించి దేశము నెడల కర్తవ్యమా? తల్లిదండ్రుల కోర్కె ప్రకారం వారి యెడ గల కర్తవ్యమా? మేము చెప్పినట్లే చేయడం మీ విధి, మీ కర్తవ్యమని వారంటారు. ఇక వారు చెప్పేది వారి సంస్కారము, వారి సంప్రదాయముల ననుసరించి వుంటుంది.

ఇక విద్యార్థియనగా నెవరు? పరీక్ష పాసవడంకోసం బడికిపోయి యేవో కొన్ని పుస్తకాలు చదివే వాడా? లేక జీవిత పర్యంతం ఎల్లప్పుడూ నేర్చుకొంటూ వుండేవాడా? అంటే నేర్చుకోడానికి – చదువుకు – ముగింపంటూ లేనివాడా విద్యార్థి? ఏదో యొక పాఠ్య విషయం తీసికొని చదివి, పరీక్ష పాసై తరువాత చదువు మానివేసేవాడు వాస్తవానికి విద్యార్థి కాడు. నిజమైన విద్యార్థి యెవరంటే ఏదో యిరవై యిరవయ్యేదేండ్లవయసు వరకో కాకుండ, జీవిత పర్యంతం అధ్యయనం చేస్తూ నేర్చుకొంటూ విచారణ సల్పుతూ పరిశోధిస్తూ వుండేవాడే.

విద్యార్థిగా నుండడమంటే ఎల్లప్పుడును నేర్చుకొంటూ వుండడమే. మీరు నేర్చుకొంటూ వున్నంత కాలం వేరే గురువుంటాడా? ఉండడు. మీరు విద్యార్థిగా నున్న క్షణము నుండి మీకు బోధించడానికి ప్రత్యేకంగా ఒకడంటూ వుండడు. ఏలయన, మీరే స్వయంగా ప్రతిదాని నుండి నేర్చుకొంటూ వుంటారు. గాలిచే పైకెగుర గొట్టబడే ఆకు, ఏటి గట్టున తపతపకొట్టుకొనే నీళ్ళు, గాలిలో పైన ఎత్తుగా ఎగురుతూ వున్న పక్షి, తలమీద పెద్ద బరువుతో మెల్లగా నడుస్తూ వున్న బీదవాడు, జీవితం గురించి అన్నీ తమకే తెలుసుననుకొనే జనులు – వీరందరినుండి మీరు నేర్చుకొంటూ వుంటారు. అందువలన మీకొక గురువంటూ వుండడు. మీరెవరికినీ శిష్యులూ కారు.

కాబట్టి, విద్యార్థియొక్క కర్తవ్యము కేవలం నేర్చుకోవడం. ఒకప్పుడు స్పెయిను

దేశంలో గోయా అను పేరుగల ప్రసిద్ధ చిత్రకారుడొక డుండేవాడు. అతడానాటి చాల గొప్ప చిత్రకారులలో నొకడు. అతడు చాల ముసలి వాడైనప్పుడు తన వర్ణచిత్రాలలో నొక దానిక్రింద "నేనింకా నేర్చుకొంటూ వున్నాను" అని వ్రాసికొన్నాడు. మీరు పుస్తకాలనుండి చదివి నేర్చుకోవచ్చు. కాని, అది అంత ఉపయోగకరం కాదు. రచయిత చెప్పదలచిన దేదో అది మాత్రమే మీరు పుస్తకాలనుండి నేర్చుకోగలరు. కాని, ఆత్మజ్ఞానము ద్వారా నేర్చుకొనే దానికి అంతము లేదు. ఆత్మజ్ఞానము ద్వారా నేర్చుకోవడమంటే శ్రవణ మెట్లు చేయవలెనో, పరిశీలన మెట్లు చేయవలెనో తెలిసికోవడం. అప్పుడు ప్రతిదాని నుండి మీరు విషయాలను గ్రహిస్తూ వుంటారు. సంగీతము నుండి, లోకులు చెప్పేదానినుండి, వారు దానిని చెప్పకొనే తీరునుండి, కోపము నుండి, లోభమునుండి, కీర్తి కాంక్షనుండి, ప్రతిదాని నుండి మీరు నేర్చుకొంటూ వుంటారు.

ఈ భూమి మనది; ఇది సామ్యవాదులదీ కాదు, సమాజవాదులదీ కాదు, పెట్టుబడిదారులదీ కాదు. ఇది మీదీ, నాదిన్నీ. ఎట్టి ఘర్షణ లేకుండా సుఖ సంతోషాలతో జీవించడం కోసమే యిది వున్నది. కాని, అట్టి జీవన సంపద, అట్టి సుఖము, "ఈ భూమి మనది" అనే భావన – యివి బలవంతం చేస్తే వచ్చేవికావు. చట్టం ద్వారా వచ్చేవి కావు. అవి మన అంతస్సులో నుండియే పుట్టుకొని రావలెను. ఎందుకంటే, మన మీ భూమిని, అందులోని వాటినన్నిటినీ ప్రేమిస్తున్నాము కాబట్టి. అట్టి స్థితిలోనే మనము నేర్చుకొంటాము.

5. ప్రశ్న:- గౌరవమునకు ప్రేమకు గల భేదమేమి?

**కృష్ణమూర్తి:-** ఏ నిఘంటువులో నైనా చూస్తే ఆ రెండు మాటలకు గల అర్థము తెలుస్తుంది. అంతమాత్రమేనా మీరు తెలిసికొనగోరేది? ఆ రెండు మాటలకును గల పైపై అర్థమునా మీరు తెలిసికొనగోరేది లేక వాటి అంతరార్థమునా?

ఎవరైనా ఒక గొప్ప మనిషి, మంత్రిగాని గవర్నరుగాని, వచ్చినప్పుడు అందరున్ను అతన్ని చుట్టుముట్టి అతనికెట్లు వంగి వంగి నమస్కారాలు చేస్తారో చూశారా? దానినే మీరు గౌరవం చూపడమంటారు. కాని, ఆ గౌరవమంతా వట్టి నటన. దానివెనుక భయంగాని ఆశగాని వుంటుంది. అతని నుండి యేదో లాభం పొందాలనే కోరికతో అతని మెడచుట్టు ఒక దండ వేస్తారు. అది నిజమైన గౌరవం కాదు. దేనినైనా కొనడం కోసం ఉపయోగించే నాణెం లాంటిదది. మీ పనిమనిషి మీదగాని పల్లెటూరి వాని మీదగాని మీకు గౌరవముందా? ఎవరినుండైతే యేదైనా లాభం వుంటుందని ఆశిస్తామో వారికి గౌరవం చూపుతాం. కాని, నిజానికది గౌరవం కాదు. అది మన భయాన్నే సూచిస్తుంది. ఆ గౌరవాని కర్థమే లేదు. నిజంగా మీ హృదయంలో ప్రేమ అనేది వుంటే అప్పుడు మీకు గవర్నరు, ఉపాధ్యాయుడు, సేవకుడు, గ్రామీణుడు, అందరూ సమానమే. అప్పుడు మీరందరినీ గౌరవిస్తారు. అందరియందును అభిమానం చూపుతారు. కారణమేమంటే, ప్రేమ ప్రతిఫలాన్ని కోరదు గదా!

*6 జనవరి, 1955*

# 8. క్రమబద్ధమైన ఆలోచన

జీవితంలో ఎన్నో విషయాలుంటాయి. అందులో ఒకటి బద్ధకించడం, అంటే ప్రాలుమాలిక. మనలో చాలమంది మామూలుగా ప్రతివిషయంలోను బద్ధకిస్తారు. దుస్తులు వేసికోవడంలో, నడిచే నడతలో, చేసే ఆలోచనలో, పనులు చేసే తీరులో – అన్నిటిలోను ప్రాలుమాలిక, అశ్రద్ధ కనిపిస్తాయి. ఏ సమయానికి చేయవలసిన పనిని ఆ సమయానికి చేయక యితరులకు ఇబ్బంది కలిగిస్తారు. మనం గుడ్డలు ధరించడంలో, ఆలోచించడంలో, మాట్లాడడంలో, దారిన నడవడంలో, మనకంటె దురదృష్టవంతులను మనం చూచుకొనే తీరులో – ఇట్లా ప్రతిదానిలోను ఒక క్రమమును, ఒక కట్టుబాటును తెచ్చి పెట్టేది యేదైనా వున్నదా? ఈ కట్టుబాటు యెట్టి బలవంతము లేకుండా, ప్రయత్నము చేయకుండా, కావాలని ముందుగా ఆలోచించి తెచ్చి పెట్టుకొన్నది కాకుండా దానంతట అది రావలసినట్టిది. ఈ వింతైన కట్టుబాటు యెట్లా వస్తుంది? దీని గురించి యెప్పుడైనా ఆలోచించారా? కట్టుబాటు అంటే నా యుద్దేశ మేమిటో తెలుసునా? ఎటువంటి ఒత్తిడి లేకుండా ప్రశాంతంగా కూర్చోవడం, గబగబా కాకుండా సొంపుగా తినవలసిన తీరులో తినడం, తీరికగా వుంటూనే ఏది యెప్పుడు ఎట్లా చేయవలెనో అట్లా – పద్ధతి ప్రకారం – చేస్తూ వుండడం, ఆలోచనలలో స్పష్టంగా వుంటూనే, ఇతరులతో స్వేచ్ఛగా మాట్లాడడం, మాట్లాడించడం – ఇదీ కట్టుబాటు లేదా వ్యవస్థ లేదా క్రమబద్ధత అంటే. జీవితంలో ఈ కట్టుబాటును తెచ్చేది యేది? ఇది నిజంగా చాల ముఖ్యమైన విషయం. ఇటువంటి కట్టుబాటు దేనిమూలంగా వస్తుందో దానిని తెలిసికోవడంలో మీరు చదివే చదువు ఉపయోగపడితే అది యెంతో సార్థకమైనదని నేననుకొంటాను.

నిజానికి సౌశీల్యము వల్లనే కట్టుబాటు వస్తుంది – చిన్న చిన్న విషయాలలోనే కాదు, అన్ని విషయాలలోను సౌశీల్యమనేది లేకపోతే జీవితము అస్తవ్యస్తమై పోతుంది; ఏమి, నిజం కాదా? కేవలం సౌశీల్యము కలిగివుండడంలో లేదు దాని సార్థకత; కాని సౌశీల్యము కలవాని మనస్సు క్రమపద్ధతిలో పనిచేయ సాగుతుంది. దానితో జీవితమంతా క్రమబద్ధమౌతుంది. అదియే సౌశీల్యము వలన కలిగే ప్రధాన ప్రయోజనము.

కాని, సౌశీల్యవంతుడగుటకై మనిషి ప్రయత్నించసాగితే, దయాదాక్షిణ్యములు, శక్తిసామర్థ్యములు కలిగి వుండాలని, ఆలోచించి పనులు చేయాలని, పరుల కష్టములందు సానుభూతి చూపాలని తనలో తానొక నియమం పెట్టుకొని, దాని ప్రకారం పని చేయసాగితే, ఇతరులను నొప్పించకుండా వుండడం కోసం గట్టి ప్రయత్నం

చేయసాగితే, క్రమబద్ధ జీవితం నడపడం కోసం, మంచివాడుగా వుండడం కోసం తన శక్తియుక్తుల నన్నింటిని ఉపయోగించి ప్రయత్నించ సాగితే, ఏమవుతుంది? అతని ప్రయత్నాలన్నీ అతనికి సంఘంలో గౌరవాన్ని తెచ్చి పెడతాయి. కాని, దాంతో అతని మనస్సు మాత్రం మట్టమైపోతుంది; అందువలన అటువంటివాడు సౌశీల్యవంతుడు కానేరడు.

ఎప్పుడైనా మీరొక పువ్వును చాల దగ్గరగా వుండి చూచారా? అది రేకలన్నిటితో హెచ్చుతగ్గులు లేకుండా, ఎంత అద్భుతంగా వుంటుందో! అంతేగాదు, అది యెంతో మృదువుగా, మంచి వాసన గలిగి చూడ సొంపుగా నుంటుంది. ఇక, మనిషి క్రమబద్ధ జీవితం నడపడానికై ప్రయత్నిస్తే, అతని జీవితం హెచ్చుతగ్గులు, ఒడుదుడుకులు లేకుండా, – ఏది, యెప్పుడు, ఎట్లా వుండవలెనో అట్లా – కొనసాగవచ్చును. కాని, పూవులో వున్నట్లుగా అప్రయత్నంగా వచ్చే సొంపు, సౌమ్యత అతని జీవితంలో కన్పించవు. కాబట్టి, యిప్పుడు మనకున్న కష్టమేమంటే, యెట్టి ప్రయత్నం చేయకుండానే, మన చేతలు సమతూకంగా వుండాలి, మన ఆలోచనలు స్పష్టంగా, సహేతుకంగా, వివేకవంతంగా సాగాలి. మన సంభాషణలు స్వేచ్ఛగా, సావకాశంగా జరగాలి.

చూశారూ, క్రమబద్ధ జీవితం నడపడం కోసం, తీర్చి దిద్దినట్లు నీటుగా వుండడంకోసం మనం చేసే ప్రయత్నం మన మనస్సును సంకుచితము చేస్తుంది. అది మన అల్పత్వాన్ని సూచిస్తుంది. నా గదిలో ప్రతిదిన్ని క్రమ పద్ధతిలో వుంచడానికై నేను కావాలని ప్రయత్నిస్తూ వుంటే, ప్రతి దానిని దేని స్థలంలో దానిని వుంచడం కోసమై జాగ్రత్తపడుతూ వుంటే, ఎక్కడ నేను అడుగు వేస్తున్నానో, ఎటు పోతున్నానో – ఇట్లా ప్రతి చిన్న విషయంలోను నన్ను నేను ఎల్లప్పుడూ గమనించుకొంటూ వుంటే, అప్పుడేం జరుగుతుంది? నాకేగాదు, ఇతరులకున్నూ నేనొక భరింపరాని పీడగా తయారవుతాను, అందరినీ విసిగిస్తాను. ఏదో యొక స్థితికి చేరాలని ఎల్లప్పుడూ ప్రయత్నం చేసే మనిషి, తన ఆలోచనలను ఒక పద్ధతి ప్రకారం జాగ్రత్తగా కొనసాగిస్తూ ఈ ఆలోచన మంచిది కాదని అది, అది మంచిది కాదని యిది – యిట్లా ఎన్నుకొంటూ ఆలోచనలను సాగించే మనిషి – యితరులకు విసుగు పుట్టిస్తాడు, చిరాకు కలిగిస్తాడు. అటువంటి మనిషి చాల నీటుగా కనబడవచ్చు, సహేతుకముగా తూచితూచి మాట్లాడవచ్చు, ఇతరుల యెడ చాల శ్రద్ధ చూపవచ్చు, వారి బాగోగులను పట్టించుకోవచ్చు. కాని, జీవితంలో సృజనాత్మక శక్తి వలన కలిగెడి ఆనందమును మాత్రము పోగొట్టుకొన్న వాడవుతాడు.

కావున, ఇప్పుడింతకు మనకు గల సమస్య యేమిటి? ఎవరైనా సరే, జీవితంలో సృజనాత్మక శక్తివలన గలిగెడి ఆనందమును పొందటమెట్లు? విముక్త భావములు, విశాలమగు ఆలోచనలు కలిగియుండి, వానికి తోడుగా మన చేతలు సమతూకములై, మన మాటలు సహేతుకములై మరియు సుస్పష్టములై జీవితము సక్రమపద్ధతిన కొనసాగడమెట్లు? మనలో చాలమంది అట్లుండరని నా తలంపు. మన భావములు గంభీరములు కావు; మనము మన మనోహృదయములను దేనియందును పూర్తిగా లగ్నము చేయము. నే నొకప్పుడు పొడవైన కుచ్చుతోకలు, ఒళ్ళంతా మెత్తని

బొచ్చుతో అందమైన రెండు ఎఱ్ఱని ఉడతలను చూచినాను. అవి చాల యెత్తుగా వున్న ఒక చెట్టు మీదికి పైకిని క్రిందికిని పరుగెత్తుతూ, పది నిమిషాల సేపు, ఆగకుండా ఒకదాని నొకటి తరుముకొంటూ వుండినాయి. ఇదంతా ఎందుకోసం? కేవలం జీవితానందమును అనుభవించడం కోసమే! మన కటువంటి ఆనందమును గూర్చి బొత్తిగా తెలియదు. అది తెలియవలెనంటే దేని గురించైనా మన భావములు లోతుగా పోవాలి. మన జీవితంలో ఉత్కంఠ పెరగాలి – అది యేదో మంచి చేయడం కోసం కాదు, ఏదో సంఘసంస్కరణ కోసం కాదు. ఉత్కంఠ (Passion) అంటే – దేనియందైనా దృఢమైన భావన, అత్యంతమగు ఔత్సుక్యము. అటువంటి మహత్త్వపూర్ణమగు ఉత్కంఠ మనలో కలుగవలెనంటే మన ఆలోచనా సరళిలోనే సమూల పరివర్తనము జరగాలి, మన సమగ్ర వ్యక్తిత్వములోనే పూర్తి మార్పు రావాలి.

దేని గురించైనా దృఢమైన భావన మనలో ఎంత తక్కువ మంది కుంటుందో మీరు గుర్తించారా? మీ రెన్నడైనా మీ ఉపాధ్యాయులను గాని మీ తల్లిదండ్రులను గాని వ్యతిరేకించినారా? ఆ వ్యతిరేకించడం మీకు దేనిమీదో ఇష్టం లేకపోవడం చేత కాదు; కాని ఏవో కొన్ని పనులు మీరు చేయగూడదని చాల గట్టిగా భావించడం చేత. దేనిమీదనైనా మీకు దృఢమైన భావన లోతుగా నాటుకొని వున్నట్లయితే ఆ దృఢమైన భావనయే వింతగా మీ జీవితాన్ని క్రమబద్ధం చేయడం గమనించగలరు. మీ జీవితం సక్రమ మార్గాన నడవడం గమనించగలరు.

క్రమపద్ధతిన నడుచుకోవడం, ఇంటాబయటా నీటుగా నుండడం, ఆలోచనలలో స్పష్టత – ఇవి వానికవే ప్రధానం కాదు. కాని, సున్నితమైన మనస్సు గలవానికి, జాలి గుండె గలవానికి, నిరంతరము ఆంతరిక పరివర్తనము పొందుతున్న వానికివి చాలా ముఖ్యములు. బీదవాని దుర్దశను, ధనవంతుడు కారులో పోతుంటే వాని కారు దుమ్మెగిరి మొగం మీద పడే బిచ్చగానిని జూచి మీ గుండె కరిగిపోతే, ఇతరుల మాటలను వినిపించుకోగల అపూర్వమైన శక్తి మీకుంటే, ప్రతిదానిని ప్రేమార్ద్రమగు మనస్సుతో మీరు చూడగల్గితే – అట్టి మనస్సే మీ జీవితంలో క్రమబద్ధతను, సౌశీల్యమును కొని తెస్తుంది. దీనిని అర్థం చేసికోవడం ఉపాధ్యాయునకును, విద్యార్థికిని – ఇద్దరికిని – చాల అవసరం.

దురదృష్టవశాత్తు, తక్కిన ప్రపంచంలో మాదిరే ఈ దేశంలోను దేనినీ మనము లక్ష్యపెట్టము. దేనినీ మనస్సుకు గట్టిగా పట్టించుకోము. మనలో చాల మందిమి బుద్ధిజీవులము – అదైనా పైపై అర్థములో మాత్రమే. అంటే, మనకు తెలివితేట లెక్కువ. ఏది మంచి, ఏది చెడు అనే దాని గురించి, ఏమి ఆలోచించాలి, ఎట్లా ఆలోచించాలి, ఏం చెయ్యాలి అనే దాని గురించి, మనం తెగ చర్చిస్తాం, వాదిస్తాం. మానసికంగా మనం చాల అభివృద్ధి చెందినాం. కాని, ఆంతరికంగా మనలో సత్తా దాదాపు శూన్యం; పనికి వచ్చేదంటూ ఏమీలేదు. కాని, నిజానికి లోపలవుండే ఆ సత్తాయే సరియైన ఆచరణకు దారి చూపేది. ఆ యాచరణ ఏదో యొక అభిప్రాయాన్ని, నమ్మకాన్ని అనుసరించి జరిగేది కాదు.

అందువలన మీలో చాల దృఢమైన భావన లుండాలి – ఉద్రేకము, ఉత్కంఠ,

క్రోధము లాంటివి. వాటిని చాల జాగ్రత్తగా గమనించండి; వాటితో ఆడుకోండి; వాటి యందలి సత్యాన్ని కనుక్కోండి. అట్లు గాక వాటిని పూర్తిగా అణచివేస్తే, "నేను కోపం తెచ్చుకోరాదు, నేను దేనికినీ ఉద్రేకపడరాదు, అది తప్పు" అని అంటే, అప్పుడు మీ మనస్సు క్రమక్రమంగా ఆ యభిప్రాయానికి లొంగిపోయి, దానిలో చిక్కుకొని, మట్టమైపోతుంది. మీరెంతో తెలివిగలవారు కావచ్చు, విజ్ఞాన సర్వస్వ గ్రంథములోని విషయమంతా మీకు కరతలామలకంగా తెలిసి వుండవచ్చు. కాని, హృదయమును స్పృశించు దృఢమైన భావనయే లేనిచో, మీ అవగాహనము నిర్గంధ కుసుమము (వాసనలేని పువ్వు).

ఈ విషయాలన్నీ మీరు మీ చిన్నతనంలోనే అర్థం చేసికోవడం చాల అవసరం. అట్లాగైతేనే మీరు పెద్దైన తరువాత నిజమైన విప్లవ వీరులు, క్రాంతివాదులు కాగలరు. ఏదోయొక వాదము ననుసరించియో లేదా ఏదో యొక సిద్ధాంతమునో గ్రంథమునో అనుసరించియో కాకుండ, అసలా పదముయొక్క నిజమైన అర్థములో విప్లవవీరులై క్రాంతివాదులై కడకంట సంపూర్ణ మానవులుగా జీవింపగలరు. తత్ఫలితంగా పాతకాలపు వాసనలచే దూషితమైన అంశము మీలో ఏమాత్రమును శేషించదు. అప్పుడు మీ మనస్సు నిర్మలమై, పసిపిల్లల మనస్సు వలె అమాయకమై రాణిస్తుంది. అట్టి మనస్సే అసాధారణమైన సృజనాత్మక క్రియను కొనసాగింప సమర్థము. దీని ప్రాముఖ్యాన్ని మీరు గ్రహించకపోతే మీ జీవితము ఆనందరహితమై వ్యర్థమైపోతుంది. మీ చుట్టునున్న సంఘము, మీ కుటుంబము, భార్య లేక భర్త, సిద్ధాంతములు, మతములు, మత సంస్థలు, రాజకీయ సంస్థలు – అన్నీ మిమ్ము ముంచెత్తి పూర్తిగా లొంగదీసికొంటాయి. అందువలన మీరు చిన్నప్పుడే సరియైన విద్యను పొందడం చాల అవసరం. అందుకోసం యీ బండబారిన నాగరికత అనబడే దానిని బద్దలు కొట్టడంలో మీకు సహాయపడగల ఉపాధ్యాయులుండాలి. మీరు చెప్పిందే చెప్పెడి యంత్రముల వలె గాకుండ, హృదయములందు సంగీతము గల స్వతంత్ర వ్యక్తులుగా, సృజనాత్మకత గల మానవులుగా సుఖసంతోషాలతో జీవించాలి.

### 1. ప్రశ్న:- కోపమనగా నేమి? ఎవరికైనా కోపమెందుకు వస్తుంది?

కృష్ణమూర్తి:- మీ కాలిప్రేళ్ళను నేను త్రొక్కితే, లేదా మిమ్ము నేను గిల్లితే, లేదా మీ వస్తువును దేనినైనా నేను తీసివేసికొంటే మీకు కోపం రాదా? ఎందుకని కోపం రాగూడదు? అసలు కోపం చెడ్డదని ఎందుకనుకొంటారు? మీతో ఎవరైనా అట్లా అన్నారా? కాబట్టి ఎవరికైనా కోపమెందుకు వస్తుందో తెలిసికోవడం చాల ముఖ్యం. కోపము యొక్క నిజమైన తత్త్వమేమిటో చూడాలి. అంతేగాని, కోపము చెడ్డదని ఊరక పలికినంత మాత్రాన ఉపయోగం లేదు.

సరే, మీకెందుకు కోపం వస్తుంది? ఎవరైనా మీకు నొప్పి కలిగించడం మీ కిష్టముండదు. ఇది చావకుండా బ్రతికి వుండడం కోసం మానవ మాత్రునికుండే మామూలు కోరికలో ఇది ఒక భాగము. ఎవరైనాసరే ఒక వ్యక్తిగాని, ప్రభుత్వం గాని, సంఘంగాని మిమ్ము ఉపయోగించుకోరాదని, మిమ్ము అణగద్రొక్కి వేయరాదని,

నాశనం చేయరాదని, మిమ్ము నిలువు దోపిడీ చేయరాదని అనుకొంటారు. ఎవరైనా మిమ్మొక చెంప దెబ్బ కొట్టితే మీరు బాధపడతారు; అవమానం జరిగినట్లు భావిస్తారు. అది మీ కిష్టముండదు. మిమ్ము కొట్టిన మనిషి మీకంటె పెద్దవాడై బలవంతుడైతే, మీరు వాణ్ణి మళ్ళీ కొట్టలేరు. అందుకు బదులుగా మీరు మరొకణ్ణి కొడతారు – మీ తమ్ముణ్ణో, మీ చెల్లెలినో లేదా మీకు పనిమనిషి వుంటే ఆ పనిమనిషినో కొట్టి మీ కోపం చల్లార్చుకొంటారు. ఈ విధంగా ఈ కోపమనే ఆట కొనసాగుతూ వుంటుంది.

అసలు, దెబ్బనుండి తప్పించుకోవడం ప్రాణి సహజమైన క్రియ. ఎవరైనా మిమ్మెందుకు తమ స్వార్థంకోసం ఉపయోగించుకోవాలి? అందుచే దెబ్బ తగులకుండా మిమ్ము మీరు కాపాడుకొంటారు. మీ చుట్టూ ఒక రక్షణ శ్రేణిని, ఒక అడ్డుగోడను నిర్మించుకొంటారు. అంతర్గతంగా మీ చుట్టు మీరొక గోడను నిర్మించుకొని మిమ్ము మీరు మూసివేసికొంటారు. అంటే, మీ మనస్సు సంవేదనా శూన్యమౌతుంది. అందుచేత మీరు తత్త్వాన్వేషణ చేయడానికి పనికిరారు. మీలో విశాల భావాలకు చోటులేదు. మనస్సులో కలిగే వివిధ భావాలను ఖండిస్తున్నట్లే, కోపమును గూడ చాల చెడ్డదని చెప్పి దానిని ఖండిస్తారు. అందుచేత మీ హృదయము క్రమక్రమంగా ఎండిపోయి వట్టిపోతుంది. అందులో బలమైన భావాలేవియు ఉద్బుద్ధమవడానికే అవకాశముండదు. ఏమి, మీ కర్థమయినదా?

## 2. ప్రశ్న:- మనం మన తల్లులను ఎందుకెక్కువగా ప్రేమిస్తాము?

కృష్ణమూర్తి:- మీరు మీ తండ్రిని అసహ్యించుకొనేటట్టయితే తల్లిని ప్రేమించ గలరా? జాగ్రత్తగా వినండి. మీరొకరిని ఎక్కువగా ప్రేమిస్తూ వుంటే, అట్టి ప్రేమకు పాత్రులు కాకుండ ఇతరులను బహిష్కరిస్తారా? మీ తల్లిని మీరు నిజంగా ప్రేమిస్తూ వుంటే మీ తండ్రిని, పినతల్లిని, ఇరుగుపొరుగు వారిని, మీ పనిమనిషిని గూడ ప్రేమించరా? మొట్టమొదట ప్రేమభావమంటూ మీలో వుంటే, ఆ తరువాతగదా ప్రత్యేకంగా ఎవరినో యొకరిని ప్రేమించడమనేది? "నా తల్లిని నేను చాల ఎక్కువగా ప్రేమిస్తున్నాను" అని మీరంటే ఆమె యొక్క బాగోగులను పట్టించుకోవడం కాదా? అప్పుడు మీరామెకు ఎన్నో లేనిపోని కష్టాలు కలిగిస్తారా? మీ తల్లి బాగోగులు మీరు చూచుకొంటూ వుంటే, మీ తమ్ముడు, చెల్లెలు ఇరుగుపొరుగువారి బాగోగులను గూడ చూచుకోరా? అట్లా చూచుకోకపోతే మీరు మీ తల్లిని గూడ నిజంగా ప్రేమిస్తున్నట్లు కాదు. అప్పుడా ప్రేమ అర్థంలేని కేవలం ఒకమాట, స్వార్థ సాధన కోసం పనికి వచ్చే ఒక పనిముట్టు మాత్రమే.

## 3. ప్రశ్న:- నానిండా అసహనము, ద్వేషము. ప్రేమించడమెట్లో దయచేసి నాకు నేర్పుతారా?

కృష్ణమూర్తి:- ప్రేమించడమెట్లో ఎవరును ఎవరికిని నేర్పలేరు. ప్రేమించడమెట్లో ప్రజలకు నేర్పగల్గితే, యిక ప్రపంచ సమస్య దాదాపు తీరినట్లే కాదా? పుస్తకం

చూచి లెక్కలు చేయడం నేర్చుకొన్నట్లుగా ప్రేమించడం నేర్చుకోగల్గితే, యీ ప్రపంచమే అద్భుతంగా మారిపోతుంది. అప్పు డిక్కడ ద్వేషముండదు, దోపిడీ వుండదు, యుద్ధములుండవు, బీదవారు ధనికులనే భేదముండదు. మనమందరము అన్యోన్య మైత్రితో జీవిస్తాము. కాని, ప్రేమ అనేది అంత సులువుగా వచ్చేది కాదు. ద్వేషించడమే సులువు. అది యొక పద్ధతిలో మనుషులను కలుపుతుంది గూడ. అది వారిలో రకరకాలైన భ్రమలను పుట్టిస్తుంది. యుద్ధములో చేసికొన్నట్లే అనేక విధముల పరస్పర సహకారము చేసికోడానికది తోడ్పడుతుంది. కాని, ప్రేమ భావన చాల కష్టసాధ్యం. మీరు ప్రేమించడ మెట్లో నేర్చుకోలేరు. కాని ద్వేషమన నేమిటో జాగ్రత్తగా గమనిస్తూ, మెల్లగా దానిని తొలగించుకోవచ్చు. ద్వేషభావనతో పోరాటం పెట్టుకోకండి. "ప్రజలను ద్వేషించడం ఎంత దారుణమైనపని" అని అనకండి. కాని, అసలు ద్వేషమంటే యేమిటో శ్రద్ధగా గమనిస్తూ దానిని మెల్లగా జారి పోనివ్వండి. దానిని ప్రక్కకు త్రోసి వేయండి. నిజానికది ముఖ్యంకాదు. ముఖ్యమేమంటే ద్వేషము మీ మనస్సులో నాటుకోకుండా వుండడం. అర్థమౌతున్నదా? మీ మనస్సు సారవంతమైన భూమిలాంటిది. తగినంత అవకాశమే యిస్తే, అడ్డం వచ్చిన ప్రతి సమస్య మడిలోని కలుపు మొక్కవలె సారవంతమైన ఆ మనోభూమిలో నాటుకుపోతుంది. అప్పుడు దానిని లాగిపారవేయడం కష్టసాధ్యమవుతుంది. ఆ సమస్యకు నాటుకొనడానికి తగినంత సమయం మీరీయకపోతే, దానికప్పుడు పెరగడానికి అవకాశం లేక వాడిపోతుంది. ద్వేషానికి ప్రోత్సాహమిస్తే, వేరూనడానికి పెరగడానికి పక్వమవడానికిన్ని తగినంత సమయమిస్తే, అది యొక బ్రహ్మాండమైన సమస్యగా తయారై కూర్చుంటుంది. అట్లుగాక ద్వేష భావన తలయెత్తినప్పుడెల్ల దానిని పట్టించుకోకుండ దానిదారిన దానిని పోనిస్తే అప్పుడు మీ మనస్సు భావుకత లోనికి జారుకోకుండా మిక్కిలి సున్నితము సూక్ష్మగ్రాహకమవుతుంది; కాబట్టి అట్టి మనస్సే ప్రేమ నెఱుగ గలదు.

ఇంద్రియాల ద్వారా జ్ఞానమును పొందడం కోసం, కోరికలను తీర్చుకోవడం కోసం మనస్సు ప్రయత్నించవచ్చు. కాని, ప్రేమనుమాత్రం ప్రయత్నించి సాధించుకోలేదు. ప్రేమయే మనస్సు వద్దకు రావాలి. ప్రేమంటూవుంటే దానిలో ఇంద్రియ సంబంధమగు శారీరక ప్రేమ యని, దివ్యప్రేమయని విభాగముండదు. ప్రేమంటే ప్రేమే... అదే అందులో వుండే అసాధారణ విషయము. ఆ గుణమొక్కటే సృష్టి తత్త్వమునంతను పూర్తిగా అర్థము చేసికొనడంలో సహాయపడగలది.

## 4. ప్రశ్న:- జీవితంలో సుఖమంటే యేమిటి?

**కృష్ణమూర్తి:-** మీ మనస్సునకు సంతోషాన్ని కలిగించేపని చేస్తే మీకు సుఖం కలుగుతుందని అనుకొంటారు. చాల గొప్ప ధనవంతులం కావాలని లేదా చాల అందమైన బాలికను పెండ్లి చేసికోవాలని అనుకొంటారు. ఏదో పెద్ద పరీక్ష పాసు కావాలని, అందరూ మిమ్ము మెచ్చుకోవాలని అనుకొంటారు. ఈ విధంగా మీరు కోరుకొనే కోరికలన్నీ నెరవేరితే సుఖం కలుగుతుందని అనుకొంటారు. కాని

అది నిజంగా సుఖమేనా? ఆ సుఖము త్వరలోనే నశించదా? ప్రొద్దున వికసించి సాయంకాలానికి వాడిపోయే పువ్వులాంటిది కాదా ఆ సుఖము? కాని అదే మన జీవితం, అదే మనం కోరుకొనేది. అటువంటి పైపై విషయాలతోనే మనం తృప్తిపడతాం. మనకొక కారువుంటే, ఏదైనా మంచి యుద్యోగం, సురక్షితమైన పదవి దొరికితే, ఏదో యొక పనికిమాలిన విషయముపై కొంత భావావేశం కలిగితే దానితో తృప్తి పడతాం. ఆ సుఖమెట్లాంటిదంటే – చిన్నపిల్లవాడు తీవ్రంగా వీస్తూవున్న గాలిలో గాలిపటాన్ని యెగురవేసి సంతోషించడంలాంటిది. ఆ సుఖము క్షణభంగురము. కొద్ది సేపట్లోనే వాడు ఏడుస్తూ కన్నీళ్ళు కార్చడం మొదలుపెడతాడు. అటువంటిది మన జీవితం. దానితో మనం తృప్తి పడతాం. అంతేగాని, "నా హృదయాన్ని, నా శక్తిని, నా సర్వస్వాన్ని ధారవోసి నిజమైన సుఖమంటే యేమిటో కనుక్కొంటా"మని మనమెన్నటికిని అనము. మనం దీనిని తీవ్రమైన విషయంగా తీసికోము, దీని గురించి గట్టిగా మనసుకు పట్టించుకోము. అల్ప విషయాలతో సంతృప్తి చెందుతాం.

అయితే, సుఖమనేది ప్రయత్నించి సాధించుకొనేది కాదు. అది మనము కోరుకోకుండా దానంతటదే వచ్చెడి ఒక సిద్ధి. మీరు కేవలం సుఖం కోసం ప్రయత్నం చేస్తే ప్రయోజనం లేదు. అది పిలిస్తే వచ్చేది కాదు, కోరుకొంటే కలిగేది కాదు. మీరు సుఖంగా వున్నట్లు మీ మనస్సునకు తట్టిన మరుక్షణంలో ఆ సుఖ మదృశ్యమైపోతుంది. మీరీ విషయాన్ని గమనించలేదని నా అనుమానం. ఏ కారణము లేకుండ మీలో తటాలున ఆనందానుభూతి కలిగితే అప్పుడు మీ పెదవులమీద చిరునవ్వు కనిపిస్తుంది. ఆ సుఖము విముక్తస్థితి ఫలితము. కాని, సుఖము వున్నట్లు మీ మనస్సునకు తట్టిన క్షణమే ఆ సుఖము అంతర్ధానమైపోతుంది. మనసా ఎరిగి యెరిగి సుఖంగా వుండడమంటే, లేదా సుఖాన్వేషణ చేయడమంటే సుఖమునకు మంగళహారతి పట్టడమే. మనస్సులోని నే ననే భావన, అందలి కోరికలున్ను వైదొలగినప్పుడే సుఖము దర్శనమిస్తుంది.

మీరు గణితం గురించి చదువుకొన్నారు. దేశ చరిత్ర, భూగోళ శాస్త్రం, సామాన్య విజ్ఞాన శాస్త్రం, పదార్థ విజ్ఞాన శాస్త్రం, జీవ శాస్త్రం – ఇంకా ఏవేవో చదవడానికి మీరు కాలమంతా వెచ్చిస్తున్నారు. కాని, ఉపేక్షింపరాని అతి ముఖ్యములైన యీ పై విషయాలను గురించి మీరుగాని మీ ఉపాధ్యాయులుగాని యే మాత్రమైనా కాలాన్ని వెచ్చించినారా? మీరెప్పుడైనా వెన్నెముకను నిటారుగా నిలిపి, (పద్మాసనంలో) కదలకుండా, మౌనంగా కూర్చుండి, ఆ మౌనస్థితిలోని అందమును, ఆనందమును ఆస్వాదించినారా? ఎప్పుడైనా మీ మనస్సును అల్ప విషయాలమీదికి పోనీకుండా, విశాలమై గంభీరమైన విషయాలమీదికి స్వేచ్ఛగా పోనిచ్చి సత్యమును అన్వేషించి దర్శించినారా?

ఈ ప్రపంచంలో ఏమి జరుగుతున్నదో మీకు తెలుసునా? మన ప్రతియొక్కరిలోను ఏమి జరుగుతున్నదో అదే బయటి ప్రపంచంలోనూ జరుగుతున్నది. మనమెట్లున్నామో ప్రపంచమట్లా వున్నది. మనలో చాలమందిమి అశాంతిలో పడి కొట్టుకొంటున్నాము. అంతా మనకే కావాలి అని ప్రతిదీ కూడ బెట్టుకొంటున్నాము. చూచిన దానినెల్ల మన

సొంతం చేసికోవా లనుకొంటున్నాము. ఇతరులను చూచి, ఓర్చుకోలేము. ప్రతివానిని నీది తప్పని నిందిస్తుంటాము. సరిగ్గా అదే జరుగుతున్నది బయటి ప్రపంచంలో కూడ; అయితే యింకొంచెం నాటక ఫక్కీలోను, ఇంకొంచెం క్రూరంగాను – అంతే తేడా. అయితే మీరుగాని, మీ ఉపాధ్యాయులుగాని దీనినంతను గూర్చి ఆలోచించడానికి ఏ మాత్రమైనా సమయమును వెచ్చించరు. అట్లుగాక ప్రతిదినం యీ విషయాల గురించి లోతుగా, తీవ్రంగా ఆలోచించడానికై మీరు కొంత సమయాన్ని వెచ్చిస్తూ వుంటే, అప్పుడు మాత్రమే సంఘంలో సంపూర్ణ పరివర్తనము తేవడానికి, క్రొత్త ప్రపంచాన్ని సృష్టించడానికి బహుశా అవకాశముంటుంది. క్రొత్త ప్రపంచాన్ని సృష్టించడం చాల అవసరమని నేను నమ్మకంగా చెబుతున్నాను. క్రొత్త ప్రపంచమంటే నేటి యీ క్రుళ్ళిన సమాజమే మరియొక రూపంలో కొనసాగడం కాదు. మీ మనస్సు చురుకుగా వుండి, మెలకువ గలిగి, ప్రతిదానిని గమనిస్తూ వుండకపోతే క్రొత్త ప్రపంచాన్ని సృష్టించలేరు. అందువలన మీరు చిన్నవాండ్లుగా వున్నప్పుడే చాల గంభీరమై, ఉపేక్షింపరాని యీ విషయాలను గూర్చి పర్యాలోచిస్తూ కొంత సమయాన్ని గడపడం చాల అవసరం బడిలో బోధించే ఏవో కొన్ని పాఠ్య విషయాలను మాత్రమే చదువుతూ రోజులు గడిపేశారంటే దానివలన ఏదో యొక వుద్యోగం రావడం, తుదకు మృత్యువు తప్ప మరియొక ప్రయోజనమేమీ వుండదు. కాబట్టి, యీ విషయాలనన్నిటిని మీరు చాల తీవ్రంగా ఆలోచించాలి. ఆ యాలోచనవలన అపూర్వమైన ఆనందానుభవము, సుఖానుభవముంటుంది.

5. ప్రశ్న:- నిజమైన జీవితమనగా నేమి?

**కృష్ణమూర్తి:-** "నిజమైన జీవితమనగా నేమి?" – ఈ ప్రశ్న వేసేది ఒక చిన్న పిల్లవాడు. ఆటలాడడం, మంచి తిండి తినడం, పరుగెత్తడం, దుముకడం, త్రోసుకోవడం – ఇదీ అతనికి నిజమైన జీవితం. చూశారా, మనం జీవితాన్ని వాస్తవమైనదని, అవాస్తవమైనదని రెండుగా విభజించుతాం. వాస్తవమైన జీవితమంటే మీరు ప్రేమించే పనిని, అందులో పూర్తిగా లీనమైపోయి చేయడం. అట్టి జీవితంలో అంతర్విరోధముండదు; తలపులకు చేతలకు పొందిక లేకపోవడమంటూ వుండదు. మీరు చేసేదానికి, చేయవలెనని అనుకొన్నదానికి మధ్య పోరాటముండదు. జీవితమప్పుడొక అఖండమైన, అవిభక్తమైన ప్రక్రియ; ఏకతానముగా సాగునట్టిది. అందులో అత్యంతానందముంటుంది. అట్టి స్థితి రావాలంటే మానసికంగా మీ రేవ్యక్తిమీదను, సంఘము మీదను ఆధారపడరాదు. ఆంతరికంగా సంపూర్ణ వైరాగ్యముండాలి. అప్పుడు మాత్రమే మీరు ప్రేమించిన పనిని చేయడానికి, చేసే పనిని ప్రేమించడానికి అవకాశముంటుంది. మీలో సంపూర్ణ పరివర్తనము కలిగినప్పుడు మీరు తోటమాలిగా పనిచేస్తున్నా, దేశమునకు ప్రధానమంత్రిగా వున్నా, లేక మరింకే పనిని చేస్తున్నా ఒకటే. అప్పుడు మీరు చేసే పనిని మీరు ప్రేమిస్తారు. ఆ ప్రేమలో నుండి అపూర్వమైన సృజనాత్మక భావన కలుగుతుంది.

*7 జనవరి, 1955*

★ ★ ★

# 9. విముక్తమగు మనస్సు

నేర్చుకోవడమంటే యేమిటో తెలిసికోవడం చాల ఆసక్తిదాయకంగా వుంటుంది. అది మీకు తెలుసా? గణితము, భూగోళ శాస్త్రము, దేశచరిత్ర మొదలైనవి ఏదైనా పుస్తకం చదివిగాని, లేదా ఎవరైనా ఒక ఉపాధ్యాయుడు చెబితే విని గాని నేర్చుకొంటాము. అట్లే లండను ఎక్కడ వున్నదో, మాస్కో ఎక్కడ వున్నదో, న్యూయార్కు ఎక్కడ వున్నదో తెలిసికొంటాం. ఏదైనా యంత్రం ఎట్లా పనిచేస్తుంది, పక్షులు తమగూళ్ళ నెట్లా కట్టుకొంటాయి, అవి తమ పిల్లల భద్రత కోసం ఏమి చేస్తాయి – ఇటువంటి విషయాలను గూడ పరిశీలనగా చూచిగాని, పుస్తకాలు చదివిగాని, ఉపాధ్యాయులు చెబితే వినిగాని మనం నేర్చుకొంటాం. నేర్చుకోవడంలో ఇది యొక మార్గము.

ఇక నేర్చుకోవడానికి మరియొక మార్గం లేదా? స్వానుభవం వలన గూడ మనం నేర్చుకోమా? మనం నదిలో ఒక పడవను, దాని తెరచాపలను, అవి నిశ్చలమైన నీటిలో ప్రతిబింబించడాన్ని చూస్తే అది ఎంతో అద్భుతమైన అనుభవంకాదా? అప్పుడేమి జరుగుతుంది? మనస్సు తనకింతకు ముందు తెలిసియున్న విషయాలతోబాటు ఈ అనుభవాన్నికూడ తనలో భద్రపరచుకొంటుంది. మరునాడు సాయంకాలం ఆ పడవను మళ్ళీ చూద్దామని, చూచి, క్రిందటి నాటివలె ఆనందానుభవమును పొందుదామని, జీవితంలో ఎప్పుడో అరుదుగాగాని లభించని శాంతిని మరల ఒకసారి పొందుదామని, అక్కడికి వెళ్ళుతాము. మనస్సీవిధంగా తాను పొందిన అనుభవాలను పట్టుదలతో తనలో భద్రంగా నిలువచేసికొంటూ వుంటుంది. "స్మృతి" లేదా "జ్ఞప్తి" యని పిలువబడే ఆ యనుభవాల రాశియే కాదా ఆలోచనలకు మూలము? ఆలోచించడమని మనము దేనినంటామో అది స్మృతిమూలకము. నదిలో పడవను చూచి, ఆనందమనుభవించి, ఆ యనుభవాన్ని జ్ఞప్తిరూపేణ భద్రపరచుకొనియుండి, మరల ఇంకొకసారి దానిని అనుభవింపగోరుతాము. ఈ విధంగా ఆలోచనా ప్రక్రియ కొనసాగుతూ వుంటుంది, అవునుకదా?

చూశారా, ఆలోచించడ మెట్లో మనలో చాల తక్కువ మందికే తెలుసు. మనలో చాలమంది ఏదో పుస్తకంలో చదివిన దానిని లేదా ఎవరైనా మనకు చెప్పిన దానిని తిరిగి ఒప్పజెప్పుతూ వుంటాం. మన ఆలోచన మిక్కిలి పరిమితమైన మన అనుభవాలనుండి మాత్రమే సాగుతుంటుంది. మనము ప్రపంచమంతా పర్యటించినా, అసంఖ్యాకమైన అనుభవాలను పొంది, వివిధ ప్రజలను గలిసికొని వారు చెప్పినదంతా విని, వారివారి అలవాట్లను, మతములను, ఆచారవ్యవహారములను గమనించి అదంతా మన మనస్సులో జ్ఞాపక ముంచుకొంటాం. దానిమీద ఆధారపడి

మనం మన ఆలోచనలను సాగిస్తూ వుంటాం. ఒకదానితో మరియొకదానిని పోల్చడం, వాని బాగోగులు విమర్శించడం తుద కొకదానిని ఎన్నుకోవడం – ఈ ప్రక్రియ ద్వారా జీవితము నెడల మన మవలంబించవలసిన ఒక సక్రమ వైఖరిని కనుగొన గలమని ఆశిస్తాం. కాని, ఆ విధమైన ఆలోచన చాల పరిమితమైనది; అది ప్రసరింపగల క్షేత్రము చాల చిన్నది. నదిలోని పడవను, శ్మశానానికి తీసికొని పోతున్న శవమును, ఒక బరువైన మోపును మోయుచున్న పల్లె పడుచును చూడడం లాంటి అనుభవాలు మన మనస్సులో ముద్రింపబడి వుంటాయి. కాని మన మనస్సులు ఎంతగా కొరడుపారి వుంటాయంటే, ఆ యనుభవాలు మనలో లోతుగా దిగవు, పక్కానికి రావు. మన చుట్టూరా వున్న ప్రతి దానికి మనం స్పందిస్తూ వున్నప్పుడు మాత్రమే వివిధ సంస్కారములచే నిబద్ధముగాని క్రొత్తదగు ఆలోచనావిధానము మనలో ఆరంభమౌతుంది. మన మాలోచించే తీరులోనే మార్పు వస్తుంది.

మీరొక విధమైన నమ్మకాలను వదలక గట్టిగా పట్టుకొని వుంటే ఆ నమ్మకాల మీదగల దురభిమానంతోనే ప్రతి దానిని చూడడం మొదలుపెట్టుతారు. అంతేగాని, సత్యముతో మీకెట్టి సంబంధమును వుండదు. పల్లెపడుచులు పెద్ద పెద్ద బరువులను తలమీద పెట్టుకొని పట్టణమునకు మోసికొని పోతూవుంటే మీరెన్నడైనా చూచారా? చూచినప్పుడేమి జరుగుతుంది? మీకెట్టి అనుభూతి కలుగుతుంది? లేక ఇటువంటి స్త్రీలను చాల మందిని మీరనేక పర్యాయాలు చూచివుండడంచేత బాగా అలవాటు పడిపోయి వాండ్లను గమనించనే గమనించరా? గమనించినా మీ మనస్సులకు పట్టదా? పోనీ, మొదటిసారిగా మీరు దేనినైనా గమనిస్తే ఏం జరుగుతుంది? మీరు మీ మీ దురభిమానాలు, దుర్భ్రమల కనుగుణంగా మీరు చూచిన దానికి మీరు యాంత్రికంగా (ఏమీ ఆలోచించకుండానే) అర్థము చెప్పకోరా? అప్పుడు సామ్యవాదిగానో, సమాజవాదిగానో, భూస్వామ్యవాదిగానో లేక మరొకవాదిగానో మీ మీ సంస్కారాల కనుగుణంగా మీ మీ అనుభవాలు, ఆలోచనలు వుంటాయి. అయితే, యిందులో ఎవరును మీరు గాకపోయినచో ఆయా నమ్మకాలు, అభిప్రాయాలనే తెరగుండా చూడరు గాబట్టి అప్పుడు మీరు దేనిని చూస్తారో దానితో మీకు సాక్షాత్సంపర్కము కలిగి, మీకును మీరు చూచిన దానికిన్ని మధ్య ఎంతో అద్భుతమైన సంబంధమొకటి వున్నట్లు గమనింపగలరు. మీకు దేని యందును దురభిమానంగాని, పక్షపాతంగాని లేనియెడల, మీ మనస్సులు నిర్మలములై వున్నయెడల, అప్పుడు మీ చుట్టూ వున్న సృష్టియంతయు అత్యంత సజీవమై, అపూర్వ మనోహరమై కనిపిస్తుంది.

అందువలన మీరు చిన్నవారుగానున్నప్పుడే యీ విషయాల నన్నిటిని గమనించడం చాల అవసరం. నదిలో పోతున్న పడవను, నదిమీద పోతున్న రైలును, పెద్ద బరువు మోయుచున్న పొలంకాపును – అందరినీ, అన్నిటినీ జాగ్రత్తగా గమనించండి. ధనవంతుల దురుసుతనాన్ని, మంత్రులు తదితర ప్రముఖుల అహంకారాన్ని, అన్నీ తమకే తెలుసు ననుకొనేవారి గర్వాన్ని చక్కగా పరిశీలించండి. వాండ్ల తీరును గమనించండి. అంతేగాని విమర్శించకండి. మీరు విమర్శించిన మరుక్షణం వారికి మీకును గల సంబంధము తెగిపోతుంది. మీకును వారికిని మధ్య అడ్డుగోడ

యేర్పడుతుంది. అట్లుగాక కేవలం పరిశీలనగా గమనిస్తూ వున్నట్లయితే అప్పుడు ప్రజలతోను పదార్థములతోను మీకు ప్రత్యక్ష సంబంధ మేర్పడుతుంది. మీరు, ఎట్టి విమర్శ చేయకుండా ఎట్టి నిర్ణయానికి రాకుండా ఏమరుపాటు లేకుండా ప్రతిదానిని సూటిగా చూడగల్గితే, మీ ఆలోచన అద్భుతంగా పదునవడం గమనిస్తారు. అప్పుడు మీరు నేర్చుకొనేదానికి అంతరాయమంటూ వుండదు. నిరంతరము నేర్చుకొంటూనే వుంటారు.

మీ చుట్టూర ఎటు చూచినా జనన మరణాలు, ధనంకోసం పదవికోసం అధికారంకోసం పెనగులాటలు, తుది మొదలులేని సాంసారిక జీవితమున్ను కనిపిస్తాయి. మీరు చిన్నవాండ్లే అయినప్పటికిన్ని 'ఇదంతా యేమి'టని ఎప్పుడో ఒకసారైనా ఆశ్చర్యపడరా? చూశారా, ప్రతిదానికిన్ని మనకు సమాధానం కావాలి. ఇదంతా యేమిటో మనకెవరో చెప్పాలి. అందుకోసం యేదో రాజకీయ గ్రంథమో, ధార్మిక గ్రంథమో తీసికొని చదవడం మొదలుపెడతాం. లేదా, మనకు దాని గురించి చెప్పమని ఎవరినో అడుగుతాం. కాని ఎవరూ మనకు చెప్పలేరు. జీవితమనేది పుస్తకాలు చదివి అర్థం చేసికొనేది కాదు. ఎవరికో శిష్యరికం చేసిగాని, ఏవైనా ప్రార్థనలు చేసిగాని దాని ప్రాముఖ్యాన్ని గ్రహించలేము. దానిని ఎవరంతట వారు గ్రహించవలసిందే. దానిని గ్రహించవలెనంటే మనం చాల చులుకుగా, అప్రమత్తంగా వుండాలి. జాగ్రత్తగా ప్రతిదానిని గమనిస్తూ వుండాలి. మన చుట్టూరా వున్న ప్రతిదానియందును శ్రద్ధ చూపాలి, ఆసక్తి చూపాలి, అప్పుడే అసలు సుఖమంటే యేమిటో తెలిసికోగల్గుతాము.

చాలమంది యొక్క జీవితాలలో సుఖ సంతోషాలంటూ వుండవు. దానికి కారణం వారి హృదయాలలో ప్రేమభావన అంటూ లేకపోవడమే. మీకును మరియొకరికిని మధ్య అడ్డుగోడలు లేకపోతే, ఎవరినైనా కలిసికొన్నప్పుడు వారి తప్పొప్పులవైపు మన దృష్టి పోకుండా, విమర్శించకుండా వారిని గమనించి చూడ గల్గితే, నదిలో తెరచాపెత్తికొని పోవుచున్న పడవను చూచి దాని సౌందర్యమున కానందింపగల్గితే, అప్పుడు మీ హృదయాలలో ప్రేమ ఉత్పన్నమవుతుంది. దేనినైనా యథాతథంగా చూడగలగాలి, అంతేగాని, మీ పిచ్చితలంపులు మీ దృష్టికడ్డురాగూడదు. శ్రద్ధగా అవలోకించిన చాలును. కేవల మిట్టి అవలోకనము వలన చెట్లను, పక్షులను, మనుష్యులు నడవడాన్ని, పని చేయడాన్ని, చిరునవ్వు నవ్వడాన్ని – ఇట్లా ప్రతి దానిని మెలకువతో గమనించుచుండడం వలన మీలో ఏదో మార్పురావడం కనుగొంటారు. మీలో ఈ అపూర్వ పరివర్తనము కలుగనిదే, మీ హృదయంలో ప్రేమ ఉద్బుద్ధము కానిదే, జీవితము సార్థకము కాదు. ఈ అన్ని విషయాల ప్రాముఖ్యమును తెలిసికోవడంలో మీకు సహాయపడడం కోసం మునుముందుగా మీ విద్యాబోధకులకు విద్య బోధించడం చాల అవసరము.

**1. ప్రశ్న:- భోగమయ జీవితము నడుపవలెనని మనమెందుకు కోరుకొంటాము?**

**కృష్ణమూర్తి:-** భోగమయ జీవితమంటే యేమిటి? శుభ్రమైన బట్టలు వేసికోవడం, శరీరాన్ని శుభ్రంగా వుంచుకోవడం, మంచి తిండి తినడం – దీనిని మీరు

భోగమయ జీవితమంటారా? అయితే, యివే తిండి లేనివానికి, గుడ్డపేలికలు కట్టుకొనేవానికి, ప్రతిదినం స్నానం చేయలేని వానికి భోగములుగా కనిపిస్తాయి. అందువలన భోగములనేవి వారి వారి కోరికలనుబట్టి, మనిషి మనిషికీ భేదిస్తాయి. ఇదంతా తరతమ భావములకు సంబంధించిన విషయము.

భోగమయ జీవితాన్ని మీరు కోరుకొనేటట్లయితే – ఎల్లప్పుడు సోఫా మీదనో, మెత్తని కుర్చీలోనో సుఖంగా కూర్చోవాలని మీరు కోరుకొంటూ వుంటే ఏం జరుగుతుందో తెలుసునా? మీ మనస్సుకు నిద్రమత్తెక్కువవుతుంది. కొంత శరీర సౌఖ్యం వుండడం మంచిదే కాని, దాని కెక్కువ ప్రాధాన్యమిస్తే మనస్సు నిద్ర పోవడం మొదలుపెడుతుంది. లావుపాటి మనుషులు చాలమంది ఎంత సుఖంగా వుంటారో ఎప్పుడైనా గుర్తించారా? వాండ్ల శరీరంమీద పొరలు పొరలుగా క్రొవ్వు పేరుకొని పోవడంచేత వాండ్లు దేనికిన్నీ తొందరగా కలతచెందరు. ఇది వారి శరీర పరిస్థితి. కాని, మనస్సులో గూడ ఈ క్రొవ్వు పొర లేర్పడతాయి. అట్టి మనస్సుకు ఎవరైనా వచ్చి తన్ను ప్రశ్నించడం, తన శాంతికి భంగం కలిగించడం ఇష్టముండదు. ఇటువంటి మనస్సు మెల్లమెల్లగా నిద్రలోకి జారుకొంటుంది. మనమిప్పుడు విద్యయని దేనిని పిలుస్తున్నామో అది విద్యార్థిని మామూలుగా నిద్రపుచ్చేది. ఎందుకంటే, అతడు నిజంగా వాడిగా సూటిగా ప్రశ్నిస్తే – అంతర్యమును బయటికి లాగగల ప్రశ్నలు వేస్తే, ఉపాధ్యాయుడు కలతచెంది, ఏమి జవాబివ్వవలెనో తోచక, "ముందు పాఠం కానీయండి" అని తప్పించివేస్తాడు.

కాబట్టి, మన మనస్సు ఏదైనా ఒక సౌకర్యానికి గాని, ఒక అలవాటుకుగాని, ఒక నమ్మకానికిగాని, 'మా యిల్లు' అని చెప్పుకొనే ఒక స్థలానికి గాని కట్టుబడి పోయినట్టయితే అప్పుడది మెల్లగా నిద్రపోసాగుతుంది. ఈ విషయం అర్థం చేసికోవడం ముఖ్యం. అంతేగాని, భోగమయజీవితం గడుపుతున్నామా లేదా అనేది ముఖ్యంకాదు. ఎల్లప్పుడును చురుకుగా అప్రమత్తంగా, మెలకువతో వుండే మనస్సు శరీర సౌఖ్యానికి ఎన్నటికిని కట్టుబడిపోదు. భోగమయ జీవితమును అది కోరదు. దానిని అది లెక్కసేయదు. ఏవో అల్పంగా గుడ్డలు ధరిస్తాడన్న మాత్రాన, అట్టి వాని మనస్సు హెచ్చరిక గలిగి అప్రమత్తంగా వుంటుందనడానికి వీలులేదు. పైకి చూడడానికి చాల సాదాగా, నిరాడంబరంగా వుండే సన్న్యాసి లోలోపల గూడ అట్లే వుంటా డనడానికి వీలులేదు. అతని మనస్సు సంకీర్ణమై, సౌశీల్యమును పెంపొందించుకొన ప్రయత్నిస్తూ సత్యమును, దైవమును సాక్షాత్కరింప గోరుతూ వుండవచ్చును. ఇంతకును ముఖ్యమేమిటంటే – మనిషి యొక్క మనస్సు మిక్కిలి నిర్మలంగా నిరాడంబరంగా పవిత్రంగా వుండాలి, నమ్మకాలతో భయాలతో లెక్కలేని కోరికలతో నిండిపోయి యుండరాదు. అట్టి మనస్సే సరిగా ఆలోచింపగలదు. అన్వేషింపగలదు, కనుగొనగలదు.

**2. ప్రశ్న:- మనం మన పరిసరాలతో పోరాటం సల్పుతూ వున్నంత కాలం జీవితంలో శాంతి వుంటుందా?**

**కృష్ణమూర్తి:-** పరిసరాలతో పోరాటం సల్పవలసిన అవసరం లేదా? వాటిని

ఛేదించుకొని బయటికి రానక్కర లేదా? మీ తల్లిదండ్రుల నమ్మకాలు, మీరున్న సంఘముయొక్క పూర్వ చరిత్ర, మీ సంప్రదాయాలు, మీరు తినే ఆహారము, మీ చుట్టూ వుండే మతము, పూజారి, పురోహితుడు, ధనవంతుడు, బీదవాడు – ఇవన్నీ కలిసి మీ పరిసరా లవుతాయి. ఆ పరిసరాలను ఎదురు తిరిగి ప్రశ్నించి, వాటిపై తిరుగబడి, వాటిని ఛేదించుకొని బయటికి రావద్దా? మీరు తిరుగబడకపోతే, మీ పరిసరాలకు ఊరక లొంగిపోతే అప్పుడొక విధమైన శాంతి వుంటుంది. కాని, అది మృత్యు శాంతి, జీవము లేని శాంతి. అట్లుగాక గట్టి ప్రయత్నంతో మీ పరిసరాలను ఛేదించుకొని బయటికి వచ్చి సత్యమేదో మీ యంతట మీరు తెలిసికొన గల్గితే, అప్పుడు లభించే శాంతి మరియొక విధమైనది. ఆ శాంతి నిలువ నీటివలె జీవము లేనిది కాదు. కాన పరిసరాలతో పోరాటము చాల అవసరము; అది తప్పదు. కాబట్టి శాంతి కాదు ముఖ్యము, పరిసరాల నర్థము చేసికొని, వాటిని బ్రద్దలు కొట్టుకొని బయటికి రావడం ముఖ్యము. అప్పుడే శాంతి లభిస్తుంది. అట్లుగాక పరిసరాలకు లొంగిపోవడం ద్వారా శాంతి రావాలని కోరితే నిద్రమత్తు మిమ్మల్ని కమ్మివేస్తుంది. దానికంటే చావడం మేలు. అందుచేత చాల చిన్నవయస్సునుండి మీలో తిరుగబడే స్వభావముండాలి. అది లేనిచో కేవలం క్షయించిపోతారు, ఏమి, పోరా?

3. ప్రశ్న:- మీరు సుఖంగా వున్నారా లేదా?

కృష్ణమూర్తి:- నాకు తెలియదు, నేను దానిగురించి ఎన్నడును ఆలోచించలేదు. సుఖంగా వున్నామని మీ రనుకొన్న మరుక్షణం మీరు సుఖవంతులు కారు, మీ సుఖమాగిపోతుంది, పోదా? మీరు ఆనందంతో కేరింతాలు కొడుతూ ఆడుకొంటూ వున్నప్పుడు, తటాలున మీ రానందంగా వున్న విషయం మీ మనస్సుకు తట్టగానే ఏమవుతుంది? మీ ఆనందం ఆగిపోతుంది. ఇది మీరు గుర్తించారా? అందువలన సుఖమనేది, మీ రాసంగతి గుర్తించగానే తొలగిపోవునట్టిది.

మంచి వాండ్లుగా వుండాలని మీరు ప్రయత్నిస్తే, మంచివాండ్లవుతారా? మంచితనమనేది సాధన చేస్తే వచ్చేదా? లేక ప్రతిదానిని చూస్తూ జాగ్రత్తగా గమనిస్తూ, అవగాహన చేసికొంటూ వుంటే దానంతట అది సహజంగా వచ్చేదా? అదే విధంగా సుఖంగా వున్నామని మీ మనస్సున కెప్పుడైతే తట్టుతుందో అప్పుడే ఆ సుఖము కిటికీ గుండా అంతర్ధానమై పోతుంది. సుఖాన్వేషణ మనేమాట అసంబద్ధమైనది, అసంగతమైనది. ఎందువల్లనంటే, సుఖంకోసం అన్వేషణ చేసినంతకాలము అది రాదు; అన్వేషణ మానివేయగానే అది సిద్ధిస్తుంది.

వినయము అనే మాటకు అర్థమేమిటో తెలుసునా? మీరు వినయాన్ని కృషిచేసి అభివృద్ధి చేసికోగలరా? ప్రతిదినము ప్రొద్దున్నే లేచి "నేనిక మీదట వినయంగా వుంటాను" అని జపం చేస్తూ వుంటే వినయం గలవారలౌతారా? లేక మీలో గర్వము, అహంభావము తొలగిపోతే, వినయము దానంతట అదే సహజంగా వస్తుందా? అదే విధంగా సుఖ నిరోధకములయిన చింత, నిర్వేదము, భద్రతకోసం ప్రయత్నము నిలిచిపోతే, అప్పుడుండేది సుఖమే! దానికోసం వేరే ప్రయత్నం చేయనక్కరలేదు.

మీలో ఎక్కువమంది యెందుకని అంత నిశ్శబ్దంగా కూర్చొని వున్నారు? నాతో ఎందుకు చర్చించరు? మీ మనస్సులోని ఆలోచనలను, అభిప్రాయాలను ఎంత చెడ్డగానైనా సరే పైకి చెప్పుకోవడం చాల అవసరం. దాని వలన మీకు చాల ప్రయోజనముంటుంది. అది యెందుకో చెబుతా, వినండి. మీ మీ ఆలోచనలను, అభిప్రాయాలను, ఎంత సంకోచంతోనైనా సరే – ఇప్పుడు పైకి చెప్పుకోవడం ఆరంభిస్తే, మీరు పెద్దైన తరువాత మీ పరిసరాలుగాని, తల్లిదండ్రులుగాని, సంఘముగాని సంప్రదాయముగాని – యేదిన్నీ మిమ్ము అణచి వేయలేదు. మీ గొంతు నొక్కి వేయలేదు. కాని, దురదృష్టవశాత్తు, మీ ఉపాధ్యాయులు మిమ్ములను ప్రశ్నలు వేయడానికి ప్రోత్సహించరు; మీ ఉద్దేశము లేమిటని అడుగరు.

4. ప్రశ్న:- మనమెందుకు ఏడుస్తాము? దుఃఖమంటే యేమిటి?

కృష్ణమూర్తి:- ఒక చిన్న పిల్లవాడు అడుగుతున్నాడు – మనమెందుకు ఏడుస్తామని, దుఃఖమంటే యేమిటని. మీరు ఎప్పుడు ఏడుస్తారు? మీరాడుకొనే బొమ్మను ఇంకెవరైనా తీసుకొనిపోతే, లేదా మీకు దెబ్బ తగిలితే, లేదా మీరు ఆటలో ఓడిపోతే, లేదా మీ ఉపాధ్యాయులుగాని, తల్లిదండ్రులుగాని మిమ్ము తిడితే, లేదా ఎవరైనా మిమ్ము కొడితే మీరు ఏడుస్తారు. మీరు పెద్దవారయ్యే కొలది ఏడవడం క్రమంగా తగ్గిపోతుంది. ఎందుకంటే, జీవితా న్నెదుర్కొనడంలో మీరు గట్టిపడిపోతారు. పెద్దైన తరువాత గూడ ఏడ్చేవాళ్ళు మనలో చాల తక్కువ మంది మాత్రమే. ఎందువల్లనంటే, చిన్నతనంలో వుండే మెత్తని మనస్సు పెద్దైతే వుండదు, దాని అపూర్వమైన సున్నితత్వము నశించిపోతుంది. కాని, దుఃఖమనేది మన మేదైనా పోగొట్టుకొంటేనో, ఎవరైనా మన కడ్డం తగిలితేనో, మన కాశాభంగము కలిగితేనో వచ్చేది మాత్రమే కాదు. దుఃఖమనేది చాల లోతైనది. అవగాహన లేకపోవడమనే స్థితి యొకటున్నది. అవగాహన లేనప్పుడు దుఃఖముంటుంది. మనస్సు తాను కల్పించుకొన్న అడ్డుగోడలను దాటి ముందుకు పోలేకపోతే అది యొక పెద్ద దుఃఖమే.

5. ప్రశ్న:- ఘర్షణ లేకుండ మనమెట్లు సమగ్రతను సాధింపగలము?

కృష్ణమూర్తి:- ఘర్షణ వుండగూడదని మీ రెందుకనుకొంటారు? దాని నెందుకు ఆక్షేపిస్తారు? ఘర్షణ మిక్కిలి దారుణమైనదని మీరనుకొంటున్నట్లున్నది. ప్రస్తుతము మీకును నాకును మధ్య ఘర్షణమున్నది. మనం ఘర్షణ పడుతున్నాము – పడడం లేదా? నేనేదో మీకు చెప్పడానికై ప్రయత్నిస్తున్నాను, కాని, మీరర్థము చేసికోవడం లేదు. అందువలన మనిద్దరి మధ్య ఇప్పుడు ఘర్షణ వున్నది, అశాంతి వున్నది. అయితే, దానివలన తప్పేమి? మీ శాంతికి భంగము కలుగకూడదా? మీరెంత ప్రయత్నించినా, ఘర్షణ లేకుండా సమగ్రత రాదు. ఘర్షణ ద్వారా, ఆ ఘర్షణను అర్థం చేసికొనడం ద్వారానే, సమగ్రత లభిస్తుంది.

సమగ్రత చాల దుర్లభమైన వాటిల్లోనొకటి. సమగ్రత అనగా త్రికరణ శుద్ధి. అంటే – మీరు చేసే పనులలో, చెప్పే మాటలలో, ఆలోచించే ఆలోచనలలో

అభిన్నత్వముండడం. అన్యోన్య సంబంధమును అర్థము చేసికోకపోతే త్రికరణ శుద్ధి కలుగదు. అన్యోన్య సంబంధమనగా సంఘముతో, బీదవానితో, పల్లెటూరివానితో బిచ్చగానితో, కోటీశ్వరునితో, గవర్నరుతో మీకు గల పరస్పర సంబంధమే. ఈ సంబంధాన్ని అర్థం చేసికోవాలంటే దానితో ఘర్షణ పడాలి. పరంపరాగతమైన మీ సంప్రదాయము చేతను, తల్లిదండ్రుల చేతను, పూజారి చేతను, పురోహితుని చేతను, మతము చేతను, సంఘమందలి ఆర్థికవ్యవస్థ చేతను నిర్ణయింపబడిన విలువల నన్నింటిని మీ రెదురుతిరిగి ప్రశ్నించాలి. అంతేగాని, వాటిముందు గుడ్డిగా తలవంచరాదు. అందువల్లనే ఎదురు తిరిగి ప్రశ్నించడం చాల అవసరం, లేకపోతే మీలో త్రికరణ శుద్ధి కలుగదు; సమగ్రత రాదు.

*10 జనవరి, 1955*

★ ★ ★

# 10. అంతస్సౌందర్యము - ప్రేమ

పచ్చపచ్చని పంటచేలు, అస్తమించుచున్న సూర్యుడు, నిశ్చలమైన సరోవరము, మంచుతో కప్పబడి వున్న పర్వత శిఖరములు – వీటినుండి వచ్చి సర్వత్ర వ్యాపించెడి ఒక అద్భుతమైన ప్రశాంతతను మరియు సౌందర్య భావనను మన మెప్పుడో ఒకప్పుడైనా చవిచూచి వుంటాము. ఇంతకును అందమంటే యేమిటి? అది మన మనస్సులో కలిగిన అనుభూతి మాత్రమేనా లేక ప్రత్యక్షానుభూతికి ఇంద్రియానుభవమునకు తోడు మరేదైనా వున్నదా? మీరు వేసికొనే బట్టలను ఎన్నుకోవడంలో మీకు తగినంత నేర్పుంటే, ఒకదానికొకటి పొసగునట్లు రంగులను మీరు ఉపయోగించగలిగితే, మీ ప్రవర్తన గౌరవనీయంగా వుంటే, మీ వాక్కు శాంత గంభీరంగా వుంటే, మీరు తలెత్తుకొని ఠీవిగా నడుస్తూ వుంటే అదంతా అందంగానే పరిగణింపబడుతుంది. ఏమి, పరిగణింపబడదా? అయితే, అదంతా అంతస్సౌందర్యమునకు బాహ్య వ్యక్తీకరణము మాత్రమే – బుద్ధిస్థమైన దానిని పద్యరూపమునగాని వర్ణచిత్రరూపమున గాని బాహ్యమున వ్యక్తీకరించినట్లు. పచ్చని వరిపొలము నదిలో ప్రతిఫలిస్తూ వుంటే మీరు చూడవచ్చును గాని సౌందర్య భావన మాత్రం మీ మనస్సులో కలుగకపోవచ్చు, దానిని మీరు పట్టించుకోక పోవచ్చు. ఏటి నీటిపై క్రిందుగా ఎగురుతూ పోతున్న వానకోయిలలను ప్రతిదినము చూస్తూ వుండే బెస్తవారివలెనే నిర్లిప్తంగా మీరును చూస్తే మీరు వాటిని చూచినను చూడనట్లే. అట్లుగాక అటువంటి దృశ్యముల యందలి అపూర్వ సౌందర్యమును మీరు గమనించినట్లయితే మీలో గలిగే మార్పేమిటి? "ఆహా, ఇది యెంత అందంగా వున్నది!" అని మీచేత అనిపించేదేమిటి? ఇట్టి అంతరిక సౌందర్యభావనకు మూలమేమిటి? మంచి మంచి గుడ్డలు, అందమైన బొమ్మలు, ఆకర్షకమైన సామాను లేదా అసలు సామానే లేకుండ, ఒకదానికొకటి అనుగుణమగు కొలతలు గల గోడలు, చక్కని ఆకారముగల కిటికీలు – ఇటువంటివన్నీ బాహ్య సౌందర్యాన్ని సూచిస్తాయి. కాని, కేవలం బాహ్య సౌందర్యాన్ని గూర్చి నేను మాట్లాడడం లేదు. ఆంతరిక సౌందర్యమునకు మూలమేమని అడుగుతున్నాను.

ఈ ఆంతరిక సౌందర్య ముండవలెనంటే సంపూర్ణమగు ఆత్మసమర్పణ (abandonment) అత్యంతావశ్యకము. ఆత్మ సమర్పణలో తన్నెవరో పట్టియుంచినట్లు గాని నిర్బంధములో నున్నట్లు గాని భావన వుండదు. (అందులో అనాసక్తి, త్యాగ భావన చేరి వుంటాయి.) రక్షణ కోసమై ప్రయత్నమూ లేదు, దేనినీ నిరోధించడమున్నూ లేదు. కాని, ఆత్మసమర్పణతోబాటు ఆత్మసంయమము (austerity) లేనిచో అది అస్తవ్యస్తతకు సంక్షోభానికి దారితీస్తుంది. సంయమమంటే

తనకున్న కొద్ది పాటితో సంతృప్తి చెందడం, ఇంకా కావలెనని కోరకుండడం. ఆత్మ సమర్పణతోబాటు దృఢమైన అంతరిక సంయమము తప్పకుండా వుండాలి. ఇది అత్యంత సులభమైనది కూడ. ఇందులో మనస్సు సాధించుకోవడం, సమకూర్చుకోవడం లేదు. ఇంకా ఎక్కువ కావాలని కోరుకోవడం లేదు. ఇటువంటి ఆత్మసంయమముతో గూడిన ఆత్మసమర్పణ వలన కలిగెడి వినయము లేదా నిరాడంబరత సృజనాత్మక సౌందర్యసిద్ధికి కారణమవుతుంది. కాని, ప్రేమభావన లేనిదే వినయమూ లేదు, సంయమమూ లేదు. వినయము, సంయమముల గురించి మీరు చెప్పకోవచ్చును. కాని, ప్రేమభావన లేని వినయముగాని సంయమముగాని బలవంతముగా తెచ్చిపెట్టుకొన్నట్టివి. కాబట్టి ఆత్మ సమర్పణయూ లేనట్లే. ఆత్మ సమర్పణ చేసికొన్నవాడే, తన్ను తాను పూర్తిగా విస్మరించుకొన్నవాడే ప్రేమ గలవాడు. అట్టివాడే సృజనాత్మక సౌందర్యసిద్ధిని పొందగలవాడు.

సౌందర్య మన్నప్పుడు అందులో బాహ్య సౌందర్యము కూడ తప్పక చేరుతుంది. కాని, అంతరిక సౌందర్యము లేకుండా, కేవల బాహ్య సౌందర్యము – అనగా ఇంద్రియముల ద్వారా గ్రహింపబడు రూప సౌందర్యము – మనిషికి అధఃపతనము కలిగిస్తుంది. మనోవాక్కర్మల ఐక్యమును చెడగొట్టుతుంది. అంతరిక సౌందర్య ముండవలెనంటే మానవులనే కాదు, ప్రపంచమందలి సర్వప్రాణికోటిని సమస్త వస్తు జాతమును గూడ ప్రేమించవలెను. (సర్వవ్యాపకమైన ప్రేమ భావనయే అంతరిక సౌందర్యమునకు మూలము.) అట్టి ప్రేమగలవాడు సర్వప్రాణుల యోగక్షేమముల గూర్చి నిత్యము తీవ్రముగా చింతిస్తుంటాడు. ప్రతిదానిని మిక్కిలి మెలకువతో గమనిస్తుంటాడు, అంతము లేని ఓర్మి గలిగి వుంటాడు. గాయకునిగా గానపద్ధతి, కవిగా కవిత్వ లక్షణము మీకు క్షుణ్ణముగా తెలిసి యుండవచ్చు. బొమ్మలకు రంగులెట్లు వేయవలెనో, రచనలో పదముల నెట్లు కూర్చవలెనో మీరెరిగి యుండవచ్చు. కాని, మీలో యీ సృజనాత్మక సౌందర్యమే గనక లేకపోయినట్లైతే మీ ప్రజ్ఞలకు విలువ లేదు. మీ సామర్థ్యములకు అర్థము లేదు.

దురదృష్టవశాత్తు మనలో చాలమందిమి వివిధ కార్యముల నొనర్చుట యందు సామర్థ్యము మాత్రమే సంపాదించుకొంటున్నాము. కేవలము సాంకేతిక నిపుణుల మౌతున్నాము. జీవనాధారము కోసమై ఏవేవో పరీక్షలు పాసై, ఏదో యొక సాంకేతిక కళను సాధిస్తాము. కాని, మన అంతరిక స్థితిని గమనించకుండా, మన మనస్సును దాని మీదికి పోనీకుండా కేవలము ఏదో యొక సాంకేతిక కళను మాత్రమే సాధించడం వలన, ఏదో యొక పనిని చేయగల యోగ్యతను మాత్రం పెంపొందింప జేసికొనడం వలన మనము ప్రపంచ మందలి సౌందర్యభావనకు విఘాతము కలిగిస్తున్నాము, అసౌందర్యమును పెంపొందింప జేస్తున్నాయి. ప్రపంచమందు అవ్యవస్థను, సంక్షోభాన్ని పుట్టిస్తున్నాము. మనము మన లోపల సృజనాత్మక సౌందర్యమును ఉద్బుద్ధము చేసి కొన్నట్లయితే అది సహజంగానే బయటికి అభివ్యక్తమవుతుంది. దాంతో సువ్యవస్థ యేర్పడుతుంది. అయితే, యిది కష్ట సాధ్యము. ఏదో యొక సాంకేతిక కళను నేర్చుకోవడమే తేలిక. ఎందువల్లననగా, అంతరిక సృజనాత్మక సౌందర్యము మనలో జాగృతము కావలెనంటే, సంపూర్ణమైన ఆత్మసమర్పణము అత్యావశ్యకము. అందులో

భయముగానీ, రక్షణగానీ, నిర్బంధముగానీ, నిరోధముగానీ లేకుండా వుండవలెను. మనలో సంయమము ఉన్నప్పుడు మాత్రమే ఆత్మ సమర్పణము చేయగలము. బయటికి మనము చాల నిరాడంబరంగా, వినయంగా కనబడవచ్చు. చాల తక్కువ బట్టలతో కాలక్షేపం చేయవచ్చు. దినమున కొక పూట మాత్రమే భోజనం చేయవచ్చు. కాని, అది నిజమైన సంయమము కాదు. మన మనస్సు అనంతమైన అనుభూతిని పొందడానికి తగిన యోగ్యత కలిగియుండి, అట్టి అనుభూతి కలిగినప్పుడు కూడ అది చాల సాధువుగా, వినయంగా వుండగల్గితే, అప్పుడు మాత్రమే సంయమము సిద్ధిస్తుంది. మనస్సున కట్టి స్థితి రావలెనంటే "ఇంకా ఎక్కువ కావాలి" అనే ఆలోచన వుండరాదు. కాలక్రమేణ నేనింకా మారిపోగలనని గాని, ఇంకా ఏదో యెక్కువ సంపాదిస్తానని గాని ఆలోచన వుండరాదు.

నేను మాట్లాడుతూ వున్న విషయాలు మీకు అర్థం చేసికోవడానికి కొంత కష్టంగా వుండవచ్చు. కాని, అవి చాల ముఖ్యమైన విషయాలు. సాంకేతిక నిపుణులు నూతన సృష్టికర్తలు కాలేరు. ప్రపంచంలో సాంకేతిక నిపుణుల సంఖ్య పెరిగిపోతూ వున్నది. ఏ పని చేయవలెనో ఎట్లా చేయవలెనో వారికి తెలుసు. కాని, వారు సృజన శీలురు కాదు. అమెరికాలో ఒక విధమైన కంప్యూటరులున్నాయి (గణకయంత్రములు). మనిషి దినమునకు పదిగంటలవంతున పని చేస్తూ నూరు సంవత్సరములలో పరిష్కరింప గల గణిత సమస్యలను ఆ గణకయంత్రము (కంప్యూటరు) కొద్ది నిమిషాలలో పరిష్కరింపగలదు. ఇటువంటి అపూర్వములైన యంత్రములను వారు అభివృద్ధి చేస్తున్నారు. కాని, యంత్రములు సృష్టికర్తలు కానేరవు. మానవులు రానురాను యంత్రముల వలె తయారవుతున్నారు. వారెన్నడైనా తిరుగబడినా, ఆ యంత్రముల పరిధిలోనే తిరుగబడతారు. అందువలన అది నిజానికి తిరుగుబాటుకాదు.

అందువలన సృజనాత్మకత (సృజనశీలత) గలిగి వుండడమంటే యేమిటో తెలిసికోవడం చాల ముఖ్యము. ఆత్మ సమర్పణ వున్నప్పుడే సృజనాత్మకత వుంటుంది. అంటే, నిర్బంధమనే భావనయే లేనప్పుడు; తన యునికికి భంగము కలుగునని గాని, ఎట్టి లబ్ధిని పొందలేమని గాని ఏదోయొక స్థితికి చేరుకోలేమని గాని భయము లేనప్పుడు మాత్రమే అది సంభవమవుతుంది. అప్పుడు కఠినమైన సంయమము, వినయము, దానితో బాటు ప్రేమ వుంటాయి. అదియే సౌందర్యము, అదియే సృజనాత్మక స్థితి.

1. ప్రశ్న:- మరణానంతరం గూడ ఆత్మ జీవిస్తుందా?

కృష్ణమూర్తి:- నిజంగా మీరు దీనిని తెలిసికోదలిస్తే, యెట్లా తెలిసికోగలరు? శంకరుడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు వ్రాసిన పుస్తకాలు చదివి తెలిసికుంటారా లేక మీరు అనుసరించే నాయకుడుగాని, మహాత్ముడుగాని చెప్పిన దానిని విని తెలిసికొంటారా? బహుశా వారందరు చెప్పినదిన్ని అసత్యం కావచ్చుగదా? ఈ విషయాన్ని ఒప్పుకోవడానికి మీరు సిద్ధమేనా? అట్లయితేనే మీ మనస్సు ఈ విషయమై దర్యాప్తు చేయడానికి సిద్ధంగా వున్నట్లు.

నిజానికి మొట్టమొదట తెలిసికోవలసిన విషయం అసలు ఆత్మ అంటూ వున్నదా? అని. ఆత్మ అంటే యేమిటి? మీకు తెలుసునా? లేక మీ తల్లిదండ్రులుగాని, మీ మతగురువు గాని, ఏదో శాస్త్రగ్రంథముగాని, మీరున్న సాంస్కృతిక వాతావరణం గాని తెల్పితే దానిని మారుమాటాడక అంగీకరిస్తున్నారా?

ఆత్మ అనే పదము పైకి కన్పించే భౌతిక శరీరమును కాకుండా దాని కతీతంగా వుండే మరియొక దానిని దేనినో సూచిస్తుంది. అవునా, కాదా? మీ భౌతిక శరీరము, మీ నడత, మీ ప్రవృత్తులు, మీ మంచి గుణాలు – ఇవన్నీ పైకి తెలిసేవి, వ్యక్తములు. వీటికి అతీతంగా ఆత్మ అనేది వున్నదని మీరంటారు. అసలు అటువంటిదేదైనా వుంటే అది అలౌకికమై త్రికాలాబాధితమై యుండాలి. అటువంటి అలౌకికమైన వస్తువు మరణానంతరము గూడ జీవిస్తుందా? అని మీ రడుగుతున్నారు. ఇది ప్రశ్నలో నొక భాగము.

ఇక ప్రశ్నలో రెండవ భాగము: మరణమనగానేమి? మరణమంటే యేమిటో మీకు తెలుసునా? మరణానంతరము జీవిత ముంటుందో లేదో మీరు తెలిసికొనగోరుతున్నారు. కాని, చూశారా, ఆ ప్రశ్నకాదు ముఖ్యము; ముఖ్యమైన ప్రశ్న యేమిటంటే, మీరు జీవించియుండగా మృత్యువు గురించి తెలిసికొనగలరా? అని. మరణానంతరము జీవిత మున్నదని చెప్పినా, లేదని చెప్పినా – మీకు దానివలన గలుగబోయే ప్రయోజన మేమి? ఆ సమాధానం విన్న తరువాత గూడ మీకా విషయమై ఏమియు తెలియనట్లే. కాని, మరణమంటే యేమిటో మీ యంతట మీరు తెలిసికోగలరు. అది మరణించిన తరువాత కాదు, జీవించి ఆరోగ్యంగా బలంగా వున్నప్పుడే, మీ మనస్సు ఆలోచిస్తూ అనుభవిస్తూ వున్నప్పుడే.

ఇది కూడ విద్యలో నొక భాగము. విద్యావంతు డవడమంటే గణితము, దేశచరిత్ర, భూగోళశాస్త్రము మొదలైన వాటిల్లో పాండిత్యం సంపాదించడమే కాదు; మృత్యువని పిలువబడే ఈ అద్భుతమైన విషయాన్ని అర్థం చేసికోగల శక్తి గలిగి వుండడం కూడ. అదైనా శారీరకంగా చనిపోతూవున్న సమయంలో కాదు; బ్రతికి వుండంగానే, నవ్వుతూ కేరింతలు కొడుతూ, చెట్లు ఎక్కుతూ, పడవ నడుపుతూ, ఈదుతూ వున్నప్పుడే. మృత్యు వనేది అజ్ఞాత మైనది, తెలియనిది అట్లు అజ్ఞాతమైన దానిని మీరు జీవించియుండగానే జ్ఞాతము చేసికొనడం - తెలిసికొనడం – చాల అవసరము.

**2. ప్రశ్న:- మేము జబ్బుపడినప్పుడు మా తల్లిదండ్రులు మా గురించి ఎందు కంతగా చింతిస్తారు?**

కృష్ణమూర్తి:- చాలమంది తల్లితండ్రులు కనీసం కొంతవరకైనా తమ పిల్లల బాగోగులు చూచుకొంటారు. వాండ్లగురించి తగిన జాగ్రత్త తీసికొంటారు. కాని, వారు తమ పిల్లల గురించి అదేపనిగా చింతిస్తూ వుంటే దాని అర్థం, వాండ్లు తమ పిల్లల బాగుకంటే తమ బాగుకు ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నారన్నమాట! మీరు చనిపోవడం వారి కిష్టం లేదు. వారనేదేమంటే – "మా కొడుకుగాని కూతురుగాని చనిపోతే మా సంగతి యేమౌను?" అని. తల్లితండ్రులు తమ పిల్లలను నిజంగా

ప్రేమించినట్లయితే ఏం జరుగుతుందో మీకు తెలుసునా? మీ తల్లిదండ్రులు మిమ్ము నిజంగా ప్రేమించి నట్లయితే మీకు భయకారణమేమీ లేకుండేటట్లు చూస్తారు. మీరు ఆరోగ్యంగా సుఖంగా జీవించేటట్లు చూస్తారు. ప్రపంచంలో యుద్ధాలనేవి లేకుండేటట్లు, దారిద్ర్యము తొలగిపోయేటట్లు చూస్తారు. మిమ్ముగాని, మీ చుట్టు ప్రక్కల వుండే పల్లె ప్రజలను గాని, పట్టణవాసులను గాని, ఆఖరికి జంతువులను గూడ సంఘము అణగద్రొక్కి వేయకుండ, నాశనము చేయకుండ చూస్తారు. తల్లిదండ్రులు తమ పిల్లలను నిజంగా ప్రేమించరు కాబట్టే ప్రపంచంలో ఇన్ని యుద్ధాలు జరుగుతున్నాయి. అందువల్లనే ధనవంతులున్నారు, బీదవాళ్ళున్నారు. తల్లిదండ్రులు తమ పిల్లలలో తమ సర్వస్వాన్ని పెట్టుబడి పెట్టుకొంటారు. వారి ద్వారా తాము శాశ్వతంగా కొనసాగుతామని ఆశిస్తారు. అందుచేత మీరు బాగా జబ్బుపడితే వాండ్లు చింతిస్తారు. కాబట్టి, వారికున్న చింత అంతా తమ దుఃఖాన్ని గురించే. కాని, దీనికి వారొప్పుకోరు.

చూశారూ – ఆస్తి, భూమి, పేరు ప్రఖ్యాతులు, ధనము, కుటుంబము – ఇవన్నీ మనిషికి శాశ్వతంగా కొనసాగడాని కుపయోగపడే సాధనాలు. దీనినే అమరత్వమని కూడ అంటారు. కాబట్టి, తల్లితండ్రులు తమ పిల్లల కేదైనా సంభవిస్తే అదిరిపోతారు, దుఃఖ సముద్రంలో మునిగిపోతారు. ఎందుకనగా, వారి ప్రధానమైన చింత అంతా తమ బాగుగురించే! అట్లుగాక తల్లితండ్రులు నిజంగా తమ పిల్లల బాగునే కోరుకొనేటట్లయితే, ఒక్క రాత్రిలో సంఘమంతా మారిపోదా? అప్పుడు మన విద్యావిధానమే వేరు. మన యిండ్లే వేరు. ప్రపంచమునందిక యుద్ధములే వుండవు.

### 3. ప్రశ్న:- దేవాలయములలో పూజ కొఱకై అందరికిని ప్రవేశార్హత వుండవలెనా?

కృష్ణమూర్తి:- దేవాలయమనగానేమి? అదియొక పూజాస్థానము. అందులో దేవుని ప్రతీక వుంటుంది. ప్రతీక అంటే మనస్సుతో ఊహింపబడిన, రాతియందు చేతితో చెక్కబడిన ఒక విగ్రహము. ఆ రాయిగాని, ఆ విగ్రహముగాని దేవుడు కాదు. అవునుకదా? అది కేవల మొక ప్రతీక మాత్రమే, ఎండలో నడుస్తున్నప్పుడు భూమిమీదపడే మీ నీడలాంటిదా ప్రతీక. నీడ మీరు కాదు గదా? అట్లే గుడిలోని విగ్రహాలు ప్రతీకలే, దేవుడు కాదు, 'సత్యము' కాదు. అందువలన గుడిలోనికి ఎవరు పోతేనేమి, ఎవరు పోకపోతేనేమి? దీనికింత ఆర్భాటమెందుకు? సత్యమనేది యెండిపోయిన ఆకు క్రింద వుండవచ్చు, దారి ప్రక్కనగల రాతిలో నుండవచ్చు, సంధ్యాకాల సౌందర్యమును ప్రతిఫలింపజేయు నీళ్ళల్లో వుండవచ్చు, మేఘాల్లో వుండవచ్చు, బరువును మోస్తూ వున్న పడతియొక్క చిరునగవులో నుండవచ్చు. సత్యమనేది ఒక్క గుడిలోనే కాదు, ప్రపంచ మంతటను వున్నది. బహూశా గుడిలో సత్యముండక పోవచ్చును గూడ. ఏలయన, ఆ గుడి నిర్మాణానికి కారణము మనిషికుండే భయము, తన భద్రతయందతని కుండే అభిలాష. ఆ గుడి నిర్మాణము మానవులలోని కుల మతముల మీద ఆధారపడినది. ఈ ప్రపంచము మనది;

ఇచ్చట మనమందరము – మానవులము కలసి మెలసి జీవిస్తున్నాము. ఎవడైనా ఒక మనిషి నిజంగా దైవాన్ని అన్వేషిస్తూవుంటే, అతడు గుడులవైపు పోడు. అవి మానవులను వేరుచేస్తాయి కాబట్టి వాటినుండి దూరంగా పోతాడు. క్రైస్తవుల చర్చి, మహమ్మదీయుల మసీదు, మీ హిందువుల గుడి – ఇవన్నీ మనుషులను విభజించేవి. దైవమును అన్వేషించేవాడికి ఇవేమీ అక్కర లేదు. అందువలన ఎవరైనా గుడిలోకి ప్రవేశించవచ్చునా, ప్రవేశించరాదా యనేది కేవలము రాజకీయ విషయము. దానికి యథార్థ స్థితితో నెట్టి సంబంధమును లేదు.

## 4. ప్రశ్న:- మన జీవితంలో క్రమశిక్షణకు గల స్థానమేమి?

కృష్ణమూర్తి:- దురదృష్టవశాత్తు మన జీవితంలో దానికొక ముఖ్యమైన స్థానమే వున్నది. లేదంటారా? మీ జీవితంలో ఎక్కువ భాగము, "ఇది చేయండి, అది చేయకండి" అనే క్రమశిక్షణలోనే – అనుశాసనములోనే – గడుస్తుంది. ఎప్పుడు నిద్రనుండి లేవవలెనో, ఏమి తినవలెనో, ఏమి తినరాదో, దేని గురించి మీరు తప్పక తెలిసికొనవలెనో, దేని గురించి మీరు తెలిసికోరాదో – ఇవన్నీ మీకు చెబుతారు. మీరు చదువుకోవాలని, తరగతులకు పోవాలని, పరీక్షలు పాసు కావాలని – ఇట్లా యెన్నో మీకు చెబుతారు. మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు, మీ సంఘము, మీ సంప్రదాయము, మీ శాస్త్రగ్రంథములు – ఇవన్నీ మీరు ఏం చెయ్యాలో చెప్పతూ వుంటాయి. అందువలన మీ జీవితము క్రమశిక్షణకు లొంగి, దానిచే నిర్ణయింపబడిన హద్దులలోనే నడుస్తూ వుంటుంది. ఏమి, అట్లా లేదా? "ఇది చేయవచ్చును", "ఇది చేయరాదు" అనే విధి నిషేధములకు మీరు బందీలు; అవే మీ బోనుకు గల ఇనుప కమ్మీలు.

అయితే, ఆ విధంగా అనుశాసనబద్ధమైన మనస్సు ఏమైపోతుంది? నిజానికి మీరు దేనికైనా భయపడుతూ వుంటే, మీరు దేనినైనా నిరోధిస్తూ వుంటే, అప్పుడే క్రమశిక్షణ అవసరమవుతుంది. అప్పుడు మిమ్ము మీరు అదుపులో వుంచుకోవలసి వస్తుంది, జారి పడిపోకుండ నిలబెట్టుకోవలసి వస్తుంది. అట్టి క్రమశిక్షణలో – మీ యంతట మీరే స్వయంగానైనా నడుస్తారు లేదా సంఘమైనా మిమ్ము నడిపిస్తుంది. సంఘమంటే మీ తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, సంప్రదాయము, శాస్త్రగ్రంథములున్ను. కాని, మీ యంతట మీరు నిర్భయంగా విచారణ చేయసాగితే, పరిశోధింప సాగితే, నేర్చుకొంటూ అవగాహన చేసికొంటూ వుంటే అప్పుడు గాడ మీకు క్రమశిక్షణ అవసరమవుతుందా? కాదు. అప్పుడా అవగాహనయే మీ జీవితంలో క్రమతను తీసికొని వస్తుంది. ఆ క్రమత పైనుండి విధింపబడినది కాదు, నిర్బంధముచే వచ్చినది కాదు.

దీని గురించి మీరున్ను ఆలోచించండి. మిమ్ము భయపెట్టి మీచేత క్రమశిక్షణను పాటింప జేసేటట్లయితే, సంఘము యొక్క నిర్బంధములో మీరు నలిగిపోయేటట్లయితే, మీ తల్లిదండ్రులు, ఉపాధ్యాయులున్ను మీమీద పెత్తనం చలాయించేటట్లయితే అప్పుడు మీకు స్వతంత్రమూ లేదు, ఆనందమూ లేదు. మీలో వుండే చొరవ

అంతా నశించిపోతుంది. దేశ సంస్కృతి యెంత ప్రాచీనమైనదో సంప్రదాయము అంత బరువైనది. అది మిమ్ము క్రమశిక్షణలో పెడుతుంది. "ఇది చేయండి, అది చేయకండి" అని మిమ్ము నడిపిస్తుంటుంది. మీరా బరువు క్రిందపడి నలిగిపోతారు, మీ మనస్సులు చదును చేయబడతాయి – రోడ్డు రోలరు క్రింద రోడ్లు చదునైనట్లు. భారతదేశములో జరిగినదే అది. పరంపరా గతమైన సంప్రదాయపు బరువుక్రింద పడి నలిగిపోయి స్వతఃసిద్ధమైన చొరవ అంతా పూర్తిగా నశించిపోయింది. మీకిక స్వతంత్ర వ్యక్తిత్వమంటూ లేదు; మీరు సంఘమనే యంత్రములో నొక భాగము మాత్రమే. దానితోనే మీరు తృప్తిపడతారు! ఏమి, అర్థమవుతున్నదా? మీరు తిరుగబడరు, భగ్గుమని ప్రేలరు, త్రెంచుకొని బయటపడరు! మీరు తిరగబడడం మీ తల్లిదండ్రుల కిష్టము లేదు; త్రెంచుకొని బయటపడడం మీ ఉపాధ్యాయుల కిష్టము లేదు. అందువలన మీ చదువంతా సంప్రదాయమనే యినుప చట్రంలో మిమ్ము బంధించి వేయడం కోసమే; దాని కనుకూలంగా మెలగునట్లు మిమ్ములను మలచడం కోసమే. భయము మీ గుండెలను పిండివేస్తూ వుంటుంది కాబట్టి మీరు సంపూర్ణ మానవులు కాలేరు, కాబోరు. భయమున్నంతకాలము ఆనందమునకు తావులేదు, సృజనాత్మకతకు చోటులేదు.

5. **ప్రశ్న: ఇంతకుముందు దేవాలయములను గూర్చి మాట్లాడేటప్పుడు మీరు దేవుని యొక్క ప్రతీకను మనిషి నీడతో పోల్చినారు కదా! అసలు మనిషే లేనిచో అతని నీడ యెట్లా వుంటుంది?**

**కృష్ణమూర్తి:-** మీరు నీడతోనే తృప్తి పడతారా? ఆకలిగా వున్నవానికి ఆహారమును చూస్తేనే తృప్తి కలుగుతుందా? అట్లే గుడిలోని నీడతో మీరెందుకు తృప్తిపడాలి? సత్యమును తెలుసుకోవాలని గట్టి పట్టుదలే వుంటే, నీడలను వదిలి పెట్టెయ్యాలి. కాని చూశారా, మీరా నీడచేత, ఆ ప్రతీక చేత, ఆ రాతి విగ్రహం చేత సమ్మోహితులై పోయినారు. ప్రపంచంలో ఏమి జరిగిందో చూడండి. మనుషులలో విభేదాలు ఎందుకు వచ్చాయో చూడండి – మసీదులో ఒక విధమైన నీడను, చర్చిలో ఇంకొక విధమైన నీడను, గుడిలో మరియొక విధమైన నీడను ఆరాధిస్తున్నారు. కాబట్టి, ఈ నీడల సంఖ్యకు అంతము లేదు – ఎన్నైనా వుండవచ్చు. కాని, సత్యము మాత్రము ఒక్కటే. దాని నెవరును విభజింపలేరు. ఆ సత్యమును చేరుటకు ఒక మార్గమంటూ లేదు. క్రైస్తవుల మార్గము, ముస్లిముల మార్గము, హిందువుల మార్గము – ఇంకా ఎవరెవరివో వేర్వేరు మార్గములంటూ లేవు.

6. **ప్రశ్న:- ధనవంతుల పిల్లలకు భవిష్యత్తు ఎట్లాగూ నిశ్చితమే. కాబట్టి వారికి పరీక్షలు అనవసరము కావచ్చు. కాని, బీద పిల్లలు తమ జీవనాధార మును తాము వెదకుకోవలసి వస్తుంది కాబట్టి, వారికి పరీక్షలు అవసరం కాదా? ముఖ్యంగా ఇప్పుడున్న సంఘ పరిస్థితిని బట్టి చూస్తే వారికి వాటి అవసరమేమైనా తక్కువా?**

**కృష్ణమూర్తి:-** ఇప్పుడున్న సంఘాన్ని యథాతథంగా – ఎదురు తిరిగి

ప్రశ్నించకుండా – అంగీకరిస్తున్నారు, ఎందువలన? బీద వర్గానికి చెందని మీరు, సంపన్న కుటుంబాలకు చెందిన మీరు ఎందుకు తిరుగబడరు? సామ్యవాదిగానో, సమాజవాదిగానో కాకుండ, ప్రస్తుతమున్న యీ సంఘ వ్యవస్థ కంతటికి విరుద్ధముగా ఎందుకు తిరుగబడరు? మీకా అవకాశమున్నది. సత్యమేదో తెలిసికొనడానికి, క్రొత్త సంఘాన్ని సృష్టించడానికి మీ తెలివితేటల నెందుకుపయోగించరు? బీదవాడు తిరుగబడడు. ఎందువల్లనంటే, అతనికి ఆలోచించడానికి తగిన శక్తిగాని, సమయంగాని లేవు. అతనికి బొత్తిగా తీరుబడి లేదు. అతనికి ఆహారము, పని కావాలి. కాని, కొంత తీరుబాటు, మీ తెలివితేటల నుపయోగించుకోడానికి కొంత విడి సమయముగల మీరు ఎందుకు తిరుగబడరు? సరియైన సంఘమంటే, నిజమైన సంఘమంటే యెట్లుంటుందో కనుక్కొని, నూతన నాగరికతకు పునాది యెందుకు వేయరు? అది మీతో ఆరంభము కాకపోతే బీదవానితో అసలు కాదనుట స్పష్టము.

7. ప్రశ్న:- బీదవారికోసం ధనవంతులు తమకున్న దానిలో పెద్ద మొత్తం ఇవ్వడానికి ఎప్పటికైనా సిద్ధపడతారా?

కృష్ణమూర్తి:- బీదవారికోసం ధనవంతులు ఏమి యివ్వాలి అనే విషయమై మనమిప్పుడు చర్చించడం లేదు. వారేమిచ్చినా సరే, బీదవారికది తృప్తినీయదు. అసలు సమస్య అదికాదు. సంపన్నులైన మీరు, అందువలన మేధాశక్తిని పెంపొందింప జేసికోడానికి అవకాశమున్న మీరు, తిరుగుబాటు ద్వారా నవసమాజమును నిర్మింపలేరా? అది మీ మీదనే ఆధారపడి వున్నది – ఇతరుల మీద కాదు – అది మనలో ప్రతియొక్కని మీదను ఆధారపడి వున్నది; కేవలము ధనవంతుల మీదనో, బీదవారి మీదనో, సామ్యవాదుల మీదనో కాదు. చూశారా, మనలో చాలమందికి తిరుగుబాటు చేసే స్వభావమే లేదు. తెంచుకొని బయటపడడానికి గాని, అన్వేషించడానికి గాని తగినంత ప్రేరణ లేదు, ఉత్సాహము లేదు. అట్టి ఉత్సాహమే అన్నిటికంటె ముఖ్యము.

*11 జనవరి, 1955*

★ ★ ★

# 11. ధ్యానము

ఎప్పుడైనా మీరు కండ్లు మూసికొని ప్రశాంతంగా కూర్చుండి మీ ఆలోచనా ప్రక్రియను మీరు స్వయంగా గమనించారా? మీ మనస్సు ఎట్లా పని చేస్తున్నదో గమనించారా? లేదా, మీ మనస్సే తన్ను దాను ఎట్లా పని చేస్తున్నదో గమనించుకొన్నదా? మీ ఆలోచన లేమిటి? మీ భావా లేమిటి? వృక్షములవైపు, పుష్పములవైపు, పక్షులవైపు, మనుషులవైపు మీరేవిధంగా చూస్తున్నారు? ఏదైనా సలహా యిస్తే మీరు దానినెట్లా స్వీకరిస్తారు? ఏదైనా ఒక క్రొత్త అభిప్రాయం వెలిబుచ్చితే దానికి మీ ప్రతిక్రియ యెట్లా వుంటుంది? ఇవన్నీ మీరు గమనించవలసినవే. ఈ పని యెప్పుడైనా చేశారా? చేయకపోతే మీరెంతో నష్టపోయిన వారవుతారు. మనస్సు ఎట్లా పని చేస్తుందో తెలిసికోవడమే విద్యయొక్క ప్రధానోద్దేశము. మీ మనస్సు యొక్క ప్రతిక్రియ లెట్లా వుంటాయో మీకు తెలియకపోతే, మీ మనస్సు తాను చేసే పనులను తా నెరుగకపోతే సంఘమంటే యేమిటో అసలు తెలిసికొనలేరు. సాంఘిక శాస్త్రగ్రంథములను మీరు చదవవచ్చు, సాంఘిక విజ్ఞాన శాస్త్రమును మీరు అధ్యయనం చేయవచ్చు. కాని, మీ మనస్సెట్లు పని చేస్తున్నదో మీకు తెలియకపోతే సంఘమంటే యేమిటో మీరు వాస్తవంగా అర్థం చేసికోలేరు. ఎందువల్లనంటే, మీ మనస్సు సంఘములో ఒక భాగము–కాదు–అసలదే సంఘము! మీ ప్రతిక్రియలు, మీ నమ్మకాలు, మీరు గుడికి పోవడాలు, మీరు ధరించే బట్టలు, మీరు చేసే పనులు, చేయని పనులు, మీరు వేటిగురించి ఆలోచిస్తారో అవి – ఇవన్నీ కలిస్తే సంఘమవుతుంది. మీ మనస్సులో ఏమి జరుగుతున్నదో దాని ప్రతిరూపమే సంఘము. కావున మీ మనస్సు సంఘముకంటె భిన్నము కాదు. మీ సంస్కృతి, మీ మతము, మీలో వుండే వివిధములైన వర్గ భేదములు, మీలో వుండే ఆశలు, ఆరాటాలు, సంఘర్షణలు – వీటన్నింటికంటే మీ మనస్సు భిన్నము కాదు. ఇదంతా కలిస్తేనే సంఘము; అందులో మీరొక భాగము. సంఘముకంటే వేరుగా 'మీరు' లేరు.

ఇకపోతే, సంఘము చిన్నపిల్లల ఆలోచనా విధానమును ఎల్లప్పుడును తన వశములో వుంచుకొని, దానికొక రూపమిస్తే దానిని మలచడానికి ఎల్లప్పుడూ ప్రయత్నిస్తూ వుంటుంది. మీరు పుట్టిన క్షణం మొదలుకొని, మీకు ఊహ వచ్చినది మొదలుకొని, మీ తల్లితండ్రులు మీరేపనులు చేయవచ్చునో, ఏవి చేయగూడదో, వేటిని నమ్మవచ్చునో, వేటిని నమ్మరాదో – ఇవన్నీ అదే పనిగా మీకు నూరిపోస్తూ వుంటారు. దేవుడున్నాడనో, లేక ప్రభుత్వమే తప్ప వేరే దేవుడు లేడనో, లేదా ప్రభుత్వాన్ని నడిపే నియంతయే ఈశ్వరుడని లేదా ఈశ్వరుని దూతయని మీకు

చెబుతారు. శైశవం నుండి యీ విషయాలతో మీ మనస్సులను నింపుతారు. అంటే, ఎటు త్రిప్పితే అటు తిరిగే మీ లేతమనసులు, ప్రతిదాన్ని తెలిసికొందామనే కుతూహలము గల మీ మనసులు – సంవేదనా శీలములు, జిజ్ఞాసువులైన మీ మనసులు – క్రమక్రమంగా అన్నివైపులనుండి మూసివేయబడి, మలచబడి, ఆయా సంఘపు చట్రములలో ఇమిడిపోవునట్లుగా రూపొందింపబడతాయి. కాన సమూల పరివర్తనము తేగల విప్లవ వీరులు, క్రాంతి కారులు మీరు ఎన్నటికిని కాలేరు. ఒకే నిశ్చితమైన పద్ధతిలో ఆలోచించడానికి మీ రలవాటు పడిపోవడం చేత, ఒకవేళ మీరు తిరుగుబాటు చేసినప్పటికిన్ని మీరలవాటు పడిన పద్ధతిలోనే, మీరున్న మూసలోనే తప్ప దానిని వదిలి బయటికి రారు. ఇది యెట్లాంటిదంటే, ఖైదీలు మంచి భోజనము, ఎక్కువ సౌకర్యముల కోసం తిరుగుబాటు చేసినట్లు. వారెంత తిరుగుబాటు చేసినా, అది చెఱసాల యొక్క నాలుగు గోడల మధ్యనే! మీరు దేవునికోసం అన్వేషించినా, మంచి ప్రభుత్వం కోసం ప్రయత్నించినా, అదంతా సమాజము యొక్క పరిధి లోపలనే. సమాజమే చెబుతుంది, "ఇది సత్యము, అది అసత్యము. ఇది మంచిది, అది చెడ్డది. ఇతడు మంచి నాయకుడు. వారు మహాత్ములు" అని. కాబట్టి ఏవేవో పేరాశలు పెట్టుకొన్నవారు మంచి తెలివితేటలు గలవారు తీసికొని వచ్చిన తిరుగుబాట్లవలె మీ తిరుగుబాటు కూడ గతకాలపు ప్రభావము నుండి బయటపడదు. కాన, అది నిజమైన తిరుగుబాటు కాదు. అది తన హద్దులలోనే జరిగెడి, ఉత్కృష్ట కర్మాచరణము, వీరోచితమైన పోరాటము మాత్రమే. కాని, తన పరిధిని ఛేదించుకొని బయటికి వచ్చి విచారణ చేయడమే నిజమైన తిరుగుబాటు, వాస్తవమగు క్రాంతి.

చూశారా, సంస్కర్తల కందరికిని గల శ్రద్ధ అంతా – వారెవరైనా సరే – చెఱసాలలోని పరిస్థితులను చక్కదిద్దడంలోనే. అంతేగాని, సంఘ మర్యాదలకు సంఘపు కట్టుబాట్లకు లొంగిపోనక్కరలేదని, సంప్రదాయము మరియు అధికారమనెడి గోడలను బ్రద్దలుకొట్టుకొని మనసులను పట్టి వదలని సంస్కారములను విదిలించుకొని బయట పడమని వా రెన్నటికిని చెప్పరు. కాని, అదే నిజమైన విద్య; మీ బుఱ్ఱ నిండా నింపుకొన్న పాఠ్య విషయాలతో ఏదో విధంగా పరీక్షలు పాసు కమ్మని చెప్పడం, కంఠస్థము చేసి వ్రాయమనడం కాదు నిజమైన విద్య అంటే. మీ మనస్సును బందీ చేసిన చెరసాల గోడ లేవో చూచి గ్రహించడంలో సహాయపడడమే నిజమైన విద్యయంటే. సంఘము చేత మన మందరము ప్రభావితుల మౌతున్నాము. అది మన ఆలోచనాసరళిని నిరంతరము మార్చివేస్తూ వున్నది. దాని వత్తిడి తీవ్రమై, అది లోపలినుండియే వచ్చిన ఒత్తిడేమో అనిపిస్తుంది. కాని, ఆ ఒత్తిడి యెంత బలమైనదైనను ఎంత లోతుగా పోయినను అది బయటినుండి వచ్చిన ఒత్తిడేగాని, లోపలినుండి వచ్చినది కానేరదు. బాహిరమగు ఒత్తిడులచే మనస్సు మీద పడిన ప్రభావములను, సంస్కారములను పగులగొట్టుకొని బయటపడనంతవరకు ఆంతరికమనేది లేదు. మీరు ఏమీ ఆలోచిస్తున్నది, ఎట్లు ఆలోచిస్తున్నదిన్ని మీకు తెలియాలి. అంటే, మీ రేమతంలో పుట్టడం సంభవించిందో దాని ననుసరించి హిందువుగా ఆలోచిస్తున్నారా? ముస్లిముగా ఆలోచిస్తున్నారా? క్రైస్తవునిగా ఆలోచిస్తున్నారా? అనేది మీకు

తెలియాలి. మీరు దేనిని నమ్ముతున్నారో, దేనిని నమ్మడంలేదో మీరెరిగి యుండాలి. ఇదంతా సంఘము నడిచే తీరు. దానినెరిగి దానినుండి విడివడితే తప్ప మీకు విముక్తిలేదు. అప్పటివరకు మీరు బందీలే, స్వతంత్రుల మని మీరనుకొన్నప్పటికిన్ని.

కాని, మనలో చాలమందికి చెఱసాల యొక్క నాలుగు గోడల మధ్య తిరుగబడడంలోనే వారికి గల శ్రద్ధ అంతా. మరికొంత మంచి తిండి, మరికొంత వెలుతురు, మరికొంత ఆకాశాన్ని చూడగల్గడం కోసం ఇంకొంత పెద్ద కిటికీ – ఇవే మనకు కావలసినవి! హీన జాతివారు దేవాలయ ప్రవేశము చేయవచ్చునా లేదా అనేది మనకిప్పుడున్న పెద్ద చింత! ప్రస్తుత మొక కులాన్ని నాశనం చేయగోరుతాం. కాని, ఒక కులాన్ని నాశనం చేయడంలో మరియొక ఉచ్చకులానికి జన్మనిస్తున్నాం. అందువలన మన మెప్పటికిని బందీలమే, కారాగార బద్ధులమే. కారాగారంలో స్వాతంత్ర్యము లేదు. స్వాతంత్ర్యము చెఱసాల గోడలకు బయట వుంటుంది, సంఘము యొక్క పరిధికి బయట వుంటుంది. ఆ సంఘ పరిధి నుండి బయటపడవలెనంటే దాని యొక్క నిర్మాణమును మీరు అర్థం చేసికోవాలి. అంటే, మీ మనస్సును మీరు అర్థం చేసికోవాలి. నేటి నాగరికతను సృష్టించినది మనస్సు; సంప్రదాయ బద్ధమైన సంస్కృతిని లేదా సమాజమును సృష్టించినది మనస్సు. మీ మనస్సును మీరు అర్థం చేసికోకుండా కేవలము సామ్యవాదిగానో, సమాజవాదిగానో లేక మరొకవాదిగానో తిరగబడడంలో ప్రయోజనము మృగ్యము. అందువలన మీగురించి మీరు తెలిసికోవడం చాల అవసరం. మీరు చేసే కార్యకలాపాలను, మీ ఆలోచనలను, మీ భావాలను జాగ్రత్తగా గమనిస్తూ వుండాలి. ఇదే విద్యయంటే, కాదా? ఇట్లు మిమ్ము మీరు జాగ్రత్తగా గమనించుకొంటూ వుంటే, మీ మనస్సు సున్నితము, సంవేదన శీలము మరియు మిక్కిలి జాగృతమవుతుంది.

ఇది మీరు ప్రయత్నించి చూడండి – ఎప్పుడో భవిష్యత్తులో కాదు, రేపు లేదా ఈ మధ్యాహ్నమే. ఒకవేళ మీ గదిలో చాల మంది జనం వుండేటట్లయితే, మీ యింటినిండా మనుషులున్నట్టయితే, మీరు ఒంటరిగా ఎక్కడికో దూరంగా పొండి; ఏద్దైనా చెట్టు క్రింద కూర్చోండి లేదా ఏటిగట్టున కూర్చోండి. మీ మనస్సు ఎట్లా పని చేస్తున్నదో మెల్లగా గమనించండి. దానిని సరిదిద్దవద్దు. "ఇది తప్పు, ఒప్పు" అని అనవద్దు. ఒక సినిమా చూస్తున్నట్లుగా దానిని చూస్తూ వుండండి. సినిమాకు పోయినప్పుడు మీరా సినిమాలో పాల్గొనడం లేదుగదా! నటీనటులు పాల్గొంటారు; మీరూరక చూస్తూవుంటారు. అదే విధంగా మీ మనస్సు ఎట్లా పనిచేస్తూ వున్నదో గమనించండి. అట్లా గమనించడం చాల వినోదంగా వుంటుంది. సినిమా చూడడం కంటే వినోదంగా వుంటుంది. ఎందువల్లనంటే, మీ మనస్సు సమస్త ప్రపంచముయొక్క అవశిష్టాంశము. అందులో మానవ మాత్రులంద రనుభవించిన అనుభవముల సారమున్నది. అర్థమవుతున్నదా? మీ మనస్సే మానవత. ఎప్పుడైతే మీకిది ప్రత్యక్షంగా అనుభూతమవుతుందో అప్పుడు మీలో సర్వవ్యాపకమైన దయారసము నిండిపోతుంది. మీ అవగాహన నుండి అపరిమితమైన ప్రేమ పుట్టుకొని వస్తుంది. అప్పుడు మీకు అందమైన వాటిలోనుండే అందమేమిటో తెలుస్తుంది.

1. ప్రశ్న:- మీరు మాట్లాడుతున్న విషయాలన్నీ మీకెట్లా తెలిశాయి? అవి మాకెట్లా తెలుస్తాయి?

కృష్ణమూర్తి:- ఇది మంచి ప్రశ్న; కదా? ఇప్పుడు నా గురించి నేను కొంత చెప్పకొనేటట్లయితే నేనీవిషయాల గురించి యే పుస్తకాలున్నూ చదువలేదు; ఉపనిషత్తులు, భగవద్గీత మొదలైనవిగాని మనస్తత్త్వశాస్త్ర గ్రంథాలుగాని చదువలేదు. కాని, నేనింతకు ముందు చెప్పినట్లుగా, మీ మనస్సును మీరు గమనించి చూస్తూ వుంటే, అన్నీ అందులోనే వున్నాయి. కాబట్టి, ఆత్మజ్ఞానమును పొందడం కోసం యాత్ర ప్రారంభించింది మొదలు పుస్తకాలు అప్రధానమై పోతాయి. అది యొక వింత ప్రపంచంలోకి ప్రవేశించినట్లు; అక్కడ క్రొత్త క్రొత్త విషయాలను కనుగొనడం ఆరంభిస్తారు. అద్భుతమైన వాటిని కనిపెడతారు. కాని చూశారా, అక్కడ మీరు మీ 'అహము'నకు ప్రాధాన్యమిచ్చినట్లయితే - మీకు మీరు ప్రాధాన్యమిచ్చుకొనేటట్లయితే - అదంతా క్షణములో నశించి పోతుంది. "నేను కనిపెట్టినాను, నాకు తెలుసు. నేను దీనిని తెలిసికొన్నాను, దానిని తెలిసికొన్నాను, అందుచేత నేను చాల గొప్పవాణ్ణి" అని మీరనుకొన్న క్షణమే దారి తప్పతారు. దూరప్రయాణం చేయదలచుకొన్నవారు తక్కువ సామానుతో బయలుదేరాలి. ఉన్నతమైన పర్వత శిఖరాల నధిరోహింపదలచుకొన్నవారు చాల తేలికగా ప్రయాణం చెయ్యాలి.

కాబట్టి, యీ ప్రశ్న నిజంగా చాల ముఖ్యమైనది. తన్ను తాను తెలిసికొనడం (ఆత్మజ్ఞానము) ద్వారా, మనస్సు యొక్క పోకడలను గమనించడం ద్వారా సత్యమును దర్శిస్తాము, అవగాహన కలుగుతుంది. మీ పొరుగువానిని గురించి మీరేమి చెబుతారో, మీరెట్లా మాట్లాడుతారో, ఎట్లా నడుస్తారో, ఆకాశాన్ని అందలి పక్షులను ఎట్లా చూస్తారో, మనుషుల నెట్లా ఆదరిస్తారో, చెట్టు కొమ్మనెట్లా నరుకుతారో - ఇవన్నీ ముఖ్యమే. ఎందువల్లనంటే, యివన్నీ అద్దాలవలె మిమ్ము మీ యథార్థస్వరూపాన్ని యథాతథంగా తెల్పుతాయి. మీరు సావధానులై మిక్కిలి హెచ్చరికతో నుంటే, ఏ క్షణమున కాక్షణము ప్రతిదానిని క్రొత్తక్రొత్తగా కనుగొంటూ వుంటారు.

2. ప్రశ్న:- మనమెవరి గురించియైనా ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవచ్చునా, ఏర్పరచుకోగూడదా?

కృష్ణమూర్తి:- మనుషుల గురించి అభిప్రాయాలు పెట్టుకోవచ్చునా? ఎవరి గురించైనా ఒక అభిప్రాయాన్ని ఏర్పరచుకోవచ్చునా? మంచి చెడ్డ విమర్శించి నిర్ణయాలకు రావచ్చునా? మీ ఉపాధ్యాయుని గురించి మీకు కొన్ని అభిప్రాయా లున్నట్లయితే అప్పుడు మీకు మీ ఉపాధ్యాయుడు కాదు ముఖ్యము, ఆయనపై మీకున్న అభిప్రాయాలు ముఖ్యమౌతాయి. జీవితంలో జరిగేదే అది, కాదా? ప్రజల గురించి మనందరికి వేర్వేరు అభిప్రాయాలుంటాయి. మనమంటాము గదా, "అతడు మంచివాడు." "అతడు గర్విష్ఠి." "అతనికి మూఢ విశ్వాసము లెక్కువ." "అతడు అది చేస్తాడు, ఇది చేస్తాడు." ఈ విధంగా మనకున్ను ఎదుటివానికిన్ని మధ్య అభిప్రాయాల తెర అడ్డుగా వుంటుంది. కాబట్టి, మనము ఆ మనిషిని నిజంగా

చూడలేము, చూడము. ఎవరో ఏదో యొక పనిని చేయడం చూచి "అతడీ పని చేశాడు" అని అంటాము. అందువలన, జరిగిన సంఘటనలను తేదీలవారీగా గుర్తించడం ప్రధానమైపోతుంది. అర్థమౌతున్నదా? మీరు మంచిదని గాని చెడ్డదని గాని అనుకొన్న పనిని దేనినైనా ఎవరైనా చేయడం చూస్తే, అప్పుడతని మీద మీకొక అభిప్రాయం ఏర్పడి, అది మామూలుగా మీలో స్థిరపడిపోతుంది గూడ. మళ్ళీ పది రోజుల తర్వాతనో, సంవత్సరం తరువాతనో మీరతనిని కలిసినప్పుడు మీరింకా మీ అభిప్రాయాల కనుగుణంగానే అతని గురించి ఆలోచిస్తారు. కాని, యీ మధ్యకాలంలో అతడు మారిపోయివుండవచ్చు. అందువలన "అతడిట్లాంటివాడు" అని చెప్పగూడదు. ఇది చాల ముఖ్యం. "ఫిబ్రవరి నెలలో అట్లా వుండేవాడు." అని చెప్పవచ్చు. ఎందుకంటే, సంవత్సరాంతానికి అతడు పూర్తిగా మారిపోయి వుండవచ్చు. "మాకా మనిషి తెలుసును" అని మీరెవరి గురించైనా అంటే మీరన్నది పూర్తిగా తప్పయియుండవచ్చు. ఎందుకంటే, అతని గురించి మీకు తెలిసినది కొంతవరకే, లేదా ఒకానొక దినమున జరిగిన సంఘటనలనుబట్టి మాత్రమే. అంతకుమించి మీ కతని గురించి బొత్తిగా తెలియదు. అందువలన ఎప్పుడు ఎవరిని కలిసికొన్నా గతముతో ప్రభావితము కాని నిర్మలమైన మనస్సుతో కలసికోవలెనేగాని మీ మీ పక్షపాతములతో ముందుగానే ఏర్పరచుకొన్న అభిప్రాయాలతో ఉద్దేశాలతో కలిసికొనరాదు.

**3. ప్రశ్న:- మానసికమైన అనుభూతి యనగానేమి? మనమెట్లా దానిని పొందుతాము?**

**కృష్ణమూర్తి:-** శరీర విజ్ఞాన శాస్త్రపు పాఠాలు మీకుండి వున్నట్లయితే మీ ఉపాధ్యాయుడు మానవ శరీరమందలి నాడీమండల నిర్మాణమును గూర్చి, అది పని చేయు తీరును గూర్చి మీకు వివరించి యుండవచ్చు. ఎవరైనా మిమ్ము గిల్లితే మీకు నొప్పి పుట్టుతుంది. అంటే అర్థమేమిటి? మీ నాడులు మెదడుకు ఒక విధమైన సంవేదనను తీసికొనిపోతాయి. అప్పుడు మెదడు దానిని నొప్పిగా తెలియజేస్తుంది. అప్పుడు మీరంటారు, "నీవు నాకు నొప్పి కలిగించావు" అని. ఇది శరీరానికి సంబంధించిన అనుభూతి.

అదేవిధంగా మానసికానుభూతి కూడ కలదు. ఏమి, లేదా? ఎంతో అందంగా వున్నామని మీరనుకొంటూ వుంటారు. ఇంతలో ఎవరో వచ్చి "మీరు బొత్తిగా అనాకారు" లని అంటారు. అది విని మీరు చాల బాధ పడతారు. అంటే, దాని అర్థమేమిటి? మీరు కొన్ని మాటలు విన్నారు. అవి మిక్కిలి భరింపరానివని అవమానకరమైనవని మెదడు అర్థం విప్పి చెప్పుతుంది. అప్పుడు మీరు బాధపడతారు. ఎవరో వచ్చి మిమ్ము పొగిడినప్పుడు "ఈ మాటలు వినడానికెంత యింపుగా వున్నాయి" అని మీరంటారు. కాబట్టి ఈ భావన, ఈ ఆలోచన ఒక విధమైన ప్రతిక్రియ. గుండు సూది గ్రుచ్చుకొన్నదానికి అవమానానికి పొగడ్తకు ఇంకా యిటువంటి వానికిది ప్రతిక్రియ. ఇదంతా మానసికానుభూతి, ఇదే ఆలోచన జరిగే ప్రక్రియ. ఇంతేకాదు, ఇది యింకా క్లిష్టమైనది. మీరింకా లోతుకు పోయి చూడవచ్చును.

చూశారా, మనకేదైనా అనుభూతి కల్గితే దానికొక పేరు పెడతాము. ఏమి, పెట్టమా? అది చాల సుఖకరమనో అసుఖకరమనో అంటాము. మనకు కోపం వచ్చినప్పుడు ఆ యనుభూతి కొక పేరుపెడతాం – కోపమని. కాని, అనుభూతికి పేరు పెట్టకపోతే ఏమౌతుందో ఎప్పుడైనా ఆలోచించారా? ప్రయత్నం చేసి చూడండి. ఈసారి కోపము వచ్చినప్పుడు దానికి పేరు పెట్టవద్దు. దానిని కోపమని అనవద్దు. పేరు పెట్టకుండా ఆ యనుభూతిని మెలకువతో గమనించండి, ఏమి జరుగుతుందో చూడండి.

## 4. ప్రశ్న:- భారతీయ సంస్కృతికిని అమెరికా సంస్కృతికిని గల భేదమేమి?

**కృష్ణమూర్తి:-** అమెరికా సంస్కృతిని గూర్చి మాట్లాడుతున్నా మంటే, మన ఉద్దేశం అమెరికాకు తీసికొని పోబడిన ఐరోపా సంస్కృతిని గూర్చియే. అది అమెరికాలో నాటుకొని క్రమపరిణామము చెందుతూ పెరిగి భౌతికంగానూ, మానసికంగానూ గూడ నూతన సీమలను అధిగమించినది.

ఇక భారతీయ సంస్కృతి అంటే ఏమిటి? ఇక్కడ వున్న మీ సంస్కృతి యేమిటి? అసలు సంస్కృతి యనే మాటకు అర్థమేమి? మీ రెప్పుడైనా తోట పని చేసివుంటే నేల నెట్లా సంస్కరించి సిద్ధం చేస్తారో మీకు తెలుస్తుంది. మొదట త్రవ్వుతారు, రాళ్ళు తొలగిస్తారు, అవసరమైతే మిశ్రితమైన యెరువును వేస్తారు; అంటే – ఆకులు, ఎండుగడ్డి, పెంట ఇంకా రకరకాలైన సేంద్రియ పదార్థములు కలిపి అవన్నీ క్రుళ్ళిన తరువాత దానిని నేలను సారవంతము చేయడానికై వాడుతారు. అప్పుడు మొక్కలు నాటుతారు. ఈ సారవంతమైన నేల మొక్కకు పుష్టినిస్తుంది, పెంచుతుంది. ఆ మొక్క క్రమంగా పెరిగి పెద్దదై అద్భుతమైన ముద్దులు మూటగట్టే గులాబిపూవును పూస్తుంది.

భారతీయ సంస్కృతి గూడ అట్లాంటిదే. కోట్లకొలది మనుషులు తమ ప్రయత్నాలద్వారా, తమ సంకల్పముల ద్వారా కొన్నిటిని కోరుతూ, మరికొన్నిటిని నిరోధిస్తూ, సంతతము ఆలోచన సాగిస్తూ, బాధలను అనుభవిస్తూ, భయపడుతూ, కొన్నిటిని పరిహరిస్తూ, కొన్నిటిని ఉపభోగిస్తూ, నేటి యీ భారతీయ సంస్కృతికి కారకులైనారు. ఇందుకుతోడు ఇక్కడి శీతోష్ణస్థితి, ఆహారము, వస్త్రధారణ కూడ ఆ సంస్కృతి మీద తమ ప్రభావాన్ని చూపించినాయి. కాబట్టి, యీ సంస్కృతి కాధారమైన నేల, అంటే మనస్సు, చాల అద్భుతమైనది. అది ప్రస్తుత రూపమును పొందకముందు – అనగా పూర్తిగా సంప్రదాయ బద్ధము కాకముందు – ఇక్కడ కొందరు సృజనశీలురైన మహా పురుషులుద్భవించి ఆసియా ఖండమునంతటిని ఒక్క ఊపు ఊపియుండిరి. మీ మాదిరి "సమాజము యొక్క ఆదేశాలను మేము తప్పక పాటించాలి; లేకపోతే మా తండ్రి యేమనుకొంటాడో" అని వారనలేదు. పైగా వా రన్వేషించి అనిర్వచనీయమైన సత్యమును దర్శించినవారు. వారు తమ దర్శనము గురించి మిక్కిలి ఉత్సాహము చూపియుండిరి గాని ఉదాసీనులుగా నుండలేదు. ఇదంతా కలిసి భారతీయ సంస్కృతి అయినది. మీరు ఆలోచించే ఆలోచనలు, మీరు తినే తిండి, మీరు ధరించే వస్త్రాలు, మీ ఆచారవ్యవహారాలు, మీ

సంప్రదాయము, మీ మాటలు, మీ వర్ణచిత్రాలు, మీ శిలావిగ్రహాలు, మీ దేవతలు, మీ పూజారులు, పురోహితులు, మీ శాస్త్రాలు, ధర్మగ్రంథాలు – ఇవన్నీ కలిస్తే భారతీయ సంస్కృతి అవుతుంది, కాదా?

ఈ విధంగా భారతీయ సంస్కృతి యూరోపియను సంస్కృతి కంటే కొంత భిన్నముగా కన్పించినను ఆ రెండింటి మూల మందున్న ప్రేరణ మాత్రము సమానమే. ఈ ప్రేరణ అమెరికాలో మరియొక విధంగా అభివ్యక్తం కావచ్చు, అక్కడి అవసరాలు, ఆవశ్యకతలు వేరు కాబట్టి. అక్కడ సంప్రదాయము తక్కువ, శీతలీకరణ యంత్రములు, కార్లు మొదలైనవి యొక్కువ. కాని, మూలమందున్న ప్రేరణ మాత్రము సమానమే. అది సుఖాన్ని పొందడానికై దేవుడననేమో, సత్యమననేమో తెలిసికొనడానికైగల ప్రేరణ. ఈ ప్రేరణ ఆగిపోయినట్లయితే సంస్కృతి క్షీణిస్తుంది. అదే జరిగిన దీదేశములో. ఈ సహజ ప్రేరణను అధికారము, సంప్రదాయము, భయమున్ను ఎప్పుడైతే అడ్డగిస్తాయో అప్పుడే సంస్కృతి క్షయిస్తుంది, క్షీణదశను పొందుతుంది.

సత్యమును, దైవమును కనుగొనడానికై గల ప్రేరణయే నిజమైన ప్రేరణ. మిగిలిన ప్రేరణలన్నీ గౌణములు, అముఖ్యములు. నిశ్చలమైన నీటిలోనికి ఒక రాతిని విసరినపుడు అది పడిన చోటునుండి వృత్తాకారంలో చిన్న చిన్న అలలు అనేకం బయలుదేరి విస్తరించుకొంటూ ఒడ్డువరకు పోతాయి. అట్లు విస్తరించుకొనే అలలు అప్రధానములు; అవే సమాజము యొక్క ప్రతిక్రియలు. కాని, వాస్తవమైన ప్రేరణ కేంద్రమందుంటుంది; అది సుఖమును, దైవమును, సత్యమును కనుగొనడానికి గల ప్రేరణ. భయములో చిక్కుకొని యున్నంతవరకు బెదిరింపులకు లొంగి యున్నంతవరకు మీరు సత్యమును కనుగొనలేరు. బెదిరింపు, భయమున్ను తలయెత్తిన క్షణమునుండి సంస్కృతి క్షీణించడం మొదలుపెడుతుంది.

అందువలన మీరు చిన్నవారుగా నున్నప్పుడు సంప్రదాయమునకు బద్ధులు కాకుండా, మీ తల్లిదండ్రులకు సంఘమునకు భయపడకుండా వుండడం అవసరము. అప్పుడే సత్యమును కనుగొనడానికై కాలముతో సంబంధము లేని ప్రేరణ మీలో జాగృత మవుతుంది. సత్యమును దైవమును అన్వేషించెడివారు మాత్రమే నవీన నాగరికతను నూతన సంస్కృతిని సృష్టింపగలరు. అంతేగాని, అంధానుసరణము చేసేవారు కాదు, పాత సంప్రదాయమనే కారాగారంలోని నాలుగుగోడల మధ్య తిరుగుబాటు చేసేవారుకూడ కాదు. మీరు సన్న్యాసిదుస్తులు వేస్తే వేయవచ్చు, ఏదో యొక సంఘంలో జేరవచ్చు, ఒక మతం వదిలిపెట్టి మరియొక మతంలోకి పోవచ్చు, విముక్తికోసం ఎన్నోవిధాల తంటాలు పడవచ్చు. కాని, తత్త్వమును సత్యమును ప్రేమను కనుగొనడానికై తగినంత ప్రేరణ మీలో లేనట్టయితే మీ ప్రయత్నములన్నియు నిష్ప్రయోజనములు, అర్థరహితములు. మీరు మహా పండితులు కావచ్చు, ప్రజలందరు మెచ్చుకొనే మంచి పనులను చేయవచ్చు. కాని, అవన్నియు సంప్రదాయ మనెడి కారాగారము యొక్క నాలుగు గోడల మధ్యనే కాబట్టి, నిజమైన తిరుగుబాటుకు, నిజమైన క్రాంతికి ఉండే విలువ వాటికి బొత్తిగా వుండదు.

5. ప్రశ్న:- భారతీయుల గురించి మీ అభిప్రాయమేమి?

**కృష్ణమూర్తి:-** ఇది వట్టి అమాయకుడడిగే ప్రశ్న. ఏమి, కాదా? నిజాలను వాటిగురించి ఎట్టి అభిప్రాయాలు పెట్టుకోకుండా చూడడం వేరు, నిజాలపై ఏవో అభిప్రాయాలుంచుకోవడం వేరు. ప్రజలందరు మూఢవిశ్వాసాలలో భయంలో చిక్కుకొని వున్నారనే నిజాన్ని చూడడం వేరు, ఆ నిజాన్ని చూచి దానిని ఖండించడం, నిందించడం వేరు. అభిప్రాయాలు ముఖ్యం కాదు. ఎందుకంటే, నాకొక అభిప్రాయం వుండవచ్చు. మీకొక అభిప్రాయం వుండవచ్చు. మరియొకరికి మరియొక అభిప్రాయం వుండవచ్చు. కేవలం అభిప్రాయాల మీద ఆధారపడి చేసే ఆలోచన తెలివి తక్కువ ఆలోచన. ఇంతకు ఎట్టి అభిప్రాయాలు పెట్టుకోకుండా, మంచి చెడ్డల విమర్శ చేయకుండా ఒకదానితో నొకటి పోల్చకుండా నిజాలను ఉన్నవి ఉన్నట్లు చూడడం చాల ముఖ్యం.

ఎట్టి అభిప్రాయాలు పెట్టుకోకుండా సౌందర్యమును యథాతథంగా చూడడమే నిజమైన సౌందర్య దర్శనము. అదే విధంగా భారతదేశములోని ప్రజలను యథాతథంగా మీరు చూడగల్గితే ఎట్టి నిశ్చితాభిప్రాయాలు లేకుండా మంచి చెడ్డల విచారణ చేయకుండా మిక్కిలి స్పష్టంగా మీరు చూడగల్గితే అప్పుడు మీరు చూచిన విషయాలే వాస్తవములు.

భారతీయులకు తమవైన కొన్ని ఆచారవ్యవహారాలు, అలవాట్లు ఉన్నాయి. కాని వాస్తవానికి తక్కిన మనుజులందరి వలెనే వారున్ను విసుగుచెందుతారు, దుఃఖిస్తారు, భయపడతారు, క్రూరంగా వుంటారు. అందరివలెనే వారున్ను సంఘమనే కారాగారం నాలుగు గోడల మధ్యనే తిరుగబడతారు. అమెరికనుల మాదిరే వారికిన్ని సౌకర్యాలు కావాలి. అయితే, ప్రస్తుతం వారికున్నన్ని సౌకర్యాలు వీరికి లేవు. సంసారాన్ని వదిలి సన్న్యసించి ఋషుల మాదిరి వుండడానికి ప్రయత్నించడం వారికిగల బలమైన ఒక సంప్రదాయం. కాని, వారికిన్ని బాగా నాటుకొని పోయిన ఆశలు, ఆకాంక్షలు, దంభము, లోభము, ఈర్ష్యాసూయలు కలవు. లోకమంతట అందరు మనుష్యులలో వున్నట్లే వీరిలోను కుల భేదములు గలవు. అయితే, అవి వీరిలో మరింత తీవ్రమయినవి. ప్రపంచంలో ఏమి జరిగినా దాని ప్రభావాన్ని దాని సంపూర్ణ దృశ్యాన్ని భారతదేశంలో ఇంకా స్పష్టంగా దగ్గరినుండి చూడవచ్చు. మనలనందరు ప్రేమించాలని కోరుకొంటాము. కాని, ప్రేమ అంటే ఏమిటో మనకు తెలియదు. ఏదో సత్యపదార్థం కోసం తపిస్తూ విచారంగా వుంటాము. దానికోసం ఉపనిషత్తులు, భగవద్గీత, బైబిలు - ఇంకా ఇతర పుస్తకాల వైపు మన దృష్టి మరలిస్తాం. తుదకందరి శబ్దజాలములో ఊహాపోహలలో చిక్కుకొని దారితప్పుతాం. ఇక్కడగాని, రష్యాలోగాని, అమెరికాలోగాని మానవుని మనస్సు ఒకే విధమైనది. కాని, వేర్వేరు వాతావరణాలలో వేర్వేరు ప్రభుత్వాల క్రింద వేర్వేరు విధాలుగా అది అభివ్యక్తమవుతూ వుంటుంది.

*12 జనవరి, 1955*

★ ★ ★

# 12. అభయ భావన

చెఱసాల గోడల మధ్య జరిగే తిరుగుబాటును గురించి యింతవఱకు చర్చిస్తూ వచ్చినాము - అంటే, సంఘ సంస్కర్తలు, ఆదర్శవాదులు, ఏవేవో ఫలితాలను సాధించడం కోసం నిరంతరము పాటుపడే యితరులున్ను ఇటువంటి వారందరు తాము పొందియున్న సంస్కారములనే గోడల మధ్య, తామున్న సంఘవ్యవస్థ యొక్క గోడల మధ్య, పెక్కు మంది జనుల సమష్టిసంకల్పానికి అభివ్యక్తీకరణముగా నున్నట్టి సభ్యతా సంస్కృతుల యొక్క పరిధిలోపల ఎట్లు తిరుగుబాటును చేస్తారో చర్చించినాము. ఇప్పుడు అభయమంటే యేమిటో అదెట్లా కలుగుతుందో మనము చర్చించడం చాల ప్రయోజనకరంగా వుంటుందని అనుకొంటున్నాము.

చొరవ తీసికొని పనిచేస్తూ వుంటే విశ్వాసం కలుగుతుంది. కాని, నిశ్చిత పరిధిలోపల చేసెడి ఆ చొరవ ఆత్మవిశ్వాసాన్ని (Self confidence) మాత్రమే కలిగిస్తుంది. దీనిని అహంపూర్ణ విశ్వాస మనవచ్చు. దీనికిని అహం శూన్య విశ్వాసానికిని పోలికయే లేదు. ఆ రెండును పూర్తిగా భిన్నములు. విశ్వాసం కల్గియుండడమంటే యేమిటో మీకు తెలుసునా? మి చేతులతో మీరు స్వయంగా ఏదైనా పనిచేస్తే, స్వయంగా ఒక మొక్కను నాటి అది పెరగడం చూస్తే, ఏదైనా బొమ్మకు రంగు వేస్తే, ఒక పద్యం అల్లితే లేక మీరు పెద్దవాండ్లైన తరువాత ఒక వంతెన నిర్మిస్తే లేదా ప్రభుత్వ పరిపాలనకు సంబంధించిన పనినీ దేనినైనా చాలా బాగా నిర్వహిస్తే - అప్పుడు మీలో ఒక పనిని చేయగలమనే ధీమా - విశ్వాసం - కల్గుతుంది. కాని, మనకు తెలిసిన యీ విశ్వాసం చెఱసాల లోపలనే. ఈ చెఱసాల సామ్యవాదుల సమాజంగాని, హిందువుల సమాజంగాని, క్రైస్తవుల సమాజంగాని, మరి యే సమాజమైనా సరే - మనచుట్టు నిర్మించిన చెఱసాల. ఇట్టి చెఱసాల లోపల తీసికొన్న చొరవవలన ఒక విధమైన విశ్వాసం తప్పక కలుగుతుంది. మనం కొన్ని పనులు చేయగలమనే విశ్వాసమది - ఒక మోటారుకు రూపకల్పన చేయగలమని గాని, మంచి వైద్యులమో, గొప్ప శాస్త్రజ్ఞులమో, లేదా మరొకరమో కాగలమని గాని విశ్వాసము కలుగుతుంది. ఈ విధంగా సంఘవ్యవస్థలో నుంటూ సఫలత పొందడంలో, ఆ సంఘాన్ని సంస్కరించడంలో, దాని లోపలికి మరికొంత వెలుతురు వచ్చేటట్లు చేయడంలో, దానిలోపలి గోడలను అలంకరించడంలో సామర్థ్యమున్నట్లయితే, దానితో వచ్చే విశ్వాసము నిజంగా ఆత్మ విశ్వాసము, అహంపూర్ణ విశ్వాసము. అందులో మనమేదో చేయగలమనే జ్ఞానమున్ను, దానిని చేయడంలో మేము సమర్థులము కాన మేము గొప్పవారమనే భావనయున్ను వుంటాయి. అట్లుగాక విచారణ చేయటం ద్వారా, అవగాహన పొందడం ద్వారా మీరున్న సంఘము యొక్క

కట్టుబాట్లను ఛేదించుకొని బయటపడితే అప్పుడు పూర్తిగా విభిన్నమైన విశ్వాసమొకటి మీలో కల్గుతుంది. అందులో ఆత్మ ప్రాధాన్య భావనకు చోటులేదు. మన మీ రెండు విధములైన విశ్వాసములకు–అంటే అహంపూర్ణ విశ్వాసమునకును అహంశూన్య విశ్వాసమునకును – గల భేదమును అర్థము చేసికోగల్గితే మన జీవితమెంతో సార్థకమవుతుంది.

బాడ్మింటను, క్రికెట్టు, ఫుట్‌బాల్ లాంటి ఆటలను మీరు ఛాల బాగా ఆడినప్పుడు మీ మనస్సులో ఒక విధమైన ఆత్మ విశ్వాసం కలుగుతుంది. ఏమి, కలుగదా? నేను బాగా ఆడగలననే భావన అందులో వుంటుంది. గణిత సమస్యలను చాల వేగంగా మీరు పరిష్కరింపగలిగితే దానివలన గూడ మీకు ఆత్మప్రత్యయం కలుగుతుంది. సంఘ పరిధిలోనుంటూ చేసిన పనుల వలన విశ్వాసం కలిగినట్లయితే, దానితో బాటు ఒక విధమైన దురహంకారము కూడ కలుగుతుంది. ఏమి, కల్గదా? కార్యక్షమత గల్గినవానికి, కార్యమందు సాఫల్యమును పొంద సమర్థుడైన వానికి ఆత్మవిశ్వాసముతో బాటు దురహంకారముగూడ – అంటే "ఆ పని చేసిన వాణ్ణి నేనే" అనే భావన గూడ తప్పక వుంటుంది. కాబట్టి, ఫలితమును సాధించడంలో, చెఱసాల గోడల మధ్యగల సంఘమును సంస్కరించడంలో ఈ ఆత్మ దురహంకారము – అంటే, "నేను చేసితిని, నా ఆదర్శము గొప్పది, నా పక్షము గెలిచినది" – ఇటువంటి భావన తప్పక వుంటుంది. సమాజమనే చెరసాల యొక్క గోడల మధ్య వ్యక్తమయ్యే ఆత్మవిశ్వాసముతోబాటు, నేను – నాది అనే భావన ఎల్లప్పుడును తప్పక వుంటుంది.

ఆదర్శవాదులు ఎంత దురహంకారముతో వుంటారో మీరు గమనించలేదా? సంఘంలో పెద్ద పెద్ద సంస్కరణలు కొని తెచ్చినట్టి, కొన్ని ఫలితాలను సాధించినట్టి రాజకీయ నాయకులు తమ గొప్పతనానికి తాము పొంగిపోతూ తమ ఆదర్శాలకును అందులో తాము పొందిన సిద్ధికిని ఉబ్బిపోతూ వుండడం మీరు గమనించలేదా? వారి దృష్టిలో వారెంతో ముఖ్యులు. కొన్ని రాజకీయోపన్యాసములను చదవండి. సంఘసంస్కర్తలమని చాటుకొనే యీ మనుషులను కొందరిని గమనించండి. వారు కొనసాగించే సంఘ సంస్కరణోద్యమంలో వారు తమ అహమును ఎంతగా పెంచుకొంటున్నారో మీరు చూడగలరు. వారు తలపెట్టిన సంస్కరణలు ఎంత విస్తృతమైనవైనను, అవి చెఱసాల యొక్క నాలుగు గోడల మధ్యనే! కాబట్టి అవి వినాశకరములు; తుదకవి మనిషికి ఎంతో దుఃఖాన్ని సంఘర్షణను కలుగచేస్తాయి.

కాబట్టి, మీరీ సంఘవ్యవస్థనంతను, సంస్కృతి రూపములో నున్న సాముదాయక సంకల్పమును, నాగరికతయని పిలువబడే దానిని క్షుణ్ణముగా పరిశీలించి చూచినట్లయితే, – అదంతా అర్థం చేసికొని దానిని ఛేదించుకొని బయటపడితే, హిందువులుగాని, క్రైస్తవులుగాని, సామ్యవాదులుగాని, మీరెవరైనా సరే, మీమీ సంఘములనెడి కారాగారముల కుడ్యములను ఛేదించుకొని బయటికి వచ్చివేస్తే, అప్పుడు మీకు కలిగెడి విశ్వాసము దురహంకారముతో దూషితము కానిదని తెలిసికోగలరు. ఆ విశ్వాసము నిర్దోషము, నిర్వ్యాజము. అది వట్టి అమాయికమైన శిశువు యొక్క విశ్వాసము లాంటిది. ఆ పసిపాప దృష్టిలో చేయగూడని పని అంటూ లేదు. ఇటువంటి

అమాయికమైన విశ్వాసమే క్రొత్త నాగరికతను సృష్టింపగలదు. కాని, మీరు సంఘ వ్యవస్థకు లోబడియున్నంత కాలము ఇట్టి అమాయికమైన విశ్వాసము సిద్ధింపనేరదు. ఇట్టి విశ్వాసమును బహుశా అభయమని పిలువవచ్చు.

ఈ విషయాన్ని దయచేసి జాగ్రత్తగా వినండి. ఈ చెప్పే వక్త కానేకాదు ముఖ్యము. అతడు చెప్పేదానిలోని సత్యమును అవగాహన చేసికోవడమే ముఖ్యము. ఇంతకును విద్యయంటే అదే; కాదా? సంఘ వ్యవస్థలో ఇమిడిపోవడం కోసం మిమ్ము సిద్ధపరచడం కాదు విద్యయొక్క పరమార్థము. తద్విరుద్ధముగా, సంఘవ్యవస్థను పూర్తిగా లోతుగా క్షుణ్ణంగా అవగాహన చేసికొని, దానిని ఛేదించుకొని బయటపడడంలో సహాయపడడమే విద్య యొక్క ప్రధాన ప్రయోజనము. అప్పుడు మాత్రమే మీరు దరహంకారము లేని స్వతంత్ర వ్యక్తులౌతారు. అప్పుడు మీరు నిజంగా మాయామర్మములేని అమాయకులు, మీకున్న విశ్వాసము మాయామర్మము లేనిది.

సంఘంలో మనమెట్లు ఇమిడిపోగలం? లేదా, దానినెట్లు సంస్కరింపగలం? దాదాపు మనందరి ధ్యాస ఇదే. చాల విషాదకరమైన విషయం కాదా ఇది? మీరడిగిన ప్రశ్నలలో ఎక్కువ భాగము ఈ వైఖరిని ప్రతిబింబించడం మీరు గమనించలేదా? మీరడిగే ప్రశ్నల సారాంశ మేమంటే, "నేనెట్లు సంఘంలో ఇమిడి పోగలను? సంఘంలో ఇమడకపోతే మా తల్లితండ్రులు ఏమంటారో? నా గతి యేమైపోను?" అటువంటి వైఖరి మీలో వున్న ఆ కొద్దిపాటి విశ్వాసాన్ని, మీలో వున్న ఆ కొద్ది పాటి చొరవను నశింపజేస్తుంది. పాఠశాలలు, కళాశాలలు వదిలి స్వయంచాలిత యంత్రముల (automatons) వలె మీరును బయటికి వస్తారు. ఆ యంత్రములవలె బహుశా మీలో మిక్కిలి శక్తి సామర్థ్యములుండవచ్చు. కాని, సృజనాత్మకమగు జ్వాల మాత్రముండదు. అందువలన తామున్న సమాజాన్ని, తాము నివసించెడి పరిసరాలను బాగుగా అర్థం చేసికోవడం, అట్లు వాటిని అవగాహన చేసికోవడం ద్వారా వాటినుండి విడిపడడం చాల అవసరం.

చూశారా, ప్రపంచమంతటా వున్న సమస్య యిది. ఐరోపాలోగాని, రష్యాలోగాని, ఇక్కడగాని ప్రాత విలువలన్నీ నశించిపోతున్నాయి. జీవితాన్ని క్రొత్త దృష్టితో చూడడానికి, దానికి క్రొత్త విలువల నీయడానికిన్ని మానవుడు ప్రయత్నిస్తున్నాడు. జీవితమనేది యెడతెగని సవాలు. ఆ సవాలు నిత్యనూతనము. అందువలన ఆర్థిక వ్యవస్థలో ఏదో కొంత మార్పు తేవడం ఆ సవాలును సంపూర్ణంగా ఎదుర్కొంటున్నట్లు కాదు. నిత్యనూతనమగు ఆ సవాలును సంపూర్ణంగా ఎదుర్కొనడంలో సంస్కృతులు, నాగరికతలు, మానవజాతులు సమర్థములు కానట్లయితే అవన్నియు నశించిపోతాయి.

మీకు సరియైన విద్య గఱపబడకపోతే, పసిపిల్లలకు వలె యీ అద్భుతమైన విశ్వాసము, ఈ అభయ భావన మీలో లేకపోతే మీరు తప్పని సరిగా సమష్టిలో – సముదాయంలో లీనమైపోతారు; మీ జీవితములు నిరర్థకములై పోతాయి. మీ పేళ్ళ చివర కొన్ని అక్షరాలు చేర్చుకొంటారు. తరువాత పెండ్లి, పిదప పిల్లలు, అంతటితో కథ కంచికి, మనమింటికి – మీ వ్యక్తిత్వానికి మంగళహారతి.

చూశారా, మనలో చాలమందికి భయం. మీరందరు సంపూర్ణమానవులైపోతారేమోనని మీ తల్లితండ్రులకు భయం, మీ ఉపాధ్యాయులకు భయం, ప్రభుత్వములకు

భయం, మతములకు భయం. మీరందరు పరిసరముల ప్రభావానికి, సాంస్కృతిక ప్రభావానికి బందీలై 'భద్రంగా' వుండిపోవాలని వారందరి అభిప్రాయం. కాని సంఘనిర్మాణమును అర్థం చేసికొని దానిని ఛేదించుకొని బయటికి వచ్చినవారే, ఆ విధంగా తమ మనస్సులయందు నాటుకొనిపోయిన సంస్కారములకు బద్ధులు కాని వారే క్రొత్త నాగరికతను సృష్టింప గలవారు. అంతేగాని, కేవలం గ్రుడ్డిగా ఇతరుల ననుకరించేవారు కాదు; తామలవాటు పడ్డ పద్ధతికి భిన్నంగా వున్నదని తలచి, మరొక పద్ధతిని ఎదిరించేవారున్ను కాదు. దైవమును లేదా సత్యమును అన్వేషించడం చెరసాలలో నాలుగుగోడల మధ్య జరిగే పనికాదు. ఆ చెరసాలను అర్థం చేసికొని దాని గోడలను బ్రద్దలుగొట్టుకొని బయటపడడంలో ఆ యన్వేషణ ఆరంభమవుతుంది. విముక్తి దిశగా చేసెడి ఈ ప్రయాణమే క్రొత్త సంస్కృతిని క్రొత్త ప్రపంచాన్ని సృష్టిస్తుంది.

## 1. ప్రశ్న:- కృష్ణజీ, మనకెవరైనా తోడువుండాలని యెందుకు కోరుకొంటాము?

**కృష్ణమూర్తి:-** మనకు తోడు కావాలని ఎందుకు కోరుకొంటామని ఒక బాలిక అడుగుతున్నది. ఎవరికైనా తోడెందుకు కావాలి? భర్తగాని, భార్యగాని, పిల్లలుగాని, స్నేహితులుగాని లేకుండా ఒంటరిగా ఈ ప్రపంచంలో మీరు జీవింపగలరా? చాలమంది ఒంటరిగా జీవింపలేరు. కాబట్టి వాండ్లకు తోడు కావాలి. ఒంటరిగా వుండవలెనంటే అత్యధికమైన తెలివి కావాలి. పైగా దైవమును సత్యమును దర్శించవలెనంటే ఒంటరిగా వుండడం చాల అవసరం. భర్తగాని, భార్యగాని, మరెవరైనాగాని తోడుండడం, బిడ్డలుగూడ వుండడం పైకి చూడడానికి చాల బాగుంటుంది గాని, ఆ బాదర బందీలో చిక్కుకొని మనం నశించుతాం. కుటుంబ బాధ్యతలలో, ఉద్యోగ నిర్వహణలో క్రొత్తదనం లేక, విసుగు పుట్టిస్తూ ఏకరీతిగా కొనసాగే దైనిక జీవితంలో క్రమంగా క్షీణించి నశిస్తాం. అట్టి జీవితానికి అలవాటుపడిపోయి, ఆ తర్వాత ఒంటరిగా జీవించడమనే ఆలోచన వస్తేనే భయపడిపోతాం. మనలో చాలమందిమి మన భరోసానంతా, మన విశ్వాసమంతా ఏదో ఒకే దానిమీద వుంచుతాం – అన్ని గ్రుడ్లను ఒకే గంపలో పెట్టినట్లు. మన జీవితాలలో మన సహచరులు; మన కుటుంబాలు, ఉద్యోగాలు తప్ప మనకు మరే సంపదా లేదు. ధన సంపదను, జ్ఞాన సంపదను ఎవరైనా సంపాదించుకోవచ్చును. అట్టి సంపదగాకుండా మరొక విధమైన సంపద – అంటే ఆద్యంతములు లేని సత్యము యొక్క అన్వేషణ మనే సంపద – మన జీవితంలో వుండి వున్నట్లయితే అప్పుడు ఇతరుల సాహచర్యం కోసం ప్రాకులాడము, అది అప్రధానమవుతుంది.

కాని చూడండి, ఒంటరిగా స్వతంత్రంగా జీవించడమంటే ఎట్లో మీకు ఎవరును బోధించలేదు. మీరెపుడైనా ఒంటరిగా వాహ్యాళికి వెళ్తారా? బయటికి ఒంటరిగా పోవడం చాల అవసరం. ఏమీ పుస్తకాలు తీసికొని పోవద్దు. ఎవరినీ తోడుగా తీసికొని పోవద్దు. ఒంటరిగా పోయి ఏదైనా చెట్టుక్రింద కూర్చోండి. అక్కడ అన్నిటిని మెల్లగా పరిశీలిస్తూ వుండండి – చెట్టు నుండి ఆకు రాలడం గమనించండి. నీరు

తప తప కొట్టుకోవడం వినండి. బెస్తవాడు పాట పాడడం ఆలకించండి. పక్షి ఎగరడం చూడండి. అట్లే మీ మనో వీధిని ఒకదానివెంట నొకటి తరుముకొంటూ వస్తూవుండే ఆలోచనలను శ్రద్ధగా గమనిస్తూ వుండండి. మీరు ఒంటరిగా వుండి వీటినన్నిటిని గమనించి చూస్తూ వుంటే, మీ హృదయంలో అద్భుతమైన సంపదలను కనుగొనగలరు. వాటిపై మరెవరికిని అధికారము లేదు. ఏ ప్రభుత్వమున్ను పన్ను వేయలేదు. ఏ మానవ మాత్రుడున్ను వాటిని చెడగొట్టలేడు. అవి యెన్నటికిని నశించేవి కావు.

2. ప్రశ్న:- మీరు ఉపన్యాసాలివ్వడం సరదా కోసమా? కాలక్షేపం కోసమా? మాట్లాడి మాట్లాడి అలసిపోరా? మీరెందుకోసం ఈ పని చేస్తున్నారు?

కృష్ణమూర్తి:- ఈ ప్రశ్న అడిగినారు, నాకు చాల సంతోషం: మీరు దేనినైనా ప్రేమిస్తే దానియందు మీకు విసుగు పుట్టదు – అది మీకు తెలుసుగదా! నా ఉద్దేశంలో ప్రేమించడమంటే అందులో ఏదో ఫలితం పొందాలనే కోరిక వుండదు. ప్రేమద్వారా ఏదైనా ఫలితాన్ని ఆశించము. మీరు దేనినైనా ప్రేమించడం ఆత్మతృప్తికోసం కాదు. అందువలన దానిలో నిరాశ పొందడమంటూ లేదు. ఆ ప్రేమకు అంతమున్నూ లేదు. ఐతే మరి నేను ఎందుకిది చేస్తున్నాను? బహుశా ఇదేవిధంగా – గులాబి పూవు ఎందుకు వికసిస్తుంది? మల్లెపువ్వు ఎందుకు సువాసనలు విరజిమ్ముతుంది? పక్షి యెందుకు ఎగురుతుంది? అని కూడ మీరడుగవచ్చుగదా?

అయితే, మాట్లాడకపోతే యేమి జరుగుతుందో చూద్దామని తలచి నేను మాట్లాడకుండా వుండడానికి ప్రయత్నించాను. సంభాషణలు, ప్రసంగములు జరుపలేదు. అదీ బాగానే వుంది. ఏమి, నేను చెప్పేది మీకర్థమౌతున్నదా? ధనమో, బహుమానమో, పదిమందిలో గొప్ప పేరో ప్రసిద్ధో ప్రాముఖ్యమో లభిస్తుందని మీరు మాట్లాడుతూ వుంటే అందులో అలసట వుంటుంది. అది చెరుపు కలుగజేస్తుంది. అందుచే అది నిరర్థకము; కేవలము ఆత్మ తృప్తికోసమే చేయబడుతుందది. అట్లుగాక మీ హృదయంలో ప్రేమ అనేది వున్నట్లయితే, ఆ హృదయము మనఃకల్పితములైన వాటితో నిండి వుండకపోతే, అప్పుడది త్రికాలములందును నిర్మల జలమును ద్రవించెడి జలధారాయంత్రము (Fountain) వంటిది, ఊటబుగ్గ (Spring) వంటిది.

3. ప్రశ్న:- నేను ప్రేమించే మనిషికి కోపం వస్తే ఆ కోపమెందుకంత తీవ్రంగా వుంటుంది?

కృష్ణమూర్తి:- అసలు మీరు ఎవరినైనా ప్రేమిస్తారా? ప్రేమించడమంటే యేమిటో మీకు తెలుసునా? ప్రేమించడమంటే మీ మనస్సును మీ హృదయాన్ని మీ సర్వస్వాన్ని అర్పించి, దానికి బదులుగా ఏమిన్ని ఆశించకపోవడం, ప్రేమకు బదులు ప్రేమనిమ్మని భిక్షాపాత్రను ముందుకు సాచకపోవడం. ఏమి, అర్థమవుతున్నదా? అటువంటి ప్రేమ వున్నప్పుడు అక్కడ కోపమునకు అవకాశమే లేదు. మనమెవరినైనా మామూలుగా ప్రేమ అనబడే దానితో ప్రేమిస్తే మనకెందుకు కోపం వస్తుందో

తెలుసా? మన ప్రేమకు బదులుగా ఆ మనిషినుండి మనము దేనిని ఆశిస్తామో, అది మనకు లభించడం లేదు, అంతేనా? నేను నా భార్యనుగాని భర్తనుగాని కొడుకునుగాని కూతురునుగాని ప్రేమిస్తాను. కాని, వాండ్లేదైనా తప్పుచేస్తే వెంటనే నాకు కోపం వస్తుంది. ఎందువలన?

తండ్రికి తన కొడుకుమీదగాని కూతురుమీదగాని కోపమెందుకు వస్తుంది? ఎందుకంటే, తన బిడ్డ తాను కోరినట్లుండక, తాను చెప్పినపని చేయక, తానుద్దేశించిన చట్రంలో ఇమడక తిరుగబడడం మొదలుపెడుతుంది. తల్లితండ్రులు తమ ఆస్తి ద్వారాగాని, తమ బిడ్డలద్వారాగాని తమ ఆశలను ఫలింపజేసికోడానికి, తాము చిరంజీవులై పోవడానికి ప్రయత్నిస్తారు. తమకు నచ్చని పనిని బిడ్డ చేసినప్పుడు వాండ్లకు తీవ్రమైన కోపం వస్తుంది. బిడ్డ యెట్లా వుండవలెనో వారికొక ఉద్దేశమున్నది, ఒక ఆదర్శమున్నది. దాని ద్వారా వారు తమ ఆశయాలను నెరవేర్చుకొన దలుస్తారు. అందులోనే వారికి తృప్తి. అందువలన తమ ఉద్దేశాలకు భిన్నంగా బిడ్డలు నడుచుకొంటున్నప్పుడు వారికి కోపం వస్తుంది.

ఒక్కొక్కసారి మీ స్నేహితుని మీద మీకెంతో కోపం వస్తుంది, గమనించారా? ఇక్కడ కూడ జరిగేది అదే ప్రక్రియ. మీరతని నుండి యేదో ఆశిస్తూ వుంటారు. మీ ఆశ నెరవేరనప్పుడు మీరు నిరాశ చెందుతారు. నిజానికి దాని అర్థం యేమిటంటే, మీరు అంతరికంగా, మానసికంగా, ఆ మనిషి మీద ఆధారపడి వున్నారన్నమాట! కాబట్టి, మానసికమైన పరిధీనత ఎక్కడ వున్నదో అక్కడ ఆశాభంగము, చిరాకు తప్పవు. దానివలన కోపము, మాత్సర్యము, అసూయ – ఇంకా రకరకాలైన విరోధ లక్షణాలన్నీ కలుగుతాయి. అందువలన చిన్నప్పటినుండి మీరు ప్రేమిస్తూ వుండాలి – చెట్టునుగాని, పిట్టనుగాని, జంతువునుగాని, మీ ఉపాధ్యాయునిగాని, మీ తల్లినిగాని, మీ తండ్రినిగాని – ఎవరినైనా సరే, దేనినైనా సరే, సంపూర్ణభావముతో ప్రేమించడం చాల అవసరం. అప్పుడు స్వయంగా మీకే అర్థమవుతుంది – ఘర్షణ లేకుండా, భయం లేకుండా వుండడమంటే యేమిటో.

కాని చూశారా, చదువు చెప్పే ఉపాధ్యాయుడు మామూలుగా తన బాగోగుల గురించి తాను ఆలోచించుకొంటూ వుంటాడు; తన కుటుంబము, తన ఆదాయము, తన పదవి – వీటిని గురించిన చింతలలో తగుల్కొని వుంటాడు. అతని హృదయంలో ప్రేమంటూ వుండదు. విద్యావిధానంలో వున్న కష్టాలలో ఇది యొకటి. మీ హృదయంలో ప్రేమ వుండవచ్చు; చిన్నపిల్లలలో ప్రేమ వుండడం సహజం. కాని, ఆ ప్రేమను తల్లితండ్రులు, ఉపాధ్యాయుడు, సాంఘిక వాతావరణమున్ను త్వరలోనే నశింపజేస్తాయి. ఆ అమాయకత్వాన్ని, జీవితమును గుభాళింపజేసెడి ఆ ప్రేమను పోకుండా చూచుకోవడం చాల కష్టమైన పని. దానికెంతో తెలివి, లోచూపున్ను వుండాలి.

**4. ప్రశ్న:- మనస్సు తనకున్న అడ్డంకులనెట్లు అతిక్రమించి పోగలదు?**

**కృష్ణమూర్తి:-** తన అడ్డంకులను తాను దాటుకొని ముందుకు పోవాలంటే

మొట్టమొదట ఆ యడ్డంకులేవో మనస్సు తెలిసికోవాలి గదా? మీరు మీ మనస్సునకున్న పరిమితులను, హద్దులను, సరిహద్దులను మొదట తెలిసికోవాలి. కాని, మనలో చాల తక్కువమందికే వాటిని గురించి తెలుసును. మనకవి తెలుసునని అంటాం. కాని, అది వట్టి నోటిమాట. "ఇదిగో, ఇక్కడ వున్నది అడ్డంకి; ఇది నాలోని బంధము. దీనిని నేను అర్థం చేసికోవాలి. కాబట్టి, దీనిని విమర్శించి చూచుకొంటాను. ఇది యెట్లా వచ్చినదో, దీని స్వభావమేమిటో నేను చూస్తాను," అని మన మెప్పుడూ అనము. జబ్బేమిటో తెలిస్తే, దానిని నయం చేసికోవడానికి అవకాశముంటుంది. కాని, జబ్బేమిటో తెలిసికోవాలంటే – అనగా మనసునకున్న పరిమితులను, దానికున్న బంధాన్ని లేక ఆటంకాన్ని తెలిసికోవాలంటే, అనగా మనస్సును అర్థం చేసికోవాలంటే దానిని ఖండించకూడదు; ఇది తప్పు, ఇది ఒప్పు అని విమర్శించకూడదు. ముందుగానే ఎట్టి అభిప్రాయాన్ని ఏర్పరచుకోకుండా, దానియెడల పక్షపాతంగాని, విరోధంగాని లేకుండా జాగ్రత్తగా పరిశీలించాలి. ఈ పని చాల కష్టం. ఎందుకనగా, మనం తప్పు పట్టడానికి, ఖండించడానికి అలవాటుపడ్డ వాండ్లం.

పిల్లవాణ్ణి అర్థం చేసికోవాలంటే, ముందా పిల్లవాణ్ణి నిందించడం, తప్పు పట్టడం మానివేయాలి. వాణ్ణి నిందించడంలో అర్థం లేదు. వాణ్ణి ఆడుకొనేటప్పుడు, ఏడ్చేటప్పుడు, తినేటప్పుడు గమనించి చూడాలి. వాడి మనస్సు ఎప్పుడెట్లా వుండేది పరిశీలించాలి. అంతేగాని, ఆపిల్లవాడు అందవికారంగా వున్నాడు, తెలివి తక్కువ మొద్దు, ఇట్లాంటివాడు, అట్లాంటివాడని మీరన్నట్లయితే, మీరింక వాణ్ణి సరిగా గమనించలేరు, పరిశీలించలేరు. అదే విధంగా మనస్సునకున్న అడ్డంకులను – పైపైన కన్పించేవే గాకుండా, లోతుగా, అంతశ్చేతనలో వుండే వాటినిగూడ – గమనించాలంటే, వాటిని నిందించకుండా గమనించాలి. అప్పుడు మీ మనస్సు వాటిని దాటి ముందుకు పోగలదు. అట్లా ముందుకు పోవడమే సత్యము దిశగా పోవడము.

### 5. ప్రశ్న:- ప్రపంచంలో ఇంతమంది స్త్రీ పురుషులను దేవు డెందుకు సృష్టించినాడు?

**కృష్ణమూర్తి:-** దేవుడు మనలను పుట్టించినాడని ఎందుకనుకొంటారు? దీనికి సరళమైన వివరణ మేమంటే – ఇది జీవికి పుట్టుకతో వచ్చిన గుణం, సహజాతం (Instinct). ఈ సహజాతము, కోరిక, ఉత్కంఠ, మోహము – ఇవన్నీ జీవము యొక్క లక్షణములు. "జీవమే దైవ"మని మీరంటే, అది వేరే విషయం. అప్పుడు దైవమంటే సమస్తమున్ను – అంటే ఉత్కంఠ, మోహము, ఈర్ష్య, భయము – అన్నీ దైవమే. ఈ కారణాలన్నీ కలిసి మితిమీరిన జనాభావృద్ధికి తోడ్పడినాయి. దీనితో జనాభా సమస్య యేర్పడినది. ఈ దేశానికి వచ్చిన శాపాలలో ఇది యొకటి. కాని చూశారా, యీ సమస్య అంత సులువుగా పరిష్కరింపబడదు. మానవునికి పారంపర్యంగా సంక్రమించిన అవసరాలు, నిర్బంధాలు అనేకములున్నాయి. క్లిష్టమైన

ఆ ప్రక్రియనంతను అవగాహన చేసికోకుండా, కేవలం జనన శాతాన్ని – జనాభా వృద్ధి రేటును – నియమితం చేస్తామనడంలో అర్థం లేదు. మనమందరమున్ను కలిసి ఈ ప్రపంచాన్నంతను గందరగోళం చేసి వున్నాము. మనలో ప్రతియొక్కడున్ను దీనికి బాధ్యుడే. మనకు జీవించడమంటే యేమిటో తెలియదు. జీవించడమంటే యీ డాంబికమైన, మధ్యమమైన మరియు క్రమశిక్షణకు లొంగిపోయిన అస్తిత్వము కాదు. జీవించడమంటే దీనికి పూర్తిగా భిన్నమైనది. అది యెంతో సౌందర్యవంతమైనది, నిత్య పరిణామ శీలమైనది. అట్టి శాశ్వతమైన జీవిత ప్రవాహాన్ని అర్థం చేసికోనంత కాలము మన జీవితములు నిరర్థకములవడం తథ్యము.

*13 జనవరి, 1955*

★ ★ ★

# 13. సమానత్వము

ఎండిపోయిన పొడి నేలమీద వాన కురిస్తే చాల అద్భుతంగా వుంటుంది, కాదా? ఆకులు శుభ్రమవుతాయి; నేల చల్లబడుతుంది. వాన నీటిచేత చెట్ల దుమ్మంతా కడిగి వేయబడినట్లే మన మనస్సులు గూడ శుభ్రంగా కడిగివేయబడాలని ప్రక్షాళితములు కావాలని నేననుకొంటాను. మన మనస్సులు ఎన్నో శతాబ్దాల దుమ్ముతో నిండివున్నాయి. ఆ దుమ్మునే మనము జ్ఞానమని, అనుభవమని పిలుస్తాం. ప్రతి దినము మనం మన మనస్సులను శుభ్రం చేసికొంటూవుంటే, దుమ్మంతా కడిగివేసికొంటూ వుంటే, నిన్నటి జ్ఞాపకాలనుండి యీనాడు విముక్తమవుతూ వుంటే, అప్పుడు మన మనస్సులు నిర్మలములై, నవీనములై, జీవితమునకు సంబంధించిన అనేక సమస్యలను సమర్థవంతంగా ఎదుర్కొనగలవు.

ఇప్పుడు ప్రపంచాన్ని మిక్కిలి కలత పెడుతున్న పెద్ద సమస్యలలో ఒకటి 'సమానత్వం.' ఒక విధంగా చూస్తే ప్రపంచంలో సమానత్వమనేదే లేదు. మనకున్న శక్తిసామర్థ్యాలు వేర్వేరు – అందరికిని ఒకేరకంగా వుండవు. కాని, మనమిప్పుడా అర్థంలో సమానత్వాన్ని గూర్చి చర్చించడం లేదు. 'అందరినీ సమానంగా చూచుకోవాలి' అనే అర్థంలో సమానత్వం గూర్చి చర్చిస్తున్నాం. ఉదాహరణకు బడిలో ప్రిన్సిపాలు, ఉపాధ్యాయులు, విద్యార్థుల గృహపతులు (House parents) – వీరి పనులన్నీ జీతం కోసం చేసే పనులు, ఉద్యోగ ధర్మములు. కాని, కొన్ని పనులతో బాటు కొన్ని కర్తవ్యములతో బాటు హోదా అనేది ఒకటుంటుంది. దానిని అందరు గౌరవిస్తారు. ఎందుకంటే, హోదా అనగా అధికారము, పేరు, ప్రతిష్ఠ. హోదాలో వున్నవాడు ఇతరులను గద్దించవచ్చు, ఇతరులను ఆజ్ఞాపించి వారిచేత పనులు చేయించుకోవచ్చు – అదే అధికారమంటే. అతడు తన స్నేహితులకు గాని, బంధువులకుగాని ఉద్యోగాలు ఇచ్చుకోగలడు. కాబట్టి, ఉద్యోగ ధర్మంతో బాటు అధికారము లేదా హోదా అనేది ఒకటుంటుంది. కాని, యీ హోదా, యీ అధికారం, యీ పదవి, యీ ప్రతిష్ఠ, యీ ఆశ్రిత పక్షపాతం, యీ బంధుప్రీతి – యిటువంటి భావనలనన్నిటిని మనం తొలగించి వేయగల్గితే అప్పుడు ఉద్యోగానికి సరిక్రొత్త అర్థం వస్తుంది, సరళమైన అర్థం వస్తుంది, ఏమి, రాదా? చూడండి, అప్పుడు గవర్నరైనా, ప్రధానమంత్రులైనా, వంటమనుషులైనా, బీద బడిపంతుళ్ళైనా – ఎవరైనా సరే అందరినీ సమానంగా చూస్తారు, అందరికీ సమానంగా గౌరవం లభిస్తుంది. ఎందువల్లనంటే, వారందరు సంఘంలో తమ తమ కర్తవ్యాలను వేర్వేరుగా ఎవరివివారు చేసికొంటూ వుంటారు.

ముఖ్యంగా బడిలోనుండి అధికారాన్ని హోదాను ప్రతిష్ఠను, "నేను వీరందరికి తలపెద్దను, నేను చాల ముఖ్యమైన వాణ్ణి," అనే భావనను నిజంగా తొలగించి

వేయగల్గితే ఏమవుతుందో మీకు తెలుసా? మన ముండే వాతావరణమే పూర్తిగా మారిపోతుంది; ఏమి, మారిపోదంటారా? అప్పుడు ఒకరు ఎక్కువ, ఒకరు తక్కువ, ఒకడు గొప్పవాడు, ఇంకొకడు తక్కువ వాడు అనే భేద భావమే వుండదు. ఒకరిమీద నౌకరు పెత్తనం చెలాయించడం వుండదు. దానితో అందరి మనస్సులలో నుండి అరమరలు తొలగిపోతాయి, స్వతంత్రముంటుంది. ఏ బడిలోనైనా అటువంటి వాతావరణాన్ని సృష్టించడం చాల అవసరం. అటువంటి స్వేచ్ఛాపూరిత వాతావరణంలోనే ప్రేమ వుంటుంది. అటువంటి వాతావరణంలోనే ప్రతివాని హృదయ మందును అత్యధికమైన విశ్వాసము, అంటే అభయభావన ఏర్పడుతుంది. చూడండి, స్వగృహంలో మాదిరి నిర్భయంగా నిశ్శంకగా వున్నప్పుడే, మనకేమీ పర్వాలేదనే భావన పూర్తిగా వున్నప్పుడే విశ్వాసమేర్పడుతుంది, అభయముంటుంది. మీ యింట్లోనైనా సరే – మీ తండ్రి, మీ తల్లి, మీ నాయనమ్మ మీతో "ఇది చెయ్యి, అది చెయ్యి, ఇది చెయ్యవద్దు, అది చెయ్యవద్దు" అని అదేపనిగా చెబుతూ వుంటే మీకెంత ఇబ్బందిగా వుంటుంది? దానితో స్వయంగా ఏ పనిచేయడానికైనా సరే – మీకుగల విశ్వాసము, మీకుగల చొరవ అంతా క్రమంగా తొలగిపోతుంది. మీరు పెద్దవాండ్లయ్యేకొలది మీరాలోచించేది సత్యమవునా కాదా, సరియవునా కాదా యని చర్చించి తెలుసుకోగల్గియుండాలి. తెలిసికొని దానిని వదలకుండా పట్టుకొని వుండాలి. మీకు సరియని తోచిన దానికోసం మీరు గట్టిగా నిలబడగల్గియుండాలి – దాని వలన నొప్పికల్గినా సరే, దుఃఖము కల్గినా సరే, డబ్బుపోయినా సరే, ఇంకా యేమి జరిగినా సరే – అన్నింటినీ భరించగలిగివుండాలి. అట్టి స్థితికి రావలెనంటే, మీరు చిన్నప్పుడు పూర్తిగా సురక్షితమైన వాతావరణంలో నిర్భయంగా, సుఖంగా జీవించవలె.

పెక్కుమంది యువకులు భయగ్రస్తులు; వారి మనస్సులో మనకేమీ పర్వాలేదనే భావం, మనకు భద్రత గలదనే ప్రత్యయం లేదు. వారికి పెద్దలంటే భయం, ఉపాధ్యాయులంటే భయం, తల్లితండ్రులంటే భయం. అందువలన వారెన్నటికిని స్వేచ్ఛగా సంతోషంగా వుండలేరు. కాని, మీరే గనక అంత స్వేచ్ఛగాను సంతోషంగాను ఉండగల్గితే అద్భుతం జరుగుతుంది. మీరు మీ గదికిపోయి, తలుపు వేసికొని, ఎవరి కంట బడకుండా "అది చెయ్యండి, ఇది చెయ్యండి" అని మీమీద పెత్తనం చెలాయించే వాండ్లెవ్వరూ లేకుండా, మీ యంతట మీరు ఒంటరిగా వుండగల్గితే అప్పుడు మీలో ఒక విధమైన ఆత్మప్రత్యయం కలుగుతుంది. ఒక విధమైన విశ్వాసము, భద్రతా భావము కలుగుతుంది. దానితో మీరు వికసించడం ఆరంభిస్తారు, నిజమైన బోధ కలుగసాగుతుంది. మనస్సును కప్పిన పొర తొలగడం ఆరంభమవుతుంది. మీరట్లు వికాసం పొందడంలో తోడ్పడడమే – దానికి తగిన దోహదమివ్వడమే – బడియొక్క ముఖ్యకర్తవ్యము. అట్లు వికాసము పొందడంలో తోడ్పడనిచో ఆ బడి బడే కాదు.

ఎక్కడనైనా సరే, మీరు మీ సొంత యింట్లో మాదిరి స్వేచ్ఛగా నిర్భయంగా ఉండగలిగేటట్లయితే, మిమ్ము కొట్టరని తిట్టరని ఆ పనీ యీ పనీ చెప్పి బలవంతంగా మీ చేత యే పనీ చేయించరని నమ్మకం గలిగినట్లయితే, మీరు ఎట్టి

ఒత్తిడులు లేకుండా జీవింపగలిగినట్లయితే మీరు అల్లరిపనులు చేస్తారా? చేయరు. నిజంగా మీరు సంతోషంగా వుంటే మీరు ఇతరులను బాధించరు, ఏ వస్తువునూ ధ్వంసం చేయరు. కాని, విద్యార్థిని పూర్తిగా సంతోష పెట్టడం చాల కష్టమైన పని. ఎందుకంటే, అతడు బడికి వచ్చేటప్పటికే అతని మనస్సులో ప్రిన్సిపాలు, ఉపాధ్యాయులు, గృహపతులు తాను ఏమేమి చేయవలెనో చెప్పుతారని, తన చేత నానా చాకిరీ చేయిస్తారని ఒక భావన పడిపోయి వుంటుంది. అందువలన భయముంటుంది.

అంతస్తును, హోదాను గౌరవింపవలెనని బోధింపబడిన యిండ్లనుండి, పాఠశాలలనుండి మీలో చాలమంది వచ్చియుంటారు. మీ తల్లితండ్రులకు హోదా వుంటుంది. ప్రిన్సిపాలుకు హోదా వుంటుంది. అందుచేత మీరు భయముతో హోదాకు గౌరవమిస్తూ వస్తారిక్కడికి. కాని, మనమిక్కడ పాఠశాలలో నిజమైన స్వేచ్ఛాపూరిత వాతావరణాన్ని సృష్టించవలెననుకున్నాం. అది సృష్టించబడాలంటే హోదాతో నిమిత్తంలేకుండా, అందరూ సమానమనే దృష్టితో ఎవరి పనులు వారు చేసికొంటూ పోవాలి. అందుకు మీరు దేనికినీ భయపడకుండా హోదాను గౌరవించాలనే తప్పుడు అభిప్రాయం పెట్టుకోకుండా, సంవేదనాశీలురై శక్తి సంపన్నులగు ఉత్తమ మానవులుగా జీవించడంలో సహాయపడడమే సద్విద్యయొక్క నిజమైన లక్ష్యము.

1. ప్రశ్న:- మాకు ఆటలమీద వున్నంత ప్రీతి చదువుమీద ఎందుకుండదు?

**కృష్ణమూర్తి:-** దాని కొకే కారణం, స్పష్టమైన కారణం – మీ ఉపాధ్యాయులకు పాఠాలు చెప్పడం చేతకాదు, అంతే! దానికేదో వేరే పెద్ద కారణమంటూ లేదు. గణితంగాని, దేశ చరిత్రగాని మరి యేదైనా గాని ఉపాధ్యాయుడు తాను బోధించే దానిని తాను నిజంగా ప్రేమిస్తున్నట్లయితే మీరు గూడ ఆ పాఠ్య విషయాన్ని ప్రేమిస్తారు. ఎందువల్లనంటే, ప్రేమ అనేది సాంక్రామికము. దాని ప్రభావము చుట్టు ప్రక్కల నున్నవారి మీద తప్పక పడుతుంటుంది. అది మీకు తెలియదా? గాయకుడు ప్రేమతో గానము చేస్తూ అందులో లీనమైపోతే, వింటూ వున్న మీలో గూడ అదే భావము పుట్టదా? అటువంటి గాయకుని పాట వింటూవుంటే మీకు గూడ అతని మాదిరే పాట పాడడం నేర్చుకొందామని బుద్ధి పుట్టుతుంది గాదా? అయితే, చాలమంది టీచర్లకు తాము బోధించే విషయం మీద తమకే ప్రేమ వుండదు. అదంటేనే వారికి విసుగు. వేరే బ్రతుకు తెరువులేక, తప్పనిసరై ఆ వృత్తిని చేపడతారు. రోజూ వాడుక ప్రకారం, గత్యంతరం లేక, పాఠాలు చెబుతూ వుంటారు. అట్లుగాక నిజంగా మీ ఉపాధ్యాయులకు పాఠాలు చెప్పడంలో ప్రేమే వుండేటట్లయితే మీరేమౌతారో తెలుసా? అద్భుతమైన మానవులుగా తయారవుతారు. అప్పుడు మీరు మీ ఆటలను మీ పాఠాలనే గాదు, పువ్వులను, పక్షులను, నదులను, భూమిని అన్నింటిని ప్రేమిస్తారు. మీ హృదయాలలో ఈ ప్రేమభావము నిరంతరము స్పందిస్తూనే వుంటుంది. మీరు చాల వేగంగా నేర్చుకొంటారు. మీ మనస్సులు మట్టములు గాకుండా అత్యుత్తమములుగా తయారవుతాయి.

అందువలన ముందు విద్యాబోధకులకు విద్యను బోధించడం చాల అవసరం. కాని ఇది చాల కష్టమైన పని. ఎందువల్లనంటే, ఎక్కువ మంది విద్యాబోధకులు తమ తమ అలవాట్లలో బాగా స్థిరపడిపోయివుంటారు. అలవాట్లకు లొంగిపోయి వుంటారు. పిల్లలలోనైతే అలవాట్లు అంత లోతుగా నాటుకొని వుండవు. మీరు కనీసం ఏదో ఒకదానినైనా నిజంగా ప్రేమిస్తే – అంటే ఆటలనుగాని, లెక్కలనుగాని, దేశచరిత్రను గాని, రంగులు వేయడాన్ని గాని, పాటలు పాడడాన్నిగాని దేనినైనాసరే ఏదో ఒకదానిని ప్రేమించినా – మీ బుద్ధి చురుకుగా సజీవంగా పనిచేస్తుంది. అప్పుడు మీరు మీ పాఠాలనన్నిటిని చాల చక్కగా చదువుకోగలుగుతారు. మీ చదువు బాగా కొనసాగుతుంది. అసలు మీ మనస్సుకు అన్నీ తెలుసుకోవాలనే కుతూహల మెక్కువ. మీరు అన్నిటిని విమర్శించి చూడాలనుకొంటారు. కాని, తప్పుదారిన విద్యాబోధన జరగడం చేత ఆ కుతూహలమంతా త్వరలోనే చచ్చిపోతుంది. అందువలన విద్యార్థితో బాటు విద్యాబోధకునికి గూడ విద్య బోధింప వలసి యున్నది. అసలు జీవించడమంటేనే చదువు కోవడం, నేర్చుకోవడమున్ను. పరీక్షలకు ముగింపంటూ వుంటుంది. కాని, చదువుకోవడాని కుండదు. మీ మనస్సు జిజ్ఞాసువై, సావధానమై వున్నట్లయితే మీరు ప్రతియొక్క విషయమునుండి నేర్చుకోవచ్చును.

2. **ప్రశ్న:- ఏదైనా ఒక విషయం తప్పని గ్రహిస్తే ఇక ఆ తప్పు మనలో నుండి తొలగిపోతుందని మీరు చెప్పివున్నారుగదా! పొగత్రాగడం తప్పని నేను ప్రతిదినము గ్రహిస్తూనే వున్నాను కాని, ఆ యలవాటు పోవడం లేదు!**

కృష్ణమూర్తి:- మీ తల్లిదండ్రులుగాని, ఉపాధ్యాయులుగాని, ఇరుగుపొరుగువారుగాని లేదా మరెవ్వరైనా సరే పెద్దవాండ్లు పొగ త్రాగుతూ వుండగా మీరెన్నడైనా చూచి వుండలేదా? అది వాండ్లకొక అలవాటై పోయింది; కాలేదంటారా? దినం తరువాత దినం, సంవత్సరం తరువాత సంవత్సరం, వాండ్లు అలాగా పొగత్రాగుతూనే వుంటారు. వాండ్లా అలవాటుకు బానిసలై పోయినారు. ఆ విధంగా దానికి బానిసలై పోవడం యెంత బుద్ధి తక్కువ పనో చాలమంది తెలిసికొని ఆ యలవాటును పోగొట్టుకోవడం కోసం దానితో పోరాడసాగుతారు. దానికి వ్యతిరేకంగా వారు తమ్ము తాము కట్టుబాటులో వుంచుకోవడానికి ప్రయత్నిస్తారు. దానిని ఎదిరిస్తారు. దానిని వదిలించుకోడానికి ఎన్ని విధాలుగానో తంటాలు పడతారు. కాని, అది పోదు; అది యింకా గట్టిపడుతూ వుంటుంది. చూడండి, యీ అలవాటనేది ఒక నిర్జీవమైన వస్తువు, యాంత్రికంగా మారిపోయిన ఆచరణము. దానితో పోరాడే కొలది అది యింకా బలం పుంజుకొంటూ వుంటుంది. అట్లుగాక పొగ త్రాగేవాడు తన అలవాటును తాను సాక్షీభూతంగా వుండి గమనిస్తూ వుంటే, అనగా తన జేబులోనికి చేయిపెట్టడం, సిగరెట్టును పైకి తీయడం, దాని నొకవైపు తట్టడం, నోటిలో పెట్టుకోవడం, వెలిగించడం, గుప్పున పొగ వదలటం – ఈ పనులన్నిటిని పొగ త్రాగిన ప్రతిసారి అతడు సాక్షీభూతంగా వుండి గమనిస్తూ వుంటే, దానిని తెగడకుండా, పొగ త్రాగడం ఎంత దారుణమైన చెడ్డ పని యని అనకుండా, కేవలం

గమనిస్తూ వుంటే, అప్పుడా యలవాటు కతడు క్రొత్తగా బలం చేకూర్చడంలేదు. కాని, స్థిరపడిపోయిన ఏ యలవాటునైనా మీరు నిజంగా వదులుకోదలచుకొంటే దాని నింకా లోతుగా పోయి విచారించి చూడవలసి వుంటుంది. అంటే, మనస్సు ఆ యలవాటు నసలు ఎందుకు చేసికొన్నదనే ప్రశ్నను పూర్తిగా పరిశీలించవలసి వుంటుంది. అనగా, మనస్సు ఎందుకంత అనవధానముగా, పరాకుగా వున్నదో తెలిసికోవలసి వుంటుంది. ప్రతిదినం మీరు కిటికీ గుండా బయటికి చూస్తూ పండ్లు తోముకొంటూ వుంటే, ఆ పండ్లు తోముకోవడమనేది ఒక అలవాటుగా మారిపోతుంది. అట్లుగాక ప్రతిదినము చాల జాగ్రత్తగా మీ మనస్సంతా దానిమీదే వుంచి, పండ్లుతోముకొంటూ వుంటే అప్పుడది అలవాటుగా మారిపోదు, ఆలోచనా రహితంగా మరల మరల చేసే ఒక నిత్యాచర్యగా అది మారిపోదు.

మీరు ఇది చేసిచూడండి, ఇటువంటి అలవాట్ల ద్వారా మనస్సు ఎట్లా నిద్రలోకి జారుకొంటుందో, ఆ తర్వాత ఆ నిద్ర మత్తులోనే యెట్లా వుండిపోదలుస్తుందో మీరు బాగా గమనించండి. చాలా మంది యొక్క మనస్సులు అలవాటనే గాడిలోనే ఎప్పుడూ నడుస్తూ వుంటాయి. మనం పెద్దవాండ్లమయ్యేకొద్దీ, యీ స్థితి యింకా దిగజారిపోతుంటుంది. బహుశా మీరిప్పటికే డజనులకొలది అలవాట్లు చేసికొనే వుంటారు. మీ తల్లితండ్రులు చెప్పినట్లు చేయకపోతే, మీ తండ్రి కోరిక ప్రకారం మీరు పెండ్లి చేసికోకపోతే ఏమౌతుందో యని మీకు భయం. అంటే అప్పుడే మీ మనస్సు ఒక గాడిలో పని చేయడం మొదలు పెట్టిందన్నమాట! మీరు పది పదిహేనేండ్ల చిన్నపిల్లలే కావచ్చు; కాని, ఒకే గాడిలో మీ మనస్సు పని చేయడం మొదలు పెట్టిందంటే మీరు ముసలివారై పోయినట్టే లెక్క. అంటే అంతర్గతంగా మీకు శైథిల్యం ఆరంభమయింది, క్షీణించడం మొదలుపెట్టినారు. మీ శరీరం ఆరోగ్యంగా వుండవచ్చు. అంతే, అంతకంటే యేమీలేదు. మీ శరీరం లేత వయస్సులో నుండి నిటారుగా నిలబడగలిగి వుండవచ్చు. కాని, మీ మనస్సు మాత్రం తన భారంతో తాను క్రుంగిపోతుంటుంది.

కాబట్టి మన మనస్సు ఎందుకెల్లప్పుడు అలవాట్లలో తగులుకుంటుందో, గాళ్ళలోనే యెందుకు నడుస్తూ వుంటుందో, రోడ్డుమీద పట్టాలపై దారితప్పకుండా పోయే రైలుబండివలె బాట వెంబడి ఎందుకు పోతూవుంటుందో, ప్రశ్నించటానికి లోతుకుపోయి విచారించడానికి ఎందుకు జంకుతుందో – యీ సమస్యనంతను అర్థం చేసికోవడం చాల అవసరం. "మా తండ్రి సిక్కు మతస్థుడు, అందువలన నేను గూడ సిక్కు మతస్థుణ్ణే. నేను గూడ జుట్టు పెంచుకొంటాను, తలపాగా పెట్టుకొంటాను" అని మీరంటే – ఏమీ విచారణే చేయకుండా ఏమీ ప్రశ్నించకుండా ఈ యలవాటునుండి తప్పించుకొందామనే ఆలోచనే లేకుండా మీరావిధంగా అన్నట్లయితే – అప్పుడు మీకును యంత్రానికిన్నీ భేదమే లేదు. పొగ త్రాగే అలవాటు కూడ మిమ్ము యంత్రము వలె మార్చివేస్తుంది. ఆ యలవాటుకు మీరు బానిసలై పోతారు. ఇదంతా మీరు సరిగా అర్థం చేసికొన్నప్పుడే మీ మనస్సు నిర్మలమై నిత్య నూతనమై లేతమనస్సు వలె చురుకుదనము గల్గి సజీవంగా పని చేయసాగుతుంది.

అప్పుడు ఏ దినమున కాదినము క్రొత్త దినమే. నదిమీద ప్రతిఫలించే ప్రతి అరుణోదయమున్ను ప్రాతగిలక, చూడడానికి ఎప్పటికప్పుడు క్రొత్తదిగ ఆనందమును కలుగజేస్తూ వుంటుంది.

**13. ప్రశ్న:- మా పెద్దలలో కొందరు చాల గంభీరంగా ముఖం పెట్టినప్పుడు మేమెందుకు భయపడతాము? వాండ్లెందుకట్లా గంభీరంగా కనబడతారు?**

కృష్ణమూర్తి:- గంభీరంగా వుండడమంటే యేమిటో మీరెప్పుడైనా ఆలోచించారా? మీరెప్పుడైనా గంభీరంగా వున్నారా? మీ రెల్లప్పుడూ ఉల్లాసంగా, ఉత్సాహంగా నవ్వుతూనే వున్నారా లేక ఎప్పుడో కొన్ని క్షణాలపాటైనా శాంత గంభీరంగా – ఏదో కారణంచేత గాకుండా సహజమైన గాంభీర్యంతో – వున్నారా? మరి పెద్ద వాండ్లు గంభీరంగా కనబడితే యెవరైనా యెందుకు భయపడాలి? భయపడవలసిన అవసరమేమున్నది? మీకే యిష్టం లేనిదానిని దేనినైనా మీలో వారు చూస్తారని భయమా? చూడండి, మనలో చాలమందిమి యిటువంటి విషయాలను గురించి ఎన్నడును ఆలోచించం. గంభీరంగా వుండే ఒక వృద్ధుని యెదుట మనం భయపడేటట్లయితే దాని గురించి మనం లోతుగా విచారించం. "ఎందుకు నేను భయపడాలి?" అని మనలో మనం తర్కించుకొనం.

సరే, గంభీరంగా వుండడమంటే యేమిటో ఇప్పుడు తెలిసికొందాం. మామూలు అత్యల్ప విషయాలమీద గూడ గంభీరంగా వుండవచ్చు. ఉదాహరణకు, ఏదైనా చీరె కొంటున్నారనుకోండి. మీ మనస్సంతా ఆ విషయం మీదనే నిలవవచ్చు; దాని గురించే చింతిస్తుండవచ్చు, దానికోసం వేరువేరుగా పది దుకాణాలు తిరుగవచ్చు, రకరకాలైన నమూనాలను చూస్తూ మధ్యాహ్నం దాకా గడుపవచ్చు. దీనినే తీవ్ర విషయంగా, గంభీరమైన విషయంగా తీసికోడమని అంటారు. కాని, ఆ గాంభీర్యమంతా అల్ప విషయాలమీదనే. ప్రతిదినం గుడికి పోవడం, అక్కడ విగ్రహానికొక మాల వేయడం, అర్చించడం, పూజారులకు దక్షిణ యిచ్చుకోవడం ఇటువంటి విషయాలను మీరు గంభీర విషయాలుగా తీసికోవచ్చు. కాని, అదంతా వట్టి బూటకం కాదా? సత్యమని పిలిచినా, దైవమని పిలిచినా అది గుడిలో లేదు. జాతీయభావాన్ని గూడ మీరు గంభీరమైన విషయంగా తీసికోవచ్చు. కాని, అది కూడ ఒక మిథ్యా విషయమే, అది కూడ ఒక భ్రమే.

జాతీయతా భావమంటే యేమిటో మీకు తెలుసునా? "నా భారత దేశమిది, నా దేశమిది – తప్పైనా సరే, ఒప్పైనా సరే –" అనే భావన. లేదా "భారతదేశము ఆధ్యాత్మిక విజ్ఞాన కోశము. ఇచ్చట ఆధ్యాత్మిక విజ్ఞాననిధులు కోకొల్లలు. అందువలన తక్కిన అన్ని దేశములకంటె మా దేశము గొప్పది." – ఇదే జాతీయతా భావమంటే. ప్రపంచంలోని ఏదైనా ఒక దేశంతో మనము తాదాత్మ్యమును పొంది, అందుకు మనం గర్విస్తూ వుంటే, మనం ప్రపంచంలోకి జాతీయతా భావాన్ని దిగుమతి చేస్తున్నామన్నమాట. ఈ జాతీయతా భావమొక బూటకపు దైవము. ఒక భ్రమ. ఒక మిథ్యాకల్పనము. కాని, లక్షలకొలది ప్రజలు దీనినొక గంభీరమైన

విషయంగా పరిగణిస్తారు. అట్టివారు తమ దేశంకోసం పోరాడుతారు. ఒకరినొకరు కుత్తుకలు నరుకుకుంటారు. ఒకరినొకరు నాశనం చేసికొంటారు. ఇటువంటి తీవ్ర భావాలను రాజకీయవాదులు తమ స్వార్థానికి ఉపయోగించుకొంటూ వుంటారు.

కాబట్టి మిథ్యా విషయాలను గూడ మీరు చాల గంభీరమైన విషయాలుగా తీసికోవచ్చు. కాని, గంభీరంగా వుండడమంటే యేమిటో మీరు నిజంగా విచారణ చేయసాగితే అప్పుడు మరియొకవిధమైన గాంభీర్య మొకటి వున్నదని, అది భ్రాంతి మూలకము కాదని – మిథ్యావిషయాలపై ఆధారపడిన గాంభీర్యము కాదని – ఏదో యొక విశేష పద్ధతి ప్రకారము రూపొందింపబడినది కాదని మీరు కనుగొన గలరు. ఆ గాంభీర్యము మన మనస్సొక ఫలితంకోసం, ఒక లక్ష్యసాధన కోసం ప్రయత్నించకుండా నిశ్చలంగా వున్నప్పుడు అభివ్యక్తమవుతుంది.

## 4. ప్రశ్న:- విధినిర్ణయము లేదా కర్మఫలమనగానేమి?

**కృష్ణమూర్తి:-** ఈ సమస్యను గూర్చి చర్చించాలని మీరు నిజంగా కోరుతున్నారా? ప్రపంచంలో ప్రశ్నలు వేయడం అన్నిటికంటె తేలిక. మీ ప్రశ్నతో మీకేమైనా ప్రత్యక్షంగా ఉపయోగముంటే అప్పుడా ప్రశ్న సార్థకమవుతుంది. అప్పుడు మీరా ప్రశ్నను గంభీరమైన సమస్యగా, చాల ముఖ్యమైన విషయంగా తీసికొంటారు, లేకపోతే లేదు. ఒకసారి ప్రశ్న అడిగివేసిన తరువాత ఎంతమందికి దానిమీద శ్రద్ధ తొలగిపోతుందో ఎంత మంది దానినింక పట్టించుకోరో మీరెన్నడైనా గమనించారా? మొన్న నొక పెద్దమనిషి ఒక ప్రశ్న వేసిన తరువాత ఆవలించడం మొదలుపెట్టాడు. తలగోకుకొనడం ఆరంభించినాడు, ప్రక్కవానితో మాట్లాడసాగినాడు. తానడిగిన ప్రశ్నమీద తనకే అభిరుచి పూర్తిగా తొలగిపోయినదన్నమాట! కాబట్టి, నా సలహా యేమంటే – నిజంగా చాల ముఖ్యమని మీకు తోస్తేనే ప్రశ్నలు వేయండి, లేకపోతే వేయకండి.

విధినిర్ణయ మనగానేమి? అనే ప్రశ్న చాల కష్టమైనది, జటిలమైనది. చూడండి, కారణముంటే దానికి తప్పనిసరిగా కార్యముంటుంది. కార్య కారణములు అవినాభావ సంబంధము కలవి. రష్యావారు గాని, అమెరికావారుగాని, భారతీయులు గాని ఎక్కువమంది జనులు యుద్ధానికి సన్నాహాలు చేస్తూవుంటే వారికి గల విధి నిర్ణయం, వారి నుదుటివ్రాత యుద్ధమన్న మాటే. మేము శాంతి కాముకులమని, మా స్వరక్షణకోసమే సైన్యసన్నాహాలు చేసికొంటున్నామని వారెంతగా చెప్పుకొన్నా, వారు చేసే పనులన్నీ యథార్థంగా యుద్ధాన్ని కొనితెచ్చేవే; వారు అమలులో పెట్టే పనులన్నీ యుద్ధానికి దారితీసే కారణాలే. అదే విధంగా ఏదేని ఒక నాగరికతను, ఒక సంస్కృతిని లక్షలాది ప్రజలు శతాబ్దాల తరబడి కలిసి పనిచేసి అభివృద్ధి చేసినట్లయితే, వారట్లు ప్రవర్తింపజేసిన ఉద్యమంలో, ఆ ప్రవాహంలో సాధారణ వ్యక్తులు – వారి కిష్టమున్నాసరే, లేకున్నాసరే – చిక్కుకొని కొట్టుకొని పోతూ వుంటారు. ఈ విధంగా సభ్యతా సంస్కృతుల ప్రవాహంలో తగుల్కొని కొట్టుకొని పోవడాన్నే కర్మ ఫలము లేదా విధి నిర్ణయమని, నుదుటి వ్రాత యని వేర్వేరు పేర్లతో పిలుస్తారు.

ఇంతకు మీరొక న్యాయవాది పుత్రులైనట్టయితే మీరుగూడ న్యాయవాది వృత్తి చేపట్టాలని మీ తండ్రి మిమ్ము బలవంతం చేస్తాడు. మీ యిష్టానికి వ్యతిరేకమైనా సరే, మీ తండ్రిమాటలను మీరు పాటించినట్లయితే మీ నుదుటి వ్రాత, మీ విధి నిర్ణయం న్యాయవాద వృత్తిని చేపట్టడమే అవుతుంది. ఇది స్పష్టమే గదా! అట్లుగాక న్యాయవాదులు కావడానికి మీరు నిరాకరించి, మీకు సత్యమని ధర్మమని తోచినదానిని చేయడానికి దృఢముగా నిశ్చయించుకొన్నట్లయితే, అంటే మీరు నిజంగా ప్రేమించేదాన్ని – అది వ్రాయడంగావి, రంగులు వేయడంగాని, డబ్బులేక బిచ్చమెత్తుకోవడంగాని ఏదైనా సరే – చేయడానికి గట్టిగా పూనుకొన్నట్లయితే, అప్పుడు మీరా ప్రవాహంలో నుండి బయటపడినారన్నమాటే! మీ తండ్రి మీకై ఉద్దేశించిన విధి నిర్ణయమును త్రోసిరాజని, దానిని భంగం చేసినా రన్నమాట! అదేవిధంగా సభ్యతా సంస్కృతుల ప్రవాహవిషయంలోను.

అందువలన మనకు సరియైన విద్యాబోధన చాలా అవసరము. సంప్రదాయము చేత అణగద్రొక్కి వేయబడకుండుటకై అయా జాతుల, సంస్కృతుల, వంశముల యొక్క కర్మఫల ప్రవాహంలో కొట్టుకొని పోకుండుటకై ముందుగా నిశ్చయింపబడిన ఒక ప్రయోజనము నుద్దేశించి యాంత్రికముగా సాగిపోవు వ్యక్తులము కాకుండుటకై మనకు సరియైన విద్యాబోధన జరుగవలసియున్నది. ఈ ప్రక్రియ నంతను అర్థము చేసికొన్న మనిషి, దానిని ఛేదించుకొని బయటికి వచ్చి అసహాయవీరునివలె స్వతంత్రముగా నిలబడగల వ్యక్తి తనకు తాను వేగమును పుంజుకొని ముందుకు సాగి పోగలడు. అట్లు ఛేదించుకొని బయటికి రావడమనేది మిథ్యనుండి సత్యమువైపునకే యైనచో, అప్పుడతడు పుంజుకొన్న వేగమే సత్యమవుతుంది. అట్టి మానవులు విధి నిర్ణయమున కతీతులు.

*14 జనవరి, 1955*

★ ★ ★

# 14. క్రమశిక్షణ - ఒక పెద్ద సమస్య

ఎవరైనా మనలనెందుకు క్రమశిక్షణలో పెడతారో, లేదా మనలను మన మెందుకు క్రమశిక్షణలో పెట్టుకొంటామో ఎప్పుడైనా మీరు ఆలోచించారా? ప్రపంచమంతట రాజకీయ పక్షాలు తమ తమ పక్షాల క్రమశిక్షణకు సంబంధించిన నియమాలను పాటించవలెనని తమ తమ సభ్యులనందరిని బలవంతపెడతాయి, నిర్బంధం చేస్తాయి. మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు, మీ చుట్టునున్న సమాజము - అందరున్నూ మిమ్ము క్రమశిక్షణలో పెట్టాలని, మిమ్ము అదుపులో ఉంచాలని చెబుతూ వుంటారు, ఎందుకని? అసలు క్రమశిక్షణ నిజంగా అవసరమా? క్రమశిక్షణ చాల అవసరమని మనం అలవాటుగా అనుకొంటుంటాం. అది నాకు తెలుసు. ఈ క్రమశిక్షణను మనమీద సంఘమైనా విధిస్తుంది, మత గురువైనా విధిస్తాడు, నీతి శాస్త్రమైనా విధిస్తుంది, లేదా అనుభవం మీద మనకు మనమే విధించుకొంటాం. ఏదైనా సాధించాలని, ఎంతో డబ్బు సంపాదించాలని, గొప్ప రాజకీయ వేత్త కావాలని పెద్ద ఆశ పెట్టుకొన్నవానికి, ఆ పెద్ద ఆశయే అతనిని క్రమశిక్షణలో పెడుతుంది. అందువలన మీ చుట్టూ ఉన్నవారందరు క్రమశిక్షణ చాల అవసరమని చెబుతూ వుంటారు; మీరు నియతమైన వేళకు పడుకోవాలని, నియతమైన వేళకు నిద్ర లేవాలని, చదువుకోవాలని, పరీక్షలు పాసు కావాలని, మీరు మీ తల్లితండ్రుల మాట వినాలని యిట్లా చెబుతూ వుంటారు.

సరే, అసలు మీ రెందుకు క్రమశిక్షణను పాటించాలి? క్రమశిక్షణ అంటే అర్థమేమిటి? క్రమశిక్షణ అంటే దేనికో యొకదానికి అనుకూలంగా సర్దుకుపోవడం, అంతేనా? అంటే, యితరులు చెప్పేదానికి అనుకూలంగా మీ యాలోచనలుండేటట్లు చూచుకోవడం, ఒక విధమైన కోరికలను నిరోధించడం, ఇంకొక విధమైన వాటికి సమ్మతించడం, ఒక విధమైన సాధనకు అలవాటు పడడం, మరియొక విధమైన దానిని మానుకోవడం, గ్రుడ్డిగా అంగీకరించడం, ఆలోచనలను కోరికలను అణచుకోవడం, ఆదర్శాన్ని అనుసరించడం - ఇవన్నీ మనస్సులో - పైపైనేగాదు లోతుగా మనస్సులోని లోపలి పొరలవరకూ - నాటుకొని పోవాలి. ఇదంతా క్రమశిక్షణలో అంతర్భాగము. ఎన్నో శతాబ్దాల నుండి, ఒక యుగం తరువాత మరియొక యుగంలో, విద్యాబోధకులు, గురువులు, మత గురువులు, రాజకీయవేత్తలు, రాజులు, న్యాయవాదులు, మనముండే సంఘము - అందరున్నూ క్రమశిక్షణ చాల అవసరమని మనకు చెబుతూనే వచ్చినారు.

కాబట్టి, అసలు క్రమశిక్షణ అవసరమా? ఈ సమస్యాపరిష్కారానికి వేరే మార్గమేమీ లేదా? అని నాలో నేను ప్రశ్నించుకొంటున్నా. అట్లే మీలో మీరు

కూడ ప్రశ్నించుకొంటారని ఆశిస్తున్నా. దీనికింకో మార్గమున్నదనే నా తలంపు. ఇప్పుడు పాఠశాలలే కాదు, ప్రపంచమంతా యెదుర్కొంటున్న సమస్యే యిది. చూడండి, మంచి సామర్థ్యం కలిగి వుండాలంటే మీరు క్రమశిక్షణతో మెలగడం నేర్చుకోవలసి వుంటుందని అందరూ అనుకొనే విషయం. నీతి శాస్త్రం ప్రకారమో, రాజకీయ సంప్రదాయం ప్రకారమో, కర్మాగారంలోని యంత్రంలాగా పని చేయడానికి శిక్షణ పొందడం ద్వారాగాని మీరు క్రమశిక్షణతో మెలగడం నేర్చుకొంటారు. కాని, యీ క్రమశిక్షణ విధానము అంధానుకరణానికి దారితీసి, మనస్సును మొద్దుబార జేస్తుంది.

సరే, యిక యీ క్రమశిక్షణ అనేది మనిషిని స్వతంత్రుని జేస్తుందా లేక గ్రుడ్డిగా ఏదేని ఒక ఆదర్శానికి అనుగుణంగా ప్రవర్తించునట్లు చేస్తుందా? ఆ యాదర్శము భూలోకంపై స్వర్గలోకాన్ని సృష్టించాలని కలలుగనే సామ్యవాదానిది కావచ్చు లేదా ఏదో యొక విధమైన నీతిమార్గమో ధార్మిక మార్గమో కావచ్చు. అసలు క్రమశిక్షణ అనేది మిమ్మెప్పటికైనా స్వతంత్రుల జేయగలదా? క్రమశిక్షణ అనేక రూపాలలో వుండవచ్చు. కాని, అదేదైనాసరే, మిమ్మొకసారి బంధించిన తరువాత మరల విడిచి పెడుతుందా? దాని చెఱలో నుండి విముక్తి లభిస్తుందా? అది యెట్లా సాధ్యమవుతుంది? అట్లుగాక దీనికేదైనా వేరే మార్గమున్నదా? అది తెలుసుకోవడం కోసం యీ క్రమశిక్షణ యనే సమస్యనంతను లోతుగా క్షుణ్ణంగా పరిశీలించి చూడవలసి వుంటుంది. వ్యక్తిగతంగా మీరు రెండు పరస్పర విరుద్ధములగు కోరికలను లేదా ఇంకా ఎక్కువ కోరికలను పెట్టుకోకుండా ఒకే యొక కోరికను కలిగియుండగలరా? నేను చెప్పేది మీకు అర్థమవుతున్నదా? రెండు, మూడు లేదా పది కోరిక లెప్పుడైతే మీకుంటాయో అప్పుడే క్రమశిక్షణ ఒక సమస్యగా మీకెదురవుతుంది. ఏమి, ఎదురవదా? మీరెంతో ధనం సంపాదించాలని, చాలా కార్లు, భవనాలు కలిగి వుండాలని కోరుకొంటారు. అదే సమయంలో వీటినన్నిటిని త్యాగం చేసి సన్న్యాసం తీసికొందామని అనిపిస్తుంది. ఎందుకంటే, మీ వుద్దేశంలో ఏమీ ఆస్తి లేకుండా (సన్న్యాసి లాగా) వుండడం, ఒకవేళ ఆస్తివున్నా యేకొంచెమో అల్పంగా కలిగి వుండడం నీతియని, న్యాయమని, ధర్మమని, పుణ్యమని అనుకొంటారు. మీ జీవిత మిట్టి పరస్పర వైరుధ్యానికి పాత్రం కాకుండా, సమగ్రమై సాగుటకు వీలు లేదా? అందుకు తోడ్పడగల సరియైన విద్యాబోధనకు అవకాశము లేదా? అప్పుడు మీకు క్రమశిక్షణ యొక్క ఆవశ్యకతయే వుండదు. సమగ్రత కలిగి వుండడంలో ఒక విధమైన స్వతంత్రతా భావ మంతర్గతమై కన్పిస్తుంది. ఈ సమగ్రత సిద్ధించు సమయంలో క్రమశిక్షణావశ్యకత బొత్తిగా వుండదు. సమగ్రత అంటే ఒకే సమయమున అన్ని స్థాయీలలోను పూర్తిగా ఒకేవిధంగా వుండడం.

చూడండి, మీకు పసితనమునుండి సరియైన విద్యాబోధన జరిగి వున్నట్లయితే మీలో ఆంతరికంగాగాని బాహ్యంగాగాని పరస్పర వైరుధ్యముండదు, విసంవాదము (Contradiction) ఉండదు. మాటలకు చేతలకు పొందిక లేకపోవడమంటూ ఉండదు. అప్పుడింక మీకు క్రమశిక్షణావశ్యకత లేదు, నిర్బంధము అవసరము కాదు. ఎందువల్లనంటే, అప్పుడు మీరేమి చేసినా పూర్ణ స్వాతంత్ర్యంతో మనఃస్ఫూర్తిగా

చేస్తూ వుంటారు. విసంవాద మున్నప్పుడే క్రమశిక్షణ అవసరమవుతుంది. మీరంద రొకేవిధంగా ఆలోచించాలని రాజకీయవాదులు, ప్రభుత్వములు, మత వ్యవస్థలు కోరుకొంటాయి. ఎందువల్లనంటే, అవి మిమ్ము సంపూర్ణ సామ్యవాదులుగా గాని, సంపూర్ణమైన క్యాథలిక్కులుగా గాని లేక మరొకరుగా గాని మలచగల్గినట్టయితే అప్పుడు మీ వలన వారి కెటువంటి సమస్యా ఉత్పన్నం కాదు. వారు చెప్పిన దానినెల్ల మీరు గ్రుడ్డిగా నమ్మి యంత్రాలవలె పని చేస్తారు. అప్పుడును మీలో విసంవాదము – పరస్పర వైరుధ్యము – ఉండదు. కారణమేమనగా, మీరు వారిని కేవలం అనుకరిస్తారు. కాని, అనుకరణమేదైనా సరే – అది యాంత్రికము కాబట్టి, దానివలవ నష్టమే కలుగుతుంది. అది కేవలం అంధానుసరణము, అందుండి సృజనాత్మక శక్తి విడుదల కాదు.

ఇంతకు, మీలో పసితనమునుండి సంపూర్ణ భద్రతా భావాన్ని, మనకేమీ భయంలేదనే ధీమాను, విశ్వాసాన్ని పుట్టింపగలమా? అదే గనక పుట్టింపగల్గితే అప్పుడు మీలో ఇట్లా వుండాలని, అట్లా వుండరాదని తీవ్ర ప్రయత్నము చేయడం వుండదు. లేనిచో ఆ మానసిక ప్రయత్నమున్న క్షణమునుండి సంఘర్షణ తప్పదు. (అదా? ఇదా? అని రెండింటి మధ్య విరోధమున్నప్పుడే సంఘర్షణ మ్ముంటుంది.) ఆ సంఘర్షణ నుండి విముక్తి పొందడం కోసం క్రమశిక్షణ అవసరమవుతుంది. అట్లుగాక మీకు సరియైన విద్యాబోధన జరిగినట్లయితే, మీరు చేసే ప్రతి పనీ సమగ్రంగా, సమరసంగా వుంటుంది. అందులో విసంవాదము – పరస్పర వైరుధ్యముండదు. అందుచేత నిర్బంధముతో పని చేయడముండదు. సమగ్రత లేనంత కాలము క్రమశిక్షణ తప్పక అవసరమవుతుంది. కాని, క్రమశిక్షణ ఎన్నటికిని ఆత్మస్వాతంత్ర్యమునకు దారితీయదు కాబట్టి అది వినాశదాయకమే.

సమగ్రత కలిగి వుండడంకోస మెట్టి క్రమశిక్షణ అక్కరలేదు. అంటే, నేను చేసే పని మంచిదైతే, అది సహజంగా సత్యమును సుందరమును అయినట్టైతే, పైగా నేను దానిని అనన్య భావంతో, తత్పరుడనై చేస్తూవుంటే, అప్పుడు నాలో పరస్పర విరుద్ధ భావములుండవు, విసంవాదము కలుగదు, నేను దేనినీ గ్రుడ్డిగా అనుకరించడమున్న లేదు. నేను చేసేపని, పూర్తిగా మంచిదై నట్టయితే, స్వతఃసిద్ధంగా సరియైనదైనట్టయితే – అంటే హిందూ సంప్రదాయం ప్రకారంగాని, సామ్యవాద సిద్ధాంతం ప్రకారంగాని కాకుండా సర్వకాల సర్వావస్థల యందును సరియైనదైనట్టయితే – అప్పుడు నేనొక సమగ్ర మానవుడను, నాకప్పుడు క్రమశిక్షణావశ్యకత వుండదు. ఇట్లు అవిభక్తమై సమగ్రమగు విశ్వాసాన్ని మీలో కల్గించడమే కాదా పాఠశాల యొక్క ప్రధానకర్తవ్యము? అప్పుడు మీరు చేసేపని కేవలం మీరు మనసా కోరుకొన్నదేగాదు, అది మౌలికంగా సరియైనదిన్ని, మంచిదిన్ని, నిత్య సత్యమైనదిన్ని అవుతుంది.

నిజంగా మీలో ప్రేమ వున్నట్లయితే అప్పుడు క్రమశిక్షణ అవసరమవుతుందా? కాదు. ప్రేమ స్వయంగా సృజనాత్మకమైన అవగాహనము కలిగిస్తుంది, కాబట్టి అప్పుడు నిరోధముండదు, సంఘర్షణ వుండదు. అయితే, పరిపూర్ణమగు సమగ్రతా భావముతో ప్రేమించడమనేది మీలో అభయము, భద్రతా భావము పూర్తిగా నున్నప్పుడు మాత్రమే, అంటే – తల్లి ఒడిలో బిడ్డకున్నట్లు మీలో పూర్ణ విశ్వాసము, –

ముఖ్యంగా మీ చిన్న వయస్సులో – వున్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది. అంటే దాని అర్థమేమనగా విద్యాబోధకుడు, విద్యార్థి – వీరిద్దరిలో ఒకరి యందొకరికి పరిపూర్ణ విశ్వాసముండవలె; అది లేకపోతే ప్రస్తుత సమాజమువలె వికృతమును వినాశకరమును అగు సమాజమునే మనము సృష్టిస్తాము. పరస్పర వైరుధ్యము లేనట్టిదిన్ని, అందుచేత క్రమశిక్షణను కోరనట్టిదిన్ని అయిన సంపూర్ణ సమగ్రతా భావముతో చేయబడు కర్మాచరణము యొక్క ప్రాధాన్యమును మనము గ్రహింప గలిగితే అప్పుడు మనము పూర్తిగా సరిక్రొత్త సంస్కృతిని, సరిక్రొత్త నాగరికతను సృష్టింపగలమని అనుకొంటాను. అట్లుగాక దేనినైనా క్రమశిక్షణ ద్వారా మనము నిరోధించి, అణచి వేసినట్లయితే, అది యెదురు తిరిగి వేరే మార్గముల దిశగా విజృంభించి, తప్పుదారులు త్రొక్కుతుంది, వినాశకరమైన సంఘటనకు దారి తీస్తుంది.

అందువలన క్రమశిక్షణకు సంబంధించిన యీ సమస్యనంతను సరిగా అర్థం చేసికోవడం చాల అవసరం. నా దృష్టిలో క్రమశిక్షణ అనేది పూర్తిగా అసుందరమైనది, అసహ్యమైనది. అది సృజనాత్మకము కాదు, వినాశాత్మకము. అయితే, అట్లా అని అంతటితో వూరుకుంటే, దాని అర్థం మీ యిష్టారాజ్యంగా, అడ్డూ అపూ లేకుండా, ఏదంటే అది చేయవచ్చునని కాదు. అట్లుగాక, నిజానికి ప్రేమపూరిత హృదయము కలవాడు ఇష్టారాజ్యంగా ప్రవర్తించడు. ఎట్లా తోస్తే అట్లా చేయడు. అతనిలోని ప్రేమయే అతనిని సరియైన మార్గమున నడిపిస్తుంది. ప్రపంచంలో సువ్యవస్థను తీసికొని వచ్చేది ప్రేమ మాత్రమే. ప్రేమ యేది చేసినా అది సరియైనదే. దాని దారికి అడ్డు పోరాదు. దానిపని నది చేసికోనివ్వాలి, అంతే.

1. ప్రశ్న:- మనమెందుకు బీదవారిని అసహ్యించుకొంటాము?

కృష్ణమూర్తి:- నిజంగానే మీరు బీదవారిని అసహ్యించుకొంటున్నారా? నేను మిమ్ము తప్పు పట్టడం లేదు; నే నూరక అడుగుతున్నాను – మీరు నిజంగా బీదవారిని అసహ్యించుకొంటున్నారా? ఒకవేళ నిజంగానే అసహ్యించుకొంటూ వుంటే, ఎందుకని అట్లా చేస్తున్నారు? ఎప్పటికైనా మీరుగూడ బీదవాండ్ల వుతామేమోనని భయపడి, అప్పటి మీ స్థితిని ఊహించుకొని దానిని మీరు గర్హిస్తున్నారా? లేక, ఆలనా పాలనా లేకుండా, మురికిగా వుండే వారి హీనస్థితిని అసహ్యించుకొంటున్నారా? అశుభ్రత, అవ్యవస్థ, కశ్మలము, మాలిన్యము – ఇటువంటివి మీ కిష్టం లేకపోవడం చేత బీదవాండ్లతో మాకెట్టి సంబంధం లేదని అంటున్నారా? కాని, యీ ప్రపంచంలో దారిద్ర్యాన్ని, కశ్మలాన్ని, అవ్యవస్థను సృష్టించింది ఎవరు? మీరు, మీ తల్లిదండ్రులు, మీ ప్రభుత్వమున్ను కాదా? దానికి మన సమాజమంతా కారణమే. మన హృదయంలో ప్రేమ అనేదిలేదు. మనము మన పిల్లలను ప్రేమించము, పెద్దలను ప్రేమించము. ఇరుగువారినీ ప్రేమించము, పొరుగువారినీ ప్రేమించము. బ్రతికియున్నవారినీ ప్రేమించము, చచ్చిపోయినవారినీ ప్రేమించము. మనకు దేనిమీదను ప్రేమలేదు, ఎవరిమీదను ప్రేమలేదు. ప్రపంచంలోని యీ దైన్యాన్ని, దౌర్భాగ్యాన్ని రాజకీయ నాయకులు రూపుమాపలేరు, మతాలు రూపుమాపలేవు, సంఘ సంస్కర్తలనబడే వారున్ను ఏమీ చేయలేరు. ఎందువల్లనంటే,

మీరు చేసేదెల్లా అతుకులపని – ఇక్కడ కొంచెం, అక్కడ కొంచెం బాగుచేస్తున్నట్లు కనబడతారు. కాని, వీరిలో గనక ప్రేమే వున్నట్లయితే యీ దౌర్భాగ్య పరిస్థితులన్నీ రేపటికల్లా అదృశ్యమైపోతాయి.

మీ రసలు దేనినైనా ప్రేమిస్తారా? అసలు ప్రేమంటే యేమిటో మీకు తెలుసునా? మీరు దేనినైనా అనన్య భావంతో, సంపూర్ణంగా, ప్రేమిస్తే ఆ ప్రేమ భావోద్రేకము కాదు; అది కర్తవ్యం క్రిందికి లెక్కకు రాదు; అందులో భౌతిక ప్రేమయని, దివ్య ప్రేమయని విభాగము లేదు. మీ రనన్య భావంతో – త్రికరణ శుద్ధిగా – ఎవరినైనా సరే, దేనినైనా సరే ప్రేమించారా? – మీ తల్లినిగాని, తండ్రినిగాని, స్నేహితునిగాని, కుక్కనుగాని, చెట్టునుగాని – దేనినైనా సరే ప్రేమించారా? దేనినీ ప్రేమించరని నా భయం. అందువల్లనే మీలో ద్వేషము, రోషము, అసూయ, కుత్సితము మొదలగునవి ఉండడానికి బాగా అవకాశం దొరికినది. చూడండి, ప్రేమపూరిత హృదయంలో మరొక దానికి చోటుండదు. మనం మన మనస్సులను పనికిరాని చెత్తతో నింపుకొని, ప్రేమకు తావులేకుండ చేసినాము. నిజానికి మన మనస్సులనుండి ఆ చెత్తను తొలగించడమెట్లో చర్చించడం చాల అవసరం. అందుకోసం మనమెంత సమయమైనా వెచ్చించవచ్చు. మనం ప్రేమించినప్పుడే సుఖ సంతోషాలతో స్వేచ్ఛగా వుండగలం. ప్రేమ మూర్తులు, చైతన్య స్వరూపులు, సంతోష స్వాంతులైన మానవులు మాత్రమే క్రొత్త ప్రపంచాన్ని సృష్టించగలరు – రాజకీయ నాయకులు కాదు, సంఘసంస్కర్తలు కాదు, ఆదర్శవాదులైన సన్న్యాసులున్ను కాదు.

2. **ప్రశ్న:- సత్యము, సౌజన్యము, సమగ్రత (Integration)ల గురించి మీరు మాట్లాడుతున్నారు. అంటే, వాటికి భిన్నంగా అసత్యము, అసౌజన్యము, అసమగ్రతలున్నట్లే కదా? కాబట్టి, క్రమశిక్షణ లేనిదే మనిషి సత్యవంతుడు, సౌజన్యవంతుడు, సమగ్రతగలవా డెట్లు కాగలడు?**

కృష్ణమూర్తి:- మరియొక విధంగా చెప్పాలంటే, ఈర్ష్యాళువు క్రమశిక్షణను పాటించకుండా ఈర్ష్యా విముక్తుడెట్లు కాగలడు? అని మీ ప్రశ్న. అసలు ప్రశ్నను సరిగా అర్థం చేసికోవడం చాల అవసరమనుకొంటాను. ఎందువల్లనంటే, ఈ ప్రశ్నకు సమాధానము ప్రశ్నలోనే అంతర్నిహితమైయున్నది, ప్రశ్నకు బాహ్యంగా లేదు.

ఈర్ష్య అంటే యేమిటో మీ కర్థం తెలుసునా? మీరు చాలా అందంగా వున్నారు, మంచి దుస్తులు వేసుకొన్నారు, అందమైన పాగా పెట్టుకొన్నారు లేదా అందమైన చీర కట్టుకొన్నారు. నాకు గూడ మీ మాదిరే వుండాలని కోరిక. కాని, నాకు శక్తి లేదు. అందుకు మిమ్మల్ని చూచి ఓర్చుకోలేను. మీకున్నదేదో అది నాకు కావాలి, అందుకనే అసూయ. నేనెట్లా వున్నానో అది నాకు తృప్తినీయడం లేదు. అందుకు భిన్నంగా మీ మాదిరి వుండాలని నా కోరిక. అందుకే మిమ్ము చూస్తే అసూయ, ఈర్ష్య.

మీలాగా అందంగా వుండాలని నా కోరిక. మీకుండేలాంటి సన్నని నాజూకైన (నాణ్యమైన) గుడ్డలు, అందమైన యిల్లు, ఉన్నత పదవి – ఇవన్నీ నాకూ కావాలి.

అందుకే మీమీద నాకు అసూయ. నాకున్న దానితో నేను తృప్తిపడక పోవడం చేతనే, మీ మాదిరి వుండాలనే కోరిక నాలో కలుగుతున్నది. కాని, నా అసంతృప్తిని దానికి కారణాన్ని నేను అర్థం చేసికోగల్గితే అప్పుడు మీ మాదిరి వుండాలనే కోరిక నాలో ఎందుకు కల్గుతుంది? కల్గదు. మీకుండి నాకు లేదని బాధపడను. అంటే దాని భావమేమనగా, నన్ను నేను అర్థం చేసికోవడం మొదలుపెట్టినప్పటినుండి నన్ను ఇతరులతో పోల్చుకోవడం మానివేస్తాను. ఎవరిని జూచినా అసూయపడను. నేను మరియొకరుగా మారిపోవాలని ఎప్పుడైతే కోరుకొంటానో అప్పుడే అసూయ ఉత్పన్నమవుతున్నది. అట్లుగాక, "నేనెవరినన్నాగానీ, ఎట్లన్నా ఉండనీ, నన్ను నేను అర్థం చేసికోవాలి, నా నిజమైన స్థితి యేమిటో తెలిసికోవాలి" అని మీరు సంకల్పించుకొంటే, మీలోని అసూయ దానంతట అదే తొలగిపోతుంది. అప్పుడిక క్రమశిక్షణయే అక్కఱలేదు. నన్ను నేను అర్థం చేసికొనడంతో నాలో సమగ్రత (Integration) సిద్ధిస్తుంది.

మనం చదువుకొన్న చదువు, మనమున్న పరిసరాలు, మనం పుట్టి పెరిగిన సంస్కృతి — యివన్నీ మనమేదో యొక ఉన్నత స్థితికి చేరుకోవాలని మనలను ఉద్బోధిస్తూ వుంటాయి, అందుకు మనలను ప్రేరేపిస్తూ వుంటాయి. మన తత్త్వ శాస్త్రాలు, మన మతాలు, మన ధార్మిక గ్రంథాలు — ఇవన్నీ చెప్పేది అదే. కాని, నాకిప్పుడర్థమైనదేమంటే — మరియొక స్థితిలోనికి, లేదా మరియొకరుగా పరిణతి చెందడమనే ప్రక్రియలోనే అసూయ అంతర్లీనమై వుంటుంది. అంటే, నేను నా సహజ స్థితితో తృప్తిపడడం లేదన్నమాట! కావున నా సహజ స్థితి యేమిటో నేను అర్థం చేసికోవాలి.

ఒకరితో నన్ను నేనెందుకు పోల్చుకొంటున్నానో ఏదో యొక స్థితికి చేరుకోవాలని ఎల్లప్పుడూ ఎందుకు ప్రయత్నిస్తున్నానో నాకు తెలియాలి. నా సహజ స్థితిని తెలిసికోవాలంటే దానికి క్రమశిక్షణతో పనిలేదు. దానిని అర్థం చేసికొనే ప్రక్రియలోనే సమగ్రత (Integration) సిద్ధిస్తుంది. నన్ను నేను అర్థం చేసికొనడంతో నాలో వున్న పరస్పర వైరుధ్యము (Contradiction) తొలగిపోతుంది. తత్ఫలితంగా సమగ్రమగు కర్మాచరణ — బహుముఖములుకాని కర్మాచరణ — సిద్ధిస్తుంది.

### 3. ప్రశ్న:- శక్తి యంటే యేమిటి? అధికారమంటే యేమిటి?

**కృష్ణమూర్తి:-** శక్తి యనేది అనేక విధాలు. అంతర్దహన యంత్రము (Internal combustion engine) ద్వారా పుట్టింపబడిన శక్తి, ఆవిరి శక్తి, విద్యుచ్ఛక్తి — ఇటువంటివి యాంత్రిక శక్తిలోని భేదములు. చెట్టులో వుండే శక్తివలన చెట్టునందంతట రసము ప్రవహిస్తుంది; ఇగుళ్ళు, ఆకులు పుడతాయి. మానవునిలో శక్తి వుంటేనే స్పష్టంగా ఆలోచన చేయగలుగుతాడు. ప్రేమించడానికి, ద్వేషించడానికి గూడ శక్తి కావాలి. నియంతకు గల శక్తి వేరైనది. దేవుని పేరిట, దివ్య గురువుల పేరిట, దేశం పేరిట ప్రజలను దోచుకోవాలంటే శక్తి కావాలి. ఇవన్నీ శక్తి యొక్క విభిన్న రూపాలు.

అయితే విద్యుచ్ఛక్తి, కాంతిశక్తి, అణుశక్తి మొదలైన శక్తి రూపాలు సహజంగా మంచివే, మీరేమంటారు? కాని, ఆ శక్తులను దురాక్రమణ కోసం, ప్రజలను హింసించడంకోసం, స్వార్థసిద్ధికోసం ఉపయోగించుకొనే మానవుని మానసిక శక్తి యెట్టి పరిస్థితులలోనైనా సరే, చెడ్డదే. శక్తి యొక్క మరియొక రూపము అధికారము. ఏదైనా సంఘానికిగాని, క్రైస్తవ దేవాలయానికి గాని, అందలి వివిధ సంప్రదాయాలకు గాని, మత శాఖలకు మత వర్గములకు గాని పెద్దగా వుండి యితరులపై అధికారము చూపేవాడు ఎప్పటికిని దుష్టుడే. ఎందువల్లనంటే, అటువంటివాడు తన గతేమిటో తనకు తెలియకపోయినా, ఇతరులను మాత్రం తన వశంలో పెట్టుకొని, వారి భవిష్యత్తును తీర్చి దిద్దబోతున్నాడు! తాను పోయేదారి ఎటు పోతున్నదో తనకు తెలియకపోయినా, ఇతరులకు దారి చూపగోరుతున్నాడు! ఇది ప్రపంచంలోని పెద్ద పెద్ద సంస్థల విషయంలోనే కాదు, చిన్న చిన్న సంస్థల, సంఘాల విషయంలోను అంతే. ఎప్పుడైతే మానవుని మనస్సు నిర్మలము, భ్రమప్రమాదరహితము అవుతుందో, శాంతము సమాహితము అవుతుందో, ఆ క్షణమునుండి అతడితరులపై పెత్తనం చేసే నాయకుడుగా ఉండగోరడు, ఉండడు. నిర్మల మనస్కుడు, శాంత చిత్తుడు, ఇతరులపై అధికారము చేయడమున్ను – ఈ రెండును ఒకదానికొకటి పొసగని విషయాలు.

కాబట్టి, యితరులమీద అధికారం కావాలని మానవుని మనస్సు ఎందుకు కోరుకొంటుందో తెలిసికోవడం చాల అవసరం. తల్లిదండ్రులకు తమ పిల్లలమీద అధికారముంటుంది; భార్యకు భర్తమీద అధికారముంటుంది లేదా భర్తకు భార్యమీద అధికారముంటుంది. ఇట్లా చిన్న కుటుంబాలతో ఆరంభించిన యీ చెడ్డ గుణం (evil) పెరిగి పెద్దదై విస్తరించి ప్రభుత్వములకు, రాజకీయనాయకులకు, మత గురువులకున్ను వుండే క్రౌర్యంగా, దురాచారంగా పరిణమిస్తుంది. ఇట్టి అధికార దాహం లేకుండా, ప్రజలను తన చెప్పుచేతలలో పెట్టుకోవాలని వారిని తన స్వార్థానికి ఉపయోగించుకోవాలని కోరకుండా, తనకుగాని తన వర్గానికిగాని తన దేశానికిగాని దివ్యగురువులకు గాని దైవభక్తులకు గాని అధికారము కావాలని కోరకుండా మనిషి జీవించలేడా? వివిధ రూపాలలో నున్న ఆ అధికారాలన్నీ వినాశకరములు; వాటివలన మనిషికి హాని కలుగుతుంది, దుఃఖము దైన్యము కలుగుతుంది. అట్లుగాక ఇతరుల కష్టసుఖములను తనవిగా భావించుకొంటూ, దయార్ద్ర హృదయుడై ప్రేమమూర్తియై జీవించడం మిక్కిలి అద్భుతమైన విషయము. అది శాశ్వత ఫలితాన్నిస్తుంది. ప్రేమ అజరామరము, శాశ్వతము; ప్రేమ యున్నచోట దుష్ట శక్తులకు తావు లేదు, దుష్టమైన అధికారమునకు అవకాశము లేదు.

### 4. ప్రశ్న:- కీర్తి ప్రతిష్ఠల కోసం మనమెందుకు ప్రాకులాడుతాము?

కృష్ణమూర్తి:- మీరెప్పుడైనా దీనిగురించి ఆలోచించినారా? మనం రచయితగానో, కవిగానో, చిత్రకారునిగానో, రాజకీయనాయకునిగానో, గాయకునిగానో, మరి యే విధంగానైనా సరే ప్రసిద్ధులం కాగోరుతాము. ఎందుకని? మనం చేసే పనిమీద మనకు

నిజంగా ప్రేమలేదు కాబట్టి. సంగీతాన్ని గాని, కవిత్వాన్ని గాని, చిత్రలేఖనాన్నిగాని దేనినైనా సరే మీరు నిజంగా ప్రేమిస్తే, పేరు ప్రఖ్యాతుల కోసం ప్రాకులాడరు; దాని గురించి అసలు పట్టించుకోరు. పేరు పొందాలనే కోరిక అల్పబుద్ధినే సూచిస్తుంది. ఆ కోరికకు అర్థం లేదు. మనం చేసే పనియందు మనకు ప్రేమ లేదు. కాబట్టి ఆ 'ప్రేమ దారిద్ర్యాన్ని' పేరుప్రతిష్ఠలతో కప్పిపుచ్చుకో జూస్తాం. ప్రస్తుతం మనం చదువుకొనే చదువు తుచ్ఛమైన చదువు, అది మనం చేసే పనిని మనం ప్రేమించాలని చెప్పదు, తుట్టతుదకు లభించే విజయాన్ని మాత్రమే ప్రేమించమంటుంది, ఆ విజయ మేవిధంగా లభించినా సరే! కర్మాచరణము కంటె కార్యసిద్ధి మనకు ప్రధానము.

మన దగ్గర యేదైనా మంచి వుంటే, మనమేదైనా మంచి పని చేస్తే దానిని గూర్చి పదిమంది యెదుట గొప్పగా చెప్పకోనక్కరలేదు. అట్లా చెప్పకొంటే అది మన అల్పత్వాన్నే సూచిస్తుంది. మీరేపని చేసినా దానిమీది ప్రేమతో చేయండి; పేరుకోసం చేయవద్దు, ప్రచారం కోసం చేయవద్దు. అట్లా చేస్తూ, అజ్ఞాత వ్యక్తిగా జీవించడంలోనే గొప్పతనమున్నది. దయారసముచే చిప్పిలు హృదయముగలిగి పేరుకోసం ప్రయత్నించకుండా జీవించు వాడుత్తముడు.

అట్లా చేస్తే మీకు ప్రసిద్ధి రాకపోవచ్చు, వార్తా పత్రికలలో మీ ఫోటో పడకపోవచ్చు, రాజకీయ నాయకులు మీ యింటికి రాకపోవచ్చు. అప్పడు మీరు అజ్ఞాతంగా జీవితం గడుపుతూవున్న కేవలం సృజనశీలురైన మానవులు మాత్రమే. అయితే అందులోనే గొప్పతనమున్నది, అందమున్నది, ఆనందమున్నది.

*18 జనవరి, 1955*

★ ★ ★

# 15. పరస్పర సహకారము

మన మనేక విషయాలగురించి అనేక జీవిత సమస్యల గురించి మాట్లాడుతూ వచ్చాము కదా! కాని అసలు 'సమస్య' అంటే యేమిటో మనకు నిజంగా తెలుసునా యని నా అనుమానం. సమస్యలను మనం మన మనస్సులో వేరు నాటుకోనిస్తే పిదప వాటిని పరిష్కరించడం చాలా కష్టమవుతుంది. సమస్యలను సృష్టించేది మనస్సే, మరల అవి వేరు నాటుకోడానికి తగిన మన్నుగా ఉపయోగపడేది గూడ మనస్సే. ఆ విధంగా ఒకసారి ఒక సమస్య మన మనస్సులో బాగా నాటుకొన్నదంటే దానినింక సమూలంగా పెళ్ళగించివేయడం చాలా కష్టం. అందువలన మనస్సు స్వయంగా సమస్యను గుర్తించి అది పెరగడానికి అవకాశ మివ్వకుండడం, అది వేరు నాటుకోడానికి దోహదమీయకుండడం చాలా అవసరం.

ప్రపంచాన్ని ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలలో నొకటి సహకార సమస్య. సహకారమనే మాటకు అర్థమేమి? సహకరించడమంటే కలిసి పనిచేయడం, కలసి నిర్మించడం, సుఖదుఃఖములను సమంగా కలిసి అనుభవించడం. మనందరిలో సమానంగా ఏదైనా వుంటే, అప్పుడే మనందరం స్వేచ్ఛగా కలసి పనిచేయగలం. కాని మనుషులు సహజంగా, ఎట్టి నిర్బంధం లేకుండా, సంతోషంగా కలిసి పనిచేయడానికి సుముఖులై వుండరు; బెదిరించో, భయపెట్టో, దండించో లేదా యేదైనా యెర చూపించో ఏదో విధంగా వారిచేత బలవంతంగా పని చేయిస్తారు. ఇది ప్రపంచమంతటా వుండే తీరు. క్రూరప్రభుత్వాల క్రిందనైతే కలిసి పనిచేయడం కోసం దయాదాక్షిణ్యాలు లేకుండా మిమ్ము బలవంత పెడతారు. ఒకవేళ మీరు సహకరించకపోతే, మిమ్మసలు భూమిమీద లేకుండా చేసి వదిలించుకొంటారు; లేదా యుద్ధ ఖైదీలనుంచే శిబిరాలకైనా పంపించి వేస్తారు. ఇక నాగరక దేశాలని పిలువబడే వాటిలోనైతే, 'మన దేశం కోసం మనం కలిసి పనిచేయాలి, అందుకోసం ఎట్టి త్యాగమైనా చేయాలి' అనే భావన కలిగిస్తారు, లేదా జాగ్రత్తగా ఆలోచించి నిర్ణయించిన ఏదైనా ఒక ఆదర్శాన్ని గొప్పగా మీముందుంచుతారు. దాని గురించి విరివిగా ప్రచారం కూడా చేస్తారు; దాంతో మీరు దానికి సంతోషంగా అంగీకరిస్తారు. లేదా ఎవరో ఒక పెద్ద మనిషి భూలోక స్వర్గాన్ని నిర్మించడం కోసమై వివరంగా ఒక పథకాన్ని తయారుచేస్తే దానిని ఆచరణలో పెట్టడం కోసం మీరందరు కలసి పని చేస్తారు.

కాబట్టి సారాంశమేమంటే, ఏదేని ఒక ప్రణాళికగాని ఒక పథకంగాని, ఒక భావనగాని, లేదా ఒకరికి మీమీదగల అధికారంగాని మీరు కలిసి పని చేయడానికి కారణమౌతుంది. దీనినే మామూలుగా సహకార మంటారు. ఇందులో దండనముగాని

మండనముగాని ఎప్పుడూ వుంటుంది. అంటే దాని అర్థం యిట్టి సహకారానికి వెనుక 'భయము' వుంటుంది. మీరెల్లప్పుడు దేని కోసమో ఒక దానికోసం - అంటే మన దేశం కోసంగాని, మీ రాజు కోసంగాని, మీ పక్షం (పార్టీ) కోసం గాని, దేవుని కోసంగాని, పరమగురువు కోసంగాని, శాంతి కోసంగాని లేదా ఏదో యొక సంఘసంస్కరణ కోసంగాని - కలిసి పనిచేస్తూ వుంటారు. సహకారమంటే మీ అభిప్రాయం ఏదో యొక ఫలితాన్ని ఉద్దేశించి అందుకోసం కలిసి పని చేయడమని. మీకొక ఆదర్శముంటుంది - ఉత్తమమైన పాఠశాల నొకదానిని నిర్మిద్దామనో లేదా, మరొకటో - దాని కోసం మీరు పని చేస్తుంటారు. దానికి అందరి సహకార మవసరమని మీరు అంటారు. ఇదంతా దేనిని సూచిస్తున్నది? అధికారమును కాదా? ఇందులో ఏది మంచిపనో, ఏది కాదో తెలిసిన పెద్ద మనిషినని అంటూ ఒకడుంటాడు. అతడు చెప్పిన పనిని పూర్తిచేయటంలో మనము సహకరించాలి అని మీరంటారు.

కాని దానిని నేను సహకారమని అనను. అది సహకారం కాదు; అది యొక విధమైన దురాశ, ఒక విధమైన భయము, నిర్బంధము. దాని వెనుక ఒక బెదరింపు వుంటుంది - మీరు సహకరించకపోతే మిమ్ము ప్రభుత్వము గుర్తించదనో, పంచవర్ష ప్రణాళిక విఫలమవుతుందనో, మిమ్ము రాజకీయ ఖైదీలనుంచే కఠిన వరకానికి పంపుతారనో, మీ దేశం యుద్ధంలో ఓడిపోతుందనో, లేదా మీరు స్వర్గానికి పోరనో బెదరింపు వుంటుంది. ఇటువంటి బెదరింపుగాని, ప్రలోభనముగాని వున్న చోట నిజమైన సహకారముండడానికి అవకాశము లేదు.

అంతేకాదు, మన మిద్దరము ఒక అంగీకారానికి వచ్చిన కారణంగా కలిసి పనిచేస్తూ వున్నట్టయితే, అదికూడ నిజమైన సహకారమనిపించుకోదు. అటువంటి అంగీకారంలో అంగీకరించిన పనిని చేయడం ప్రధానంగాని సహకరించుకోడంకాదు. మీరూ నేనూ కలసి ఒక వంతెన కట్టడానికో, రోడ్డు వేయడానికో, లేదా కొన్ని మొక్కలు నాటడానికో ఒప్పుకొన్నామనుకోండి. కాని మనం చేసికొన్న ఆ ఒడంబడికకు ఎప్పటికైనా భంగం కలుగుతుందేమో అనే భయం లోలోపల వుంటూనే వుంటుంది. పైగా నా వంతు పని నేను చేయక, అంతా పని మీ చేతనే చేయిస్తానేమోననే భయం కూడా మీకు వుంటుంది.

ఈ విధంగా ఏదో ప్రలోభనం వల్లగాని, బెదరింపు వల్లగాని, లేదా కేవలమొక అంగీకారానికి రావడం వల్లగాని మనం కలిసి పని చేస్తూ వుంటే అది నిజంగా సహకారమనిపించుకోదు. అటువంటి ప్రయత్నాలన్నిటి వెనుక ఏదో కొంతలాభం పొందుదామనిగాని, దేనినుండైనా తప్పించుకొందామనిగాని కోరిక నిగూఢంగా పనిచేస్తూ వుంటుంది.

నా దృష్టిలో సహకారమంటే యిదేదీ కాదు. సహకారమంటే అదొక ఆటవలె, సంతోషంగా కలసి మెలసి వుండడం, కలిసి మెలిసి చేయడం - ఏదో ఫలానా పని చేయడమని కాదు. మీకు అర్థమవుతున్నదా? మామూలుగా చిన్నపిల్లలు కలసి మెలసి వుండాలన్నా, కలసి మెలసి చేయాలన్నా ఇష్టపడతారు. దీనినెప్పుడూ మీరు గమనించలేదా? వారు దేనిలోనైనా సహకరించుకొంటారు. అందులో అంగీకారము,

అనంగీకారమనే ప్రశ్నే లేదు. దండన మండనముల గురించిన ఆలోచనే వుండదు. వాండ్లు కేవలం సహాయపడగోరుతారు. వాండ్లు సహజంగా ఒకరికొకరు సహాయం చేసికొంటారు. కలసి మెలిసి వుండడం, కలిసి మెలిసి చేయడమనేది వారికొక వినోదంగా వుంటుంది. కాని మనం, పెద్ద వాండ్లం, పిల్లలలోని ఆ సహజ గుణాన్ని, పరస్పరము సహకరించుకొనే ఆ సహజ స్వభావాన్ని నశింపజేస్తాం. "నీవిది చేస్తే అది నీకిస్తా", "ఇది చేయకపోతే నేను నిన్ను సినిమాకు తీసికొని పోను" – అని యిట్టి ప్రలోభములతో, బెదరింపులతో వారియందలి స్వతఃసిద్ధమగు సహకారగుణాన్ని మనం నశింపజేస్తాం, వారిలోకి అవినీతిని ప్రవేశపెడతాం.

కాబట్టి నిజమైన సహకారమనేది, ఏవేవో పెద్ద పెద్ద పనులను – ప్రాజెక్టులను – కలిసి చేద్దామని అనుకోవడంలో లేదు. మనమంతా కలిసి వుందామనే భావనలో అప్పుడుండే ఆనందములో నిజమైన సహకారము ఉంటుంది. అట్టి ఏకాత్మ భావనలో వ్యక్తిగతమైన ఆలోచనల గురించిగాని వ్యక్తిగతమైన అభిప్రాయం గురించి గాని పట్టుదల చూపడం జరుగదు.

అటువంటి సహకారం గురించి మీరెరిగినచో, అదెప్పు డీయరాదో గూడ మీకు తెలుస్తుంది. ఇది తెలుసుకోవడం గూడ ముఖ్యమే. ఏమి, అర్థమవుతున్నదా? ఇటువంటి సహకార ప్రవృత్తిని అందరిలోను మేల్కొలపడం చాలా అవసరం. అప్పుడు కేవలం మనం చేసికొన్న యేర్పాట్లవలనగాని, ఒడంబడికలవలనగాని, కాదు మనం సహకరించుకొనేది; ఏదో ప్రతిఫలం లభిస్తుందనే ఆశచేతగాని, దండనం లభిస్తుందనే భయంచేతగాని మనము సహకరించుకోము. మనమంతా ఒకటే అనే భావన, ఒకటిగా వుండడంలో, ఒకటిగా పని చేయడంలో కలిగే ఆనందం – ఇవి మాత్రమే మనమొకరికొకరు సహకరించుకోడానికి కారణా లౌతాయి. ఇది చాలా ముఖ్యమైన విషయం. అయితే ఎప్పుడు సహకరించుకొనరాదో తెలిసికొనడం కూడా అంతే ముఖ్యం. ఎందుకంటే, మనలో వివేకమేగనక లేకపోతే, అవివేకులకు సహకారమందిస్తాం. విలక్షణములైన ప్రణాళికలు వేస్తూ, విద్ధూరములైన ఆలోచనలు చేస్తూ వుండే అత్యాశాపరులైన నాయకులకును, హిట్లరులాంటి క్రూర నియంతలకును సహకారమందిస్తాం. ఇటువంటి వారు మనకు ప్రతి యుగమందును కనబడుతుంటారు. కాబట్టి యెప్పుడు మనం సహకరింపరాదో తెలిసికోవడం గూడ ముఖ్యమే. అయితే నిజమైన సహకారము వలన కలిగే ఆనందమును రుచి చూచిన వారికే ఎప్పుడు సహకరింపరాదో గూడా తెలుస్తుంది.

మనం చర్చించుకోవలసిన చాలా ముఖ్యమైన విషయమిది. మనం కలిసి పని చేద్దామని అనగానే దానిపై బహూశా మీ మొట్టమొదటి ప్రశ్న యెట్లా వుంటుందో తెలుసా? "ఎందుకోసం? మనం కలిసి యేం పని చెయ్యాలి?" అని అంటారు. అంటే, దాని అర్థం చేయవలసిన పని ప్రధానమవుతున్నది; కలిసి మెలిసి వుండడం, కలిసి మెలిసి పని చేయడమనే భావన అప్రధానమవుతున్నది. చేయవలసిన పని – అంటే, మనం వేసే ప్రణాళిక, మనం చేసే ఆలోచన, మనం ఆదర్శంగా పెట్టుకొనే భూలోక స్వర్గం – ఇవి అన్నిటికంటే ప్రధానమవుతాయి. అప్పుడు నిజమైన

సహకారముండదు. అటువంటప్పుడు మనలను కలిపి వుంచేది ఆ ఉద్దేశ్యము, ఆ లక్ష్యము మాత్రమే. అప్పుడు ఒక ఉద్దేశం మనలను కలిపి వుంచితే, మరొకటి మనలను వేరు చేస్తుంది! కాబట్టి ఆ సహకార భావం మనలో మేల్కొనడం; కలిసి మెలిసి వుండడంలో, కలిసి మెలిసి పనిచేయడంలోను కలిగే ఆనందాన్ని రుచి చూడడం, దండన మండనముల గురించిన ఆలోచనయే లేకపోవడం – ఇవి ప్రధానంగా కావలసిన విషయాలు. ఇట్టి సహకారప్రవృత్తి చాలా మంది చిన్నపిల్లలలో సహజంగానే వుంటుంది – దానిని వారి పెద్దలు అణిచివేయకుండా వుంటే.

**1. ప్రశ్న:- మన మానసిక చింతలకు కారణములైన పరిస్థితులను తొలగించుకో లేకపోతే, ఆ చింతలు మనలనెట్లా వదిలిపోతాయి?**

కృష్ణమూర్తి:- అలాంటప్పుడు మీరు వాటిని ఎదుర్కొనవలసిందే! లేకుంటే మరేం చేస్తారు? మామూలుగానైతే మీరు మీ చింతలనుండి విముక్తులు కావడం కోసం వాటికి కారణములైన సమస్యలనుండి మీరు పారిపోతారు; మీరు గుడికైనా పోతారు, సినిమాకైనా పోతారు, లేదా ఏదైనా వారపత్రికో మాసపత్రికో తీసికొని చదవడం మొదలు పెడతారు, లేదా రేడియో పెట్టుకొంటారు, ఇవేమీకాకపోతే మనస్సును మరొక దానిమీదికి మళ్ళిస్తారు. కాని యిట్లు సమస్యల నుండి తప్పించుకొని పారిపోవడం వలన సమస్యలు పరిష్కారమౌతాయా? కావు. మీరు మళ్ళీ తిరిగి రాగానే అవి మీ యెట్టయెదుట మళ్ళీ సాక్షాత్కరిస్తాయి. అందుకని మొట్టమొదటనే వాటినెదుర్కోవడం మంచిదికాదా?

సరే – అసలు 'చింత' అంటే యేమిటి? పరీక్షలు పాసవుతామో లేదో అనేది మీ చింత; పాసు కామేమో యని మీ భయం. ఆ భయం వలన మీ ఒళ్ళు చెమటలు పోస్తుంది. రాత్రిళ్ళు నిద్ర పట్టదు. మీరు పాసు కాకపోతే మీ తల్లి తండ్రులకెంతో ఆశాభంగం. "నేను సాధించాను, పరీక్షలన్ని పాసయినాను" – అని ఘరానాగా చెప్పుకోవాలని మీ కోరిక. ఈ విధమైన చింత పరీక్షలు వ్రాసే దినం వరకు వుంటుంది. ఆ తర్వాత మళ్ళీ పరీక్షా ఫలితాలు వచ్చేటంతవరకు గూడ అది అట్లే కొనసాగుతూ వుంటుంది. దీని నుండి మీరు తప్పించుకోగలరా? ఈ పరిస్థితి నుండి పారిపో గలరా? వాస్తవానికి మీరా పని చేయలేరు, కాదంటారా? అందు వలన దాని నెదుర్కోవడం తప్పదు. దానికింత చింతించడ మెందుకు? మీరు బాగానే చదివినారు, చేయగల్గినదంతా చేసినారు – పాసయినా సరే, కాకపోయినా సరే. దానికోసం బాధపడడమెందుకు? మనస్సులో మీరెంతగా బాధపడుతూ వుంటే అంతగా భయమెక్కువౌతూ వుంటుంది, జంకు ఎక్కువవుతుంది – ఆలోచన మట్టమవుతుంది. దాంతో, పరీక్షనాడు అసలేమీ వ్రాయలేరు, కేవలం గడియారంవంక చూస్తూ వుండిపోతారు. నా విషయంలో జరిగిన దదే!

ఒక సమస్యను గూర్చి మనస్సు అదే పనిగా ఆలోచిస్తూ వుంటే, విడవకుండా దాన్నే పట్టుకొని వుంటే, అప్పుడు దానినే 'చింత' అని అంటాం, అవునా కాదా? సరే. మరి, మనమాచింత నుండి విముక్తులమెట్లు కాగలము? మొట్టమొదట,

అసలు సమస్య యేదైనా సరే, అది మన మనస్సులో వేరూని నాటుకోకుండా చూచుకోవాలి. అది నాటుకోడానికి తగిన భూమిగా మన మనస్సు ఉపయోగ పడరాదు. ఇది చాలా ముఖ్యం.

మనస్సంటే యేమిటో మీకు తెలుసునా? పెద్ద పెద్ద మనస్తత్త్వవేత్తలు అనేక సంవత్సరాలపాటు మనస్తత్త్వాన్ని పరిశీలిస్తూ గడిపినారు; దాని మీద అనేక ఉద్గ్రంథాలు వ్రాసినారు. కాని తదేక ధ్యానంతో పరిశీలించి చూచుకొన్నట్టయితే మనస్సన నేమిటో తెలిసికోవడం అంత కష్టంకాదు. మీ మనస్సును మీరెప్పుడైనా పరిశీలించి చూచుకొన్నారా? మీరింత వరకు ఏమేమి నేర్చుకొన్నారో అదంతా, మీకు కలిగిన చిన్న చిన్న అనుభవాల స్మృతులూ, మీ తల్లి తండ్రులు ఉపాధ్యాయులు మీకు చెప్పిన విషయాలూ, పుస్తకాలలో చదివినదీ, చుట్టూరా వున్న ప్రపంచంలో మీరు స్వయంగా చూచి తెలిసికొన్నదీ – ఇవన్నీ కలిస్తే మనస్సు అవుతుంది. పరిశీలించేది, వివేచించేది, నేర్చుకొనేదిన్నీ ఈ మనస్సే. మంచి గుణాలనబడే వాటిని అలవాటు చేసికొనేదీ, తన ఉద్దేశాలను ఇతరులకు తెలియజేసేదీ కూడా ఈ మనస్సే. దీనిలో కోరికలున్నాయి, భయాలున్నాయి. మనస్సంటే పైపైన మనకు కనబడేది మాత్రమే కాదు, దానిక్రింద లోతైన పొరల అడుగున వుండే అంతశ్చేతన (Unconscious mind) కూడ మనస్సే. ఈ అంతశ్చేతనలోనే జాతిగతములైన ఆశలు, ఆకాంక్షలు, ప్రేరణలు, ప్రబోధనలు, సంఘర్షణలు నిగూఢములై వుంటాయి. ఇవన్నీ కలిసి మనస్సు అవుతుంది. దీనినే చేతన (consciousness) అని కూడ అంటారు.

సరే, మన మనస్సెప్పుడూ నిశ్చలంగా వుండదు, ఎప్పుడూ ఏదో యొక ఆలోచనతో, ఏదో యొక చింతతో వ్యాపృతమై (occupied) వుండగోరుతుంది. తల్లి తన పిల్లల గురించి, ఇల్లాలు తన వంటగది గురించి, రాజకీయ నాయకుడు తన పలుకుబడిని గురించి లేదా లోక్‌సభ (Parliament)లో తన స్థానము గురించి, నిరంతరము చింతామగ్నులైవున్నట్లే, మనస్సు కూడ నిరంతర మేదో యొక చింతలో నిమగ్నమై వుండగోరుతుంది. ఈ విధంగా వ్యాపృతమై యున్న మనస్సు ఏ సమస్యనూ పరిష్కరింపజాలదు. ఏమి, మీకు బోధ పడుతున్నదా? అవ్యాపృతమగు మనస్సే – అంటే చింతాక్రాంతముకాని మనస్సే ప్రసన్నముగనుండి సమస్యల నర్థము చేసికొనగలదు.

మీ మనస్సును మీరు పరిశీలించి చూచుకోండి – అదెంత చంచలంగా వున్నదో! దాని కెప్పుడూ తీరిక వుండదు. ఎప్పుడును ఏదో ఆలోచనలో నిమగ్నమై వుంటుంది. నిన్న యెవరో అన్నమాటలు, ఇప్పుడే మీరు నేర్చుకొన్న విషయాలు, రేపు మీరేమి చేయబోతున్నారో అది – ఇట్లాగా ఏదో యొకదానితో మనస్సు ఎప్పుడూ నిండి వుంటుంది. అదెప్పుడూ ఖాళీగా వుండదు. అంటే దాని అర్థం గతిరహితమై నిశ్చలంగా స్థిరంగా వుండిపోతుందని గాని, దానిలో ఒకవిధమైన శూన్యత యేర్పడుతుందని గాని కాదు. అయితే అత్యుత్తమమైన దానితో గాని, అధమాధమమైనదానితో గాని, దేనితోనేనా సరే ఆలోచనతో నిండివున్న మనస్సు అల్పమైనది, క్షుద్రమైనది. క్షుద్రమగు మనస్సు ఏ సమస్యనూ పరిష్కరింపజాలదు.

అది ఆ సమస్యతో పూర్తిగా ఆక్రమింపబడి దానితో కుస్తీపడుతూ వుంటుంది, అంతే. సమస్య ఎంత పెద్దదైనా అది మనస్సును ఆక్రమించగానే అదికూడా క్షుద్రమైపోతుంది. క్షుద్రమగు మనస్సు ఎంత పెద్ద సమస్యనైనా క్షుద్రముగానే మార్చివేస్తుంది. అనాక్రాంతమై, అందువలన నిశ్చలంగా, ప్రసన్నంగా వుండే మనస్సు మాత్రమే సమస్యల నెదుర్కొని వాటిని పరిష్కరింప గలుగుతుంది.

అయితే మనస్సు దేనిచేతను ఆక్రాంతము కాకుండా, ఏ ఆలోచనా లేకుండా వుండడం చాలాకష్టం. మీరెప్పుడైనా ఏటిగట్టున గాని, మీ గదిలో గాని ప్రశాంతంగా కూర్చుండి మిమ్ములను మీరు పరిశీలనగా చూచుకోండి. మీరు గమనిస్తూ వున్న ఆ కొద్దిపాటి స్థలము, – దేనినైతే మనము మనస్సని పిలుస్తామో అది – త్రోసుకొని వస్తూవున్న ఆలోచనలతో ఎట్లా నిరంతరము నిండిపోతూ వుంటుందో మీకు తెలుస్తుంది. ఈ విధంగా మనస్సు ఏదోయొకదానితో నిండి వున్నంతవరకు, ఆక్రాంతమై వున్నంత వరకు – ఆ మనస్సు గొప్ప శాస్త్రజ్ఞునిది కానీయండి, లేదా వంటచేసికొనే యిల్లాలిది కానీయండి – అది అల్పమైనది, క్షుద్రమైనది. అది యేసమస్యను తీసికొన్నా పరిష్కరింప జాలదు. అట్లుగాక దేనిచేతను ఆక్రాంతముగాని మనస్సులో తగినంత 'అవకాశము' (చోటు, జాగా, space) ఉండడం చేత, అది సమస్య నెదుర్కొని పరిష్కరింపగలదు. అట్టి మనస్సు కడిగివేయబడినట్లు నిర్మలముగా వుండడం వలన, పారంపర్యంగా తనకు సంక్రమించివున్న ప్రాతకాలపు స్మృతులు సంప్రదాయముల మాధ్యమమున గాకుండా, సరిక్రొత్తరీతిని సమస్య నెదుర్కొనగలదు, కాన పరిష్కరింపగలదు.

## 2. ప్రశ్న:- మనలను మనమెట్లు తెలిసికొనగలము?

**కృష్ణమూర్తి:-** మీ ముఖాన్ని మీరు అద్దంలో చాలాసార్లు చూచుకొనే వుంటారు కాబట్టి అదెట్లా వుంటుందో మీకు బాగా తెలుసు. అయితే, మిమ్ము మీరు పూర్తిగా చూచుకోవాలంటే ఉపయోగపడే అద్దం వేరొకటివుంది. అందులో మీ ముఖాన్ని కాదుగాని, మీ యాలోచనలను, మీ భావాలను, మీ యుద్దేశాలను, మీ తీరనికోరికలను, మీలోగల్గెడి ప్రేరణలను, భయాలను అన్నిటిని చూచుకోగలరు. అదే పరస్పర సంబంధమనే అద్దము. అంటే, మీకును మీ తల్లిదండ్రులకును మధ్య, మీకును మీ ఉపాధ్యాయులకును మధ్య, మీకును నదికిని, వృక్షములకును, భూమికిని మధ్య, మీకును మీ యాలోచనలకును మధ్య గల సంబంధమే ఆ అద్దము. ఈ పరస్పర సంబంధమనే అద్దంలో మిమ్ము మీరు యథాతథంగా చూచుకోగలరు కాని, మీరు కోరుకొనే విధంగా అందులో చూచుకోలేరు. మామూలు అద్దంలో చూచుకొనేటప్పుడైనా, ఇంకొంత అందంగా కనబడితే బాగుండునని నేననుకోవచ్చు, కాని అది అట్లా జరుగదు గదా! ఆ అద్దంలో నా ముఖం ఎట్లా వుందో అట్లానే కనబడుతుందిగాని, నేను కోరుకొన్న రీతిగా కనబడదు గదా? ఈ విషయంలో నన్ను నేను వంచించుకోలేను గదా! అదే విధంగా ఇతరులతో నాకు గల సంబంధమనే అద్దంలో నన్ను నేను ఉన్నదున్నట్లుగా చూచుకోగలను. నే నితరులతో ఎట్లా మాట్లాడుతున్నానో, ఎవరివల్లనైనా నాకు కొంత ప్రయోజనముంటుందని తోస్తే

వారితో ఎంత మర్యాదగా మాట్లాడుతానో, ఏమీ ప్రయోజనం లేదని తోస్తే వారితో ఎంత మొరటుగా, ఎంత తృణీకారభావంతో మాట్లాడుతానో గమనించగలను. నే నెవరికి భయపడతానో వారియెడల చాలా జాగ్రత్తగా వుంటాను. ఎవరైనా గొప్పవాండ్లు వస్తే లేచి నిలబడతాను. కాని నౌకరెవరైనా వస్తే అతని గురించి అసలేమీ పట్టించుకోను. ఈ విధంగా పరస్పర సంబంధమనే అద్దంలో నన్ను నేను గమనించి చూచుకుంటే, ఇతరులను నే నెంత కృత్రిమంగా గౌరవిస్తానో తెలిసిపోతుంది, ఏమి, తెలిసిపోదా? మనుషులతోనే కాదు, చెట్లతో, పక్షులతో, అభిప్రాయాలతో, పుస్తకాలతో నాకు గల సంబంధాన్నిబట్టి నా గురించి నేను ఎన్నో విషయాలు తెలిసికోగలను.

ప్రపంచంలో వుండే విద్యాయోగ్యతలన్నీ మీకుండవచ్చు గాక, కాని మీగురించి మీకు తెలియకపోతే మీరు వట్టి బుద్ధిహీనుల క్రింద లెక్క. తన్నుతాను తెలిసికొనడమే విద్య యొక్క ప్రధాన ప్రయోజనము. ఇట్టి ఆత్మజ్ఞానము లేకుండా, కేవలం పరీక్షలు పాసవడం కోసం ఏవేవో విషయాలు సేకరించడం, వాటి గురించి నోట్సు వ్రాసికోవడం తెలివి తక్కువ పని. మీరు భగవద్గీత నుండిగాని ఉపనిషత్తుల నుండిగాని, కొరాను నుండిగాని, బైబిలు నుండిగాని, ధర్మసూక్తులను ఉటంకించవచ్చు, కాని మిమ్ము మీరు తెలిసికొకపోతే మీరు మాటలాడ నేర్చిన చిలుకలవంటివారు; మీరు మాట్లాడే దేదో మీకే తెలియదు. అట్లు గాక, ఎంత స్వల్పంగానైనా సరే మిమ్ము మీరు తెలిసికోవడం ఆరంభించిన క్షణమునుండి మీలో అసాధారణమైన సృజనాత్మకత వికసించడం మొదలుపెడుతుంది. మీరెంత పిసినిగొట్టులో, ఎంత జగడాలమారులో, ఎంత కోపిష్ఠులో, ఎంత అసూయాపరులో, ఎంత తెలివిమాలినవారో, ఉన్నదున్నట్లుగా, మీ నిజస్వరూపం హఠాత్తుగా బయటపడుతుంది. అది మీకొక అద్భుత దర్శనము. మీరొక క్రొత్త విషయాన్ని అకస్మాత్తుగా కనిపెట్టినట్టు. ఉన్న వాస్తవికాన్ని మార్చివేయడానికి ప్రయత్నించకుండా, మీ రెల్లాంటివారో యథాతథంగా చూచి తెలిసికొవడం మీకొక అద్భుతమైన కనువిప్పులాంటిది. అటనుండి మీరింకా లోలోతుకు పోయి చూస్తూ వుంటే అనేక విషయాలు తెలుస్తూ వుంటాయి. దీని కంతము లేదు. ఆత్మజ్ఞానమునకు హద్దెక్కడిది?

ఇట్టి ఆత్మజ్ఞానము ద్వారా దేవుడన నెవరో, సత్యమన నేమో, త్రికాలాతీత స్థితి యననేదో మీకు తెలియడం మొదలుపెడుతుంది. మీ ఉపాధ్యాయుడు, తాను తన ఉపాధ్యాయునినుండి సంపాదించుకొన్న జ్ఞానమంతా, మీకు అందజేయవచ్చు, మీరు మీ పరీక్షలలో బాగా వ్రాయవచ్చు. డిగ్రీ సంపాదించవచ్చు, ఇంకా ఏవేవో చేయవచ్చు; కాని అద్దంలో మీ ముఖాన్ని మీరు చూచుకొన్నంత స్పష్టంగా మిమ్ములను మీరు చూచుకోలేకపోతే మీరు సంపాదించుకొన్న తదితర జ్ఞానమంతా వ్యర్థము. తమ్ము దామెరుగని – అంటే, ఆత్మజ్ఞానములేని – విద్యావంతులు నిజానికి విద్యావంతులు కారు. వాండ్లకు ఆలోచించడమంటే యేమిటో తెలియదు. జీవితమంటే యేమిటో తెలియదు. అందువల్లనే మునుముందుగా విద్యాబోధకునకు దానియొక్క నిజమైన అర్థంలో విద్యాబోధన జరుగవలసి యున్నది. అంటే, దాని అర్థం అతనికి అతని మనోహృదయములు పని చేసే తీరు, – వాటి వ్యాపారములు – తెలియవలసి

యున్నది. ఇతరులతో తనకుగల సంబంధమనే అద్దంలో అతడు తన్నుతాను, యథాతథంగా, చూచుకోవలసి యున్నది. ఇట్టి ఆత్మజ్ఞానమే వివేకోదయమున కారంభము. తన్నుతాను తెలిసికొంంటే విశ్వమంతా తెలిసికొన్నట్టే; అట్లే మానవజాతి యొక్క సంఘర్షణలన్నీ ఆత్మజ్ఞానాంతర్గతములే; అన్నియు దాని పరిధిలోనివే.

3. ప్రశ్న:- మనకు ప్రేరణనిచ్చే వ్యక్తి లేకుండా, మనలను మనము తెలిసికోగలమా?

కృష్ణమూర్తి:- మీ గురించి మీరు తెలిసికోవాలంటే, మీకు ప్రేరణ నిచ్చే వ్యక్తి అవసరమా? మిమ్మును తొందర చేయడానికి, మీకు చులుకు పుట్టించడానికి, మిమ్ము ముందుకు త్రోయడానికి ఎవరైనా ఉండవలెనా? ప్రశ్నను చాల జాగ్రత్తగా వినండి, వింటే మీకే జవాబు తెలుస్తుంది. సమస్యను సరిగ్గా చదివి అర్థం చేసుకొంటే సగం సమస్య పరిష్కరింపబడినట్లే కదా? కాని దానికి జవాబు తెలిసికోవాలనే ఆదుర్దాతో మీ మనస్సంతా నిండిపోయి వుంటే అసలు మీరా సమస్యనే సరిగ్గా చదువలేరు.

ప్రశ్న యేమిటనగా, మనలను మనం తెలిసికోవాలంటే అందుకోసమై మనలను ప్రేరేపించేవాడు ఎవడైనా ఉండనక్కరలేదా అని.

అయితే, మీకు ప్రేరణ యివ్వడానికి, ప్రోత్సాహమివ్వడానికి, మీరు బాగా పని చేస్తున్నారని చెప్పడానికి ఒక గురువు కావలసివస్తే, దాని అర్థం, మీరామనిషి మీద పూర్తిగా ఆధారపడుతున్నారన్నమాట! అందువలన ఎప్పటికైనా ఆ మనిషి వెళ్ళిపోతే, మీ గతి దుర్గతే! ప్రేరణకోసం మీరొక మనిషిమీద గాని, ఒక భావనమీదగాని ఆధారపడితే, ఆ క్షణమునుండి భయము తప్పదు. అందువలన అది నిజానికి ప్రేరణ కాదు. అట్లుగాక ఒక శవాన్ని తీసికొని పోతూవుంటే, లేదా ఇద్దరు మనుషులు కొట్లాడుకొంటూ వుంటే చూచినప్పుడు ఆ దృశ్యములు మీలో ఆలోచనను రేకెత్తించవా? పెద్ద పెద్ద ఆశలు పెట్టుకొన్నవానిని చూచినప్పుడుగాని, మీ రాష్ట్రగవర్నరు వస్తే అతని కాళ్ళకు మీరంతా ఎట్లా మొక్కుతారో గమనించినప్పుడుగాని ఏమిటి ఇదంతా అని తర్కించుకోరా? అందువలన దేనిని చూచినా ప్రేరణ కలుగవచ్చు - చెట్టునుండి ఆకురాలడం, పిట్ట కూలి నేలపడడం, మనిషిపోయే వింతవింత పోకడలు - ఇట్లా దేనిని చూచినా ప్రేరణ కల్గుతుంది. మీరు వీటేనన్నిటెని గమనిస్తూవుంటే, మీరెల్లప్పుడు నేర్చుకొంటూనే వుంటారు, అనేక విషయాలు గ్రహిస్తూ వుంటారు. అట్లుగాక మీరెవరినో ఒక మనిషిని గురువుగా భావించి అతని మీదనే మీ భారమంతా వుంచేటట్లయితే మీరెంతో నష్టపోతారు. ఆ మనిషి మీకు సింహస్వప్నమై కూర్చుంటాడు! అందువలన ఎవరినైనా అనుసరించడం పనికిరాదు. ఎవరినో ఒక గురువును అనుసరించే బదులు పారుతున్న యేటిని, పూచిన పువ్వులను, పచ్చని చెట్లను, బరువుమోస్తున్న అబలను, మీ కుటుంబ సభ్యులను, మీలో పుడుతున్న ఆలోచనలను - వీటి అన్నిటినుండి మీరు నేర్చుకోవచ్చు గదా? ఈ చదువు మీ యంతట మీరు చదువుకొనే చదువు; ఇతరులు చెప్పేదికాదు. అందులో వున్న అందమే అది! దీనికి కావలసింది నిత్యజాగరూకత, నిరంతర పరిశీలనాసక్తమగు మనస్సున్ను. జాగ్రత్తగా గమనించడం

ద్వారా, సంఘర్షణతో గూడిన తీవ్రప్రయత్నం ద్వారా, ఆనందము ద్వారా, అశ్రువులు రాల్చడం ద్వారా నేర్చుకొనవలసి వుంటుంది.

**4. ప్రశ్న:- తనలో ఎన్నో పరస్పర వైరుధ్యములుంటూ వుండగా అస్తిత్వము, (Being), ఆచరణము (Doing) రెండును ఒకేసారి ఎట్లా సాధ్యములౌతాయి?**

కృష్ణమూర్తి:- పరస్పరవైరుధ్యమంటే యేమిటో మీకు తెలుసునా? జీవితంలో నేనొక పని చేయదలుచుకొంటాను. అదే సమయంలో మా తల్లితండ్రులను కూడా సంతోష పెట్ట దలుచుకొంటాను. కాని వాండ్లు నన్ను మరింకేదో పని చేయమంటారు. అప్పుడు నాలో ఘర్షణ ఆరంభమౌతుంది. అదే పరస్పరవైరుధ్యమంటే. దానినెట్లా నేను పరిష్కరించుకోవలె? నాలోని యీ పరస్పర వైరుధ్యాన్ని నేను పరిష్కరించుకోలేకపోతే, అప్పుడు నాయొక్క అస్తిత్వానికిన్ని ఆచరణకున్ను ఏకవాక్యత కుదురదు, రెండును ఒకటిగా ఉండవు; ఆ రెండింటిలో ఒకదాని కొకటి పొసగదు. అందువలన మొట్టమొదట నేను నాలోని పరస్పర వైరుధ్యాన్ని తొలగించుకోవలసి వుంటుంది.

చిత్రకళ అంటే మీకు జీవితంలో ఎంతో ఆనందాన్నిచ్చే విషయం. అందువలన చిత్రకళను అధ్యయనం చేద్దామని మీ రనుకొంటారు. కాని మీ తండ్రి మిమ్ము లాయర్లో, వ్యాపారస్థులో కండి అని ఆదేశిస్తాడు. దానికి మీరొప్పుకోకపోతే, మిమ్ము నరికి పోగులుపెడతాడు; మీ చదువుకు డబ్బు పంపడు. అప్పుడు మీలో పరస్పర వైరుధ్య మేర్పడుతుంది. సరే, అప్పుడు మీలోని పరస్పర వైరుధ్యాన్ని మీరెట్లా తొలగించుకొంటారు? ఆ మానసిక ఘర్షణనుండి, ఆ బాధనుండి మీరెట్లా విముక్తులౌతారు? అట్టి పరస్పర విరుద్ధ స్థితిలో చిక్కుకొన్నప్పుడు మీరు సరిగా ఆలోచన చేయలేరు. ఆ స్థితి తొలగిపోవాలి; అదో, యిదో, యేదో ఒక పనే చేయాలి. దేనిని చేస్తారు? మీ తండ్రికి లొంగిపోతారా? మీ తండ్రి కిష్టమైన పనినే చేసేటట్లయితే మీ ఆనందానికి భంగమన్నమాట – ప్రేమించని మనిషిని పెండ్లి చేసుకొని బాధపడుతున్నట్లు! పోనీ, అట్లైనా మీలో కలిగిన పరస్పర వైరుధ్యము తొలగిపోతుందా? అట్లుగాక మీరు మీ తండ్రిమాట కెదిరించి నిలబడితే – "క్షమించండి, పస్తుండవలసి వచ్చినాసరే, బిచ్చమెత్తుకోవలసి వచ్చినా సరే, ఏమైనా సరే, నేను లక్ష్యపెట్టను. నేను చిత్రకళను నేర్చుకొని తీరుతాను!" అని మీరన గలిగితే అప్పుడు మీలోని పరస్పర వైరుధ్యము తొలగిపోతుంది. అప్పుడు మీ అస్తిత్వము, ఆచరణ ఒకటిగా వుంటాయి. ఎందువల్లనంటే, మీకేపని చేయటం ఇష్టమో మీకు తెలుసు; దానిని మీరు హృదయపూర్వకంగా చేస్తారు కూడా. అట్లుగాక ఇష్టం లేకపోయినా లాయర్లో, వ్యాపారస్థులో మీరయినట్లయితే, చిత్రకారులు కావలననే మీకోరిక మిమ్ము లోలోపల తినివేస్తూ వుంటుంది. మీ శేష జీవితమంతా ఆశాభంగంతో, తీవ్రమనోవ్యాధితో, దైన్యంతో, ఎట్టి చులుకుదనములేక, బుద్ధిమందగించి, మిమ్ము మీరు నాశనం చేసికొంటూ, ఇతరులను నాశనం చేస్తూ, ఈసురోమని దినాలు లెక్క పెట్టుకొంటూ కాలం గడుపుతారు.

ఇది మీరాలోచించుకోవలసిన చాలా ముఖ్యమైన సమస్య. ఎందుకంటే, మీరు పెద్దవారైన తరువాత మీచేత కొన్ని పనులు చేయిద్దామని మీ తల్లితండ్రుల కోరిక. ఈ లోపల మీరు భవిష్యత్తులో చేయదలచిన పని నిజంగా మీ కిష్టమైనది యేదో స్పష్టం చేసికోకపోతే, వారు మిమ్ము కసాయివాని దగ్గరకు గొఱ్ఱెను నడిపించుకొని పోయినట్లుగా తమ యిష్టప్రకారం మిమ్ము నడిపించుకొని పోతారు. అట్లు గాక మీరు మీకిష్టమైన పని యేదో తెలిసికొని, దానిని చేయడంకోసం ఎంత త్యాగానికైనా మీరు సిద్ధపడితే, దానికోసం మీరు మీ జీవితాన్ని త్యాగం చేయగలిగితే, అప్పుడందులో విసంవాదముండదు, పరస్పర వైరుధ్యముండదు. అట్టి స్థితియందు మీ అస్తిత్వమే మీ ఆచరణము.

5. ప్రశ్న:- మాకిష్టమైన పనిని మేము చేయడంకోసం తల్లితండ్రులయెడ మాకుగల బాధ్యతలను, వారియెడ మాకుగల కర్తవ్యాలను మేము వదులుకోవలెనా?

కృష్ణమూర్తి:- 'కర్తవ్య'మని మీరొక అద్భుతమైన పదాన్ని వాడుతున్నారే, ఏమిటి మీ వుద్దేశం? ఎవరి యెడల ఆ కర్తవ్యం? మీ తల్లితండ్రులయెడ, మీ ప్రభుత్వమునెడ, మీరున్న సమాజమునెడలనా? మీరొక లాయరు కావాలని, మీరు తమ్ము బాగా చూచుకోవాలని, అది మీ ధర్మమని, మీ కర్తవ్యమని మీ తల్లిదండ్రులు మీతో అంటే, మీకు మాత్రం మనస్సులో సన్న్యాసం తీసికోవాలని కోరిక వుంటే, అప్పుడు మీరేం చేస్తారు? బహుశా భారతదేశంలో సన్న్యాసిగా జీవించడం ఇబ్బందిలేని పని కాబట్టి, గౌరవింపబడే వృత్తి కాబట్టి మీ తండ్రి దాని కంగీకరింపవచ్చునేమో! కాషాయ వస్త్రాలు ధరించగానే మీరు గొప్పవారైపోతారు! మీ తండ్రి యిక దానిమీద వ్యాపారం చేయడం మొదలుపెట్టవచ్చు! అట్లుగాక మీరు మీ చేతులతో పనిచేయదలిస్తే, ఒక మామూలు వడ్రంగిగాని, మట్టితో అందమైన వస్తువులు చేసే కుమ్మరిగాని కాదలిస్తే, అప్పుడు మీ కర్తవ్యం మాట ఏమౌతుంది? ఎవరైనా ఇతరులు మీకీ విషయంలో ఏమి చెప్పగలరు? అందులో ఏమేమి యిబ్బంది లుంటాయో చూచి, జాగ్రత్తగా ఆలోచించి, మీ యంతట మీరు తేల్చుకోవలసిన విషయం కాదా యిది? అట్లా తేల్చుకొని, "ఇదిగో, ఇదే నా ధర్మమని అనుకొంటున్నాను. దీనికి నేను కట్టుబడివుంటాను – మా తల్లితండ్రులు అంగీకరించినా సరే, లేకున్నా సరే" అని మీ రనగలిగియుండాలి. మీ తల్లితండ్రులున్ను మీరున్న సమాజమున్ను మిమ్మేది చేయమంటే అది, మారుమాటాడక చేయడంకాదు కావలసింది. మీరు మీ కర్తవ్య మనుకొనే దానిలో ఇమిడియున్న కష్ట నష్టాలేవో బాగా ఆలోచించి చూచుకొని, ఏది సత్యమో స్పష్టంగా తెలిసికొని, ఆ సత్యాన్ని వదలక యావజ్జీవము అంటిపెట్టుకొని వుండగలగాలి. తిండిలేక పస్తుండవలసి వచ్చినా, ఎంతో దీనస్థితిలోకి పడిపోయినా, మృత్యువు ఎదురయినా లెక్క సేయరాదు. దీనికి ఎంతో ప్రజ్ఞ, ఎంతో తెలివి, అంతర్దృష్టి, ప్రత్యక్ష జ్ఞానము (perception), కావాలి. వీనితోబాటు అవ్యాజమైన ప్రేమ వుండాలి. మా తల్లితండ్రులను పోషించడం కేవలం మా బాధ్యత, మా విధి, మా కర్తవ్యం అని తలచి పోషిస్తున్నట్లయితే, ఆ పోషణ

సంతలోని సామానువంటిది. దానికి పెద్ద విలువలేదు – అది ప్రేమతో గూడినది కాదు కాబట్టి.

**6. ప్రశ్న:- ఇంజనీరును కావాలని నేనెంతగా కోరుకున్నా, మా తండ్రి కది యిష్టంలేకపోతే, ఆయన నా చదువుకు సహాయపడడు. అప్పుడు నేనెట్లు ఇంజనీరింగు చదవగలను?**

**కృష్ణమూర్తి:-** ఇంజనీరు కావాలని మీరు గట్టిగా పట్టుబడితే, మీతండ్రికది యిష్టంలేక, మిమ్ము ఇంట్లో నుంచి బయటికి వెళ్లగొడితే, మరి మీకింక ఇంజనీరింగు చదవడానికి దారే కనబడదంటారా? యాచించండి, స్నేహితుల దగ్గరికి పోండి. అయ్యో, జీవితమనేది ఎంతో వింతైనది. మీరు చేయదలచినదేదో అది మీకు స్పష్టమై వుంటే, ఇక అన్నీ వాటికవే అనుకూలంగా జరుగుతూ వుంటాయి. జీవితమే మీకు సహాయ పడుతుంది – ఎవరో స్నేహితుడో, బంధువో, ఉపాధ్యాయుడో, మీ బామ్మో, మామ్మో లేదా మరొకరో మీకు సహాయమందిస్తారు. కాని మీ తండ్రి మిమ్ము ఇంట్లోనుండి బయటికి తరిమివేస్తాడేమోననే భయంతో మీరసలు ప్రయత్నమే మానుకొంటే మీరే నష్టపోతారు. భయంచేత ఇతరుల ఒత్తిడికి ఊరక లొంగిపోయేవారికి జీవిత మెన్నడును సహాయపడదు. అట్లుగాక, "ఇదీ – నేను నిజంగా చేయగోరింది. దీనికోసం ఏమైనాసరే, గట్టిగా ప్రయత్నిస్తాను" అని మీరంటే అప్పుడొక అద్భుతం జరగడం మీరు చూడగలరు. మీకు తిండి దొరకకపోవచ్చు, ముందుకు అడుగువేయాలంటే ఎంతో తంటాలు పడవలసిరావచ్చు. అయితే యేమి, మీ జీవితం సార్థకమవుతుంది. మీ జన్మ చరితార్థమవుతుంది. అది దేనికినీ నకలు కాదు; అదే అందులోని విశేషం, అదే దాని మహిమ.

చూడండి, మనలో చాలామందిమి ఒంటరిగా నిలబడాలంటే భయపడతాం. అందులోను మీలాంటి చిన్నపిల్లలకది మరీ కష్టమని నాకు తెలుసు. అమెరికాలోను, ఐరోపాలోను వున్నట్టు ఈ దేశంలో చిన్నపిల్లలకు ఆర్థిక స్వాతంత్ర్యం లేదు. ఇక్కడ జనాభా చాలా ఎక్కువ. అందుచేత ప్రతివాడు త్వరగా లొంగిపోతాడు. "మా గతి యేమవుతుందో?" అని మీరంటారు. కాని మీరు గట్టిగా నిలబడితే, ఎవరోయొకరు మీ సహాయానికి వచ్చితీరుతారు. పదిమంది నుండి వచ్చే వత్తిడిని మీరు నిజంగా తట్టుకోగల్గితే, అప్పుడే మీరు స్వతంత్రవ్యక్తులు; అప్పుడే జీవితము మీ సహాయానికి వస్తుంది.

చూడండి, జీవశాస్త్రం (Biology)లో 'ఖేల' (sport) అనే ఒక వింతదృశ్యమున్నది. మామూలుగా వుండే ఒక జాతి ప్రాణులలో అనుకోకుండా ఏదో వింత మార్పొకటి కనబడుతుంది. ఉదాహరణకు, మీరొక పూలతోట వేశారనుకోండి. అందులో ఒక పూలజాతిని మీరు పెంచుతూ వుంటారు. ఇట్లా వుండగా, తటాలున ఒక ఉదయం మీరు పోయిచూస్తే, ఆ పూలమధ్య సరిక్రొత్త పూవొకటి కనిపిస్తుంది. అది ఆ పూలజాతికి సంబంధించినదేయైనా, వాటి మాదిరిగా వుండదు. క్రొత్తగా కనిపిస్తుంది. దానినే 'ఖేల'(sport) అంటారు. అది క్రొత్తగా వింతగా వుంటుంది. కాబట్టి దాని

నందరు వెంటనే గుర్తించగలరు. తోటమాలి దాని గురించి ప్రత్యేక శ్రద్ధ వహిస్తాడు. జీవితం కూడా అటువంటిదే. మీరు సాహసించి ముందడుగు వేస్తే, తక్షణమే మీలోను, మీ చుట్టు ప్రక్కలను మార్పులు రాసాగుతాయి. జీవితము అనేక రూపాలతో, అనేక విధాలుగా వచ్చి మీకు సహాయ పడుతుంది. అది మీవైపు ఏ రూపంలో వస్తుందో మీకు నచ్చకపోవచ్చు. అది దైన్యము, సంఘర్షణ,, ఆకలిబాధ – ఏదైనా కావచ్చు. కాని మీరెప్పుడైతే జీవితాన్ని ఆహ్వానిస్తారో అప్పటినుండి వింతలు జరగడం ఆరంభమవుతుంది. కాని చూడండి, మనం జీవితాన్ని ఆహ్వానింపగోరం. ఒడుదుడుకులులేని సాదా జీవితం గడుపగోరుతాం, సులభమైన ఆట ఆడగోరుతాం. అట్లా సులభమైన ఆట ఆడేవారు సులభంగానే మృత్యువువాత పడతారు – అది నిజం కాదా? అతిభద్రంగా ఆడడం మొదలుపెడితే అతిభద్రంగానే చచ్చిపోతాం.

*జనవరి 19, 1955*

★ ★ ★

# 16. జరామరణములు లేని మనస్సు

మొన్న ప్రొద్దున ఒక శవాన్ని దహనం చేయడం కోసం తీసికొని పోతూవుంటే నేను చూడడం తటస్థించింది. దానికి తళతళ మెరుస్తున్న ఒక ఎఱ్ఱరంగు గుడ్డను చుట్టబెట్టినారు. దాన్ని మోస్తూవున్న నలుగురు మనుషులు లయబద్ధంగా నడుస్తూవుంటే అది కూడా అదే లయలో వూగుతూవుంది. అటువంటి శవాన్ని చూస్తే ఎవరికైనా ఏమనిపిస్తుంది? అసలేదైనా ఎందుకు క్షీణిస్తుందో మీకెప్పుడూ అనుమానం రాలేదా? మీ మనస్సులో జిజ్ఞాస కలుగలేదా? సరిక్రొత్త మోటారు కారును కొన్నారనుకోండి; అది కొన్ని సంవత్సరాలలోనే అరిగి డొక్కైపోతుంది. అదే విధంగా మన శరీరం కూడా క్రమంగా ఉడిగిపోతుంది, క్షీణిస్తుంది. మరి కొంత లోతుకుపోయి, మన మనస్సెందుకు క్షీణిస్తుందో ఆలోచించవద్దా? ముందో వెనుకో ఈ శరీరానికి మృత్యువంటూ తప్పదు. కాని మనలో చాలామంది మనుసు లిప్పటికే మృత ప్రాయములై పోయినాయి. క్షీణించడం ఇప్పటికే ఆరంభమయింది. మరి మన మనస్సు ఎందుకు క్షీణించాలి? శరీరము క్షీణిస్తున్నదంటే కారణమున్నది – మనం మన శరీరాన్ని నిత్యమూ ఉపయోగిస్తున్నాం. సహజంగా భౌతిక శరీరం అరుగుతుంది, తరుగుతుంది. వ్యాధి, ప్రమాదములు, వార్ధక్యము, దుష్టాహారము, వంశానుగతమగు బలహీనతలు – ఇవన్నీ శరీర క్షయమునకు మృత్యువుకున్న కారణాలు. కాని మనస్సెందుకు క్షీణించాలి? దానికి ముసలితనమెందుకు రావాలి? అది యెందుకు బరువెక్కాలి? చులుకుదన మెందుకునశించాలి?

మృత శరీరాన్ని చూచినప్పుడు మీకీ ఆలోచన లెన్నడూ రాలేదా? శరీరాలు మరణించడం తప్పదు, కాని మనస్సెందుకు క్షీణించాలి? మీకీ ప్రశ్న యెప్పుడునూ తట్టలేదా? అయితే మనస్సు క్షీణించకుండా వుండడం లేదు. ఇది వృద్ధుల లోనేకాదు, యువకులలోను మనం చూస్తాం. యువకులలోను ముందుగానే మనస్సు చులుకుదనం లేక, భారమెక్కువై కొరడుపారిపోతున్నది. సంవేదనలకు స్పందించడం మానినది. మరి మనస్సెందుకు క్షీణిస్తుందో మనం తెలిసికోగల్గితే, దానితోబాటు, అవినాశి యైనదేదో అది మనం తెలిసికోగలము. అదే శాశ్వతమైన జీవితము, దాని కంతములేదు. అది కాలమునకు అతీతమైనది, ఎన్నటికిని వికారము చెందనది, దూషితము కానిది, మామూలు శరీరమువలె క్షయించనిది. మామూలు శరీరమైతే అది క్షయించి, శ్మశానమునందు దహనం చేయబడుతుంది. దాని అవశేషాలు ఏటగలుపబడతాయి.

మరి, మన మనస్సెందుకు క్షీణిస్తుంది? దీని గురించి మీరెప్పుడైనా

ఆలోచించారా? మీరింకను చిన్నపిల్లలు కాబట్టి – మీరున్న సంఘము, మీ తల్లితండ్రులు, మీ పరిస్థితుల మూలాన ఇప్పటికే మీ మనస్సు మొద్దుబారిపోకుండా వున్నట్టయితే – అది నవనవోన్మేషమై ఔత్సుక్యము కలిగి ప్రతిది తెలిసికోవాలనే జిజ్ఞాసతో వుంటుంది. నక్షత్రాలంటే యేమిటి? అవెందుకున్నాయి? పక్షులెందుకు మరణిస్తాయి? చెట్టునుండి ఆకులు ఎందుకు రాలుతాయి? జెట్ విమానమెట్లా ఎగురుతుంది? – ఈ విధంగా ఎన్నో విషయాలు మీరు తెలిసికొనగోరుతారు. కాని అటువంటి తీవ్రమైన జిజ్ఞాస, ప్రతిదీ తెలిసికోవాలనే కోరిక అణచివేయబడుతుంది. ఏమి, అది నిజంకాదా? భయము, సంప్రదాయము యొక్క బరువు, అద్భుతమైన యీ జీవితాన్ని ఎదుర్కొనడానికి తగిన శక్తి లేకపోవడం – ఇవన్నీ దానికి కారణాలే. మనస్సుకు చురుక్కుమనిపించే ఒక మాట, అలక్ష్యంగా చూసిన ఒక చూపు, చేసిన చేష్ట, పరీక్షల భయం, తల్లిదండ్రుల బెదరింపు – ఇటువంటి వాటితో మీ కుతూహలమంతా క్షణంలో నీరుగారిపోతుంది. మీ మెత్తని మనస్సుకు అఘాతం తగిలి మొద్దుబారిపోతుంది!

మనస్సు మొద్దుబారడానికి మరియొక కారణం అనుకరణ; దానికి కారణం సంప్రదాయం. గతము (Past) యొక్క భారానికి మీరు లొంగిపోయి, అది గీచిన గీత దాటరు. అట్టి అంధానుకరణంలో మనస్సు తన భద్రతను చూచుకొంటుంది; తాను సురక్షితంగా వున్నట్లు భావించుకుంటుంది. అట్టి మనస్సు బాగా చమురు వేసిన మెత్తని గాడిలో మెల్లగా పోతున్న బండిచక్రం వలె ఎట్టి ఒడుదుడుకులు లేకుండా అలవాటు పడిన మార్గంలో నిశ్శంకంగా పోతూ వుంటుంది. మీ చుట్టూరా వున్న పెద్దవాండ్లను చూడండి. వారి ఆలోచనలకు భంగము కలగడం వారి కిష్టముండదు. వాండ్లకు శాంతి కావాలి! అది మృత్యుశాంతి యైనాసరే. కాని నిజమైన శాంతి దీనికి పూర్తిగా భిన్నమైనది.

మనస్సు ఒక గాడిలో స్థిరపడిపోయినప్పటినుండి, ఒక పద్ధతికి కట్టుబడిపోయి నప్పటినుండి, ఎల్లప్పుడూ భద్రత గురించిన కోరికయే దానిలో ప్రధానంగా పని చేస్తూ వుంటుంది – మీరు గమనించలేదా? అందువల్లనే మనస్సు ఒక ఆదర్శాన్ని, ఒక ఒరవడిని, ఒక గురువును అనుసరిస్తూ వుంటుంది. దానికి కావలసినది భద్రత; దాని నెవరును కదిలించకూడదు, దాని శాంతికి భంగము రాకూడదు. అందువల్లనే అది అనుకరిస్తూ వుంటుంది. మీరు మీ దేశ చరిత్రకు సంబంధించిన పుస్తకాలను చదివినప్పుడు అందులో చెప్పబడిన గొప్ప గొప్ప నాయకులవలె, మహాత్ములవలె, యుద్ధవీరులవలె జీవించాలని మీరనుకోరా? వారిని అనుకరించగోరరా? ప్రపంచంలో గొప్పవారు లేరని కాదు. కాని గొప్పవారిని అనుకరించడం, వారి మాదిరి వుండాలని ప్రయత్నించడం – ఇది మనలోని ఒక సహజగుణం (Instinct). మనస్సు ఆ విధంగా అనుకరించడమనే మూసలో పడిపోతుంది కాబట్టి దాని క్షీణతకు ఇది కూడ ఒక కారణమే.

అంతేగాకుండ అప్రమత్తులు, సూక్ష్మబుద్ధులైన క్రాంతివాదులు సమాజమున కక్కఅలేదు. పరంపరాగతమైన సంఘవ్యవస్థలో వారు ఇముడరు, ఇముడలేరు; వారా సంఘ వ్యవస్థను భంగము చేయవచ్చును గూడ. అందువల్లనే సంఘము మీ

మనస్సును తన కట్టుబాటులో నిలిపి వుంచుకోవడానికి ప్రయత్నిస్తుంది. మీరు చదివే చదువు కూడా అనుకరించడాన్ని, అనుసరించడాన్ని, సంప్రదాయానికి అనుకూలంగా నడుచుకోవడాన్ని ప్రోత్సహిస్తుంది.

మరి, మనస్సు అనుకరించడాన్ని మానివేయగలదా? అంటే, అలవాట్లు చేసికోవడం మానివేయగలదా? అలవాట్లలో ఇంతకు ముందే చిక్కుకొన్న మనస్సు ఆ యలవాట్లనుండి విముక్తము కాగలదా?

మనస్సంటే అలవాటు యొక్క ఫలితమే కాదా? అది సంప్రదాయము యొక్క ఫలితము, కాలము యొక్క ఫలితము. కాలమంటే పునః పునరావృత్తి – గతము (Past) వర్తమానమునందు కొనసాగటం. మరి మనస్సు – అంటే మీ మనస్సు – గతించిన వాటిని గూర్చి మరియు రాబోయే వాటిని గూర్చి ఆలోచించడం మానివేయగలదా? నిజానికి, గతకాలమేకదా వర్తమానము ద్వారా రాబోయేకాలముగా (Future) కొనసాగుతుంటుంది! మీ మనస్సు అలవాట్లనుండి విముక్తమై మరల అలవాట్లు చేసికోకుండా వుండగలదా? చాలా లోతుగా పోయి ఆలోచించిచూస్తే అది సాధ్యమేయని మీరు గ్రహించగలరు. ఆ విధంగా మనస్సు క్రొత్త అలవాట్లు చేసికోకుండా వుంటే, క్రొత్తపథకాలు వేయకుండావుంటే, మరల అనుకరించడమనే గాడిలో పడకుండా వుంటే అప్పుడా మనస్సు నిత్యనూతనమై వృద్ధాప్యమంటూ లేనిదై, పసిబిడ్డ మనస్సువలె అమాయకముగ నిర్మలముగ వుండిపోతుంది. అట్టి మనస్సునకుగల అవగాహన శక్తి అమితము.

అట్టి మనస్సుకు మృత్యువు లేదు. ఏలయన అది తనలో దేనినీ ప్రోగు చేసుకొంటూ కూడబెట్టుకొంటూ వుండదు. ఈ ప్రోగుచేసికొని కూడబెట్టుకొనే విధానమే అలవాట్లు ఏర్పడడానికి, అనుకరణ కొనసాగడానికి కారణము. ప్రోగు చేసికొంటూ, నిలువ చేసికొంటూ వుండే మనస్సు క్రమంగా క్షీణించి మృత్యువు వాత పడుతుంది. అట్లుగాక వాటిని ప్రోగు చేసికోకుండా కూడబెట్టి నిలువ జేసికోకుండా వుండే మనస్సునకు అంటే ప్రతిదినమును ప్రతిక్షణమును మరణిస్తున్న మనస్సునకు చావులేదు. అది నిర్మలమైన అనంతాకాశరూపంలో వుండిపోతుంది.

కాబట్టి మనస్సు తాను కూడబెట్టుకున్నవానికెల్ల మరణించాలి. అంటే అన్నివిధ ములైన అలవాట్లనుండి, ఇతరులను చూచి అభ్యాసంలో పెట్టుకొన్న సద్గుణములనుండి, తనకు భద్రత లభిస్తుందని వేటివేటిమీద ఆధారపడివున్నదో వాటియన్నిటినుండి మనస్సు విముక్తి పొందాలి. అప్పుడా మనస్సు తన ఆలోచనలనే వలలో తాను చిక్కుకోదు. ఈ విధంగా క్షణక్షణము మరణిస్తూ అంటే గతమునుండి విడివడుతూ వున్న మనస్సు నిత్యనూతనముగా వుంటుంది. కాబట్టి దానికెన్నటికిని క్షయము లేదు. దానిలోనుండి చీకటి తెరలు వచ్చి క్రమ్ముకొనవు.

1. ప్రశ్న:- మీరు చెప్పే విషయాలను మేమేవిధంగా ఆచరణలో పెట్టగలము?

కృష్ణమూర్తి:- మీరేదో వింటారు, అది చాలా బాగుందని అనుకొంటారు. దానిని మీరు మీ దైనిక జీవితంలో అమలులో పెట్టవలెననుకొంటారు. అంటే మీ ఆలోచనకున్ను ఆచరణకున్ను మధ్య వ్యవధి యున్నది. ఏమి, లేదంటారా?

మీరనుకొనే దొకటి, చేసేది మరి యొకటి. కాని మీరేమనుకున్నారో దానినే ఆచరణలో పెట్టాలని మీ కోరిక. ఈ విధంగా ఆచరణకున్ను ఆలోచనకున్ను మధ్య ఎడమున్నది, అంతరమున్నది. ఈ రెండింటికి మధ్యగల అంతరాన్ని ఎట్లా అతిక్రమించగలం? ఎట్లా దాటగలం? ఈ అంతరం లేకుండా ఎట్లా చేసికోగలం? ఆలోచనను ఆచరణతో కలిపి వేసే దెట్లాయని మీ ప్రశ్న.

మరి మీరు దేనినైనా చేయవలెనని గట్టిగా కోరుకొంటే దానిని మీరు చేసితీరుతారు – ఏమి, చేయరా? పోయి క్రికెట్టు ఆడదామని గట్టిగా అనుకొంటే లేదా మీకు బాగా ఇష్టమున్న పనిని దేనినైనా సరే చేయదలచుకొంటే, దానిని ఎట్లాగైనా సరే చేయడానికి దారులు వెదుకుతారు. దానినెట్లా చేయాలి, ఎట్లా ఆచరణలో పెట్టాలి అని మీరడగనే అడగరు. మీకు దానిలో ఔత్సుక్యముండడంచేత మీ మనస్సు మీ హృదయం మీ సర్వస్వమున్ను అందులో వుండడం చేత దానిని మీరు చేస్తారు.

కాని యీ రెండో విషయంలో మీరు చాలా చాతుర్యం చూపిస్తారు. మీరనుకొనే దొకటి, చేసేది యింకొకటి. "ఆహా! మీరు చెప్పిన విషయం ఎంత బాగుందో! బౌద్ధికంగా దానిని మేము ఎంతో మెచ్చుకుంటాం కాని దాని గురించి యేమి చేయవలెనో మాకు తెలియదు. దానిని ఎట్లా ఆచరణలో పెట్టవలెనో దయచేసి తెల్పండి" అని మీరంటారు. అంటే దానిని చేయవలెనని అసలు మీ మనస్సులో లేదన్నమాట! ప్రస్తుతానికి ఆ పనిని ఆపివేద్దామని మీ వుద్దేశం. కొంచెం ఈర్ష్య కొంచెం అసూయ లేదా మరింకొకటి కలిగి వుంటేనే మేలని మీ తలంపు; "ఇతరులందరిలోను ఈర్ష్య వున్నది. నాకెందుకు వుండరాదు?" అని మీ వాదము. దానితో మీ జీవితం ఎప్పటి మాదిరిగానే గడుస్తూవుంటుంది. అందులో మార్పురాదు. అట్లుగాక నిజంగానే ఈర్ష్య అనేది పనికిరాదని మీరనుకొంటే, కండ్లయెదుట త్రాచుపామును చూచినంత స్పష్టంగా మీరు ఈర్ష్యను చూడగలిగినట్లయితే యిక మీరప్పటినుండి ఈర్ష్యాపరులై వుండరు. అంతటితో అది సరి. ఈర్ష్య నుండి ఎట్లా విముక్తిని పొందాలి? అని మళ్ళీ మీరడగరు.

ఇంతకు దేనినైనా సరే స్పష్టంగా చూడడం, అంటే అందలి సత్యాన్ని గ్రహించడం ప్రధానంగాని దానిని ఆచరణలో ఎట్లా పెట్టడమనే ప్రశ్న కాదు ప్రధానం. మీ రా ప్రశ్న వేసినారంటే దాని భావం మీ రందలి సత్యాన్ని స్పష్టంగా చూడలేదని. దారిలో త్రాచుపామెదురైతే దానివలన కలిగే ప్రమాదమేమో మీకు స్పష్టంగా తెలుసు. కాబట్టి, వెంటనే దానినుండి తొలగిపోతారు. ఈర్ష్యవలన కలిగే ఫలితాలనన్నింటిని మీరు యథార్థంగా పరీక్షించి చూడలేదు; దానిగురించి మీతో ఎవరూ మాట్లాడి యుండలేదు; మీతో బాటు లోతుగా దానిని పరిశీలించి యుండలేదు. ఈర్ష్య పనికిరాదని మీతో చెప్పినారే గాని స్వయంగా మీరు దాని స్వరూప స్వభావాలను అధ్యయనం చేసి గ్రహించి యుండలేదు. దానిమీద – ఏదో స్థితికి చేరుకోవాలనే కోరికమీద – సమాజమున్ను వ్యవస్థీకృతమైన అన్ని మతములున్ను అధారపడి వున్నాయని మీ రెన్నడును గమనించలేదు. అట్లుగాక ఈర్ష్య అంటే యేమిటో, దాని సత్య స్వరూపాన్ని మీరు స్పష్టంగా చూచిన క్షణమే, ఆ యీర్ష్య మీనుండి తొలగిపోతుంది.

"నేనది యెట్లా చెయ్యాలి?" అనే ప్రశ్న ఆలోచనారహితంగా అడిగిన ప్రశ్న. ఎట్లా చేయవలెనో తెలియని ఏ విషయాన్నైనా తెలిసికోవాలని మీకు నిజంగా అభిరుచి వున్నట్లయితే, దానిగురించి విడువక పరిశీలించి దాని అంతు తేల్చుకొంటారు. అట్లుగాక, తీరికగా కుడిచి కూర్చుండి, "నాలోని లోభగుణాన్ని పోగొట్టుకోవడం కోసం ఏదైనా ఆచరణ యోగ్యమైన మార్గాన్ని ఒకదానిని తెల్పండి" అని మీరంటే మీనుండి ఆ లోభగుణము ఎన్నటికిని పోదు. మీరు లోభులుగానే వుండి పోతారు. అట్లుగాక, హెచ్చరికగల మనస్సుతో, ఎటువైపునకును మొగ్గుజూపకుండా, అనన్యభావముతో లోభమంటే యేమిటో లోతుగా విచారించి చూస్తే మీకు దాని సత్యస్వరూపము అవగతమవుతుంది. ఆ సత్యదర్శనమే మీకు లోభాన్నుండి విముక్తి నిస్తుంది. అంతేగాని దానినుండి విముక్తి పొందడం కోసం మీరు మార్గాన్ని వెదుకుతూ వుంటే మీకు విముక్తి లభింపదు.

**2. ప్రశ్న:- మనకోరికలెన్నటికిని పూర్తిగా నెరవేరవు, ఎందువలన? పూర్తిగా మన యిష్టానుసారమే పనిచేయవలెనంటే ఎప్పుడూ ఏవో ఆటంకాలు వస్తూనే వుంటాయి, ఎందువలన?**

**కృష్ణమూర్తి:-** ఏదైనా పని చేయవలెననే మీ కోరిక అఖండమై వున్నట్లయితే, – అంటే భయము లేకుండా, ఫలితమును గూర్చిన ఆలోచన లేకుండా, ఏదో సాధించవలెనని కోరుకోకుండా వున్నట్లయితే, – మీ మనోహృదయములందులో వున్నట్లయితే అప్పుడాటంకముండదు. మీ కోరిక ఖండితమై వున్నప్పుడు, అందులో అంతర్వైరుధ్యమున్నప్పుడు ఆటంకముంటుంది. మీరేదో చేయవలెననుకొంటారు కాని అది చేయడానికి భయపడతారు లేదా మరేదో చేయవలెనని అసంపూర్ణమైన కోరికొకటి వుంటుంది. ఇదంతా అటుంచి అసలు మీ కోరికలన్నీ యెప్పటికైనా నెరవేరడమంటూ వుంటుందా? ఏమి, మీకర్థమవుతున్నదా? వివరిస్తానుండండి.

సంఘమన్నా సమాజమన్నా మనిషికిని మనిషికిని మధ్యగల సమష్టి సంబంధము. అది మీరు పూర్ణకాములవడాన్ని[1] హర్షింపదు. మీరు పూర్ణకాములయినట్టయితే, మీరు సమాజానికొక పీడగా తయారవుతారు, ప్రమాదకరంగా పరిణమిస్తారు. ఒకవేళ కావాలంటే, తృష్ణ, ఈర్ష్య (పేరాశ, ఓర్వలేనితనం) లాంటి గౌరవనీయమైన కోరికలను పెట్టుకోవచ్చు, సంఘం వాటిని అనుమతిస్తుంది. అందుకేమీ యిబ్బంది వుండదు. ఈర్ష్యాళువులతోను, తృష్ణాళువులతోను, అంధవిశ్వాసముగల వారితోను, అంధానుకరణము చేయువారితోను సమాజమేర్పడినది కాబట్టి ఈర్ష్య, తృష్ణ (ambition), అంధ విశ్వాసము, అంధానుకరణములను – అవి మనిషిలో వుండే భయాన్ని సూచిస్తున్నప్పటికిన్ని వాటిని – సమాజ మనుమతిస్తుంది. మీ ఆశలు, ఆశయాలు పరంపరాగతమైన సంప్రదాయమనే చట్రంలో ఇమిడిపోగల్గి

1. 'ఇది చేస్తాను, అది చేస్తాను గొప్పవాణ్ణి అవుతాను' – ఇట్టి పరిణామమును (Becoming) సూచించెడి కోరికలు లేనివారే పూర్ణకాములు.

యున్నంతవరకు – సమాజానికి విరుద్ధంగా లేనంతవరకు – మీరు గౌరవనీయులైన పౌరులుగానే లెక్కింపబడతారు. కాని యెప్పుడైతే మీరు సంఘమర్యాదకు భిన్నంగా పూర్ణకాములౌతారో, అప్పుడు మీరు సమాజానికి ప్రమాదకరంగా పరిణమిస్తారు. అందువలన మీరు పూర్ణకాములు కాకుండ నిరోధించడంకోసం సమాజము మిమ్మొక కంట కనిపెడుతూ వుంటుంది. సంపూర్ణమై విసంవాదములేని ఆ మీ కోరిక మీ సంపూర్ణ వ్యక్తిత్వాన్ని సూచిస్తుంది. కాబట్టి అది సమాజములో క్రాంతిని తేగలదు.

అస్తిత్వమును (Being) పరిణామమును (Becoming) – ఇవి రెండును పూర్తిగా భిన్నములైన క్రియలు. అస్తిత్వరూపమైన క్రియ సమూలపరివర్తనము తెస్తుంది. కావున సమాజము దానిని నిరాకరిస్తుంది; అది (సమాజము) కేవలము పరిణామరూపమైన క్రియను మాత్రమే ప్రోత్సహిస్తుంది. ఈ క్రియ సమాజపు చట్రములో ఇమిడి పోగలదు. కావున సమాజమునకు ఆదరణపాత్రమవుతుంది. అయితే ఇట్టి పరిణామ రూపమైన క్రియద్వారా వ్యక్తమగు కోరిక ఒకవిధమైన తృష్ణారూపము (ambition). అటువంటి కోరిక యేదైనాసరే పూర్తిగా నెరవేరడమంటూ ఎన్నటికిని జరుగదు. ముందో, వెనుకో దాని కాటంకము కలుగుతుంది. విఘాతము కలుగుతుంది. వైఫల్యము ప్రాప్తమవుతుంది. కోరిక విఫలముకాగానే, ఆ వైఫల్యమునకు వ్యతిరేకంగా మనము హానికరమగు మార్గములతో తిరుగబడతాము.

ఇది మనం చర్చింపవలసిన చాల ముఖ్యమైన ప్రశ్న. మీ కోరికలేవీకూడా ఎప్పటికిని పూర్తిగా నెరవేరవనే చేదు నిజాన్ని మీరు పెద్దవారయ్యేకొలది గ్రహిస్తారు. కోరికల యొక్క సాఫల్యంలోనే వైఫల్యపు నీలినీడలు కనిపిస్తూ వుంటాయి. అందువలన మీ హృదయంలో సాఫల్యం వలన కలిగే ఆనంద గీతమునకు బదులు వైఫల్యపు నీలినీడల వలన కలిగే శోకగీతమే వినిపిస్తుంటుంది. గొప్పవాణ్ణి కావాలని, గొప్ప యోగిని కావాలని – యిట్లా ఏదేదో కావాలని కోరే కోరికకు అంతము లేదు. కాబట్టి పూర్ణకామత్వమంటూ వుండదు. ఇంకా ఎక్కువ కావాలి, ఇంకా గొప్ప కావాలి అనే కోరిక వుంటూనే వుంటుంది. అట్టి తీరనికోరిక వలన మనోవేదన, దైన్యము, యుద్ధములు కలుగుతాయి. అయితే ఇటువంటి 'పరిణామము' పొందవలెననే కోరికనుండి పూర్తిగా విడుదల పొందితే 'అస్తిత్వ' రూపమైన క్రియ సిద్ధిస్తుంది. ఇది పరిణామ క్రియకు పూర్తిగా భిన్నమైనది. అస్తిత్వమంటే 'ఉనికి', దానిలో పరిణామము లేదు – మార్పులేదు. దీనికి కాలముతో సంబంధము లేదు. ఇందు దేనినో సాధించాలని, సాఫల్యం పొందాలనే కోరిక వుండదు. అసలు అస్తిత్వమంటేనే పూర్ణకామత్వము.

3. **ప్రశ్న:- నేను మందమతినని నాకు తెలుసు. కాని నేను తెలివిగలవాణ్ణని ఇతరులు అంటారు. దేని ప్రభావం నామీద ఎక్కువగా వుంటుంది? నేను చూడడమా, వారు చెప్పడమా?**

**కృష్ణమూర్తి:-** సరేగాని ముందు మీరు ప్రశ్నను చాల జాగ్రత్తగా చాల ప్రశాంతంగా వినండి. జవాబు కోసం ప్రయత్నించకండి. "నీవు తెలివిగల వాడ"వని మీరు నాతో

అంటే, కాని నేను వట్టి మందమతినని నాకు బాగా తెలిసివుంటే, అప్పుడు మీరు చెప్పేమాట నామీద ఏమైనా ప్రభావం చూపిస్తుందా? తెలివిగలవాణ్ణిగా వుండడం కోసం ప్రయత్నిస్తూవుంటే, అప్పుడు మీరు చెప్పేమాట నామీద ప్రభావం చూపిస్తున్నట్లే! అప్పుడు మీరన్నమాటకు నేను ఉబ్బిపోతాను, మీరన్నమాటకు నేను లొంగిపోతాను. కాని నిజంగా మందమతియైనవాడు తాను తెలివిగలవాడు కావడం కోసం ప్రయత్నించడంచేత ఎప్పటి మందమతిగానే వుంటా డన్న విషయాన్ని నేను గ్రహిస్తే అప్పుడేం జరుగుతుంది?

నిజంగానే నేను అల్పబుద్ధినై కుశాగ్రబుద్ధిని కావడంకోసం ప్రయత్నిస్తూవుంటే, నేను అల్పబుద్ధిగానే వుండిపోతాను. ఎందువల్లనంటే, ఇంకోవిధంగా వుండడంకోసం, ఇంకోవిధంగా మారిపోవడం కోసం ప్రయత్నించడం, ఆ అల్పబుద్ధితనంలో ఒక భాగం! అల్పబుద్ధియైనవాడు తెలివితేటల లక్షణాలు కొన్ని సంపాదించుకోవచ్చు; ఏవో కొన్ని పరీక్షలు పాసవవచ్చు, ఉద్యోగం సంపాదించుకోవచ్చు. కాని దానితో వాడు అల్పబుద్ధి కాకుండా పోడు – దయచేసి దీనిని సరిగా అర్థం చేసికోండి; ఇది నేను నిరాశావాదినై చెప్పే మాట కాదు. కాని మనిషి తా నల్పబుద్ధినని, మూఢుడనని తెలిసికొని, కుశాగ్రబుద్ధిగా వుండడంకోసం ప్రయత్నించకుండా, తన అల్పబుద్ధితనాన్ని తన మూఢత్వాన్ని పరీక్షించి చూచుకొని దానిని అర్థం చేసికోవడానికై ఆరంభిస్తే ఆ యారంభించిన క్షణమునందే అతని తెలివి వికసింపసాగుతుంది, అతని ప్రజ్ఞ జాగృతమవుతుంది.

ఉదాహరణకు అత్యాశ అనే గుణాన్ని తీసికోండి. అత్యాశ అంటే యేమిటో మీకు తెలుసునా? కావలసిన దానికంటే ఎక్కువ తిండితినడం, ఆటలలో తక్కినవారికంటె గొప్పగా వుండాలని కోరుకోవడం, ఇతరులకంటే ఇంకా ఎక్కువ ఆస్తి కావాలని, వాండ్లకున్న కారుకంటే పెద్ద కారు కావాలని కోరుకోవడం – ఇదంతా అత్యాశనే సూచిస్తుంది. అయితే అత్యాశ మంచిది కాదని చెప్పి మీరు ఔదార్యాన్ని ఆచరణలో పెట్టడానికి ప్రయత్నిస్తారు – ఇది వట్టి తెలివితక్కువ పని. అత్యాశ లేనివాడుగా వుండడం కోసం ప్రయత్నించడం చేత అత్యాశ గుణమెన్నటికిని నశించదు. అట్లుగాక అత్యాశలో గర్భితములైయున్న విషయా లన్నిటిని మీరర్థం చేసికోసాగితే, అందలి సత్యాన్ని తెలిసికోవడం కోసం మీరు మీ మనోహృదయాలను అర్పిస్తే అప్పుడు మీరు అత్యాశనుండియే గాక, ఔదార్యమునుండియు విముక్తి పొందుతారు. అప్పుడే మీరు నిజమైన తెలివిగల మానవులు. ఎందువల్లనంటే మీరప్పుడు వాస్తవస్థితితో వ్యవహరిస్తున్నారేగాని, ఉండగోరిన స్థితిని అనుకరించడం లేదు.

కాబట్టి మీరు మందబుద్ధులై వున్నట్లయితే, తెలివిగల వాండ్లుగా, గడసరి వాండ్లుగా వుండడం కోసం ప్రయత్నించకండి. దానికి బదులు మీ రెందుకు మందబుద్ధులుగా వున్నారో అర్థం చేసికోండి. అనుకరించడం, భయపడడం, ఎవరిమాదిరిగానో వుండడానికై ప్రయత్నించడం, ఒక ఆదర్శాన్ని, ఒక ఒరవడిని అనుసరించడం – వీటన్నింటి చేత మనస్సు మొద్దుబారిపోతుంది. ఇతరులను అనుసరించడం మానినప్పుడు, మీకు భయమంటూ లేనప్పుడు, మీలో మీరు స్పష్టంగా ఆలోచించుకో గలిగినపుడు

మీరెంతో బుద్ధివికాసము గల మానవులు కారా? అట్లుగాక, మీరు మందబుద్ధులై, తెలివిగా వుండడం కోసం ప్రయత్నిస్తూ వుంటే, పైకిమాత్రం తెలివిగా కనబడుతూ, నిజానికి అతి మందబుద్ధులైన వారి కోవలో చేరతారు.

4. ప్రశ్న:- మేమెందుకు కొంటెపనులు చేస్తూవుంటాము?

కృష్ణమూర్తి:- మీరు కొంటెపనులు చేసేటప్పుడు ఈ ప్రశ్న వేసికొంటే అప్పుడది సార్థక మవుతుంది, దాని కప్పుడు అర్థముంటుంది. ఉదాహరణకు, మీకు కోపం వచ్చిందనుకోండి. ఆ సమయంలో నా కెందుకు కోపం వచ్చింది? అని యెప్పుడూ ప్రశ్నించుకోరు; ఏమి, ప్రశ్నించుకొంటారా? కోపం తగ్గిపోయిన తరువాత ఆ ప్రశ్న వేసికొంటారు. "ఎంత తెలివి తక్కువ పని చేశాను? నేను కోపం తెచ్చుకోకుండా వుండవలసింది!" అని అనుకొంటారు. అట్లుగాక కోపం వచ్చిన క్షణమందు, దానిని ఖండించకుండా, కేవలం గమనించి చూచినట్లయితే, దాని మీదికి మీ ఆలోచనను పోనిచ్చినట్లయితే, మీ మనస్సులోకి ఈ సంక్షోభం, ఈ తుపాను వచ్చినప్పుడు మీరు పూర్తిగా దాని యెదుట నిలిచినట్లయితే, ఆ కోపం ఎంత త్వరగా సమసిపోతుందో మీరే గమనించగలరు.

ఒక వయస్సులో పిల్లలు కొంటెపనులు చేస్తూవుంటారు. అయితే అది కూడ అవసరమే – ఎందుకంటే వాండ్లకా వయస్సులో ఉత్సాహం ఉఱకలు వేస్తూ వుంటుంది. చైతన్యం తొణికిసలాడుతూ వుంటుంది. చుఱుకు పాలు చిమచిమలాడుతూ వుంటుంది. అదంతా ఏదో విధంగా బ్రద్దలు చేసికొని బయటపడాలి. అందుకోసం అల్లరిపనులు చేస్తారు. కాని చూశారా, యిదంతా నిజంగా ఒక క్లిష్టమైన సమస్య. ఈ కొంటెతనానికి, ఈ తుంటరిపనులకు దోషభూయిష్టమైన ఆహారం కారణం కావచ్చు. నిద్ర లేకపోవడంగాని, భద్రతాభావము లోపించడంగాని, ఇంకా ఏవేవో కారణాలుండవచ్చు. అందువలన దానికి మూలమైన కారణాలన్నీ సరిగా అర్థం చేసికోకపోతే, ఆ పిల్లలు చేసే తుంటరితనం, సమాజ బంధములనుండి వారికి విముక్తి లేనందున, దానికి వ్యతిరేకంగా జరిగే తిరుగుబాటుగా పరిణమిస్తుంది.

బాల నేరస్థులంటే మీకు తెలుసునా? అనేకరకాల దారుణమైన పనులు చేసే పిల్లలు వాండ్లు. జీవిత సమస్యలను అర్థం చేసికోవడానికి వాండ్లకెవరును తోడ్పడలేదు. వాండ్లకు వారుండే సమాజమే ఒక చెఱసాల. అందులోనే వారు తిరగబడతారు. వాండ్లలో ఎంతో శక్తి వున్నది. వాండ్లలో కొందరు అసాధారణమైన ప్రజ్ఞావంతులు. వాండ్లు తిరుగుబాటు చేస్తున్నారంటే దానిభావం – "ఈ నిర్బంధాలను, ఈ దారుణమైన అంధానుసరణాన్ని అర్థం చేసికోడానికి, వాటినుండి విడుదల పొందడానికి మాకు తోడ్పడండి" అని చెబుతున్నారన్నమాట. అందువలన ఈ ప్రశ్న విద్యాబోధకునికి చాల ముఖ్యమైనది. పిల్లలకంటేగూడ అతనికే ఈ విషయమై బోధన జరుగవలసి యున్నది.

5. ప్రశ్న:- నాకు తేనీరు (టీ) త్రాగే అలవాటున్నది. అది చెడ్డ అలవాటని ఒక ఉపాధ్యాయుడు అంటాడు. మరియొక ఉపాధ్యాయుడు పర్వాలేదులే అంటాడు.

కృష్ణమూర్తి:- మీరేమని అనుకొంటారు? ఇతరు లేమంటారనే విషయం అట్లా వుంచండి. అది వారి వారి యిష్టాన్ననుసరించి వుంటుంది. దాని సంగతి వదలి, అసలు ప్రశ్న యేమిటో చూడండి. టీ త్రాగడం, పొగ పీల్చడం, పోటీలుపడి తిండి తినడం – ఇంకా ఇలాంటివే ఏవేవో అలవాట్లకు లొంగిపోయిన పిల్లవాని గురించి మీరేమని అనుకొంటారు? కాటికి కాళ్ళు చాచుకొన్న డెబ్భై యెనభైయేండ్ల ముసలివాడికి ఏవేవో అలవాట్లున్నాయంటే వుండనీయండి. కాని మీరింకా చిన్నపిల్లలు, జీవితారంభ దశలో నున్నవారు. ఇప్పటికే మీకు కొన్ని అలవాట్లు స్థిరపడిపోయినాయంటే, అదెంత ఘోరం? అవునా, కాదా? ఇది ముఖ్యమైన ప్రశ్న. కాని, మీరు టీ త్రాగవచ్చునా, త్రాగకూడదా అనేది కాదు.

చూడండి, మీరొక అలవాటుకు లొంగిపోయిన్నారంటే దాని అర్థం మీ మనస్సు మృత్యుముఖంవైపుకు పోతూ వున్నట్లే. హిందువులమని, కమ్యూనిష్టులమని, క్యాథలిక్కులమని, ప్రొటెస్టంట్లమని మీరనుకోసాగినట్లయితే, మీ మనస్సు అప్పుడే పతనము పొందుతున్నట్లే, క్షీణముఖం పట్టినట్లే. అట్లుగాక మీ మనస్సు హెచ్చరిక గలిగియుండి ఏదైనా అలవాటుకు మీరెందుకు లొంగిపోయినారో, ఒక నిర్దిష్టమైన మార్గాననే మీరెందుకు ఆలోచిస్తూ వున్నారో విచారించి తెలిసికోగల్గినట్లయితే పొగ పీల్చవచ్చునా లేదా, టీ త్రాగవచ్చునా లేదా – ఇటువంటి గౌణ ప్రశ్నలకు సమాధానం కనిపెట్టడం కష్టం కాదు.

*20 జనవరి, 1955*

★ ★ ★

# 17. జీవిత ప్రవాహము

మీరెప్పుడైనా ఏటిగట్టుకు విహారార్థము (షికారుగా) వెళ్ళినప్పుడు అక్కడ ఏటిలో నీటిజాలు ప్రక్కననే పొడుగ్గా సన్నగా వుండే నీటిగుంట నొకదాన్ని చూసివున్నారా? దానిని బహుశా బెస్తవాండ్లు త్రవ్వివుండవచ్చు. దానికి ఏటి నీటితో ఎలాంటి సంబంధము లేదు. ఏఱు లోతుగా, విశాలంగా, నిరాటంకంగా ప్రవహిస్తూ వుంటుంది. కాని యీ నీటి గుంటకు ఏటి నీటితో – నదీ జీవనముతో – సంబంధము లేదు. కాబట్టి అందలి నీరు మురుగుపోయి మడ్డి తేరి, కదలిక లేక, బరువెక్కి వుంటుంది. అందులో చేపలుండవు. అది ఒక నిలువనీటి గుంట. అయితే దాని నానుకొని నిరాటంకంగా వేగంగా ప్రవహిస్తున్న ఆ లోతైన నది మాత్రము చైతన్య పూరితమై జీవశక్తితో తొణికిసలాడుతూ వుంటుంది.

మరి మానవులు గూడ ఆ నీటిగుంటలాంటి వారేయని మీరనుకోరా? వేగముగా పారెడి జీవిత ప్రవాహానికి దూరంగా తమకొక చిన్న నీటిగుంటను త్రవ్వుకొని అందులోనే నిలిచిపోయి, మురిగిమురిగి నశిస్తుంటారు. ఇట్లా మురిగిపోవడాన్నే, యిట్లా క్షయం పొందడాన్నే మనము జీవించడమంటాము. అంటే మనమందరము స్థిరమైన స్థితిని కోరుకొంటాము; మనం కోరుకొనే కొన్ని కోరికలు శాశ్వతంగా కొనసాగాలని, మన మనుభవించే ఇంద్రియ సుఖాలకు అంతముండరాదని మన అభిలాష. మనమొక చిన్న బొరియ త్రవ్వుకొని, దానికి మన సంసారాలతో, మన పేరాశలతో, మన సంస్కృతీ సంప్రదాయాలతో, మన భయాలతో, మన దేవీ దేవతలతో, వివిధ పూజా విధానాలతో మనకు మనం అడ్డుకట్టలు వేసికొంటాం. తుదకు గతిశీలము, నిరంతర పరివర్తన శీలము, అతివేగవంతము, అత్యంత గంభీరము, అసామాన్య చైతన్య శోభితము, అలౌకిక సౌందర్య భూషితమగు జీవితమును జారవిడుచుకొంటాం, స్వయంగా మృత్యుముఖం ప్రవేశిస్తాం.

ఏటి గట్టున నిశ్శబ్దంగా కూర్చుంటే, మీకు ఏటినీటి పాట – అందలి నీరు గట్టుకు తపతప కొట్టుకోవడం, అందలి జాలు జలజల ప్రవహించడం – మధురంగా వినబడుతుంది, ఇదంతా మీరు గమనించలేదా? అతి విశాలమును అత్యంత గంభీరమునగు గమ్యస్థానమును దేనినో వుద్దేశించి అది చేయు అద్భుతమగు ప్రయాణమును, ఒక విధమైన గతిశీలతను అందులో మనము గమనింపగలము. కాని ఆ చిన్న నీటి గుంటలో ఎట్టి కదలిక కనబడదు. అందున్నది నిలువనీరు. అటువంటి స్థితినే మనలో చాలామంది కోరుకొంటారనేది మీకు పరిశీలించి చూస్తే తెలుస్తుంది. ఉరకలువేసే జీవిత ప్రవాహానికి దూరంగా నిలవనీటి మురికి గుంటలవలె జీవించడమే మనము కోరుకొనేది. ఈ మురికి గుంటలాంటి జీవితాన్ని మనము సమర్థిస్తాం;

అదే మంచిదంటాం. దానిని సమర్థించడం కోసం, ఒక శాస్త్రాన్ని రచిస్తాం; దాని కనుకూలంగా ధార్మిక సిద్ధాంతాలను, ఆర్థిక సాంఘిక రాజకీయ నైతిక సిద్ధాంతాలను ప్రతిపాదించి విస్తృత పరుస్తాం. దీనికెవరైనా అడ్డు చెప్పితే ఓర్చుకోలేము. మన నమ్మకానికి భంగము కలుగరాదు. ఎందుకంటే, మనం కోరుకొనేది ఇంతకూ మనం శాశ్వతంగా వుంటామనే భావననే కాదా?

శాశ్వతత్వాన్ని కోరుకోవడమంటే అర్థమేమిటో మీరెరుగుదురా? మన మనుభవించే ఇంద్రియ సుఖాలు ఎడతెగకుండా అట్లే కొనసాగాలని, అటువంటి సుఖము నీయనివన్నీ వీలైనంత త్వరలో అంతం కావాలని కోరుకోవడమన్నమాట. మన పేరు పదిమందికి తెలియాలని, మన కుటుంబంద్వారా, మన ఆస్తిద్వారా మనపేరు శాశ్వతంగా నిలబడి పోవాలని కోరుకొంటాం. ఇతరులతో మనకు గల సంబంధాలలోను, మన కార్యకలాపాలలోను శాశ్వతత్వాన్ని కోరుకొంటాం. అంటే అర్థమేమిటి? మనమున్న మురికి గుంటలోనే మనం చిరకాలం జీవించాలని, మధ్యలో ఈ జీవితానికి భంగం రాగూడదని ప్రయత్నిస్తున్నామన్నమాట. అందులో నిజంగా మార్పులు రావాలని కోరుకోము. అందువలన మన ఆస్తికి, మన పేరుకు, ప్రఖ్యాతికి శాశ్వతత్వాన్ని ఆమోదించే సమాజాన్ని, ఆ విషయంలో మనకు భరోసా (అభయం) యిచ్చే సమాజాన్ని మనం నిర్మించుకొన్నాం.

కాని, చూడండి, జీవితమంటే అటువంటిది కానేకాదు. జీవితానికి శాశ్వతత్వ మంటూ లేదు. చెట్టునుండి ఆకులు రాలునట్లు అన్నీ పోయేవే; ఈ ప్రపంచంలో ఏదీ శాశ్వతం కాదు, ఏదీ కలకాలముండదు. అన్నియు పరిణామ శీలములే, అన్నియు తుదకు నశించేవే. ఆకులన్నీ రాలి, ఆకాశంలో నగ్నంగా నిలిచి వున్న చెట్టు ఎంత అందంగా వుంటుందో ఎప్పుడైనా గమనించారా? దాని కొమ్మలన్నీ బొమ్మలో గీచిన గీతలవలె అందంగా వుంటాయి. దాని నగ్నతలో కవిత్వమున్నది, గానమున్నది. ప్రతియొక్క ఆకు దానిని వదిలిపెట్టి వెళ్ళినది. అది యిప్పుడు వసంత ఋతువుకోసం ఎదురుచూస్తూ వున్నది. వసంత ఋతువు రాగానే అది ఆ చెట్టును మరల ఆకులతో కలకల లాడునట్లు చేసి, దానిచేత ఆనందగీతమును పాడిస్తుంది. కాలము పరిపక్వము కాగానే మరల ఆకులన్నీ రాలి, గాలికి కొట్టుకొని పోయి, చెట్టు మోడై నిలబడుతుంది – ఇదీ జీవితమంటే.

కాని మనకటువంటిదేమీ అక్కరలేదు. మనం మన పిల్లలను, మన సంప్రదాయా లను, మన సమాజాన్ని, మన పేర్లను, మనం చేసే చిన్న చిన్న పుణ్యకార్యాలను అంటిపెట్టుకొని వదలం; మనకు కావలసింది శాశ్వతత్వం కదా? అందువల్లనే చావుకు భయపడతాం. మన మెరిగివున్న వాటినెల్ల పోగొట్టుకొంటామేమోయని మన భయం. కాని జీవితమంటే మనం కోరుకొన్న తీరున నడవదు. జీవిత మెన్నటికిని శాశ్వతము కానేకాదు. పక్షులు మరణిస్తాయి, మంచు కరిగిపోతుంది, చెట్లను నరికి వేస్తారు, లేదా గాలివానకు విరిగి పడిపోతాయి. ఇట్లాగా ఏది శాశ్వతం? కావి మనం, మనకు సంతోషాన్ని కలిగించేది ఏదైనా సరే, శాశ్వతంగా వుండాలని కోరుకొంటాము. మన హోదా, మన అంతస్తు, ప్రజలమీద మనకున్న అధికారము –

ఇవన్నీ చిరకాలము కొనసాగాలని కోరుకొంటాము. అంటే వాస్తవానికి జీవితాన్ని యథాతథంగా (ఉన్నదున్నట్లు) మన మంగీకరించము.

అసలు విషయమేమంటే, జీవితమొక నది వంటిది – నిరంతరము కదిలిపోతూ, అన్వేషిస్తూ, పరిశోధిస్తూ, ముందుకు త్రోసికొనిపోతూ, గట్లు పొర్లిపారుతూ, ఎక్కడ సందున్నా జొరబడుతూ, నీళ్ళతో నింపుతూ ప్రవహిస్తూ వుంటుంది. కాని, చూశారా, మన మనస్సుకు తానా విధంగా (నదివలె) వుండడం నచ్చదు. శాశ్వతమూ స్థిరమూ కానట్టి యే విధమైన భద్రతా లేనట్టి స్థితిలో జీవించడమంటే మనస్సుకు చాల ప్రమాదకరంగా తోస్తుంది. అందువలన తన చుట్టూ తానొక గోడను నిర్మించుకొంటుంది; అదే సంప్రదాయమనే గోడ, వ్యవస్థీకృత మతమనే గోడ, సాంఘిక రాజకీయ సిద్ధాంతములనే గోడ. కుటుంబము, పేరు ప్రతిష్ఠలు, ఆస్తిపాస్తులు, అలవరచుకొన్న కొన్ని సద్గుణములు – ఇవన్నీ, జీవితానికి దూరంగా, ఆ గోడలలో చేరి వుంటాయి. కాని, జీవితమో – కదిలిపోతూ వుంటుంది; అది స్థిరంగా, శాశ్వతంగా ఒకేచోట అట్లే నిలిచివుండదు. అది యీ గోడలలోనికి ప్రవేశించి, వాటిని కూలద్రోయడం కోసం నిరంతరము శాయశక్తులా ప్రయత్నిస్తూనే వుంటుంది. ఆ గోడల వెనుక గందరగోళము, కలవరపాటు, దైన్యమున్ను రాజ్యం చేస్తూ వుంటాయి. అక్కడి దేవతలు దొంగ దేవతలు; వారి శాస్త్రగ్రంథములు, వేదాంతములును అర్థము లేనివి, బూటకములు. జీవితము వీటి కన్నింటికిని అతీతము.

అయితే అటువంటి అడ్డుగోడలు లేని మనస్సునకు, తానార్జించి కూడబెట్టుకొన్న విషయముల చేతను తన జ్ఞాన వైదుష్యముల భారము చేతను క్రుంగిపోని మనస్సునకు, కాలమునకు అతీతంగా వుంటూ, తనకు భద్రతను కోరుకోకుండా జీవించెడి మనస్సునకు జీవితమనేది ఒక అద్భుతమైన విషయంగా తోస్తుంది. అసలా మనస్సే జీవితము; మనస్సు తప్ప జీవితానికి వేరే నీడలేదు. కాని మనలో చాలామందికి నీడ కావాలి, విడిది కావాలి – అది ఒక చిన్నయిల్లో, పేరు ప్రతిష్ఠలో, పదవులో – ఏదైనా కావచ్చును. అందువల్ల మన కివన్నీ చాల ముఖ్యమైనవిగా తోస్తాయి. మనం స్థిరంగా, శాశ్వతంగా వుండడం గోరుతాము. దాని కనుకూలమైన సంస్కృతినే అభివృద్ధి పరుస్తాము. అందుకోసం దేవతలను సృష్టిస్తాము. కాని నిజానికి వారు దేవతలు కానేకారు; వారు మన కోరికలకు మారు రూపములు – అంత మాత్రమే.

శాశ్వతత్వాన్ని కోరే మనస్సు త్వరలో మురిగిపోతుంది. ఏటి ప్రక్కన వుండే నీటిగుంటవలె క్రుళ్ళి, భ్రష్టమై, క్షయం పొందుతుంది. చుట్టు గోడలు లేని, నిలువ నీడ కోరని, అడ్డు తడికెలుండని, విశ్రాంతి స్థానమక్కరలేని మనస్సు మాత్రమే పూర్తిగా జీవిత ప్రవాహముతోబాటే కదులుతూ, కాలగమనముతో సంబంధము లేకుండా, ముందు ముందుకు త్రోసుకుపోతూ, అన్వేషణ గావిస్తూ భగ్గుమని ప్రజ్వరిల్లుతూ ప్రబ్దలవుతూ వుండే మనస్సు మాత్రమే ఆనందమునకు నిలయమవుతుంది. అటువంటి మనస్సు సృజనాత్మకము కాబట్టి అది నిత్యనూతనము; దానికి వార్ధక్యము రాదు.

నే నేమి చెబుతున్నానో మీ కర్థమవుతున్నదా? ఇదంతా మీరు తప్పక అర్థం

చేసికోవాలి, ఇది నిజమైన విద్యలో నొక భాగము. ఇది మీ కర్థమైతే మీ జీవితమే మారిపోతుంది. ప్రపంచంతోను, మీ యిరుగు పొరుగువారితోను, మీ భార్య లేక భర్తతోను గల సంబంధమునకు అర్థమే వేరుగా కనబడుతుంది. అప్పుడు మీరు ఏవిధంగానైనా సరే కోరికల నీడేర్చుకొందామని ప్రయత్నించరు; అట్టి ప్రయత్నము వలన దైన్యదుఃఖములను కొని తెచ్చుకోవడమే జరుగుతుంది. అందువలన మీరిదంతా మీ ఉపాధ్యాయుల నడిగి తెలిసికోవాలి, వారితో కలిసి చర్చించుకోవాలి. ఇది గనక మీ కర్థమైతే, అద్భుతమైన జీవిత సత్యాన్నే అర్థంచేసికోసాగినట్లు. ఆ యవగాహనలో గొప్ప సౌందర్యమున్నది, ప్రేమ వున్నది, దానితో మీలోని మంచితనము వికసిస్తుంది. కాని భద్రత అనే నీటిగుంట కోసం శాశ్వతత్వం కోసం మనస్సు పారాడసాగితే తుదకు అంధకారంలో చిక్కుకొని చెడి పోతుంది. ఒక్కసారి మనస్సు నిలువ నీటి గుంటలో నిలిచిపోయినట్లైతే, అది మరల బయటికి రావడానికే భయపడుతుంది; బయటనేమున్నదో చూడడానికే జంకుతుంది. కాని సత్యము, దేవుడు, పరమార్థము – లేదా మరేపేరుతో పిలిచినా సరే – అది ఆ నీటిగుంటకు వెలుపలనే వున్నది.

నిజమైన మతమంటే యేమిటో మీకు తెలుసునా? అది స్తోత్రాలు చేయడంలో లేదు, పూజా విధానంలో లేదు, మరే యితర కర్మకాండలోను లేదు. డబ్బారేకు దేవుళ్ళనో, రాతి విగ్రహాలనో ఆరాధించడంలో లేదు. గుడులలో లేదు, చర్చిలలో లేదు. బైబిలునో భగవద్గీతనో చదవడంలో లేదు. ఏదో పవిత్రనామ మనబడేదానిని పదే పదే పలకడంలో లేదు. మానవుడు కల్పించుకొన్న మరే మూఢవిశ్వాసాన్నైనా సరే పాటించడంలో లేదు. ఇదేదీ నిజమైన మతము కాదు.

నిజమైన మతమంటే నదివలె సజీవమై నిరంతరము ప్రవహించెడి ప్రేమ భావము లేదా కరుణ. అట్టి స్థితిలో అన్ని ప్రయత్నములున్ను ఆగిపోయెడి క్షణము, అన్ని విధములైన అన్వేషణలు నిలిచిపోయెడి క్షణము – ఒకటి వస్తుంది. ఇట్లు అన్వేషణ అంతమవడమే అనూహ్యమైన మరియొకదానికి ఆరంభము. నిజమైన మతమంటే దేవుని కొఱకు సత్యము కొఱకు అన్వేషణ, వెలితిలేని కారుణ్య భావము – అంటే కారుణ్య భావాన్ని, వినమ్రతాభావాన్ని ప్రయత్నంచేసి సాధించడం కాదు – మనస్సు కల్పించుకొనే వాటికి, దాని చమత్కారములకు అతీతంగా నున్నదేదో దాని కొఱకు అన్వేషణ సాగించడం, దానియందు రమించడం, దానిలోనే జీవించడం, తద్రూపమై పోవడం – ఇదీ నిజమైన మతమంటే. అది మీరు చేయవలెనంటే మీరు మీకోసం త్రవ్వుకొన్న నీటి పడియను వదలిపెట్టి జీవితము యొక్క ప్రవాహంలోనికి ప్రవేశించ వలసి వుంటుంది. అప్పుడు అద్భుతంగా మీ రక్షణ బాధ్యతను జీవితమే తీసి కొంటుంది. ఎందువల్లనంటే అప్పుడు మీ రక్షణ బాధ్యతను మీరు తీసికోవడమంటూ వుండదు గదా! అప్పుడు జీవితం మిమ్ము తన యిష్టం వచ్చిన చోటికి తీసికొని పోతుంది. అస లప్పుడు మీరు జీవితంకంటె భిన్నము కాదు. మీరును ఆ జీవిత ప్రవాహంలో నొక భాగమే. అందుచేత అప్పుడిక మీకు భద్రత యెట్లో, ప్రజలు ఏమంటారో, ఏమనరో ఇటువంటి సమస్యలేవీ వుండవు. అదే జీవితమందలి సౌందర్యము.

## 1. ప్రశ్న:- ఎందువలన మనం మృత్యువంటే భయపడతాము?

కృష్ణమూర్తి:- చెట్టునుండి రాలే ఆకు చావుకు భయపడుతుందని మీరనుకొంటారా? పక్షి మృత్యు భయంతో జీవిస్తూ వుంటుందని మీ రనుకొంటారా? మృత్యువు వస్తే దానిని స్వీకరిస్తుంది. అంతేగాని యెప్పుడూ మృత్యువును గూర్చి ఆలోచిస్తూ వుండదు. దాని మనస్సంతా జీవించడం మీద లగ్నమై వుంటుంది – అంటే, పురుగులను పట్టుకోవడం, గూడు కట్టుకోవడం, పాట పాడుకోవడం, కేవలం ఆనందం కోసం గాలిలో ఎగరడం – వీటిమీద లగ్నమై వుంటుంది. ఆకాశంలో చాల ఎత్తుకెగిరి, రెక్కలాడించకుండా అట్లే గాలిలో తేలాడుతూ వుండే పక్షులను మీరెప్పుడైనా గమనించారా? అవి యెంత ఆనందంగా వున్నట్లు కనబడతాయో! వాటికి మృత్యువుతో సంబంధము లేదు, అవి మృత్యువును పట్టించుకోవు. మృత్యువు వస్తే రానీ, మంచిదే; అంతటితో వాటి జీవితం సరి. తరువాత ఏమి జరుగుతుందో అనే భయం వాటికి లేదు. ఏ క్షణానికి ఆ క్షణమే అవి జీవిస్తూ వుంటాయి. మరుక్షణం గురించి ఆలోచిస్తూ కూర్చోవు, కాదా? మనం మనుషులం మాత్రమే, ఎప్పుడూ మృత్యువు గురించే ఆలోచిస్తూ వుంటాం. దానికి కారణం, మనం జీవించడం మానివేసినాము. అసలు ఇబ్బంది అక్కడ ఉన్నది. మనం మరణిస్తూ వున్నాముగాని జీవిస్తూ లేము. వృద్ధులు కాటికి కాళ్ళు చాచుకొని వున్నారు నిజమే; కాని పడుచువాండ్లు కూడ మృత్యువుకంత దూరంగా లేరు.

మృత్యువు వస్తే మన మెరిగిన వాటి నన్నిటిని, మనం కూడబెట్టు కొన్న వాటినన్నింటిని పోగొట్టుకొంటామని మన భయం. అందుచేత మన మనస్సంతా చావును గూర్చిన భయాందోళనలతో నిండిపోయి వుంటుంది. మన భార్య లేక మన భర్త, మన బిడ్డ లేక మన స్నేహితుడు ఇక మనకుండరని మన భయం. మనం చదువుకొన్న చదువు, కూడబెట్టుకొన్న జ్ఞానం మనవి కాకుండా పోతాయని మన భయం. అయితే మనం కూడబెట్టుకొన్న వాటినన్నింటిని – మన స్నేహితులను, మన ఆస్తులను, మన సద్గుణాలను, మన నడతను – మనతోబాటు తీసుకొనిపోవడానికే గనక వీలుంటే అప్పుడు మనం చావుకు భయపడతామా? భయపడం. అందువల్లనే మనం మరణమును గూర్చి, మరణానంతరస్థితిని గూర్చి ఏవేవో సిద్ధాంతాలను కల్పించుకొన్నాం. కాని వాస్తవమేమంటే, మరణమనగా అంతమవడం, ముగింపు. ఈ తథ్యాన్ని యెదుర్కోడానికి మనలో చాలామంది కిష్టముండదు. మనకు తెలిసిన దానిని వదులుకోవడమంటే మన కిష్టముండదు. అందువలన దానినే పట్టుకొని వేలాడుతూ, అదెక్కడ పోతుందోయని భయపడుతూ వుంటాం. అంతేగాని మనకు తెలియని దానిగురించి – అవ్యక్తము గురించి – భయపడడం లేదు. తెలిసినదాని సహాయముతో – అంటే వ్యక్తముతో – తెలియనిదానిని – అంటే అవ్యక్తమును – దర్శించలేము. వ్యక్తము యొక్క పరిధిలో అవ్యక్తము లేదు. వ్యక్తమునుండి విడివడితే అవ్యక్తము ప్రత్యక్షమవుతుంది. కాని మనస్సంటే కేవలము వ్యక్త విషయముల సంపుటి. దానినుండి విడివడడమంటే మనోవ్యాపారము నిలిచిపోవడం. కాబట్టి "నేను అంతమవుతున్నా" నని మనస్సు తలచి భయపడుతుంది. •

మరి మీరు ఏ క్షణమున కాక్షణము నిండుగా జీవిస్తూ, భవిష్యత్తును గూర్చి ఏమీ పట్టించుకోకుండా వుండగలిగితే, రేపటిని గూర్చి ఎట్టి ఆలోచన పెట్టుకోకుండా జీవింపగల్గితే – అంటే దాని అర్థం, కేవలం ఈనాటి విషయాలతో మనస్సంతా పైపైన నింపుకోవడమని కాదు – మీరు గ్రహించుచున్న విషయజ్ఞానమెల్ల క్రమముగా మీ మనస్సునందెట్లు ముద్రితమగుచున్నదో స్పష్టంగా చూస్తూ, ఇట్లు చూడడం ద్వారా ముద్రితమగుచున్న విషయజాతాన్ని సంపూర్ణంగా మనస్సు నుండి తుడిచి వేయగల్గితే, దానిని పూర్తిగా వదులుకొంటే, అప్పుడొక అద్భుతం సంభవించడం మీరు కనుగొనగలరు. ముందుగా ఒకరోజు దీనిని ప్రయత్నించి చూడండి. మీకు తెలిసినదెల్ల – జ్ఞాతవిషయ జాతమును – ఒకప్రక్క నుంచండి, దానిని మరిచిపొండి. అప్పుడేమి జరుగుతుందో చూడండి. మీ చింతలను ఒకనాటినుండి మరియొక నాటికి, ఒక గంటనుండి మరియొక గంటకు, ఒక క్షణాన్నుండి మరియొక క్షణానికి మోసికొని పోవద్దు; అన్నింటిని ఎక్కడికక్కడ వదిలి వేయండి. అప్పుడు మనస్సు నిర్మలముగ వుంటుంది – సర్వబంధ విముక్తమవుతుంది. అట్టి విముక్త స్థితిలో నుండునది అద్భుతమైన జీవితము. అందులో జీవన్మరణములు రెండును పడుగు పేకలవలె కలిసివుంటాయి. అందు మరణ మనగా ఏదైనా కేవలం అంతమవడం; ఆ అంతమవడంలోనే నూతనారంభము – సృష్టి – వుంటుంది.

2. **ప్రశ్న:- మనందరిలోను సత్యమున్నదని, అది శాశ్వతమని, త్రికాలాబాధితమని అంటారు. కాని మన జీవితమే అశాశ్వతమైనప్పుడు అందులో శాశ్వతమైన సత్యమెట్లా వుంటుంది?**

**కృష్ణమూర్తి:-** చూడండి, మనం సత్యాన్ని ఒక శాశ్వతమైన, స్థిరమైన పదార్థంగా చేసివేసినాం. కాని నిజంగా సత్యము శాశ్వతమైనదా? మారనిదా? శాశ్వతమే యైనట్లైతే అది కాలము యొక్క పరిధిలోనే వుంటుంది. దేనినైనా సరే శాశ్వతమైనదని అంటున్నామంటే, అది యెడతెగకుండా అట్లే వుంటుందని భావము. కాని అట్లా ఎడతెగకుండా కొనసాగేది సత్యము కాదు. అదే అందులోని అందము. సత్యాన్ని క్షణ క్షణము దర్శిస్తూ వుండాలి, అంతేగాని అది జ్ఞాపకముంచుకొనేది కాదు. జ్ఞాపకముంచుకొన్న సత్యము మృతప్రాయము. కాని అసలు సత్యము సజీవము, ఎప్పుడూ ఒకే విధముగా వుండదు, అది నిత్యనూతనము. దానిని క్షణక్షణమును అనుసంధానము చేస్తూ వుండాలి, దర్శిస్తూ వుండాలి. అయితే ఎప్పుడు దానిని దర్శించినా అది అట్లే వుంటుంది.

సత్యమును గురించి యేదైనా సిద్ధాంతాన్ని ప్రతిపాదించడం కాదు ముఖ్యము. మనలో వున్న సత్యము శాశ్వతమైనది, స్థిరమైనది అని యీ విధంగా ఏదేదో చెప్పడంగాదు కావలసినది. ఇదంతా గూడ జీవన్మరణములు రెండింటిని గూర్చి భయపడిన మన పూర్వులు కల్పించిన కల్పన. సత్యము శాశ్వతమైనదని, మీరు మరణము లేని ఆత్మ స్వరూపులు కాబట్టి దేనికిని భయపడనక్కఅలేదని – ఇటువంటి చిత్రవిచిత్ర సిద్ధాంతములు భయగ్రస్తులైన మానవులచే కల్పింపబడినవి. వారి మనస్సులు క్షయశీలములు, వారి శాస్త్రములు నిరాధారములు, బలములేనివి.

వాస్తవ మేమంటే సత్యమే జీవితము, జీవితానికి శాశ్వతత్వము లేదు. క్షణక్షణమును, దినదినమును జీవితమును దర్శిస్తూ వుండాలి. దాని తెర యెప్పటికప్పుడు తొలగించి చూస్తూ వుండాలి. అది యింతేయని గ్రుడ్డిగా నమ్మి వూరుకోక, నిత్యము అనుసంధానము చేస్తూ వుండాలి. జీవితమంటే యేమిటో తెలుసులే అని మీరనుకొంటే, మీరు జీవించడంలేదు, మీ జీవించడం నిజంగా జీవించడం కాదు. రోజుకు మూడు పూటలు తినడానికి తిండి, కట్టడానికి గుడ్డ, ఉండడానికి నీడ, కామ వాంఛలు దీర్చుకోవడం, మీ ఉద్యోగము, మీ వినోదములు, మీ ఆలోచనల తీరు – మార్పులేని యీ దైనిక జీవితము జీవితము కాదు. జీవితమనేది దర్శించవలసినది. మీ "అహం" తొలగకపోతే, మీ సొంతమనుకొన్న వాటినన్నిటిని, తెలిసికొన్నామని మీరనుకొన్న వాటి నన్నిటిని దూరంగా విడిచిపెట్టకపోతే, మీకు జీవితము సాక్షాత్కరించదు, దానిని మీరు దర్శించలేరు. నేను చెప్పేదానిని పరీక్ష చేసి చూచుకోండి. మీ శాస్త్రాలను, మీ మతాలను, మీ ఆచారాలను, మీ మీ జాతిగత విధినిషేధాలను – ఇంకా ఇటువంటి వాటినన్నిటిని దూరంగా విడిచి పెట్టండి. అవి జీవితం కాదు. మీరు వాటిల్లో చిక్కుకొన్నట్లయితే మీరు జీవితాన్ని ఎన్నటికిని దర్శింపలేరు. నిజానికి విద్యయొక్క పరమ ప్రయోజనము జీవితమును సదా దర్శింప గల్గడంలో మీకు తోడ్పడమే.

తనకిదంతా తెలుసుననుకొనేవాడు ముందే మృతప్రాయుడు. తనకేమీ తెలియదని గ్రహించి, అందుకోసమై అన్వేషణ గావించేవాడు, వేరే కోరిక యేమీ లేనివాడు, ఏదో యొక స్థితిని అందుకోవాలనిగాని, మరొకరుగా పరిణతి చెందాలనిగాని తలచనివాడు – అట్టి మానవుడు నిజంగా జీవిస్తున్న మానవుడు; ఆ జీవించడమే సత్యము.

**3. ప్రశ్న:- సమగ్రత లేక పరిపూర్ణత (Perfection) అంటే యేమిటో మేము మనస్సులో ఒక అభిప్రాయం ఏర్పఱచుకోగలమా?**

**కృష్ణమూర్తి:-** బహుశా ఏర్పఱచుకోవచ్చు. సమగ్రత అంటే యెట్లుంటుందో ఉజ్జాయింపుగా ఊహించుకొనిగాని, అది ఇట్లా వుండాలి అని నూతనంగా కల్పించుకొనిగాని అందుకోసమై పథకాలు, ప్రణాళికలు వేసికొనిగాని, "ఇది బాగా లేదు, అందవికారంగా వున్నది. కాని అది చాల బాగా ఉండవలసిన తీరునున వున్నది" అని అనుకొంటూగాని సమగ్రతను గూర్చి మీరొక అభిప్రాయానికి రావచ్చు. దాని గురించి మనస్సులో మీరొక ఊహాప్రతిమను నిర్మించుకోవచ్చు. కాని దేవుని గూర్చిన మీ నమ్మకానికి అర్థమెట్లా లేదో అట్లే, సమగ్రతను గూర్చిన మీ అభిప్రాయానికిన్ని ఏమీ అర్థముండదు. ముందు ప్రయత్నమేమీ లేకుండానే ఆలోచనలన్నీ వాటంతట అవి నిలిచిపోయిన ఒక క్షణకాలముపాటు జీవించిన జీవితము సమగ్రజీవితము. ఆ క్షణమట్లే కొనసాగడమంటూ లేదు. అందువలన సమగ్రతను ముందుగా ఆలోచించి సంపాదించుకోనూ లేము, వచ్చిన దానిని శాశ్వతం చేసికోనూ లేము. ఎట్టి ఆలోచనలు లేకుండా, నూత్న కల్పనలు చేయకుండా, పథకాలు ప్రణాళికలు వేయకుండా మిక్కిలి ప్రశాంతంగా వున్న మనస్సు మాత్రమే సమగ్రతను పొందిన క్షణమును, పరిపూర్ణతను పొందిన క్షణమును గుర్తించగలదు.

4. ప్రశ్న:- మనలను కొట్టినవాణ్ణి మళ్ళీ కొట్టి, వాడిమీద పగతీర్చుకొందామని మనమెందుకు కోరుకొంటాము?

కృష్ణమూర్తి :- ఆ లక్షణము ప్రాణి సహజ లక్షణము – పుట్టుకతో వచ్చినది. అది బ్రతకడం కోసం ప్రాణి చేసే ప్రతిక్రియ, అవునా కాదా? కాని వివేకవంతమగు మనస్సు, ప్రబుద్ధమైన మనస్సు, ఎంతో దూరమాలోచింపగల మనస్సు మరల ఎదురుదెబ్బ కొట్టాలని కోరుకోదు. దానికి కారణం, ధర్మనిష్ఠమగు మనస్సు – అనే పేరు సంపాదించుకొందామనిగాని, క్షమా గుణమును పెంపొందించుకొందామనిగాని కాదు. దానికి కారణం ఎదురుతిరిగి దెబ్బకొట్టడం అవివేకమని, దాని కర్థం లేదని గ్రహించడమే. కాని, చూశారా, అది గ్రహించాలంటే ధ్యానమవసరమవుతుంది.

5. ప్రశ్న:- ఇతరులను ఏడ్పించడమంటే నాకెంతో సరదా. కాని అదే పని యితరులు చేస్తే నాకెంతో కోపం వస్తుంది.

కృష్ణమూర్తి:- పిల్లల విషయంలోనే కాదు, పెద్దవాండ్ల విషయంలోను అంతేయని నా అనుమానం. మనలో చాలామందికి ఇతరులను దోపిడీ చేయడమంటే వారిని తమ స్వార్థానికై ఉపయోగించుకోవడమంటే ఎంతో యిష్టం. కాని అదేపని మనకెవరైనా చేస్తే మాత్రం ఒప్పుకోము, కోపం వస్తుంది. ఇతరులను పీడింప గోరడం, వాండ్లను ఏడిపించాలని, విసిగించాలని అనుకోవడం మన కితరుల యెడ గల నిర్లక్ష్యాన్ని సూచిస్తుంది, కాదా? స్వార్థపూరితమైన జీవితములో నుండి అట్టి గుణము తల యెత్తుతుంది. ఏడిపింపబడడం మీకిష్టం లేనట్లే మీ యెదుటి వానికిన్ని ఇష్టముండదు. కాబట్టి మీ యిద్దరున్నూ ఆ పనిని మానివేయడం మంచిది కాదా? దాని అర్థం, మీరిద్దరున్నూ ఇతరుల కష్టసుఖాలను గుర్తించగల్గి వుండాలి, పరాయివాడి బాధను తన బాధగా ఎంచుకోగల్గి వుండాలి.

6. ప్రశ్న:- మానవుని కర్తవ్యమేమిటి?

కృష్ణమూర్తి:- మీరేమని అనుకొంటారు? చదువుకోవడం, పరీక్షలు పాసవడం, ఉద్యోగం సంపాదించుకోవడం, ఆ మీదట జీవిత పర్యంతం ఆ ఉద్యోగం చేసికొంటూ బతకడం – జీవితంలో చేయవలసిన పని యిదేనా? లేక, గుడికి పోవడం, గుంపుల్లో జేరడం, రకరకాలైన సంస్కరణలు చేయబూనడమా? తన తిండికోసం, పాలకోసం జంతువులను చంపడం మనిషి చేయవలసిన పనేనా? రైళ్ళు దాటడంకోసం నదిమీద వంతెనను నిర్మించడం, నీరులేని చోట బావులను త్రవ్వడం, గనులలో నుండి చమురు తీయడం, కొండల నెక్కడం, భూమ్యాకాశములను స్వాధీనం చేసికోవడం, కవిత అల్లడం, కమనీయ వర్ణచిత్రాలను గీయడం, ప్రేమించడం, ద్వేషించడం – ఇవన్నీ మానవుడు చేసేపనులు కావా? ఏ కొన్ని శతాబ్దాలలోనో ఎట్లాగూ కూలిపోయే నాగరికతలను నిర్మించడం, యుద్ధాలను లేవదీయడం, తన రూపంలో దేవుని సృష్టించుకోవడం, మతం పేరిటగాని రాష్ట్రం పేరిటగాని ప్రజలను

హింసించడం, ఇతరుల రాజ్యాలను అన్యాయంగా ఆక్రమించడం, ఇతరుల యెడ నిర్దాక్షిణ్యంగా వ్యవహరించడం – వీటితోబాటు శాంతి సౌభ్రాతృత్వముల గురించి గొప్పగా ఉపన్యసించడం – ఇవన్నీ మన చుట్టూ వున్న మానవుడు చేసే పనులు అవునా, కాదా? ఇవి వాస్తవంగా మానవుడు చేయవలసిన పనులేనా?

ఈ పనులన్నీ వినాశనానికి, దైన్యానికి, సంక్షోభానికి, నైరాశ్యానికి దారితీయడం మీరు చూస్తూనే వుంటారు. అత్యంత భోగమయ జీవితంతో బాటు కటిక దారిద్ర్యం తాండవం చేస్తూ వుంటుంది. తీవ్రమైన వ్యాధులు, ఆకలి చావులతో బాటు శీతలీకరణ యంత్రములు (రిఫ్రిజిరేటర్లు), జెట్ విమానాలు సహజీవనం చేస్తూవుంటాయి. ఇదంతా మానవుడు చేసినపని కాదా? మీరిది చూసినప్పుడు, "ఏమిటి ఇదంతా? ఇదేదీ కాకుండా మానవుడు చేయదగిన మంచిపని యింకేమీ లేదా?" అని మీలో మీరు ప్రశ్నించుకోరా? మానవుడు చేయదగిన మంచిపని యేమిటో మనం తెలిసికోగల్గితే, అప్పుడీ జెట్ విమానాలు, గుడ్డలుతికే యంత్రాలు (Washing machines), వంతెనలు, వసతి గృహాలు – వీటికన్నింటికి పూర్తిగా వేరే అర్థం వస్తుంది. మనిషి చేయవలసిన పని యేమిటో తెలిసికోకుండా కేవలం సంస్కరణలు కొనసాగించడంలో, మానవుడు తానంతకుముందు చేసిన వాటికెల్ల మారు రూపమీయడంలో (వాటినెల్ల మార్చి వేయడంలో) ఆసక్తుడైతే, ఫలితమేమీ వుండదు.

అయితే యింతకున్ను మానవుని కర్తవ్యమేమిటి? అతడు చేయవలసిన నిజమైన పని యేమిటి? వాస్తవంగా అతడు చేయవలసిన పని యేమిటంటే దేవుని అంటే సత్యాన్ని ప్రత్యక్షం చేసికోవడం. అంటే మానవుడు తనకును ఇతరులకును మధ్య అడ్డుగోడలు పెట్టుకోరాదు, ఇతరులనుండి తన్ను వేరుచేసే పనులలో చిక్కుకోరాదు. ప్రేమించాలి, ప్రేమ స్వరూపుడై మెలగాలి – అదే అతడు చేయవలసిన పని. సత్యదర్శనములోనే ప్రేమ వున్నది. మనిషికిని మనిషికిని మధ్య గల సంబంధములో ప్రకటితమగు ఆ ప్రేమయే సరిక్రొత్త నాగరికతను, సరిక్రొత్త ప్రపంచాన్ని నిర్మించగలదు.

## 7. ప్రశ్న:- దేవుని మనమెందుకు పూజిస్తాము?

**కృష్ణమూర్తి:-** నిజానికి మనం దేవుని పూజించడం లేదని నా అనుమానం. (సభలో నవ్వులు.) నవ్వకండి. చూడండి, మనం దేవుని ప్రేమించడంలేదు. మనమే గనక నిజంగా దేవుని ప్రేమిస్తే 'పూజ' అని పిలువబడే యీ తంతు అసలుండనే వుండదు. మనకు దేవుడంటే భయం. మన హృదయాలలో నెలకొని వున్నది భయంగాని ప్రేమకాదు. అందువల్లనే దేవుని పూజిస్తున్నాము. గుడి, గుడిలోని పూజ, మెడలోని జందెం – వీటితో దేవునికి ఏమీ సంబంధంలేదు. ఇవన్నీ మనిషి తన దర్పానికి చిహ్నంగాను, భయమువలనను నిర్మించుకొన్నవి. దుఃఖంతోను, భయంతోను నిండినవారే దేవుని పూజిస్తారు. ఐశ్వర్యము, అంతస్తు, అధికారము గలవారు సుఖజీవులు కారు. తృష్ణాపరులు (పేరాశలు పెట్టుకొన్నవారు) అత్యంత దుఃఖజీవులు. వాటన్నింటి నుండి విముక్తి పొందినప్పుడే సుఖసంతోషాలు సిద్ధిస్తాయి.

అప్పుడు మీరు దేవున్ని పూజించరు. అతి దీనులు, అత్యంత పీడితులు, నిరాశా పూరితులు మాత్రమే గుడి సన్నిధికి చేరతారు. కాని ఈ పూజ అనే తంతును వదిలిపెట్టి తమ దైన్యాన్ని తామర్థం చేసికొంటే అప్పుడు వారు, – స్త్రీలుగాని, పురుషులుగాని – సుఖమయ జీవితాన్ని గడుపుతారు. దానికి కారణమేమంటే వారప్పుడు సత్యమును – అంటే దేవుని – దర్శింపగలరు; సత్యమంటే యేమిటో, దేవుడంటే యెవరో తెలిసికొనగలరు.

*21 జనవరి, 1955*

★ ★ ★

# 18. మనస్సులోని ఆకాశము

మీరెన్నడైనా గుడిగంటలు మ్రోగుతూ వుంటే ఆ మ్రోత మీదికి మనస్సు పోనిచ్చారా? పోనిస్తే అప్పుడు మీరు వినేదేమిటి? వివిధములైన ధ్వనులనా లేక ఆ ధ్వనులమధ్య నుండే నిశ్శబ్దాన్నా? నిశ్శబ్దమే గనగ లేకపోతే ధ్వనులుంటాయా? మీరు నిశ్శబ్దాన్ని గనక వింటూవుంటే, అప్పుడు ధ్వనులింకా స్పష్టంగా, లోలోతులకు చొచ్చుకొని పోతున్నట్లుగా, వేరొక విధంగా వినబడవా? కాని, చూశారా – మన మనస్సును దేనిమీదికైనా సంపూర్ణంగా ఎప్పుడోగాని పోనివ్వం. ఇంతకు దేనిమీది కైనా మన మనస్సును పోనివ్వడమంటే యేమిటో తెలిసికోవడం చాలా అవసరం. మీ ఉపాధ్యాయుడు గణితంలోని ఏదైనా లెక్కను వివరిస్తూ వుంటే, లేదా మీరు దేశ చరిత్రను చదువుతూ వుంటే, లేదా మీ స్నేహితు డొకడు మీతో మాట్లాడుతూవుంటే, మీకొక కథను చెప్తుతూ వుంటే లేదా మీరొక నది ప్రక్కన నిలబడి నీళ్ళు గట్టుకు తపతప కొట్టుకుంటూ వుండడం వింటూవుంటే, మీ మనస్సు అంతగా వాటి మీదికి పోదు. అట్లా దేనిమీదికైనా మన మనస్సును పూర్తిగా పోనివ్వడమంటే యేమిటో మనం తెలిసికోగల్గితే అప్పుడు నేర్చుకోవడమనే దానికి సరిక్రొత్త అర్థం వస్తుంది, నేర్చుకోవడం సులభమవుతుంది.

తరగతిలో సావధానంగా వుండండి అని మీ ఉపాధ్యాయుడంటే, ఆయన ఉద్దేశమేమిటి? కిటికీ గుండా బయటికి చూడవద్దని, తక్కిన అన్ని విషయాల మీదినుండి మనస్సును మరల్చి, అప్పుడు మీరు చదువుతున్న పాఠ్యభాగమేదో దానిమీదనే మీ మనస్సునంతా పూర్తిగా కేంద్రీకరించమని ఆయన ఉద్దేశం. అథవా మీరేదైనా నవల చదవడంలో నిమగ్నమైపోతే, అప్పుడు మీ మనస్సంతా దానిమీదనే కేంద్రీకృతమై, ఆ క్షణంలో మరి దేనిమీదికిన్ని మనస్సు పారదు. ఇది మరియొక విధమైన అవధానము (attention). కాబట్టి సాధారణార్థంలో, అవధానమంటే సంకుచితపరచే ప్రక్రియ కాదంటారా?

కాని యిదికాక, పూర్తిగా వేరు విధమగు అవధాన మొకటి వున్నదని నే ననుకొంటాను. సాధారణంగా అందరున్ను సమర్థించేది, ఆసక్తి చూపేది, అమలులో పెట్టేది అయిన అవధానప్రక్రియలో మనస్సును క్రమంగా సంకోచింపచేస్తూ తుదకొక బిందువుమీద దానిని కేంద్రీకరింపజేయడం జరుగుతుంది. దీనిని నిరోధ ప్రక్రియ అనవచ్చును. ఎందువల్లనంటే అవధానంకోసం అంటే మనస్సు నొకదానిమీద కేంద్రీకరింపజేయడం కోసం ప్రయత్నిస్తున్నారంటే దాని అర్థం నిజంగా మీరు దేనినో నిరోధిస్తున్నారన్నమాట, అడ్డు పెట్టుతున్నారన్నమాట. కిటికీ గుండా బయటికి

చూద్దామనే కోరికను, ఎవరు లోపలికి వస్తున్నారో కనిపెడదామనే కోరికను – ఇంకా ఇటువంటి కోరికలను నిరోధిస్తున్నారన్నమాట. ఇట్లా నిరోధించేటప్పుడు మీ శక్తిలో కొంతభాగము వ్యయమైపోతూ వుంటుంది. ఏదో యొక వస్తువుమీద మనస్సును పూర్తిగా కేంద్రీకరింపజేయడం కోసం ఆ మనస్సు చుట్టూ మీరొక అడ్డుగోడను కడతారు. అట్లా కట్టడానినే అవధానంకోసం మనస్సును క్రమశిక్షణలో పెట్టడమని మీరంటారు. ఏ ఆలోచనమీదనైతే మీరు మనస్సును కేంద్రీకరింపజేయ దలుస్తారో ఆ యాలోచనను తప్ప మిగతా వాటినన్నిటిని మనస్సులో నుండి బహిష్కరింప జేయడానికై, బయటికి త్రోసివేయడానికై ప్రయత్నిస్తారు. దానినే అవధానమని, మనస్సు నిల్పడమని చాలామంది తలుస్తారు. కాని తద్భిన్నంగా మరొక విధమైన అవధాన మున్నదని నా తలంపు. అది నిరోధ ప్రక్రియ కాదు, నిషేధ ప్రక్రియ కాదు. అందులో దేనిని లోపలికి రాకుండ అడ్డుపెట్టడం లేదు. అందువలన అధికమైన అవధానం చూపడానికి మనస్సు కెక్కువ శక్తి వుంటుంది. కాని ఎట్టి నిరోధములేని అవధానమంటే, ఏదైన పనిలో నిమగ్నమైనప్పుడు కలిగెడి అవధానంకాదు.

నేను మీతో చర్చింపదలచిన అవధానానికిన్ని మామూలుగా అందరున్ను తలచే అవధానానికిన్ని చాలా తేడా ఉన్నది. నేను చెప్పే అవధాన విధానంలో నిరోధ నిషేధములు లేవు కాబట్టి అది యెంతో బలవత్తరమైనది. ఎంతైనా ఎన్నైనా సాంధిచడానికి వీలున్నది. ఏదైనా విషయంమీదనో, సంభాషణమీదనో, ప్రసంగంమీదనో మీ మనస్సు కేంద్రీకరింపబడినట్లయితే, అప్ప డితరాలోచనలు చొచ్చుకొని రాకుండ, బుద్ధిపూర్వకంగాగాని అబుద్ధిపూర్వకంగాగాని మీరు అడ్డుగోడ నొకదానిని నిర్మించుకొంటారు. అందువలన మీ మనస్సు ఉద్దేశించిన విషయంమీద పూర్తిగా లగ్నమై వుండదు. ఏదో కొంత భాగము మాత్రమే దానిమీద కేంద్రీకరింపబడి వుంటుంది. మిగతా భాగమంతా వేరే ఆలోచనలు లోపలికి త్రోసుకొని రాకుండా నిరోధిస్తూ మీ ధ్యానము చెదరిపోకుండడం కోసం, విక్షేపములు కలుగకుండడం కోసం ప్రయత్నిస్తూ వుంటుంది.

ఈ విషయాన్నే మరియొకవిధంగా ఆలోచిద్దాం. మీకు విక్షేపమంటే యేమిటో తెలుసునా? మీరు మీ చదివేదానిమీద మనస్సును లగ్నం చేద్దామని అనుకొంటారు. కాని గది బయట ఏదో చప్పుడై మీ మనస్సు చెదిరిపోతుంది. కిటికీ నుంచి బయటికి చూస్తారు. అంటే, దేనిమీదనో మనస్సును లగ్నం చేద్దామని మీ కోరిక, కాని మీ మనస్సు చెదిరిపోతుంది. అట్లా మనస్సు చెదిరిపోవడాన్నే విక్షేపమని అంటారు. ఆ విక్షేపమును నిరోధించడంలో మీ మనశ్శక్తి కొంత వ్యయమైపోతుంది. అట్లుగాక ఏ క్షణమున కాక్షణము మీ మనస్సు ఎట్లా పనిచేస్తున్నదో మీరు గమనిస్తూ వుంటే అప్పుడు విక్షేపమనబడేదే వుండదు. దేనినీ నిరోధించడం లేనందున మీ మనశ్శక్తి వృథా అయిపోదు. అందువలన నిజమైన అవధానమంటే యేమిటో తెలిసికోవడం చాల అవసరం.

ఎవరైనా గంటను మ్రోగిస్తున్నప్పుడు, ఆ ఘంటానాదంతోబాటు, ఆ గంటమీద కొట్టేడి దెబ్బల మధ్యగల నిశ్శబ్దాన్ని గూడ మీ రాలకిస్తూ వుంటే, అదంతా కలిసి అవధాన మనిపించుకొంటుంది. అదేవిధంగా ఎవరైనా మాట్లాడుతూ వున్నప్పుడు, వారు మాట్లాడే మాటలనే గాకుండా, ఆ మాటల మధ్య గల నిశ్శబ్దాన్ని గూడ మీరు వింటూవుంటే, అదే అవధానము. మీరు దీనిని అమలులో పెట్టి చూస్తే మీకే తెలుస్తుంది. మీ మనస్సు ఎట్టి విక్షేపంగాని, ఎట్టి నిరోధం (resistance) గాని లేకుండా ఎంత బాగా అవధానంలో నిలువగలదో!

"కిటికీ గుండా బయటికి చూడరాదు; గదిలోకి వచ్చే పోయేవారిని గమనిస్తూ వుండరాదు; ఇంకో పనిమీదికి మనస్సు పోతూవున్నా, పోనివ్వకుండా, దానిని మరల్చి పాఠంమీదనే లగ్నం చేయాలి" – ఈ విధంగా అనుకొని మనస్సును వశం చేసికొందామని, దానిని క్రమశిక్షణలో పెట్టుకొందామని తలిస్తే అప్పుడు మనస్సు రెండు భాగాలౌతుంది. దానివలన చాల నష్టమున్నది. అది మానసిక శక్తిని వృథా చేస్తుంది. కాని మనస్సులో ఎట్టి విభజనముగాని, దాని ఫలితమగు నిరోధము గాని లేకుండా సర్వమును పూర్తిగా మీరు వినసాగితే అప్పుడు ప్రయత్నరహితంగానే మీ మనస్సులో అవధానము సిద్ధించడం చూడగలరు; దేని మీదనైనను మనస్సును సంపూర్ణంగా నిల్పగలమని తెలిసికోగలరు. ఈ విషయాన్ని మీరు ఆకళింపుకు తెచ్చుకోగలిగినారా? నేను మీకిది అర్థమయ్యేటట్లు స్పష్టంగా చెప్పగలిగితినా?

అవధానము సిద్ధించడం కోసమై మనస్సును క్రమశిక్షణలో పెట్టసాగితే, దానివలన మానసిక శక్తి క్షీణిస్తుంది. అంటే నా ఉద్దేశం మనస్సును కోతివలె ఎటుబడితే అటు స్వేచ్ఛగా తిరుగనిమ్మని కాదు. ఏ పనిలోనైనా లీనమైపోవడంచేత వచ్చే అవధాన స్థితి కాకుండా మనకు తెలిసినవి మరి రెండు మానసిక స్థితులున్నాయి. ఒకటి, మన మనస్సు అటునిటు చలించి పోవడానికి వీలులేకుండా వుండడం కోసమై దానిని చాల కఠోరమైన క్రమశిక్షణలో పెట్టడానికి ప్రయత్నించడం. రెండవది, దానిని ఎటుబడితే అటు పోవడానికి స్వేచ్ఛగా వదలడం. అయితే నేను మాట్లాడేది యీ రెంటిమధ్య రాజీమార్గం కాదు, రెండింటిని సమన్వయపరచడంకాదు. పైగా నేను చెప్పేదానికిని ఆ రెండింటికిని మధ్య సంబంధమే లేదు. నేను చెప్పే మార్గము సరిక్రొత్త మార్గము. దీని ప్రకారం మీ మనస్సు సదా జాగరూకమై సావధానంగా వుంటుంది; దేనినీ నిరోధించడంగాని, బహిష్కరించడంగాని లేదు. మీ మనస్సు ఎల్లప్పుడు ప్రతిదానిని మెలకువతో – అప్రమత్తతతో – గమనిస్తూ వుంటుంది.

నేను చెప్పేదానిని ప్రయత్నం చేసి చూడండి – అప్పుడు మీ మనస్సు దేనినైనా ఎంత వేగంగా నేర్చుకో గలుగుతుందో మీరే చూడగలరు. ఏదైనా పాటనుగాని, మ్రోతనుగాని విన్నప్పుడు దానితో మీ మనస్సును నింపివేయండి. అందులో నేర్చుకొనడానికి ప్రయత్నమంటూ వుండదు. ఇంతకు మీ ఉపాధ్యాయుడు ఏదైనా చారిత్రక విషయము చెబుతున్నప్పుడు దానినెట్లా వినవలెనో మీకు తెలిసివుంటే మీ మనస్సులో ఖాళీ స్థలము (ఆకాశము) మరియు నిశ్శబ్దత ఉండడం చేత విక్షేపము పొందక, అందుచేత నిరోధమును లేక, మీరు వినగల్గివుంటే అప్పుడు మీరా చారిత్రక విషయాన్నే గాకుండా, మీ ఉపాధ్యాయుడు ఆ విషయమై ఎంత పక్షపాత బుద్ధితో

వున్నదిన్ని, దానికి మీ మనస్సులో ఎట్టి ప్రతిస్పందన కలుగుతున్నదిన్ని కూడ తెలిసికోగలరు.

మీ కొక విషయం చెబుతాను. ఆకాశమంటే మీకు తెలుసు. ఆకాశమంటే ఖాళీస్థలము లేదా ఎడము. ఈ గదిలో ఖాళీస్థలమున్నది. ఇక్కడికిని మీ హాస్టలుకును మధ్య, మీ యింటికిని వంతెనకును మధ్య, నదిలో ఈ గట్టుకును ఆ గట్టుకును మధ్య ఖాళీస్థలమున్నది. అదే విధంగా మీ మనస్సులో ఖాళీ స్థలమున్నదా? లేక ఏవేవో ఆలోచనలతో నిండిపోయి, మీ మనస్సులో ఎడమే లేదా? మీ మనస్సులో గనక ఖాళీ స్థలముంటే, అందులో నిశ్శబ్దత వుంటుంది. ఆ నిశ్శబ్దతలో నుండియే ప్రతిది వస్తుంది. అటువంటి నిశ్శబ్దతలో మీరు వినగలరు, ఎట్టి నిరోధము లేకుండా మనస్సును లగ్నము చేయగలరు, అవధానత సిద్ధింపగలదు. అందువలన మనస్సులో ఖాళీస్థల ముండడం చాలా అవసరం. మనస్సు రకరకాల ఆలోచనలతో ఎల్లప్పుడు క్రిక్కిరిసి వుండక ఏమాత్రమైనా ఖాళీస్థల ముంటే, ఎడముంటే, అప్పుడది ఆ కుక్క మొరగడాన్ని వినగలదు, దూరంగా వంతెనను దాటుతున్న రైలు మ్రోతను వినగలదు. అదే సమయంలో ఇక్కడ మాట్లాడుతున్న మనిషి యేమి చెబుతున్నాడో అది గూడ గ్రహించగలదు. అట్టి మనస్సే సజీవమైన మనస్సు, అది నిర్జీవము కాదు.

1. **ప్రశ్న:- నిన్న మనం కలిసికొని విడిపోయిన తరువాత మీరక్కడ రొడ్డు ప్రక్కన ఆడుకొంటూ వున్న యిద్దరు పాలంకాపు పిల్లలను - బీదతనానికి దృష్టాంతము లన్నట్లు వున్నవారిని - గమనిస్తూ నిలబడడం మేము చూసినాము. వాండ్లను చూస్తూవున్న సమయములో మీ మనస్సులో ఎటువంటి భావాలు ఉద్భవిల్లినాయో తెలిసికొందామని కోరిక.**

కృష్ణమూర్తి:- నిన్న సాయంకాలం చాలామంది విద్యార్థులు రోడ్డు మీద నన్ను కలిసికొన్నారు. వాండ్లు వెళ్ళిపోయిన తరువాత తోటమాలి పిల్లలిద్దరు ఆడుకొంటూ వుండడం చూశాను. ఆ పిల్లలను చూస్తూ వున్న సమయంలో నాలో కల్గిన భావాలేవో ఈ ప్రశ్న వేసిన వ్యక్తి (పృచ్ఛకుడు) తెలిసికొనగోర్తున్నాడు.

బీదపిల్లలను చూసినప్పుడు మీలో ఎటువంటి భావాలు కలుగుతాయి? నాలో కల్గిన భావాలను తెలిసికోడంకంటె మీలో కల్గెడి భావాలను మీరు తెలిసికోడం చాల ముఖ్యము. లేకపోతే, హాస్టలుకుగాని, తరగతులకుగాని పోతూ పోతూ ఆ పిల్లలను గమనించి చూడడానికే తీరిక దొరకలేదా?

ఆ బీద స్త్రీలు సంతకు పెద్ద పెద్ద బరువులను మోసికొని పోతూ వుంటే చూచినప్పుడుగాని, ఆ బీద రైతుపిల్లలు ఆడుకోవడానికి మరింకేమీ లేక, మట్టితో ఆడుకొంటూ వుంటే గమనించినప్పుడుగాని మీ మనస్సులో ఎట్టి ప్రతిస్పందన కలుగుతుంది? ఆ పిల్లలకు మీ మాదిరి చదువుకోవడానికా అవకాశం లేదు. ఉండడానికా మంచి యిల్లులేదు. పరిశుభ్రత నెరుగరు. చాలీచాలని గుడ్డలు, చాలీచాలని తిండి – ఇదంతా మీరు గమనించినప్పుడు మీలో కల్గెడి ప్రతిక్రియ యేమిటి? మీ ప్రతిక్రియ యేమిటో మీకు మీరు తెలిసికోవడం చాల ముఖ్యం. నా ప్రతిక్రియ యేమిటో నేను చెబుతాను.

ఆ పిల్లలకు నిద్రపోవడానికి సరియైన చోటు లేదు. వాండ్ల తల్లిదండ్రులు సెలవంటూ లేకుండా దినమంతా పనిచేస్తూనే వుంటారు. ఆ పిల్లలకు ఎవరిప్రేమా తెలియదు. వాండ్లను గురించి ఎవరూ శ్రద్ధ తీసికోరు. వాండ్ల తల్లిదండ్రులు వాండ్లను దగ్గర కూర్చోబెట్టుకొని ఈ అందమైన భూమి గురించి గాని, ఆకాశం గురించిగాని కథలెన్నడూ చెప్పరు. ఈ ప్రపంచంలో ఒకప్రక్క ఏది కోరుకుంటే అది సంపాదించుకోగల అత్యంత ధనవంతులున్నారు. మరియొకప్రక్క దేనికినీ నోచుకోని బాల బాలికలున్నారు. ఇటువంటి పరిస్థితులకు కారణమైన యీ సమాజ మేమిసమాజము? ఇటువంటి సమాజానికి కారకు లెవరు? మీరు విప్లవం తీసుకురావచ్చు. ఈ సమాజాన్ని తలక్రిందులు చేయవచ్చు. ఈ సమాజచక్రాన్ని విరుగ గొట్టవచ్చు. కాని ఆ విరుగగొట్టడంలో దీనికి మారురూపమైన మరియొక క్రొత్త సమాజం పుట్టుక వస్తుంది. అందులోను ప్రభుత్వాధికారులకు పల్లెపట్టులందు ప్రత్యేక బంగళాలుంటాయి. వారికి జరుగవలసిన ప్రత్యేక మర్యాదలుంటాయి. ప్రత్యేక అధికారాలుంటాయి. ప్రత్యేకమైన యూనిఫారం దుస్తులుంటాయి. ఈ విధంగా పైనుండి క్రిందికి అర్హతలు అధికారాలు వుంటూనే వుంటాయి. ఫ్రెంచి విప్లవంగాని, రష్యన్ విప్లవం గాని, చైనా విప్లవంగాని – ఏ విప్లవం తరువాతనైనా సరే, ఇది యిట్లే జరిగినది. ఇటువంటి అవినీతి, భ్రష్టాచారము, దైన్యమున్నులేని సమాజాన్ని నిర్మింపగలమా? ఇటువంటి సమాజాన్ని నిర్మింపవలెనంటే మనవంటి వ్యక్తులు, సమష్టి నుండి తెగతెంపులు చేసికొని బయట పడాలి. స్వయంగా గొప్ప వాండ్లం కావాలని అత్యాశలకు పోరాదు. తృష్ణను విసర్జించాలి. ప్రేమించడమంటే యేమిటో తెలిసివుండాలి. ఇదంతా అప్పుడు నా మనస్సులో తట్టిన ప్రతిక్రియ యొక్క సారాంశం.

ఇంతకు నేను చెప్పినదంతా మీరు వింటున్నారా?

**2. ప్రశ్న:- మన మనస్సు ఒకేసారి అనేక విషయాలను ఎట్లా వినగలదు?**

**కృష్ణమూర్తి:-** అది కాదు నేను చెబుతూ వుండినది. ఒకేసారి అనేక విషయాలమీద మనస్సును నిలుపగల సమర్థులు కొందరుండవచ్చు. అది కేవలం అభ్యాసం మీద, మనస్సున కిచ్చిన శిక్షణ మీద ఆధారపడి వుంటుంది. అటువంటి దాని గురించి కానేకాదు నేను మాట్లాడుతూ వుండినది. నేను మాట్లాడుతూ వున్నది ఎట్టి అడ్డుగోడలు నిర్మించుకోని దేనినీ నిరోధించని మనస్సును గురించి. అట్టి మనస్సులో ఖాళీ ప్రదేశ ముండడంచేత, నిశ్శబ్ద ముండడం చేత అది వినగలదు. ఆ నిశ్శబ్దములో నుండియే ఆలోచనలన్నీ పుట్టుకొని వస్తుంటాయి.

**3. ప్రశ్న:- ఏమీ పని చేయకుండ, సోమరితనంగా వుండాలని మనకెందుకు బుద్ధి పుడుతుంది?**

**కృష్ణమూర్తి:-** సోమరితనం వలన దోషమేమి? కదలకుండా ఒకచోట కూర్చుండి, దూరంగావున్న ధ్వని రానురాను దగ్గరి దగ్గరికి వస్తూవుంటే వింటూ వుండడంలో

తప్పేమున్నది? లేదా, ప్రొద్దుటి పూట పక్క మీదనే పడుకొని లేవకుండా, దగ్గరలోనే వున్న చెట్టుమీది పక్షులను గాని, తక్కిన అన్ని ఆకులు కదలక మెదలక వుంటే, ఒక్క ఆకు మాత్రం చల్లని గాలికి కదులుతూ వుండడాన్ని గాని గమనిస్తూ వుండడంలో దోష మేమున్నది? మనము సోమరితనాన్ని నిందిస్తాము – దానికి కారణం మన దృష్టిలో సోమరితనం చెడ్డది. అసలు సోమరితనమంటే యేమిటో ఆలోచిద్దాం. నా కారోగ్యం బాగానే వుండి, మామూలుగా లేవవలసిన సమయానికి లేవకుండా పక్కలోనే పడుకొని వుంటే అది సోమరితనమని కొందరంటారు. శరీరంలో తగినంత ఉత్సాహం లేకగాని, శక్తి లేకగాని లేదా మరే యితర ఆరోగ్య కారణాల చేతనైనా సరే చదువుకోడానికైనా, ఆడుకోడానికైనా మీ కిష్టం లేకపోతే దానిని గూడ కొందరు సోమరితనమనే అంటారు. అసలింతకు సోమరితనమంటే యేమిటి?

ఏ మనస్సైతే వివిధములైన ప్రేరణలకు తాను చేయు ప్రతిక్రియలను, తన సూక్ష్మమైన కదలికలను తాను గమనించి చూస్తూ వుండక, వాటి గురించి అసావధానంగా వుంటుందో ఆ మనస్సే సోమరితనము గల మనస్సు; అదియే అజ్ఞానముతో గూడిన మనస్సు. మీరు పరీక్షలు పాసు కాలేకపోతే, ఏవేవో పుస్తకాలు చదవనందున అందలి విషయాలేవీ మీకు తెలియకపోతే అది అజ్ఞానము కాదు. మీ గురించిన జ్ఞానము మీకు లేకపోతే, మీ మనస్సు ఎట్లా పని చేస్తున్నదో మీ ఉద్దేశాలు మీ ప్రతిక్రియలు ఎట్లాంటివో మీకు తెలియకపోతే అదియే నిజమైన అజ్ఞానము. అదే విధంగా మనస్సు నిద్రమత్తులో పడివుండడమున్ను సోమరితనమే. నిజానికి చాలమంది మనుష్యుల మనస్సులు ఎల్లప్పుడు నిద్రమత్తులో వుంటాయి. వారి మనస్సులు ఏవేవో శాస్త్ర గ్రంథాలో లేదా శంకరాచార్యులో మరియొకరో చెప్పిన విషయాలతో ఇంకా అనేక విధాలుగా కూడబెట్టుకొన్న జ్ఞానంతో మత్తుమందు తిన్నట్లు పడివుంటాయి. వారేదో యొక శాస్త్రాన్నో, వాదాన్నో అనుసరిస్తుంటారు. ఏదో యొక విధమైన క్రమశిక్షణను పాటిస్తుంటారు. అందువలన వారి మనస్సులు, పొంగిపొరలుతున్న నదులవలె నిండుగా నుండి ఆంతరిక సౌందర్యముతో నొప్పారుచుండుటకు బదులు సంకీర్ణములై, సంవేదనా రహితములై మొద్దుబారి వుంటాయి. అట్టి మనస్సులు సోమరితనమునకు నెలవులు. అంతేగాదు, గొప్పవారము కావాలనే కోరిక గలిగి, ఒక ఫలితాన్ని ఆశించి పనిచేస్తూ వుండే మనస్సు నిజానికి చురుకైన మనస్సు కాదు. అది పైకి చూడడానికి చురుకుగా పనిచేస్తూ వున్నట్లు, చొరవ గల్గియున్నట్లు తన కోరికను సాధించుకోవడం కోసం దినమంతా పనిచేస్తూ వున్నట్లు కనబడవచ్చుగాక! కాని లోలోపల నిరాశా నిస్పృహల భారంతో, భంగపాటుతో, ఆశాభంగమువలన కలిగెడి చిరాకుతో నిండి, క్రుంగిపోతూ వుంటుంది.

అందువలన నిజంగా మనలో సోమరితనమున్నదా లేదా యనే విషయాన్ని మనం చాల జాగ్రత్తగా గమనించి చూచుకోవాలి. సోమరిపోతులని – సోంబేరులని మిమ్మెవరైనా అంటే, మన మంతేనేమో యని సమాధాన పడనవసరంలేదు. సోమరితనమంటే యేమిటో లోతుగా పోయి విచారించండి. ఏది చెప్పితే అది గ్రుడ్డిగా నమ్మేవాడు లేదా గ్రుడ్డిగా నిరాకరించేవాడు లేదా గ్రుడ్డిగా అనుకరించేవాడు,

భయంచేత రక్షణ కోసం తనకొక గాడి త్రవ్వుకొని అందులోనే నడిచిపోయేవాడు – ఇటువంటి వారందరు సోమరులు. వీరి మనస్సు క్రమంగా క్షీణించి ముక్కలు ముక్కలై పోతుంది. కాని నిత్య జాగరూకుడైన మనిషి సోమరి కానేకాడు. కాని తరచుగా నతడు పైకి చూడడానికి సోమరివలె కనబడుతూ ప్రశాంతంగా కూర్చుండి చెట్లను, పక్షులను, ప్రజలను, నక్షత్రములను, మౌనముగా ప్రవహించు నదిని మేల్కొనియున్న మనస్సుతో గమనిస్తూ వుంటాడు.

**4. ప్రశ్న:- సంఘానికి వ్యతిరేకంగా విప్లవం తీసికొని రావాలని మీరంటారు. కాని కోరిక పనికిరాదని గూడ మీరే అంటారు. అయితే సంఘాన్ని బాగుపరచవలెననే కోరిక కోరిక కాదా? అది పేరాశ కాదా?**

**కృష్ణమూర్తి:-** విప్లవమంటే నా ఉద్దేశమేమిటో చాలా జాగ్రత్తగా వివరించాను.దానిని ఇంకా విశదం చేయడం కోసం రెండు వేర్వేరు పదాలను వాడతాను. సంఘంలోనే వుంటూ, దానిని ఇంకొంచెం బాగుపరచడం కోసం, అందులో కొన్ని సంస్కరణలు తేవడం కోసం ప్రయత్నించడం ఎట్లాంటిదంటే ఖైదీలు జైలులోనే వుంటూ అందులోని తమ జీవితాన్ని బాగుపరచుకోవడం కోసం ప్రయత్నించడం లాంటిది. అట్టి విప్లవము విప్లవమే కాదు. దానిని తిరుగుబాటు (mutiny) అనవచ్చు. ఈ రెండింటికిని గల తేడా మీరు గ్రహించారా? సంఘంలో విప్లవమంటే చెఱసాలలోని ఖైదీలు మంచి తిండికోసం తమ్ము బాగా చూచుకోవడం కోసం అధికారులకు వ్యతిరేకంగా చేసిన తిరుగుబాటులాంటిది. కాని అవగాహన వలన కలిగిన విప్లవమేదంటే సంఘాన్నుండి తెగత్రెంపులు చేసికొని వ్యక్తి బయటపడటం. అదియే సృజనాత్మకమైన విప్లవము లేదా క్రాంతి.

అయితే మీరొక వ్యక్తిగా సంఘాన్నుండి విడివడి బయటికి వచ్చివేస్తే, ఆ పని మీరేదో ఆశపెట్టుకొని చేసినట్లా? ఏదో విధంగా గొప్పవారు కావాలనే కోరికతో చేసినట్లా? ఒకవేళ అట్టి కోరికతో మీరా పని చేసివున్నట్లయితే మీరు సంఘాన్నుండి విడివడనట్లే! మీరింకా చెఱసాలలోనే వున్నట్లు. ఎందువల్లనంటే అసలు సంఘానికి ప్రాతిపదిక అట్టి కోరికయే! గొప్పవాళ్ళం కావాలనే కోరిక, అంతా మనకే వుండాలనే కోరిక, స్వార్థము, లోభము – ఇట్టి గుణాలమీదనే సంఘము ఆధారపడి వుంటుంది. ఇదంతా అర్థము చేసికొని మీ మనో హృదయములలో సంపూర్ణ పరివర్తనమును గొనిరా గల్గినచో అప్పుడు మీలో తృష్ణ లేనట్లు, మహత్వాకాంక్ష లేనట్లు. అప్పుడు మీరు చేసిన పనికి ఈర్ష్యాసూయలుగాని, లోభముగాని, సంగ్రహణ శీలతగాని కారణములు కానేరవు. అందుచేత వాటిమీద ఆధారపడిన సంఘమునకు మీరు వెలిగా నుంటారు. అప్పుడు మీలో సృజనాత్మకత పరిఢవిల్లుతుంది. అప్పటి మీ యాచరణలో నూతన సంస్కృతికి బీజములుంటాయి.

కాబట్టి సృజనాత్మకమైన విప్లవమునకున్ను, సంఘములోనే వుంటూ చేసెడి తిరుగుబాటునకున్ను చాల వ్యత్యాసమున్నది. కేవలము సంఘములో సంస్కరణలు కొనిరావడముతోనే మీకు సంబంధమున్నట్లయితే, చెఱసాల యొక్క కమ్మీలకు

గోడలకున్ను రంగులువేసి, వాటిని అలంకరించడంతోనే మీకు సంబంధమున్నట్లయితే అప్పుడు మీరు సృజనాత్మకత గలిగిన వ్యక్తులు కారు. ఒక సంస్కరణ మరియొక సంస్కరణకు దారి తీస్తుంటుంది. దానితో మరింత దైన్యము, మరింత వినాశమున్ను కలుగుతుంటాయి. అట్లుగాక, (ఇంకా ఇంకా కూడబెట్టుకోవాలని కోరెడి) సంగ్రహణ బుద్ధి యొక్క లక్షణాన్ని, లోభ లక్షణాన్ని, మహత్త్వాకాంక్ష యొక్క లక్షణాన్ని అర్థము చేసికొని, వాటినన్నింటిని ఛేదించుకొని బయటికి వచ్చిన మనస్సు నిరంతరము క్రాంతి పథమున నడుస్తూ వుంటుంది. అది విశాలమై సృజనాత్మకమగు మనస్సు. కాబట్టి ప్రశాంతముగ నున్న చెరువునీటిలో రాతిని విసరినపుడు కెరటములు పుట్టి నలువైపుల వ్యాపించినట్లు సృజనాత్మకమగు మనస్సు యొక్క వ్యాపారమువలన కలిగిన కెరటములు వినూత్నమగు నాగరికతకు ఆధారములగును.

5. ప్రశ్న:- నేను చదువుకోనప్పుడు నామీద నాకెందుకు అసహ్యము కలుగుతుంది?

కృష్ణమూర్తి:- ప్రశ్నను సరిగా వినండి. చదువుకోవలసినదేదో నేను చదువుకోనప్పుడు నా మీద నాకెందుకు అసహ్యము కలుగుతుంది? ఉండవలసిన రీతిగా నేనుండవప్పుడు నామీద నాకెందుకు రోత కలుగుతుంది? అయిష్టమేర్పడుతుంది? అంటే, దాని భావం, నా ఆదర్శములకు తగినట్లుగా నే నెందుకు నడుచుకోవడంలేదని.

అయితే, అసలా ఆదర్శములే పెట్టుకోకపోతే అది మరీ మంచిది కాదా? అదెంత సులువు? ఎంత ఇబ్బందిలేని పని? మీ రాదర్శములే పెట్టుకోకపోతే మిమ్ము మీరు అసహ్యించుకోడానికి అసలు కారణమే వుండదుగదా! కాబట్టి "నేను దయగలిగి వుండాలి, ఉదారంగా వుండాలి. హెచ్చరిక కలిగి వుండాలి, బాగా చదువుకోవాలి" అని యిట్లా మీరెందుకనుకోవాలి? అదెందుకో మీరు తెలిసికొని ఆదర్శాల జోలికే పోకుండా, వాటిని మానివేస్తే అప్పుడు బహుశా మీ ఆచరణలోనే తేడా వస్తుంది; మీరు వ్యవహరించే తీరే మారిపోతుంది. అదెట్లో యిప్పుడే చూపిస్తా.

మరి మీరెందుకని ఆదర్శాలు పెట్టుకొంటారు? మొట్టమొదటిది, ఏదైనా ఆదర్శాలు పెట్టుకొని వాటి ప్రకారం నడుచుకోకపోతే, మీ జీవితాలు వ్యర్థమని, మీరు కొఱగాని పిల్లలని అందరు మీతో అంటూ వుంటారు. సామ్యవాద సిద్ధాంతం ప్రకారం నడిచే సంఘమైనా, పెట్టుబడిదారీ విధానం ప్రకారం నడిచే సంఘమైనా సరే, మీ ముందొక ఆదర్శాన్ని వుంచుతుంది. దానిని మీరు అంగీకరించి ఆ యాదర్శం ప్రకారం నడుచుకోవడానికి ప్రయత్నిస్తారు, ఏమి, ప్రయత్నించరా? అయితే ఆ యాదర్శం ప్రకారం నడుచుకోవడానికి ప్రయత్నించే ముందు అసలు ఆదర్శాలంటూ పెట్టుకోవడం అవసరమా యని మీరాలోచించుకోవద్దా? అసలదే తప్పకుండా మీరు చేయవలసిన తెలివిగల పని. రాముడు, సీత మీ కాదర్శ పురుషులు. ఇంకా సంఘం మీకిచ్చిన ఆదర్శాలు, మీరు స్వయంగా కల్పించుకొన్న ఆదర్శాలు ఎన్నో వుంటాయి. అవి మీరెందుకు పెట్టుకొంటారో తెలుసునా? మీరు మీరుగానే వుండిపోవడానికి, అంటే మీ యథార్థస్థితిని చూచుకొని, భయపడుతున్నారు.

ఈ విషయాన్ని జటిలం చేయవద్దు, సరళంగానే వుంచుదాం. మీరు మీరుగానే వుండిపోవడానికి మీరు భయపడుతున్నారు. అంటే, మీలో మీకు ఆత్మవిశ్వాసం లేదు. అందువల్లనే మీరున్న సంఘముగాని, మీ తల్లిదండ్రులుగాని, మీ మత సంప్రదాయాలుగాని మీరెట్లా వుండాలో చెప్పితే, అట్లా వుండడానికి మీరు ప్రయత్నిస్తున్నారు.

మరి, మీరు మీరుగానే వుండిపోవడానికి ఎందుకు భయపడతారు? మీరున్న స్థితితోనే మీరెందుకారంభించరు? మీరెట్లా వుండవలెనని కోరుకొంటున్నారో దానితో ఎందుకారంభిస్తారు? ప్రస్తుతం మీరున్న స్థితిని అర్థం చేసుకోకుండానే దానిని మీరుండదలచిన స్థితిలోనికి మార్చవలెనని ప్రయత్నం చేయడం అర్థములేని పని. అందువలన ఆదర్శాల నన్నిటిని తుడిచి పారవేయండి. దీనికి పెద్దలు సమ్మతించరని నాకు తెలుసు. అయినా ఫర్వాలేదు. అన్ని ఆదర్శాలను గోకి పారవేయండి, గంగలో ముంచివేయండి, చెత్త బుట్టలోకి విసిరి పారవేయండి. మీరే స్థితిలో వున్నారో దానితో ఆరంభించండి – అంటే యేమిటి?

మీరు సోమరులు, చదువుకోవడానికి బొత్తిగా ఇష్టంలేదు. ఆటలు ఆడుకోవాలని, సరదాగా కాలం గడపాలని అనుకొంటారు. పిల్లలందరి స్వభావమూ అంతే. మరి దానితోనే ఆరంభించండి. సరదాగా కాలం గడపటమంటే మీ ఉద్దేశమేమిటి? మీ బుద్ధినుపయోగించి పరీక్షించి చూడండి. అందులో వాస్తవంగా అంతర్యాతమైయున్న విషయమేమిటి? మీ తల్లిదండ్రులుగాని, మీ ఆదర్శాలుగాని చెప్పేమాటలకు మీరు చోటివ్వకండి – ఆ మాటలను వినకండి. చదువుకోవడానికి ఎందుకిష్టంలేదో మీ బుద్ధి నుపయోగించి స్వయంగా తెలిసికోండి. జీవితంలో మీరేమి చేయదలచినారో తెలిసికోవడంకోసం మీ మనస్సు నుపయోగించండి. మీరున్న సంఘంగాని, మీ ఆదర్శంగాని చెప్పే మాటలనటుంచి, స్వయంగా మీరు ఏమి చేయదలచినారో తెలిసికోండి. ఈ విచారణ చేయడానికై మీరు మీ మనోహృదయాలను పూర్తిగా వినియోగిస్తే అప్పుడు మీరు నిజమైన క్రాంతివాదు లవుతారు. అప్పుడు మీరు సృజనశీలురవడానికిన్ని మీ సహజస్థితిలో నుండడానికిన్ని మీకాత్మవిశ్వాసం కలుగుతుంది. అట్టి స్థితిలో మీ యందు నిత్యనూతనమగు జీవశక్తి వెల్లివిరుస్తుంది. అట్లుగాక ఎవరో మరియొకరిమాదిరిగా వుండడం కోసం ప్రయత్నిస్తూ వుంటే మీ శక్తి సామర్థ్యాలను పాడుచేసికొంటూ వుంటారు.

మీ సహజస్థితిలో మీరుండడంలోనే అందమున్నది. కాని అట్లా మీ సహజ స్థితిలో మీరుండడమంటే ఎందుకంత భయపడతారో చాల విచిత్రమైన విషయంకాదా? ఇది మీరు గమనించారా? మీరొకవేళ సోమరులే కావచ్చు, మూర్ఖులే కావచ్చు. కాని ఆ విషయం తెలిసికొని ఆ సోమరితనాన్ని, మూర్ఖత్వాన్ని మరియొక రూపంలోకి మార్చుకోడం కోసం ప్రయత్నించే బదులు ఆ సోమరితనమనగానేమో, ఎట్టిదో అర్థం చేసికొంటే, మూర్ఖత్వాన్ని ముఖాముఖి ఎదుర్కొంటే, ఆ స్థితిలో మీరెంతో భారవిముక్తులయినట్లు అనుభూతి చెందుతారు. మీ మనస్సు తేలికపడుతుంది. అందులోనే అందమున్నది. గొప్ప తెలివి వున్నది, ప్రజ్ఞ వున్నది.

6. ప్రశ్న:- ఒకవేళ ప్రస్తుతమున్న సమాజానికి విరుద్ధంగా తిరుగుబాటుచేసి నూతన సమాజాన్ని నిర్మించినా ఈ నూతన సమాజ నిర్మాణము పేరాశ యొక్క మరియొక రూపము కాదా?

కృష్ణమూర్తి:- నేను చెప్పినదానిని మీరు సరిగా వినిపించుకోలేదని నాకనుమానంగా వున్నది. సమాజము యొక్క చట్రములోనే, దాని పరిధిలోనే వుంటూ, మన మనస్సు తిరుగబడితే ఆ తిరుగుబాటు చెఱసాలలోని అధికారులకు వ్యతిరేకంగా, అందలి కట్టుబాట్లకు విరుద్ధంగా చేసిన తిరుగుబాటు వంటిది. అప్పుడది మరొక రూపంలో నున్న పేరాశయే అవుతుంది. కాని మనస్సు నేటి సమాజము యొక్క వినాశకరమగు ప్రవృత్తిని అర్థం చేసికొని దానినుండి బయటపడితే అప్పుడా మనసు చేసినపని పేరాశతో, అంటే ఏదో పెద్ద ఆశపెట్టుకొని – చేసినదికాదు. అట్టి ఆచరణవలన క్రొత్త సంస్కృతి, ఉత్తమ సమాజ వ్యవస్థ, నూతన ప్రపంచము ఏర్పడవచ్చు. కాని దానితో ఆ మనస్సునకెట్టి సంబంధమున్ను లేదు. సత్యమేదో కనుగొనడంతోనే – సత్య దర్శనముతోనే – ఆ మనస్సునకు గల సంబంధము. గతిశీలమగు ఆ సత్యము వలననే నూతన ప్రపంచ నిర్మాణము జరుగుతుంది కాని, సమాజము నెదిరించి నిలిచిన మనస్సువలన కాదు.

*24 జనవరి, 1955*

★ ★ ★

# 19. రెండువిధములైన జ్ఞానము

నిన్న సాయంకాలం కనబడిన ఇంద్రధనుస్సును మీలో ఎంతమంది చూచివుంటారో నా కనుమానమే. అది సరిగ్గా నీళ్ళ మీదుగా తటాలున కనబడింది. చూడడానికి ఎంతో అందంగానుంది. ఎంతో ఆనందాన్ని కలిగించింది. దానిని చూస్తే భూమి యెంత గొప్పదో, ఎంత విశాలమైనదో, ఎంత అందమైనదో మన మనస్సుకు తట్టుతుంది. ఆ మన ఆనందాన్ని యితరులతో పంచుకోవలెనంటే – (ఇతరులకు చెప్పవలెనంటే) – మనకు భాషలోని పదపదార్థముల జ్ఞానము బాగా వుండాలి; అందుకు తగిన భాషతోబాటు అందలి లయసౌందర్యములున్ను ఎఱిగి వుండాలి; ఏమి, వుండనక్కరలేదా? కాని వీటన్నిటికంటే ప్రధానమైనది అనుభూతి, సౌందర్యము యొక్క లోతైన అవగాహన వలన కలిగే ఆనందపారవశ్యము. అయితే ఇట్టి అనుభూతి కేవలం జ్ఞానార్జన వలనగాని, జ్ఞాపక శక్తిని పెంపొందించుకొనడం వలనగాని కలుగబోదు.

చూడండి, దేని గురించైనా మన భావాలను ఇతరులకు వ్యక్తం చేయవలెనంటే, దేని గురించైనా మనలో మనం మాట్లాడుకోవలెనంటే దాని గురించిన జ్ఞానం మన వద్ద తగినంత వుండాలి. అట్టి జ్ఞానాన్ని అభివృద్ధి చేసికోవాలంటే మనకు జ్ఞాపక శక్తి వుండాలి. మనవద్ద తత్తద్విషయికమైన పరిజ్ఞానమే లేకపోతే విమానములను నడుపలేము. వంతెనలనుగాని అందమైన భవనాలనుగాని నిర్మించలేము. పెద్ద పెద్ద రోడ్లను వేయలేము. వృక్ష సంరక్షణగాని, జంతుసంరక్షణగాని చేయలేము. నాగరికతగల మానవులముగా మనం చేయవలసియున్న వివిధ కార్యములను వేటిని గూడ మనం చేయలేము. విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయవలెనంటే, వివిధ విజ్ఞానశాస్త్ర విషయములందు కృషి చేయవలెనంటే, వైద్యము ద్వారా మానవునికి సహాయపడవలెనంటే, ఇంకను ఇటువంటి పనులెన్నింటినో చేయవలెనంటే వీటిని గురించిన పరిజ్ఞానము మనకుండాలి. వీటిని గురించిన వివరాలను సేకరించి, వాటిని జ్ఞాపక ముంచుకోవాలి. ఇట్టి విషయాలలో మీకు వీలున్నంత అత్యుత్తమ బోధన జరగడం చాలా అవసరం. అందువలన మీకు సరియైన వివరాల నందజేస్తూ, వివిధ పాఠ్య విషయాలలో సంపూర్ణ పరిజ్ఞానాన్ని సంపాదించుకోవడంలో సహాయపడడం కోసం సాంకేతికంగా సమర్థులైన ప్రథమశ్రేణి ఉపాధ్యాయులు మీకెంతో అవసరం.

కాని చూడండి, ఒక స్థాయిలో మనకు జ్ఞాన మవసరమైనప్పటికిన్ని, మరియొక స్థాయిలో మనకది ప్రతిబంధకంగా తయారవుతుంది. భౌతిక ప్రపంచమునకు సంబంధించిన విజ్ఞాన మెంతో మనకిప్పుడు ఉపలబ్ధమవుతున్నది. అది యింకను దినదినము వృద్ధిచెందుతూ వున్నది గూడ. అట్టి విజ్ఞానము సంపాదించుకోవడం,

దానిని లోక కల్యాణం కోసం ఉపయోగించుకోవడమున్ను అత్యావశ్యకమే. అయితే మానసిక స్థాయిలో సత్యదర్శనమునకు ప్రతిబంధకముగా పరిణమించెడి మరియొక విధమైన జ్ఞానముండలేదా? ఇంతకున్ను జ్ఞానమంటే యేమిటి? ఒక విధమైన సంప్రదాయమే కాదా? పారంపర్యముగా లభించునట్టిదే కాదా? ఇక సంప్రదాయమంటే స్మృతిమూలకము, జ్ఞాపకాలపై ఆధారపడినది. యాంత్రిక విషయాలలో సంప్రదాయ మత్యావశ్యకమే. కాని అది అంతరంగ విషయాలలో – అంటే మానసికంగా – మానవునికి మార్గదర్శకమైనట్లయితే అప్పుడట్టి సంప్రదాయము అలౌకిక విషయాలను దర్శించడానికి ప్రతిబంధక మవుతుంది.

యాంత్రిక విషయాలలోను, మన దైనిక జీవితంలోను మనము మనం సమకూర్చుకొన్న జ్ఞానంమీద, మన జ్ఞాపకాలమీద ఆధారపడతాము. అట్టి జ్ఞానమే లేకపోతే మనం మన కారును నడుపలేము, ఇంకా యెన్నో పనులను చేయలేము. కాని ఆ జ్ఞానము మన మనస్సును, మన ఆత్మను, మన అంతరంగాన్ని నడిపే ఒక సంప్రదాయంగా, ఒక నమ్మకంగా మారిపోయినట్లయితే అప్పుడది మనకొక ప్రతిబంధకమయి తీరుతుంది. అది మానవులలో విభేదము కల్పిస్తుంది. ప్రపంచమంతటు ప్రజలు తమ్ముతాము హిందువులుగా, మహమ్మదీయులుగా, బౌద్ధులుగా, క్రైస్తవులుగా, ఇంకా ఎన్నో పేర్లతో పిలుచుకొంటూ, అనేక విభాగాలుగా విభజింపబడివుండడం మీరు గమనించలేదా? వారి నట్లు విభజించిన దేది? వైజ్ఞానిక పరిశోధనలు కాదు, కృషి విజ్ఞానము కాదు, వంతెన లెట్లా నిర్మించాలో, జెట్ విమానాల నెట్లా నడపాలో దానికి సంబంధించిన విజ్ఞానమున్ను కాదు. ప్రజలను విభజించేవి సంప్రదాయము, నమ్మకాలున్ను. అవి మానవుల మనస్సును తమ కనుకూలంగా మలచివేసుకొంటాయి, ఒక నిశ్చితమార్గంలో ప్రవర్తింపజేస్తాయి.

కాబట్టి సంప్రదాయంగా మార్పుచెందిన జ్ఞానము మనస్సు నాక్రమించి, తన కనుకూలంగా దానిని మలచుకొనడంచేత అది సత్యదర్శనమునకు ప్రతిబంధకమవుతుంది. అప్పుడా జ్ఞానము ప్రజలను విభజించి వారిమధ్య విరోధమును పెంపొందింప జేయడమే గాకుండా సత్య మననేదో, జీవిత మననేమో, దేవుడన నెవరో లోతుగా విచారించి తెలిసికొన వీలులేకుండా అడ్డుపడుతుంది. దేవుడన నెవరో తెలిసికొనవలెనంటే మన మనస్సు తనకు రక్షణను కల్పించెడు సమస్త సంప్రదాయమునుండి, సమస్త సంచితమునుండి, సమస్త జ్ఞానమునుండి విముక్తము కావలసి వుంటుంది.

విద్యయొక్క కర్తవ్యమేమనగా – ఏయే క్షేత్రములందు మానవుని కృషి కొనసాగివున్నదో ఆయా క్షేత్రములకు సంబంధించిన పరిపూర్ణ జ్ఞానమును విద్యార్థి కందివ్వడమే గాకుండా అతని మనస్సును సమస్త సంప్రదాయములనుండి విముక్తము గూడ చేయవలసి వుంటుంది. అప్పుడు మాత్రమే అతనికి సరియైన పరిశోధన చేయడానికిగాని, లోతుగా విచారించడానికిగాని, సత్యమును దర్శించడానికిగాని సాధ్యమవుతుంది. అట్లుగానిచో మనస్సు కేవలము యాంత్రికమై జ్ఞాన యంత్రాంగ ముచే బరువెక్కిపోతుంది. పేరుకొనిపోతూవుండే సంప్రదాయమునుండి ఎప్పటికప్పుడు విడుదల పొందుతూ వుంటేనే తప్ప, దానినుండి తన్నుతాను నిరంతరము విముక్తము చేసికొంటూ వుంటేనే తప్ప, మనస్సు శాశ్వతమగు పరమతత్త్వమును దర్శింపజాలదు.

అయితే మానవుని దైనికజీవితమున కావశ్యకములైనవి, అందుకోసం మానవుడు ఉత్పత్తి చేయవలసినవి ఏవేవైతే వుంటాయో వాటికి సంబంధించినదై విస్తృతమౌతూ వున్న జ్ఞానరాశిని అతడు సాధించి సంపాదించుకోవలసిందే – అదిమాత్రము తప్పదు.

కాబట్టి జ్ఞానసంపాదనము – అంటే జ్ఞాపకశక్తిని పెంపొందింపజేసికోవడం – ఒక స్థాయిలో చాల అవసరము, చాల ఉపయోగకరమున్ను. కాని మరియొక స్థాయిలో అది యొక ప్రతిబంధకము. ఈ విధంగా జ్ఞాన మెక్కడ వినాశకరమో, దాని నెక్కడ దూరముగా నుంచవలెనో మరియు అది యెక్కడ అవశ్యకమో, వీలున్నంత యెక్కువగా దాని నెక్కడ ఉపయోగించుకోవలసి వుంటుందో – ఈ తేడాను గుర్తించడమే తెలివి వికసించడానికి ఆరంభము.

కాని ప్రస్తుత కాలంలో విద్య పేరిట యేమి జరుగుతూ వున్నదో తెలుసా? మీకు అనేక విషయాలలో జ్ఞానము కలుగజేయబడుతున్నది. అవునా కాదా? కళాశాలలో చదివి మీరు ఇంజనీర్లో, డాక్టర్లో, లాయర్లో అవుతారు. గణితశాస్త్రంలోనో లేదా మఱియొక శాస్త్రంలోనో పిహెచ్.డి. తీసికొంటారు. లేదా గృహవిజ్ఞానం చదివి, కాపురమెట్లా నడుపుకోవలెనో, వంట యెట్లా చేసికోవలెనో ఇంకా ఏవేవో నేర్చుకొంటారు. కాని సమస్త సంప్రదాయములనుండి విడుదల పొందడమెట్లో ఎవరును మీకు బోధించరు. అట్లా విడుదల పొందినప్పుడే మీ మనస్సు నిత్యనూతనముగా సదా నిర్మలముగా వుంటుంది. కుతూహలముతో సరిక్రొత్త విషయాలను తెలిసికొనగలిగి వుంటుంది. మీరు పుస్తకాలు చదివి అలవరచుకొన్న వేదాంతాలు, సిద్ధాంతాలు, నమ్మకాలే మీకు సంప్రదాయమవుతుంది. ఆ సంప్రదాయము మీ మనస్సును సరియైన దారిన స్వతంత్రంగా పనిచేయనీయక అడ్డుపడుతుంటుంది. మీ మనస్సు వీటి చాటున రక్షణ పొందగోరుతుంది. కాబట్టి వాటి కనుగుణంగా మీ మనస్సు మలచబడుతుంది, వాటికి లొంగిపోతుంది కాబట్టి సమస్త సంప్రదాయము నుండి విముక్తి పొందడమే గాకుండ, దానితోబాటు సమస్త విజ్ఞానమును సమస్త క్రియలందు నైపుణ్యమును సాధించడంగూడ అవసరమే. ఇదియే విద్యయొక్క పరమ ప్రయోజనము.

అయితే కూడబెట్టుకొన్న జ్ఞానమునుండి మనస్సును విముక్తము చేయడం సుసాధ్యము కాదు. అది చాల కష్టముతో గూడినపని. కాని అట్లు విముక్తమగు మనస్సు మాత్రమే ఎల్లప్పుడును అపూర్వ విషయమును దర్శింప సమర్థమవుతుంది. ఒక గొప్ప గణితశాస్త్రవేత్త గణితమునకు సంబంధించిన యొక సమస్యను ఎన్ని దినములు శ్రమించినప్పటికిని పరిష్కరింప లేకపోయెనట – ప్రశ్నకు సమాధానమును సాధింపలేకపోయెనట. ఒకనాటి ఉదయం పూట ఆయన మామూలుగా చల్లగాలిని సేవించడంకోసం తిరుగుతుండగా తటాలున ఆయన మనస్సులో ఆ ప్రశ్నకు సమాధానము తట్టినదట. ఇంతకును జరిగిన దేమిటి? అతని మనస్సు ప్రశాంతంగా ఉండడంచేత సమస్యను తాజాగా, అంటే పాత ఆలోచనలతో సంబంధము లేకుండా, చూడగల్గింది. అంతట సమస్యలోనే సమాధానము కనబడినది. సమస్యను గురించిన పూర్తిభోగట్టా – అన్ని వివరాలు – తెలియడం అవసరమే. కాని దానికి సమాధానం తెలిసికోవడంకోసం ఆ తెలిసిన వివరాలనుండి మనస్సు విముక్తము కావలసి వుంటుంది.

మనలో చాలమందిమి అనేక విషయాలు నేర్చుకొంటాం. ఎంతో సమాచారాన్ని సేకరిస్తాం, జ్ఞానాన్ని పెంపొందించుకొంటాం. కాని ప్రశాంతంగా వుండడమెట్లో, జీవిత క్లేశముల నన్నిటినుండి విముక్తి పొందడమెట్లో, వివిధ సమస్యలు తనలో వేరుపారకుండా ఎట్లు చేసికొనవచ్చునో మన మనస్సెన్నటికిని నేర్చుకొనదు. ఏవేవో సంఘాలలో చేరతాం, ఏదో యొక వేదాంతాన్ని అంటిపెట్టుకొని వుంటాం, ఏదో యొక నమ్మకానికి దాసులమౌతాం. కాని వీటి వలన ప్రయోజనమేమీ వుండదు; ఇవేవీ మన సమస్యలను పరిష్కరించలేవు సరిగదా, వీటివలన మన దైన్యమింకా వృద్ధి చెందుతుంది. మన దుఃఖమింకా పెరుగుతుంది. దీనికి కావలసింది వేదాంతంగాదు, నమ్మకంకాదు. దీనికి కావలసింది విముక్తమగు మనస్సు. అట్టి మనస్సే లోతుగా తత్త్వవిచారణ చేయగలదు, సత్యమును దర్శింపగలదు. సృజనశీలము కాగలదు.

పరీక్షలలో పాసవడంకోసం బట్టీ పడతాం, ఎంతెంతో సమాచారాన్ని సేకరిస్తాం, అదంతా పరీక్షలలో వ్రాసి డిగ్రీ సంపాదిస్తాం. దానితో ఉద్యోగం దొరుకుతుందని, వివాహం చేసికొందామని ఆశిస్తాం. జీవితమంటే అంతేనా? మీరు జ్ఞానాన్ని సేకరించినారు, సాంకేతిక నైపుణ్యాన్ని సాధించినారు. కాని మీ మనస్సు మాత్రం స్వతంత్రము కాదు, విముక్తము కాదు; అందువలన ప్రస్తుతమున్న యీ సంఘవ్యవస్థకు మీరు బానిసలై పోతారు. అంటే దాని అర్థం మీరు సృజనశీలురైన మానవులు కారన్నమాట! మీరు పిల్లలను కనవచ్చు, కొన్ని వర్ణచిత్రాలు గీయవచ్చు లేదా అప్పుడప్పుడు ఏవో కొన్ని పద్యాలు అల్లవచ్చు. కాని అంతమాత్రంచేత అది సృజనాత్మకత అనిపించుకోదు. సృజనాత్మకత సిద్ధించాలంటే మొట్టమొదట మనస్సుకు స్వతంత్రముండాలి. అప్పుడు, సిద్ధించిన సృజనాత్మకతను వ్యక్తీకరింప జేయడానికి తనకు తెలిసిన విధానమును దేనినైనా ఉపయోగించుకోవచ్చు. కాని మనస్సు సృజనాత్మకము కాకుండా, సత్యదర్శనము వలన సిద్ధించెడి అసాధారణమైన సృజనాత్మకత లేకుండా కేవలమేదో యొక సాంకేతిక కళ తెలిసి యుండడంలో అర్థము లేదు. దురదృష్టవశాత్తు మన మనస్సులు మనం కూడబెట్టుకొన్న జ్ఞానంతో, సంప్రదాయంతో, జ్ఞాపకాలతో, శంకరుడేమి చెప్పినాడో, బుద్ధుడేమి చెప్పినాడో, కార్ల్‌మార్క్స్ ఏమి చెప్పినాడో, ఇంకా ఎవరెవ రేమేమి చెప్పినారో వాటన్నిటితో నిండి బరువెక్కి వుంటాయి. కాబట్టి సృజనాత్మకత అంటే యేమిటో మనలో చాలామందికి తెలియనే తెలియదు. అట్లుగాక, మీ మనస్సు స్వతంత్రమై సత్యమును దర్శింపగల్గి యున్నట్లయితే అప్పుడు అక్షయమై అనవద్యమైన ఆంతరిక సౌందర్యమును మీలో మీరు కనుగొనగలరు. అందులో గొప్ప ఆనందముంటుంది. అప్పుడు మీకు ప్రజలతోను, అభిప్రాయాలతోను, వస్తువులతోను గల సంబంధములలో నూతనమగు అర్థము స్ఫురిస్తుంది.

1. ప్రశ్న:- అల్లరిపిల్లవానిలో మార్పు, ప్రేమద్వారా వస్తుందా లేక దండనము ద్వారా వస్తుందా?

కృష్ణమూర్తి:- మీరేమనుకొంటారు? ప్రశ్నను చాల జాగ్రత్తగా వినండి. బాగా ఆలోచించి చూడండి, మనసా అనుభూతి పొంది చూడండి. అల్లరి పిల్లవానిలో

మార్పు ప్రేమద్వారా వస్తుందా? దండనము ద్వారా వస్తుందా? దండనము ద్వారా, అంటే ఒక విధమైన నిర్బంధము చేయడం ద్వారా, పిల్లవాడు మారినట్లయితే, అది నిజమైన మార్పు అవుతుందా? మీరు వయస్సులో పెద్దవారు కాబట్టి ఉపాధ్యాయునిగానో, తల్లిదండ్రులుగానో మీకు పిల్లవానిమీద అధికారం చలాయించడానికి అవకాశముంటుంది. మీ రతనిని బెదరిస్తే, భయపెట్టితే, పాపమా పిల్లవాడు భయపడిపోయి, మీరేమి చేయమంటే అదెల్లా చేస్తాడు. కాని అది నిజమైన మార్పు అవుతుందా? ఎటువంటి నిర్బంధం ద్వారానైనా సరే మార్పు వస్తుందా? చట్టం చేయడం ద్వారా, ఏ రూపంలోనైనా సరే భయపెట్టడం ద్వారా ఎన్నటికైనా నిజంగా మార్పు రాగలదా?

పోనీ, అల్లరిపిల్లవానిలో మార్పును ప్రేమ తీసికొని వస్తుందా? అని ఈ ప్రశ్నను మీరు వేసినప్పుడు, మీ ఉద్దేశంలో ప్రేమ అనేమాటకు అర్థమేమిటి? ప్రేమించడమంటే అతనిని మార్చడమని కాదు; ప్రేమించడమంటే అతనిని అర్థం చేసికోవడం; అతనిలోని ఆ అల్లరితనానికి, ఆ చిలిపితనానికి గల కారణాలను అవగాహన చేసికోవడం. అట్టి అవగాహనయే పిల్లవానిలోని అల్లరితనాన్ని పోగొట్టుతుంది.

పిల్లవానిని మార్చాలని, అతనిలోని అల్లరితనాన్ని పోగొట్టాలని నేను అనుకుంటే, ఆ నా కోరికయే ఒక విధమైన నిర్బంధము, ఒక విధమైన ఒత్తిడి తేవడం కాదా? అట్లుగాక ఆ పిల్లవా డెందుకని అల్లరి పిల్లవాడైనాడో నేను అర్థం చేసికోసాగితే, అతనిలో ఆ అల్లరితనమెందుకు వచ్చిందో దానికి గల కారణాలను కనుక్కొని వాటిని తొలగించగల్గితే - అప్పుడా పిల్లవాడు అల్లరిపిల్లవాడుగా ఉండబోడు. దానికి కారణాలు - దూషితమైన ఆహారం కావచ్చు, నిద్రలేమి కావచ్చు, అతనియందెవరును వాత్సల్యము చూపకపోవడం కావచ్చు, మరియొక పిల్లవాడతనిని ఏడిపిస్తూ వుండవచ్చు - ఇంకా ఏవేవో యిట్లాంటి కారణాలుండవచ్చు. అయితే కేవల మా పిల్లవానిని మార్చడమే నా ప్రధానోద్దేశమైనట్లయితే - అంటే ఒక నిశ్చితమైన చట్రంలో అతడు ఇమిడి పోవాలనే నేను కోరుకొనేటట్లయితే - అప్పుడు నే నతనిని అర్థంచేసికోను, చేసికోలేను.

మరి చూశారా, ఈ సందర్భంలో మరియొక ప్రశ్న ఎదురవుతున్నది. మార్పు రావడమంటే మన ఉద్దేశమేమిటి? ఒకవేళ మీరా పిల్లవాని యెడల చూపిన ప్రేమచేత - అంటే ఒకవిధంగా అతనిమీద మీరు ఒత్తిడి తేవడంచేత - ఆ పిల్లవాడు అల్లరితనం మానివేసినాడనుకొందాం. కాని అది నిజంగా అతనిలో మార్పు వచ్చినట్లేనా? అది ప్రేమే కావచ్చు; కాని అది కూడ - తనిచేత ఏదైనా పని చేయించడానికిగాని, అతని స్థితిలో మార్పు తేవడానికిగాని తెచ్చిన - ఒకవిధమైన ఒత్తిడి కాదా? పైగా, పిల్లవానిలో మార్పు రావాలని మీరంటే దాని భావమేమిటి? ఏ స్థితినుండి ఏ స్థితిలోనికి మారాలని మీ ఉద్దేశం? ఇప్పుడున్న స్థితిలోనుండి, రేపు ఉండగోరిన స్థితిలోనికా? ఉండగోరిన స్థితిలోనికి మారడమంటే దాని భావం ఇప్పుడున్న స్థితికి కొంత మెరుగు పెట్టడమే కాదా? ఇప్పుడున్న స్థితిలోనే కించిత్ పరివర్తనము తీసికొని వచ్చినట్లు కాదా? అందువలన అది నిజమైన పరివర్తనమెట్లా అవుతుంది?

దానినే మరియొక విధంగా చెప్పాదాం – నేను సహజంగా లోభినై, మీరందరు – సమాజము, ధార్మిక గ్రంథములును – లోభగుణం మంచిది కాదని, ఆ గుణాన్ని వదిలిపెట్టమని చెప్పడంచేత, నేను అలోభిని – అంటే ఉదారుడను – అయినట్లయితే నేను నిజంగా మారినట్లేనా? లేక నాకున్న లోభగుణాన్నే మరియొక పేరుతో పిలుస్తున్నానా? అట్లుగాక నాకున్న లోభగుణమనే సమస్యను గురించి లోతుగా విచారణ చేసి దానిని పూర్తిగా అవగాహన చేసికొంటే, ఆ లోభగుణమునుండి నేను సహజంగా విముక్తుడ నౌతాను. ఈ స్థితికివి అలోభినిగా – అంటే ఉదారునిగా – మారిన స్థితికిని సంబంధమే లేదు; రెండును పూర్తిగా వేర్వేరు స్థితులు.

## 2. ప్రశ్న:- మేము తెలివిగలవారము ఎట్లు కాగలము?

**కృష్ణమూర్తి:-** ఎప్పుడైతే మీరు తెలివిగలవారు కావడానికై ప్రయత్నిస్తారో ఆ క్షణమునందే మీరు తెలివిలేనివా రవుతున్నారు. ఇది నిజంగా చాల ముఖ్యమైన విషయం. అందువలన దీనిమీదికి కొంచెం మనస్సును పోనిచ్చి చూడండి. నేను మందమతినై, ప్రతివాడును నాతో, "నీవు తెలివిగలవాడవు కావాలి" అని చెప్పి ప్రోత్సహిస్తూ వుంటే, సాధారణంగా జరిగే దేమిటి? తెలివిగలవాణ్ణి కావడంకోసం తంటాలుపడడం ప్రారంభిస్తాను. ఇంకా ఎక్కువగా చదువ సాగుతాను. మంచి మార్కులు తెప్పించుకోవడంకోసం ప్రయత్నిస్తాను. అప్పుడు అందరూ "నీవు చాల కష్టపడి చదువుతున్నా" వని నా వీపుతట్టి నన్ను మెచ్చుకొంటారు. కాని నా తెలివి తక్కువతనంలో మార్పు రాదు. తెలివిగల వానికుండే పై పై మెరుగులు కొన్ని మాత్రం సంపాదించుకొంటాను. కాబట్టి యిప్పుడు సమస్య యేమంటే, తెలివిగల వాడను అవడం ఎట్లా అని కాదు ప్రశ్న, తెలివితక్కువతనం ఎట్లా పోతుంది అనేది ప్రశ్న. నేను తెలివితక్కువ వాడనైయుండి, తెలివిగల వాడను కావాలని ప్రయత్నించడంలో నా తెలివితక్కువతనమే బయటపడుతున్నది!

చూడండి, ఇందులో ప్రధాన సమస్య మార్పు రావడం గురించి. తెలివి అంటే యేమిటి? ఎవడైనా తలివి గలవాడెట్లు కాగలడు? అని మీరడిగినారంటే దాని భావం తెలివి అంటే యేమిటో దాని గురించి మీకొక అభిప్రాయమున్నదని, దాని కనుగుణంగా మారితే తెలివిగల వారవుతారని. కాబట్టి అందుకోసం మీరు ప్రయత్నిస్తారు. కాని తెలివిగల వారవడం కోసం ఒక సూత్రాన్ని కనిపెట్టి, ఒక వాదమునో, సిద్ధాంతమునో ఆశ్రయించి, ఒక కల్పన చేసికొని దాని కనుగుణంగా మిమ్ము మీరు పోత పోసికోవడం, మిమ్ము మీరు మార్చుకోవడం వట్టి తెలివి తక్కువ పని కాదా? అట్లుగాక మందమతియైన వాడు తన మందమతి తనాన్ని మరియొక రూపంలోకి మార్చుకోడానికై ప్రయత్నించే బదులు, "నేను మందమతిని, జడుడను, మూఢుడను, ఎంత ఘోరము!" అని తన్నుతాను నిందించుకొంటూ వుండేబదులు అసలు మందమతి అంటే యేమిటో లోతుగా విచారణ చేసి తెలిసికోసాగితే ఆ చిక్కు సమస్యను విడదీయడం మొదలిడసాగితే, అతనిలో అప్రయత్నంగా ఆ మందమతితనం తొలగిపోయి నిజమైన తెలివి వికసింపసాగుతుంది.

3. ప్రశ్న:- నేను మహమ్మదీయుడను. మా మత సంప్రదాయాలను నేను ప్రతిదినము పాటించకపోతే మా తల్లిదండ్రులు నన్ను మాయింట్లోనుండి బయటికి వెళ్ళగొడతామని బెదిరిస్తున్నారు. అందుకు నేనేమి చేయాలి?

కృష్ణమూర్తి:- మహమ్మదీయులు కాని మీరందరు, బహుశా, ఇల్లు వదిలిపెట్టి వచ్చివేయమని యితనికి సలహా యిస్తారనుకొంటూ. ఏమి, యివ్వరా? కాని మీరందరు ఏయే సంప్రదాయాలకు చెందివున్నా, హిందువులు, పార్సీలు, కమ్యూనిష్టులు, క్రైస్తవులు – ఇంకా ఇటువంటి పేర్లు మీరేవేవి తగిలించుకొన్నా మీకందరికి జరగబోయేది అదే! మీ అందరికి ఆ సలహా వర్తించేదే! కాబట్టి అధికులమని మీరేమీ గర్వపడనక్కరలేదు. గుఱ్ఱంమీద ఉన్నతాకాశంలో స్వారీ చేయనక్కర లేదు.

అదట్లా వుంచండి. మరి మీరు ఏదేని ఒక మతంలో పుట్టిపెరిగి, మీ తండ్రి మీతో, "ఈ మన మతాచారాలను పాటించండి, లేకపోతే ఇల్లు వదిలి వెళ్ళిపోండి" అని మీతో అంటే, ఆ మతాచారాలన్నీ పాతకాలపు మూఢ విశ్వాసాలని మీకు దృఢంగా తెలిసివుంటే, అప్పుడు మీరేమి చేస్తారు? ఆ విషయం మీరా పాత నమ్మకాలను ఎంత దృఢంగా పాటించదలచుకోలేదో దానిమీద ఆధారపడి వుంటుంది – నిజంకాదా? "నేనీ విషయం బాగా ఆలోచించాను; మహమ్మదీయుణ్ణని, హిందువునని, బౌద్ధుణ్ణి అని, క్రైస్తవుణ్ణి అని – ఇంకా ఇటువంటి పేర్లతో దేనితోనైనా పిలిపించుకోవడం అర్థంలేని పని. ఇందుకోసం ఇంటిని వదిలిపెట్టవలసి వస్తే వదిలిపెడతాను. జీవితంలో ఏమి ఎదురైనా – అతి దైన్యస్థితిగాని, ఆఖరికి మృత్యువుగాని ఏది వచ్చినా – సంతోషంగా ఎదుర్కొనడానికి సిద్ధమే. ఇదే సరియైన మార్గమని నేను గట్టిగా నమ్ముతున్నాను. ఈ విషయంమీద నేను గట్టిగా నిలబడతాను" అని మీరు చెప్పగలరా? మీరు చెప్పలేకపోతే, మీ సంప్రదాయము, మీ సమష్టి సమాజము మిమ్ము అవలీలగా మ్రింగివేస్తాయి.

కాబట్టి మీరేమి చేయబోతున్నారు? ఇటువంటి దృఢవిశ్వాసాన్ని విద్య మీలో కల్గించలేకపోతే విద్య యొక్క ప్రయోజన మేమిటి? కేవలమేదో యొక ఉద్యోగం సంపాదించుకోవడంకోసం, వినాశకరమని స్పష్టంగా తెలిసిన యీ క్రుళ్ళు సమాజంలో ఒకరుగా ఇమిడిపోవడంకోసమున్ను మిమ్ము తయారుచేయడమా విద్యయొక్క పరమ ప్రయోజనము? ఎవరో కొద్దిమంది మాత్రమే ఈ సమాజపు ఉచ్చులను తెగత్రెంచుకొని బయటపడగలవారని, "నాలో అంతసామర్థ్యములే"దని చెప్పవద్దు. దాని మీద మనస్సు నిలపాలేగాని, ఎవరైనా త్రెంచుకొని బయటపడగలరు. సంప్రదాయముయొక్క ఒత్తిడిని అర్థం చేసికోవడానికిగాని, దాని నెదిరించి నిలబడడానికిగాని, మీకు కావలసింది శరీరసామర్థ్యం కాదు; మనోధైర్యము, దృఢవిశ్వాసము. మీయంతట మీరు స్వయంగా ఆలోచించుకోవడం మీకు తెలిస్తే దానితో ప్రచండమైన మనోధైర్యము వస్తుంది. కాని చూశారా, మీరు చదువుకొనే చదువు ఎట్లా ఆలోచించుకోవలెనో బోధించదు; ఏమి ఆలోచించుకోవలెనో తెల్పుతుంది. మీరు మహమ్మదీయులని, హిందువులని, క్రైస్తవులని, ఇదని, అదని మీకు బోధిస్తారు. కాని నిజమైన విద్యయొక్క కర్తవ్యమేమనగా – మీయంతట మీరు స్వయంగా ఆలోచించుకో గల్గడంలో సహాయపడడం. అట్లా

మీయంతట మీరు స్వతంత్రంగా ఆలోచించుకోసాగితే దానితో మీకెంతో విశ్వాసం వస్తుంది. మీకెంతో మనోధైర్యం వస్తుంది. అప్పుడే మీరు సృజనశీలురైన మానవులుగా జీవింపగల్గుతారు, బానిసలవంటి యంత్రములుగా కాదు.

**4. ప్రశ్న:- అవధానములో దేనినీ నిరోధించడం పనికిరాదని మీరంటారు. అది యెట్లా సాధ్యమవుతుంది?**

**కృష్ణమూర్తి:-** ఎటువంటి నిరోధమున్నా అది అనవధానతయే అవుతుంది, విక్షేపమవుతుంది (distraction) అని నేను చెప్పినమాట నిజమే. కాని నేను చెప్పితినని మీరు అంగీకరించకూడదు. మీరును ఆలోచించండి. చెప్పిన వారెవరైనా సరే, ఎటువంటి వారైనాసరే, దేనినికూడ యథాతథంగా అంగీకరించకూడదు. ఆ చెప్పిన విషయాన్ని మీలో మీరు బాగా విమర్శచేసి చూచుకోండి. అదేమీ లేకుండా, చెప్పినదెల్ల యథాతథంగా అంగీకరిస్తే మీరు యంత్రములవలె చైతన్యరహితులు, జడులు, మృతప్రాయులు అవుతారు. అట్లుగాక మీరు ప్రతిదానిని విమర్శించి చూచుకొంటూ వుంటే, మీకు మీరు స్వయంగా ఆలోచించుకొంటూవుంటే అప్పుడు మీరు సజీవులు, చైతన్యపూర్ణులు సృజనశీలురైన మానవులవుతారు.

అది సరేగాని, మరి మీరిక్కడ చెప్పుతూవున్న విషయంమీద మనస్సు లగ్నం చేస్తూనే, అదే సమయంలో గదిలో కెవరు వస్తున్నారో, వారెవరో చూడడంకోసం తలత్రిప్పకుండా, పైగా తలత్రిప్పి చూద్దామనే కోరికను నిరోధించకుండా గూడ – అంటే, ఎక్కడను ఎట్టి నిరోధమున్ను లేకుండ, – గమనింపగలరా? చూడడం కోసం తలప్రక్కకు తిరుగుతున్నప్పుడు మీరడ్డు పెట్టినట్లయితే – నిరోధించినట్లయితే, మీ అవధానం – అంటే ధ్యానము – భగ్నమవుతుంది. మీ మానసిక శక్తిని ఆ నిరోధ క్రియలో వ్యర్థము చేస్తున్నారు. కాబట్టి ఎట్టి విక్షేపము (distraction) లేని, అందువలన ఎట్టి నిరోధక్రియయు అవసరములేని పరిపూర్ణమగు అవధానత సాధ్యమేనా? అనగా దేనిమీదనైనా మీరు సంపూర్ణముగా మనస్సును లగ్నము చేస్తూ, అదే సమయంలో మీ చేతనయొక్క పైభాగము మీ చుట్టూరా మరియు మీ అంతస్సులోను ఏమేమి జరుగుతున్నదో గమనిస్తూ వుండగలదా?

చూశారా, మనస్సనేది ఒక అద్భుతమైన యంత్రము; అది నిర్విరామంగా ప్రతిదానిని గ్రహిస్తూ వుంటుంది. వివిధములైన రంగులను, రూపములను చూస్తూ వుంటుంది. తనమీద పడే అసంఖ్యాక సంస్కారములను గ్రహిస్తూ వుంటుంది. మాటలు అర్థమును, కంటిచూపులోని భావములను ఇంకా ఇట్టివాని నన్నింటిని వెంటవెంటనే పట్టివేస్తూ వుంటుంది. మరి మన సమస్య యేమంటే, మన అంతశ్చేతనలో ముద్రింపబడియున్న సంస్కారములను, అందలి ప్రతిస్పందనలను వాటితోబాటు మన చుట్టును జరుగుతున్న ప్రతి విషయమును మన మనస్సు తత్కాలముననే గ్రహింపగల్గి వుండాలి; అదే సమయమున మరిదేనిమీదనైనా మనము మన మనస్సును నిల్పగలిగి వుండాలి.

వాస్తవానికి నేనిప్పుడు చెబుతూవున్న యీ విషయంలో ధ్యానప్రక్రియ ఇమిడి వున్నది. అందులోనికి మనమిప్పుడు పోవడంలేదు. కాని ధ్యానమెట్లు చేయవలెనో

తెలియనివాడు పరిపక్వముగాని మనస్సుగల మానవప్రాణి. జీవితంలోని అత్యంత ప్రధానమైన విషయాలలో ధ్యానమొకటి. డిగ్రీ సంపాదించుకోవడం కోసం పరీక్షలు పాసవడంకంటె గూడ ఇది ప్రధానమైనది. ఉత్తమమైన ధ్యానమేదో అర్థం చేసికొనవడమంటే దానివి అభ్యాసం చేయడంకాదు. ఆధ్యాత్మిక విషయాలలో అభ్యాసం చేయడమనేది – అది దేని గురించి అయినా సరే – మహా భయంకరమైన విషయము. సరియైన ధ్యానమేదో అర్థం చేసికోవాలంటే మన చేతన (consciousness) పనిచేసే తీరును మనం మన అంతర్దృష్టితో గమనిస్తూ వుండాలి. అప్పుడే సంపూర్ణమగు అవధానము సిద్ధిస్తుంది. కాని ఏ విధమగు నిరోధము (resistance) ఉన్నప్పటికిన్ని సంపూర్ణమగు అవధానము సిద్ధించదు. కాని చూశారా, మనలో చాలమందిమి నిరోధముతో గూడిన అవధానములో శిక్షణ పొందినాము. అందువలన మన అవధానము పాక్షికము; సంపూర్ణము ఎన్నటికిని కాదు. అందువల్లనే మనకు అధ్యయనము విసుగు పుట్టిస్తుంది, అలసట కలిగిస్తుంది, భయపెట్టుతుంది. కాబట్టి ఆ మాటయొక్క అస లర్థంలో మనము అవధానమును కలిగివుండడం చాలా అవసరము. అంటే మనం మన మనస్సు ఎట్లా పనిచేస్తున్నదో మెలకువతో గమనిస్తూ వుండాలి. ఆత్మజ్ఞానము – అంటే స్వస్వరూప దర్శనము – లేనిదే సంపూర్ణమైన అవధానము సాధ్యము కాదు. అందువల్లనే ఆదర్శప్రాయమైన బడిలో విద్యార్థికి వివిధ పాఠ్య విషయాలను బోధించడంతోబాటు అతడు తన ఆలోచనావిధాన మెట్లు సాగుతున్నదో తనకుతాను గమనించడంలోను సహాయపడాలి. అట్లా, తన్నుతాను అర్థం చేసికొనడంలో అతనికి నిర్నిరోధమైన అవధానమననేమో తెలుస్తుంది. అట్లా తన్నుతాను అర్థం చేసికొనడమే ధ్యానము.

5. ప్రశ్న:- ప్రశ్నలు వేయడమంటే మాకెందుకంత ఆసక్తి?

కృష్ణమూర్తి:- ఇది చాలా సులభం. తెలిసికోవాలని ప్రతివానికి కుతూహల ముంటుంది. క్రికెట్టు ఎట్లా ఆడాలో, కాల్బంతి (football) ఎట్లా ఆడాలో, గాలిపటాన్ని ఎట్లా ఎగరవెయ్యాలో మీరుమాత్రం తెలిసికొనగోరరా? ప్రశ్నలు వేయడం మానివేసిన క్షణము మీరు మృతప్రాయులు. మామూలుగా వృద్ధుల విషయంలో జరిగినదదే. వాండ్ల మనస్సులు సంపాదించుకొన్న జ్ఞానముతో ఇతరులు చెప్పిన విషయాలతో బరువెక్కిపోయి ఇక ప్రశ్నించడం మానుకొన్నారు. వారిలో ప్రశ్నించి తెలిసికోవాలనే కోరికయే పోయినది. సంప్రదాయాన్ని అంగీకరించి దానిలో కూరుకపోయినారు. మీరు ప్రశ్నిస్తూ వున్నంతకాలం దానిని ఛేదించుకొని ముందుకుపోతూ వుంటారు. కాని ప్రతిదానికి తలూపి అంగీకారం తెల్పడం ప్రారంభించిన క్షణంనుండి మీరు మానసికంగా మృతప్రాయులు. కాబట్టి జీవితమంతా దేనినీ గ్రుడ్డిగా నమ్మవద్దు; అనాలోచితంగా ప్రతిదానికిని తలూపి సమ్మతి తెల్పవద్దు. ప్రతిదానిని ప్రశ్నించండి. విమర్శ చేసి చూడండి. అప్పుడు మీ మనస్సు నిజంగా ఎంత అద్భుతమైనదో తెలిసికొంటారు. దానికి అంతము లేదు. అటువంటి మన మనస్సుకు జరామృత్యువు లుండవు.

*25 జనవరి, 1955*

# 20. సత్యము - సౌందర్యము

పచ్చని చేను, అందులో పసుపు పచ్చని పూలతో కళకళలాడు ఆవ పైరు. దానిగుండా గలగల పారెడి నీటి వంక – ఎంత అద్భుతమైన దృశ్యము! కాదంటారా? నేనా దృశ్యాన్ని నిన్న సాయంత్రం చూస్తూ వుంటిని. పల్లె పట్టులందు కనబడే అటువంటి అద్భుత సౌందర్యాన్ని, అందలి ప్రశాంతతను చూచినప్పుడు అసలు సౌందర్యమంటే యేమిటి అనే ప్రశ్న మన మనస్సులో తప్పక మెదులుతుంది. ఏదైనా అందమైన దానిని చూచినా అందవికారమైన దానిని చూచినా మనలో వెంటనే దానికి ప్రతిస్పందన కలుగుతుంది. ఆ ప్రతిస్పందన ప్రీతిజనకమైనా కావచ్చు, అప్రీతిజనకమైనా కావచ్చు. ఆ యనుభూతిని మనము మాటలలో వ్యక్త పరుస్తాం – "ఇది అందంగా వున్న" దని లేదా "ఇది అందవికారంగా వున్న"దని. ఇక్కడ ప్రధాన విషయం ప్రీతిగాని అప్రీతిగాని కాదు. ప్రతి దానితోను మనకు సంపర్కముండడం, అందమైన దానికి, అందముకాని దానికి రెండింటికిని సమానంగా ప్రతిస్పందించడమనేది ప్రధాన విషయం.

మరి, అందమంటే యేమిటి? ఇది అత్యంత ప్రధానమై మౌలికమైన ప్రశ్నలలో నొకటి. ఇది సార రహితమైన మామూలు ప్రశ్న కాదు. ఇది చాల లోతైన ప్రశ్న, నిర్లక్ష్యము చేయరాని ప్రశ్న. అందమంటే యేమిటో అర్థం చేసికోవడం, ఏదైనా ఒక అందమైన వస్తువుతో మన మనోహృదయములకు ఎట్టి ఆటంకంగాని ఒత్తిడిగాని లేకుండా సంసర్గము కలిగి దానివలన మన మనస్సునకు హాయి అనిపించి, "ఇది యెంత మంచిది!" అనే భావము మనలో కలగడం – ఇదీ ప్రధానం. దీనికి జీవితంలో ఎంతో విలువ తప్పక వుంటుంది. ఈ సౌందర్యానుభూతి లేనిచో మన జీవితములు సారహీనములు. మన చుట్టును అందమైన పర్వతాలు, నదులు, పొలాలున్ను వుండవచ్చుగాక, ఎంతో సౌందర్యము మధ్యనే మనము జీవించుచుండ వచ్చుగాక. కాని ఆ సౌందర్యాని కంతకును మనము ప్రతిస్పందించనిచో, మనలో ఆ సౌందర్యానుభూతి లేనిచో, మన జీవితము నిష్ప్రయోజనము.

మీరందరు, అంటే బాలబాలికలేకాదు పెద్దలు కూడ మీలో మీరీ ప్రశ్నను వేసికోండి – అందమంటే యేమిటి? అని. పరిశుభ్రంగా వుండడం, నీటుగా దుస్తులు ధరించడం, పెదవిపై చిరునవ్వు, సవిలాసమైన హావభావములు, నడకలో లయ, జెడలో పూలు, మంచినడత, మాటలలో స్పష్టత, దూరాలోచన, సమయపాలన, ఇతరుల కష్టసుఖాల గురించి పట్టించుకోవడం – ఇవన్నీ సౌందర్యం లోని భాగాలే. కాని ఇదంతా పైకి కనిపించే అందం, అవునా కాదా? సౌందర్యమంటే ఇంతేనా? లేక ఇంకా ఏమైనా, లోతైన అర్థంలో సౌందర్యమున్నదా?

ఆకారంలో అందముంటుంది. ఆకార రచనలో అందముంటుంది. జీవితంలో అందముంటుంది. ఆకులతో రెమ్మలతో దట్టముగా కప్పబడి, కన్నుల విందొనరించెడి వృక్షము యొక్క సుందరాకారమునుగాని, ఆకాశములో తలయెత్తి నగ్నముగా నిలబడియున్న వృక్షము యొక్క అద్భుత లాలిత్యమునుగాని మీరెన్నడైనా గమనించి చూచినారా? ఇటువంటివన్నీ పైకి చూడడానికి ఎంతో అందమైనవి. కాని ఇవన్నీ నిగూఢమైన ఆంతరిక సౌందర్యమునకు బాహ్య చిహ్నములు మాత్రమే! కాబట్టి యింతకును సౌందర్యమని పిలువబడేది ఏది? దేనిని సౌందర్యమని అంటాము?

మీ ముఖము అందముగా వుండవచ్చుగాక, మీ ముఖ లక్షణాలు నిర్దోషములై వుండవచ్చుగాక, మీ రందమైన దుస్తులు వేసికొని వుండవచ్చుగాక, మీ ప్రవర్తన ఎంతో సభ్యతాపూర్ణమై వుండవచ్చుగాక, నయన గోచరమగు ప్రకృతి దృశ్యమునంతను సుందరవర్ణములతో మీరు చిత్రీకరింప గలిగి వుండవచ్చుగాక లేదా ఆ ప్రకృతి దృశ్యమును అందమైన భాషలో వర్ణింపగలిగి యుండవచ్చుగాక! కాని ఆంతరిక సౌందర్యానుభూతి లేకుండా యీ బాహ్య సౌందర్య సాధనాలన్నీ సారహీనమై సహజత్వమును కోల్పోయి కేవలం దాంభిక జీవితమునకు దారితీయునవే, నిరర్థకమైనవే.

కాబట్టి వాస్తవంగా సౌందర్యమన నేమో మనం తప్పక తెలిసికోవలసియున్నది, ఏమంటారు మీరు? తెలిసికోనక్కరలేదా? అయితే సౌందర్యము యొక్క బాహ్య లక్షణాలను నిర్లక్ష్యము చేయవలెనని నేను చెప్పడంలేదు. అది మాత్రం గుర్తుంచుకోండి. మన ప్రవర్తన చాల ఉత్తమంగానే వుండాలి, మంచీ మర్యాదా తెలిసివుండాలి, శారీరక శుభ్రతను పాటించాలి. ఆడంబరంగా కాకుండా అందమైన దుస్తులే వేసికోవాలి. ఎప్పటి పను లప్పుడు చేస్తూవుండాలి. చేసేదేదో సక్రమంగా చెయ్యాలి, చెప్పేదేదో స్పష్టంగా చెప్పాలి. ఇంకా ఇటువంటివన్నీ వుండవలసిందే, ఇవన్నీ ఆవశ్యకమే. ఇవి ఒక మంచి వాతావరణాన్ని సృష్టిస్తాయి. కాని కేవలం వాటికవే ప్రధానం కాదు.

బాహ్యరూపమునకు, బాహ్య చేష్టలకు అందాన్ని అత్యంత సౌమ్యతను కలిగించేది ఆంతరిక సౌందర్యము. ఏది లేకపోతే జీవితము క్షుద్రము రసహీనము అవుతుందో ఆ ఆంతరిక సౌందర్యమునకు అర్థమేమిటి? ఆంతరిక సౌందర్యమనగానేమి? దీని గురించి మీ రెన్నడైనా ఆలోచించారా? బహుశా ఆలోచించి వుండరు. ఇందుకు మీకు తీరిక వుండదు. మీ చదువులతో వ్రాతలతో, మీ ఆటలతో మాటలతో, మీ నవ్వడాలతో, ఒకరినొకరు ఏడ్పించుకోవడాలతో మీ మనస్సులు నిండిపోయి వుంటాయి. కాని యేది లేకపోతే బాహ్యరూపానికిని, బాహ్యచేష్టలకును అర్థముండదో ఆ యాంతరిక సౌందర్యమును దర్శించడంలో తోడ్పడడమే ఉత్తమ విద్య యొక్క ప్రధాన లక్షణము. అట్టి గాఢమైన ఆంతరిక సౌందర్యానుభూతి మీ వ్యక్తిగత జీవితంలో ఒక అత్యావశ్యకమైన భాగము.

అయితే, క్షుద్రమగు మనస్సు సౌందర్యానుభూతిని పొందగలదా? సౌందర్యమును గూర్చి అది మాట్లాడగలదు. కాని నిజంగా అందమైన వస్తువును దేనినైనా చూచినప్పుడు పెల్లుబికి వచ్చెడి ఆనంద రసవాహినిలో అది మునిగి తేలగలదా? మనస్సు కేవలము తన విషయం తాను చూచుకొంటూ, తన ఆలోచనలలో తాను లీనమైపోతే అది సుందరమైన మనస్సు కాదు. అట్టి మనస్సేమి చేసినా,

అది అసుందరమైనదే, పరిమితమైనదే. కాబట్టి సౌందర్యమంటే యేమిటో అది తెలిసికొనజాలదు. అట్లుగాక తన విషయం తాను చూచుకోనిది, ఆశలు, ఆకాంక్షల నుండి విముక్తమైనది, తన కోరికలనే వల(త్రాళ్ళలో తాను చిక్కుకొననిది, ఫలాపేక్ష చేత (పేరేపింపబడనిది అయిన మనస్సు మాత్రమే క్షుద్రము కానిది. అట్టి మనస్సు మంచితనమున వికసిస్తుంది. (పేమరసపూర్ణమవుతుంది. ఏమి, అర్థమవుతున్నదా? ఇట్టి ఆంతరిక సౌందర్యము మాత్రమే అందముగా లేని ముఖానికి గూడ అందము నీయగలది. ఆంతరిక సౌందర్యమున్నప్పుడు అంటే (పేమరసముతో నిండియున్నప్పుడు – అందవికారముగా నున్న ముఖము రూపాంతరము పొందుతుంది. ఏలయన, ఆంతరిక సౌందర్యము నిజానికి చాల గాఢమైన ధార్మిక భావన.

నిజమైన ధార్మికత యనగా నేమో మీకు తెలుసునా? దానికి గుడిగంటలతో పనిలేదు – అవి దూరాన్నుండి ఇంపుగా వినబడితే వినబడుగాక – పూజలతో పనిలేదు, మతగురువులు చేసెడి కర్మకాండతో గాని ఇంకా అటువంటి యితర మత విధులతో గాని పనిలేదు. అవన్నీ అర్థములేని పిచ్చిపనులు. ధార్మికత యనగా వాస్తవికతకు స్పందించడం. మీ సమగ్ర వ్యక్తిత్వము – అంటే మీ శరీరము, మనస్సు, హృదయమున్ను – సౌందర్యమునకును అసౌందర్యమునకును, ఆఖరికి గుంజకు కట్టబడిన గాడిదకును, ఈ పట్టణములోని దారిద్ర్యమునకును, మాలిన్యమునకును, నవ్వుకును, కన్నీటిబిందువులకును, మీ చుట్టునున్న ప్రతిదానికిని స్పందిస్తుంది. సమస్త సృష్టి యెడలగల యీ స్పందనలోనుండి మీలో మంచితనము (పేమ వికసిస్తుంది: మీకు పుట్టుకతో వచ్చిన శక్తి సామర్థ్యము లెన్నియున్నను, ఎంతమంచి బట్టలు వేసికొన్నను, ఖరీదైన మోటారు కార్లలో ప్రయాణము చేసినను, మిక్కిలి జాగ్రత్తగా అన్ని విధాల శుభ్రతను పాటించినను ఈ స్పందన లేనిదే మీలో సౌందర్యము లేదు.

(పేమ అనేది చాలా అద్భుతమైనది, కాదా? మీ గురించి మీరు ఆలోచించుకొంటూ వుంటే మీరు (పేమించలేరు. అంటే దాని అర్థం మీరు మరియొకరి గురించి ఆలోచిస్తూ వుండాలని కాదు. మనిషి (పేమ అనేది కేవలముంటుంది, అది యొక స్థితి. అంతేగాని ఇందులో ఎవరినో (పేమించడమనే ప్రశ్నేలేదు. (పేమ గల మనస్సే నిజమైన ధార్మిక మనస్సు. ఎందువల్లనంటే, అట్టి మనస్సు గతిశీలమగు సత్యముతో పరమార్థముతో లేదా దేవునితో పయనిస్తూ వుంటుంది. [సత్యము స్థితిశీలము కాదు, అది గతిశీలము.] అట్టి మనస్సే సౌందర్యమును దర్శింపగలదు. ఏ శాస్త్ర వాదములోను తగులుకొననిది, ఏదో యొక క్రియావిధానంలోగాని విశ్వాసంలోగాని కూరికొని పోనిది, అశాపాశము చేత (పేరేపింపబడనిది అయిన మనస్సే సంవేదన శీలమై, అప్రమత్తమై నిత్య జాగరూకమై వుంటుంది. అట్టి మనస్సే సౌందర్యము కలది.

మీరు చిన్న పిల్లలుగా వున్నప్పుడే నీటుగా శుభ్రంగా వుండడం, కదలకుండ ప్రశాంతంగా కూర్చోవడం, భోజనాల దగ్గర పాటించవలసిన మర్యాదలన్నీ పాటించడం, ఇతరుల యిబ్బందులను గమనించి మసలుకోవడం, ఎపు డేపని చేయవలెనో అప్పుడా పని చేస్తూ వుండడం – ఇవన్నీ తప్పక నేర్చుకోవాలి. కాని యివన్నీ యెంతో అవసరమైన వయినప్పటికిన్ని బాహ్యావిషయాలే, పైపైవిషయాలే. లోతుగా నిగూఢమై

యున్న విషయాన్ని అర్థం చేసికోకుండా కేవలం యీ పై పై విషయాలను మాత్రమే అభ్యాసం చేస్తూ వుంటే, సౌందర్యము యొక్క వాస్తవిక మహత్త్వాన్ని మీరు బొత్తిగా తెలిసికొనలేరు. ఒక జాతికి గాని, వర్గానికి గాని, సంఘానికి గాని చెందనిదై, ఎట్టి అధికారమునకు లొంగనిదై, ఆశాపాశముచే ప్రేరేపింపబడనిదై మఱియు భయపీడితము కానట్టి మనస్సు నిత్యము ప్రేమలో, మంచితనములో వికసిస్తూ వుంటుంది. అట్టి మనస్సు వాస్తవికతతోబాటు కదులుతూ వుండడంచేత దానికి సౌందర్యమంటే యేమిటో తెలుస్తుంది. అది సౌందర్యమునకును అసౌందర్యమునకును రెండింటికిని స్పందించుచుండడంచేత ఆ మనస్సు సృజనాత్మకమయినది. దానికున్న అవగాహన అంతము లేనిది.

**1. ప్రశ్న:- బాల్యంలో నాకేదైనా పెద్ద కోరిక వున్నట్లయితే దానిని పెద్దైన తరువాత తీర్చుకోగలనా?**

**కృష్ణమూర్తి:-** చిన్నపిల్లల కోరికలు సాధారణంగా చాలాకాలంపాటు అట్లే నిలిచివుండవు, కాదా? పసిపిల్లవాడు ఇంజను డ్రైవరు కావాలని కోరుకుంటాడు లేదా జెట్ విమానం ఆకాశంలో దూసికొని పోవడం చూచి, దానిని నడిపే పైలట్ (విమాన చోదకుడు) కావాలని కోరుకొంటాడు. లేదా ఒక రాజకీయ నాయకుడు బాగా ఉపన్యసించడం చూచి అతని మాదిరి కావాలని కోరుకొంటాడు. లేదా సన్యాసిని చూచి తానూ సన్న్యాసిని కావాలని కోరుకొంటాడు. పెండ్లై చాలామంది పిల్లలను కనాలని బాలిక కోరుకొంటుంది. లేదా ధనవంతుని భార్యను కావాలని, పెద్ద భవనంలో నివసించాలని కోరుకొంటుంది. అదీ గాకపోతే, మంచి వర్ణచిత్రాలు గీద్దామనిగాని, కవిత్వం చెపుదామనిగాని కోరుకొంటుంది.

అయితే బాల్యంలో కన్న స్వప్నాలన్నీ ఫలిస్తాయా? అసలు స్వప్నాలు ఫలించడం మంచిదేనా? ఏదైనా కోరిక – అది యెటువంటి కోరికైనా సరే – నెరవేరాలని కోరుకొంటే, అది చివరికి దుఃఖానికే దారి తీస్తుంది. ఈ విషయం మీకింకా తెలిసియుండక పోవచ్చు, పెద్దైతే తెలిసికొంటారు. కోరికను వెన్నంటి – దాని నీడవలె – ఎల్లప్పుడు దుఃఖముంటుంది. గొప్ప ధనవంతుణ్ణి కావాలని గాని, గొప్ప పేరు ప్రఖ్యాతులు సంపాదించాలని గాని నేను కోరుకొంటే, అందుకోసం నేనెంతో శ్రమపడతాను. ఆ నా ప్రయత్నంలో ఇతరులను ప్రక్కకు త్రోసివేస్తాను. ఎందరితోనో విరోధం పెట్టుకొంటాను. తుట్టతుదకు నే ననుకొన్నదానిని సాధింపగల్గినా ముందో వెనుకో ఏదో యొక కష్టం రాక తప్పదు. నేను జబ్బు పడవచ్చు లేదా ఒక కోరికను తీర్చుకొనగానే అంతకంటే పెద్ద కోరిక పుట్టవచ్చు. ఇక మృత్యువన్ననో ఎక్కడో ఏ మారుమూలనో ఎల్లప్పుడు మనకోసం పొంచుకొనే వుంటుంది. ఆశలు, ఆకాంక్షలు, వాటి సాఫల్యాలు ఇవి తప్పకుండా నైరాశ్యానికి దుఃఖానికి దారితీస్తాయి. ఈ ప్రక్రియను ఈ క్రమ, పరిణామాన్ని మీకు మీరే గమనించి చూచుకోవచ్చు. మీ చుట్టూవున్న పెద్ద వాండ్లను, ప్రసిద్ధులైనవారిని, దేశంలో చాల గొప్పవారుగా గణన కెక్కిన వారిని, పేరు సంపాదించుకొన్నవారిని, అధికారం గలవారిని గూర్చి బాగా అధ్యయనం చేయండి. వారి మొగాలను పరికించి చూడండి – ఎంత విచారంగా

వుంటారో లేదా ఎంతగా లావెక్కి డాబుగా కనబడుతారో! వాండ్ల ముఖాలమీద అందవికారమైన రేఖలు కనిపిస్తాయి. వారి హృదయాలు దుఃఖంతో బరువెక్కి వుంటాయి. అట్టివారిలో మంచితనము, ప్రేమ వికసించవు.

పేరాశలు పెట్టుకోకుండా మీయొక్క సహజ స్థితిలో ఈ ప్రపంచంలో జీవించడం సాధ్యం కాదా? మీరున్న స్థితిని మార్చుకోవడానికై ప్రయత్నించే బదులు, దానిని అర్థం చేసికోడానికై మొదలిడితే, అప్పుడు మీరున్న ఆ స్థితిలో సహజంగా మార్పు వస్తుంది. ఈ ప్రపంచంలో అజ్ఞాత వ్యక్తిగా ఎవరికిని తెలియబడకుండా పేరు ప్రఖ్యాతులు లేకుండా, పెద్ద పెద్ద ఆశలు పెట్టుకోకుండా, ఇతరుల యెడ కఠోరంగా వుండకుండా జీవించడం సాధ్యమేనని నే ననుకొంటాను. 'అహం'కు అంటే 'నే' ననే భావనకు ప్రాముఖ్య మీయకపోతే చాల ఆనందంగా జీవితం గడపవచ్చు. ఇట్టి అవగాహన కలిగించడంకూడ ఉత్తమ విద్యలో నొక భాగమే. ప్రపంచమంతా విజయాన్ని ఆరాధిస్తుంది. ఎవరో బీద పిల్లవాడు రాత్రులందు వీధి దీపాల క్రింద చదువుకొని పెరిగి పెద్దవాడై చివరికి ప్రధాన న్యాయాధిపతి యెట్లా అయినాడో, మరియొక పిల్లవాడు వార్తా పత్రికలను అమ్ముకొని జీవిస్తూ తుట్టతుదకు కోటీశ్వరు డేవిధంగా అయినాడో – ఇటువంటి కథలు మీరు వింటూ వుంటారు. విజయము యొక్క గౌరవగానంతో మీ మనస్సులను నింపి వేస్తుంటారు. కాని గొప్ప విజయాన్ని సాధించడంతోబాటు దాని వెనువెంటనే గొప్ప దుఃఖము కూడ వుంటుంది. అయినా మనలో చాలమంది ఏదో సాధించాలి అనే కోరికలో తగుల్కొని, దానినుండి బయటపడలేరు. దుఃఖాన్ని అర్థం చేసికోవడం, దానినుండి విముక్తి పొందడంకంటె మనకు విజయ సాధనమే ఎక్కువ ముఖ్యంగా కనబడుతుంది.

**2. ప్రశ్న:- నేటి సంఘ వ్యవస్థలో మీరు చెప్పే విషయాలను ఆచరణలో పెట్టడం ఎంతో కష్టం కాదా?**

**కృష్ణమూర్తి:-** దేని గురించైనా మీరు గట్టిగా అనుకొంటే, దానిని ఆచరణలో పెట్టడం కష్టమని తలుస్తారా? క్రికెట్టు ఆడాలని మీకు గట్టిగా అనిపిస్తే, మీరందులో పూర్తిగా లీనమై పోయి ఆడుతారు గదా! ఏమి, ఆడరా? అది కష్టమని అంటారా? దేనియొక్క యాధార్థ్యమైనా సరే – మీ మనస్సులో గట్టిగా నాటుకోకపోతే, అప్పుడు మాత్రమే దానిని ఆచరణలో పెట్టడం సాధ్యం కాదని అంటారు. అంటే, దానిమీద మీ కప్పుడు ప్రేమలేదు. మీరు ప్రేమించే పనిని ఎంతో ఉత్సాహంతో చేస్తారు; అందులో ఆనందమున్నది. అప్పుడు సంఘమేమని చెప్పినా, తల్లిదండ్రులు ఏమని చెప్పినా, మీరు లక్ష్యపెట్టరు. కాని మీ మనస్సుకు పూర్తిగా సమాధానం కలుగకపోయినా, మీరు సరియైనదని అనుకొన్నప్పటికిని దానిని చేయడంలో మీకు సంతోషం కలుగకపోయినా లేక అదియొక నిర్బంధంగా తోచినా, దాని భావం, మీకందులో నిజమైన అభిరుచి లేదని. పైకి మీకున్నట్లు కనబడే ఆ అభిరుచి అసత్యమైనది, నిజమైనది కాదు. కాబట్టి అటువంటి పని మీకొక పర్వతంలాగ తోస్తుంది; ఆ పనిని చేయడం చాలా కష్టమని అంటారు.

అయితే మీరు ప్రేమించిన పనిని చేయడంలో కష్టాలుంటాయి, తప్పదు. కాని మీరు వాటిని లక్ష్యపెట్టరు. అదంతా జీవితంలో ఒక భాగంగా తోస్తుంది. చూడండి, కష్టపడడం గురించి మనమొక సిద్ధాంతం లేవదీశాం. గట్టిగా ప్రయత్నం చేయడం, తంటాలు పడడం, ఎదుర్కొని నిలబడడం – ఇదంతా ఒక పుణ్య కార్యంగా ఎంచుతాం.

ప్రయత్నము ప్రయాసల ద్వారా సంపాదించుకొనే ప్రావీణ్యాన్ని గురించి నేను మాట్లాడడం లేదు. ఏ పనినైనా చేయడంలో వుండే ప్రేమను గురించి మాట్లాడుతున్నాను. ఈ ప్రేమ మీలో లేనప్పుడు మీరు సమాజానికి విరుద్ధంగా తలపడవద్దు. చచ్చు సాంప్రదాయాల్ని ఎదుర్కొనవద్దు. ప్రేమలేని ఆ పోరాటము అర్థరహిత మైనది. దానివలన మీరు సమాజంలో ఇంకా ఎక్కువ అనర్థాన్ని సృష్టించిన వారవుతారు. అట్లుగాక సరియైనదేదో, సత్యమేదో, మీ అంతస్సులో మీకు బాగా విశదమై వుంటే దానికోసం మీ రొంటరిగా నిలబడగలిగితే, అప్పటి మీ అచరణము ప్రేమజనితం కాబట్టి, దానికి ఎంతో అసాధారణ ప్రాముఖ్యముంటుంది. అందులో జీవశక్తి వుంటుంది, సౌందర్యముంటుంది.

మీకు తెలుసునా, ప్రశాంతమైన మనస్సులో మాత్రమే ఘన కార్యములు ఉద్భవిస్తాయి. అయితే అట్టి ప్రశాంతమగు మనస్సు ప్రయత్నం చేతగాని, నియంత్రణం చేతగాని, నియమపాలనం చేతగాని, క్రమశిక్షణ చేతగాని సాధ్యమయ్యేదికాదు.

**3. ప్రశ్న:– సంపూర్ణ పరివర్తనమనగా మీ యుద్దేశమేమి? దానిని వ్యక్తి తన జీవితంలో ఎట్లు అనుభూతికి తెచ్చుకోగలడు?**

**కృష్ణమూర్తి:–** సంపూర్ణ పరివర్తనం తీసికొని రావాలని ప్రయత్నిస్తే, అది వస్తుందని మీ రనుకొంటున్నారా? అసలు పరివర్తనమంటే యేమిటో మీకు తెలుసునా? మీకేదో పెద్ద కోరిక వున్నదనుకోండి. ఆ కోరికతో బాటుగా వచ్చేవాటి నన్నిటిని – మీరు చూడసాగినారనుకోండి. అంటే భవిష్యత్తులో ఏదో మేలు కలుగుతుందనే ఆశ, సంతృప్తి, ఆశాభంగము, క్రూరత్వము, దుఃఖము, ఇతరుల యెడ నిర్లక్ష్యము, అత్యాశ, అసూయ, బొత్తిగా ప్రేమ అనేది లేకపోవడం ఇవన్నీని. ఈ విషయం మీకు తెలిసినప్పుడు మీరేమి చేస్తారు? ఆ కోరికలో మార్పు తేవాలని, దాని రూపాన్ని మార్చివేద్దామని ప్రయత్నిస్తే అది మరియొక విధమైన కోరికయే కదా? అంటే మరియొక విధంగా వుండాలని కోరుకొనడం కాదా? మీరొక కోరికను నిరాకరించవచ్చు; కాని దానిని మీరు నిరాకరించడంలో మరియొక కోరికకు జన్మ నిస్తున్నారు. ఈ కోరిక గూడ దుఃఖమును కొనితెచ్చేదే.

ఈ విధంగా కోరిక దుఃఖాన్ని కొని తెస్తుందని కోరికను పోగొట్టుకొందామనే కోరిక గూడ దుఃఖాన్ని కొని తెస్తుందని ఈ సత్యమును మీకు మీరు స్పష్టంగా చూడగల్గి ఎట్టి కర్మాచరణమునకున్ను పూనుకోకుండా వుంటే, మీరు గ్రహించి వున్న సత్యమునే పని చేయనిస్తే, అప్పుడా సత్యము మీ మనస్సులో మౌలికమైన మార్పును కొని తెస్తుంది. అదే సంపూర్ణ పరివర్తనము; సమూల పరివర్తనము. కాని ఇట్టి పరివర్తనము రావలెనంటే ఎంతో మనోయోగము, లేదా అవధానము, ఎంతో సూక్ష్మబుద్ధి, ఎంతో లోచూపు వుండాలి.

మీరందరు మంచివాండ్లై ఉండాలని, మీలో ప్రేమ వుండాలని చెప్పినప్పుడు, మామూలుగా జరిగేదేమిటి? అప్పుడు మీలో మీరనుకొంటారు గదా, "నేను మంచివాణ్ణిగా వుండడం కోసం గట్టిగా ప్రయత్నించాలి, అందుకోసం అభ్యాసం చేయాలి. నా తల్లిదండ్రులను సేవకులను ఆఖరికి గాడిదను ఇంకా ప్రతిదానిని ప్రేమించాలి" అని. అంటే దాని అర్థం ప్రేమ చూపడంకోసం మీరు ప్రయత్నం చేస్తున్నారన్నమాట! అప్పుడా ప్రేమ కృతకమైన ప్రేమ, చౌకబారు ప్రేమ, మిక్కిలి క్షుద్రమగు ప్రేమ. ఇదే విధంగా అనంతకాలము సౌభ్రాతృత్వాన్ని అభ్యాసం చేస్తూ వుండే ఆ జాతీయ వాదులను గమనించండి! ఇది వట్టి పిచ్చిపని, బుద్ధిలేని పని. ఈ విధమైన అభ్యాసాలకు కారణము కేవలము అత్యాశ. అట్లుగాక జాతీయ వాదము నందలి సత్యమును, అత్యాశయందలి సత్యమును మీరు చూడగలిగి ఆ సత్యమును మీమీద పని చేయనిస్తే, ఆ సత్యమును తన పని తాను చేసికోనిస్తే, అప్పుడెట్టి ప్రయత్నము లేకుండానే మీలో మీరు సౌభ్రాతృత్వము కలిగి వుంటారు. ప్రేమించడాన్ని అభ్యాసం చేసే మనస్సు ప్రేమించలేదు. కాని, మీరు ప్రేమించి దాని కడ్డు పోకుండా వుంటే, అప్పుడా ప్రేమ స్వయంగా తన పని తాను చేసికొని పోతుంది.

4. ప్రశ్న:- ఏమండి, ఆత్మ విస్తరణమనగా నేమి?

**కృష్ణమూర్తి:-** మీరు గవర్నరుగా గాని, ప్రసిద్ధుడైన ఒక ప్రొఫెసరుగా గాని కాగోరినట్లయితే, ఒక గొప్ప వ్యక్తిని లేదా ఒక గొప్ప వీరుని మీరు అనుకరించేట ట్టయితే, మీ గురువునో లేదా ఎవరినైనా ఒక మహాత్ముడినో అనుసరించడానికి ప్రయత్నించేటట్టయితే అప్పుడట్లా కాగోరడం, అనుకరించడం, అనుసరించడమనేది ఒక విధమైన ఆత్మవిస్తరణము, అవునా కాదా? పేరాశ గల మానవుడు, గొప్పవాడు కాగోరిన మానవుడు, తన జీవితము చరితార్థమైనదని అనిపించుకోదలచిన మానవుడు "నేనీ పనిని శాంతి కోసమై చేస్తున్నాను, నా దేశం కోసమై చేస్తున్నాను" అని అంటాడు. కాని అతడు చేసే పని కూడ తన్నుతాను విస్తరింపజేసికొనడమే, ఆత్మ విస్తరణమే.

5. ప్రశ్న:- ధనవంతునికి గర్వమెందుకు?

**కృష్ణమూర్తి:-** ధనవంతునికి గర్వమెందుకని ఒక చిన్నపిల్లవాడు అడుగుతున్నాడు. ధనవంతునికి గర్వముండడం నీవు నిజంగా చూచినావా? బీదవానికి గూడ గర్వముండదా? మనందరిలో ఒక విశిష్టమైన దురహంకారము ఎవరిది వారికి వున్నది. దానిని అనేక విధాల బయటికి ప్రదర్శిస్తాం. ధనవంతుడు, బీదవాడు, చదువుకొన్నవాడు, సామర్థ్యం గలవాడు, భక్తుడు, నాయకుడు – వీరిలో ప్రతియొక్కనికిన్ని తాను అనుకొన్న దానినెల్ల సాధించితినని, సిద్ధసంకల్పుడనని, జీవితంలో విజయం పొందితినని, సంఘంలో తన కొక స్థానమున్నదని, తా నేదైనా చేయగలనని తన మనస్సులో తాను అనుకొంటూ వుంటాడు. అయితే తానెవరును కాని మానవుడు, సంఘంలో తనకొక స్థానం కావాలని కోరుకొననివాడు, తాను తానుగానే వుంటూ తన్ను తాను అర్థం చేసికొన్నవాడు – అటువంటి మానవుడు దురహంకార విముక్తుడు, గర్వరహితుడు.

6. ప్రశ్న:- మే మెల్లప్పుడును 'నేను' 'నాది' అనే భావనలో ఎందుకు చిక్కుకొని వుంటాము? ఇటువంటి మానసిక స్థితిలో పుట్టెడి సమస్యలను మీతో జరిపెడి సమావేశాలలో మాటిమాటికి ఎందుకు తెస్తూ వుంటాము?

కృష్ణమూర్తి:- మీరు నిజంగా దీనిని తెలిసికొనగోరుతున్నారా? లేక ఎవరైనా మిమ్మీ ప్రశ్న నడగమని ప్రేరేపించినారా? 'నేను' 'నాది' అనే యీ సమస్య సమానంగా మన కందరికీ సంబంధించియున్న సమస్య. నిజానికి అదే మనకున్న సమస్య. దానిగురించే మనం అనేక విధాలుగా అంతులేకుండా మాట్లాడుతూ వుంటాము – ఒక్కొక్కసారి మనం పొందిన సాఫల్యం గూర్చి, ఇంకొక్కసారి మనం పొందిన నిరాశా నిస్పృహలు, దుఃఖమును గూర్చిన్ని. కలకాలము సుఖంగా వుండాలనే కోరిక, ప్రాణం పోతుందేమో లేదా ఆస్తి పోతుందేమో అనే భయం, పొగడ్తలవలన కలిగే ప్రీతి, తెగడ్తలవలన కలిగే కోపం, "నీ దేవుడు నా దేవుడు" లేదా "నీ మతము నా మతము" అంటూ కొట్లాడుకోవడం వీటన్నిటితో మన మనస్సంతా ఎప్పుడూ ఎడతెగకుండా నిండిపోయి వుంటుంది. అంతకంటె ఏమీలేదు. ఆ మనస్సు శాంతిని కోరుతున్నట్లుగా, సౌభ్రాతృత్వము కలిగి వున్నట్లుగా, తనలో సౌజన్యము, ప్రేమ వున్నట్లుగా నటిస్తూ వుండవచ్చు. కాని యీ మాటల తెరవెనుక అది నేను, నాది అనే సంఘర్షణలోఎడ తెరిపి లేకుండా తగుల్కొనియే వుంటుంది. అందులోనుండి అనేక సమస్యలు పుడుతూ వుంటాయి. ఆ సమస్యలనే మీరు నా ముందుకు వేర్వేరు పదాలలో, వేర్వేరు రూపాలలో తెస్తూవుంటారు.

7. ప్రశ్న:- స్త్రీలు తమ దుస్తుల మీద ఎందుకంత శ్రద్ధ చూపిస్తారు? ఎందుకంతగా సింగారించుకొంటూ వుంటారు?

కృష్ణమూర్తి:- మీరు వాండ్లను అడగలేదా? పక్షుల నెప్పుడూ మీరు గమనించి చూడలేదా? మామూలుగా మగపక్షికి రంగెక్కువ, చులుకు పాలెక్కువ. స్త్రీ పురుష సంబంధంలో బిడ్డలను కనడం కోసం శారీరకాకర్షణ ఒక భాగం. అది జీవిత ధర్మం. అయితే మగపిల్లలు కూడ అదే పని చేస్తారు. వయస్సు వచ్చే కొద్ది అందంగా క్రొత్త పద్ధతిలో తల దువ్వుకోవడం మొదలుపెడతారు. అందమైన టోపీ పెట్టుకొంటారు. ఆకర్షకమైన గుడ్డలు ధరిస్తారు – ఇది కూడ అదే. మనమందరము గొప్పగా, డాబుసరిగా కనబడాలని కోరుకొంటాము. చాల ఖరీదైన కారులో పోయే ధనవంతుడు, అందంగా అలంకరించుకొనే బాలిక, నీటుగా చులుకుగా కనబడాలని ప్రయత్నించే బాలుడు – వీరందరు తమ దగ్గర యేదో ప్రత్యేకత వున్నదని గొప్పగా చూపగోరుతారు. ఇదంతా వింత ప్రపంచం. ఏమి, కాదంటారా? చూడండి, కలువపూవుగాని, గులాబిపూవుగాని తన దగ్గర లేనిది వున్నట్లు ఎన్నడును నటించదు. అది యథాతథంగా, ఉన్నదున్నట్లు కనిపించడమే అందులోని అందము.

*26 జనవరి, 1955*

★ ★ ★

# 21. నేర్చుకొనడము

నేర్చుకొనడమంటే యేమిటి? ఇది తెలిసికోడానికై ప్రయత్నిద్దాం – మీకిష్టమేనా? నేర్చుకోడం కోసం మీరు బడికి పోతారు. ఏమి, పోరా? మరి నేర్చుకోడమంటే యేమిటి? ఎప్పుడైనా మీరు దీని గురించి ఆలోచించారా? బడిలో దేనినైనా మీరెట్లా నేర్చుకొంటారు? ఎందుకు నేర్చుకొంటారు? మరి మీరక్కడ నేర్చుకొనేదేమిటి? నేర్చుకోడమంటే అర్థమేమిటి? అసలు దానికున్న ప్రాధాన్యమేమిటి? చదవడం, వ్రాయడం మీరు నేర్చుకోవాలి, వివిధ పాఠ్యవిషయాలను మీరు అధ్యయనం చేయాలి. దానితోబాటు, జీవనాధారాన్ని సంపాదించుకోవడం కోసం, మీరు దేనినైనా ఒక సాంకేతిక కళను నేర్చుకోవాలి, ఏదైనా ఒక వృత్తి చేపట్టడానికి తగిన సామర్థ్యం సంపాదించుకోవాలి. ఇదంతా కలిస్తేనే, మన ఉద్దేశంలో నేర్చుకోవడమంటే. అంతటితో మనలో చాలమంది నేర్చుకోవడం ఆపివేస్తారు. ఏవో కొన్ని పరీక్షలు పాసై, ఏదో యొక ఉద్యోగంలో చేరగానే లేదా ఏదో యొక వృత్తిని చేపట్టగానే, మనమీ నేర్చుకోడం విషయమే మరచిపోతామని అనిపిస్తుంది.

కాని నేర్చుకోడాని కంతమంటూ వున్నదా? పుస్తకాలు చదివి నేర్చుకోవడం, అనుభవం ద్వారా నేర్చుకోవడం – ఇవి రెండున్నూ రెండు వేర్వేరు విషయాలని మనమనుకొంటాం. కాని నిజంగా అవి రెండును వేర్వేరు విషయాలా? పుస్తకాలనుండి మనము నేర్చుకొనేదంతా ఇతరులు ఏమేమి వ్రాసినారో అది. ఉదాహరణకు విజ్ఞానశాస్త్ర విషయాలు. ఆ తరువాత, మన మింక సొంతంగా శాస్త్రీయ ప్రయోగాలు (experiments) చేసికొని, ఆ ప్రయోగముల ద్వారా నేర్చుకొంటూ పోతాం. ఇదిగాక, మనం మన అనుభవాల ద్వారా గూడ నేర్చుకొంటాం – కనీసం ఇట్లా అని మనమనుకొంటాం. కాని యింతకు, జీవితము యొక్క అద్భుతమైన లోతులలోనికి పోయి చూడవలెనంటే, దేవుడన నెవరో, సత్యమననేమో కనుక్కోవలెనంటే మనకు స్వతంత్రముండాలి, అది అవసరం. కాని అనుభవం ద్వారా తెలిసికోడంలో స్వతంత్రమున్నదా?

అనుభవమంటే యేమిటో దాని గురించి మీ రెప్పుడైనా ఆలోచించారా? అది సవాళ్ళను ఎదుర్కొనడంలో – సమస్యలను పరిష్కరించడంలో – కలిగిన మానసికానుభూతి; కాదా? సవాలును ఎదుర్కొనడమే అనుభవము. మరి, అనుభవము ద్వారా మీరేమైనా నేర్చుకొంటారా? మీరొక సవాలును ఎదుర్కొని, దానికి సమాధానమిచ్చేటప్పుడు లేదా, ఒక ప్రేరణకు ప్రతీకారము చేసేటప్పుడు మీ సమాధానముగాని, మీ ప్రతీకారముగాని, మీ సంస్కారంమీద, మీరు పొందియున్న విద్యమీద, మీ సాంస్కృతిక, ధార్మిక, సాంఘిక, ఆర్థిక స్థితిమీద ఆధారపడి

వుంటుంది. సవాలుకు మీరిచ్చే సమాధానము – హిందువుగానో, క్రైస్తవునిగానో, సామ్యవాదిగానో లేక మరియొకరిగానో – మీ పూర్వ సంస్కారంమీద ఆధారపడి వుంటుంది. అయితే మీరు మీ పూర్వ సంస్కారాన్ని ఛేదించుకొని బయటికి రాకపోతే, అప్పుడు ఏ సవాలుకైనా మీరిచ్చే సమాధానము మీ పూర్వ సంస్కారమును ఇంకా బలపరచనైనా బలపరుస్తుంది, లేదా దానికి మరికొంత మెరుగు దిద్దుతుంది. ఇట్టి పరిస్థితిలో సత్యమననేమో, దేవుడననేమో అన్వేషించి కనుగొనవలెనంటే, దానిని అర్థము చేసికోవలెనంటే మీరు అందుకు నిజంగా స్వతంత్రులు కారు.

కాబట్టి, అనుభవము మనస్సును స్వతంత్రము చేయదు, దానికి విముక్తినీయదు. అనుభవము ద్వారా నేర్చుకొనడమంటే పూర్వ సంస్కారములమీద ఆధారపడిన క్రొత్త మర్యాదలను ఏర్పరచుకొనడం మాత్రమే, క్రొత్త సంస్కారములను ముద్రించుకొనడం మాత్రమే. ఈ విషయం అర్థం చేసికోవడం చాల ముఖ్యమని అనుకొంటాను. ఎందువల్లనంటే, మనం పెద్దవారమయ్యే కొలది ఏదో నేర్చుకొంటామనే ఆశతో మనము మన అనుభవమనే కోటలో రానురాను ఎక్కువగా చిక్కుకొనిపోయి అసలు బయటికి రాలేము. ఆ విధంగా మనము నేర్చుకొన్నదెల్ల మన పూర్వ సంస్కారముపై ఆధారపడినదే. అంటే, ఏ అనుభవము ద్వారానైతే మనము జ్ఞానమును ఆర్జిస్తామో ఆ అనుభవము ద్వారా మనకు విముక్తి లభింపదు, స్వతంత్రము లభించదు; మన పూర్వ సంస్కారములో ఏదో కించిత్ పరివర్తనము, కొంత సవరణ మాత్రమే వుంటుంది.

సరే, మరి నేర్చుకోవడమంటే యేమిటి? చదవడం, వ్రాయడం, నిశ్శబ్దంగా కూర్చోవడం, చెప్పినమాట వినడం లేదా వినకపోవడం – వీటితో మీరు నేర్చుకోవడం ఆరంభిస్తారు. ఈ దేశ చరిత్రనో లేదా మరియొక దేశచరిత్రనో నేర్చుకొంటారు. పరస్పర వ్యవహారానికి అవసరం కాబట్టి భాషలు నేర్చుకొంటారు. జీవనాధారాన్ని ఎట్లా సంపాదించుకోవాలో, పొలాలనెట్లు సారవంతం చేయవచ్చునో ఇంకా ఇటువంటివన్నీ నేర్చుకొంటారు. కాని పూర్వ సంస్కారము నుండి మనస్సు విముక్తమైయున్నస్థితిలో అన్వేషణ అంతమైయున్న స్థితిలో నేర్చుకొనడం ఉన్నదా? అసలు మీకు ప్రశ్న అర్థమైనదా?

మనము దేనినైతే నేర్చుకోవడమని అంటామో, అది ఎడతెగని ప్రక్రియ. అందులో సర్దుకోవడం, అడ్డగించడం, లొంగదీసుకోవడం జరుగుతూ వుంటుంది. మనము దేనినైనా పరిహరించడంగాని, స్వీకరించడం గాని నేర్చుకొంటాం. మరి, మనస్సు జ్ఞానార్జనకు సాధనంగా కాకుండా, కేవలం అస్తిత్వానికి సాధనంగా ఉండే స్థితి యేదైనా వున్నదా? ఇందులోవున్న తేడాను మీరు గమనించారా? మనము సంపాదించుకోవడం, పొందడం, పరిహరించడం చేస్తూ వున్నంతకాలము మనస్సు నేర్చుకొంటూ వుండవలసిందే. మరి ఆ విధంగా నేర్చుకోవడంలో మనస్సుమీద ఎల్లప్పుడు ఎంతో ఒత్తిడి వుంటుంది, మనస్సును నిరోధించడముంటుంది. జ్ఞానార్జన చేయవలెనంటే మనస్సును కేంద్రీకరింపజేయాలి, ఏకాగ్రత కావాలి. ఏమి, అక్కరలేదా? మరి ఏకాగ్రత అంటే యేమిటి?

దేనిమీదనైనా మీరు మీ మనస్సును కేంద్రీకరింపజేసినప్పుడు ఏమిజరుగుతుందో

ఎప్పుడైనా గమనించారా? మీకు చదవడానికి ఇష్టంలేని పుస్తకాన్ని మీరు చదవవలసి వస్తే, లేదా, ఒకవేళ దానిని మీరు చదవగోరినప్పటికిన్ని తక్కిన ఆలోచనల నన్నిటిని నిరోధించి, ఇతర విషయాలను ప్రక్కకు పెట్టి చదవవలసి వస్తుంది. మనస్సును ఏకాగ్రం చేయడంకోసం కిటికీగుండా బయటికి చూద్దామనే కోరికను నిరోధించవలసి వస్తుంది, ఎవరితోనైనా మాట్లాడుదామనే కోరికను నిరోధించవలసి వస్తుంది; కాబట్టి మనస్సును కేంద్రీకరింపజేయడంలో ఎల్లప్పుడు ఎంతో ప్రయత్నముంటుంది, ఉండదంటారా? ఈ విధంగా ఏకాగ్రతను సాధించడంలో దానివలన ఏదో నేర్చుకొంటామని, తద్వారా ఏదో సంపాదించుకొంటామని ఒక ప్రేరక హేతువు, ఒక ప్రలోభనముంటుంది; అందుకోసం ప్రయత్నముంటుంది. మన జీవిత మిట్టి ప్రయత్నాల వరుస. అందులో ఎడతెగని ఒత్తిడి వుంటుంది. అట్టి స్థితిలో మనము జ్ఞానార్జనకు ప్రయత్నిస్తుంటాము. కాని అటువంటి ఒత్తిడే గనక లేకపోతే, సంపాదించుకోవడం, జ్ఞానాన్ని పొరలు పొరలుగా పేర్చుకోవడమంటూ లేకపోతే, అప్పుడు మనస్సు ఎంతో లోతుగాను శీఘ్రంగాను విషయగ్రహణము సేయగలదు, కాదా? అప్పుడు సత్యమంటే యేమిటో, సౌందర్యమంటే యేమిటో, దేవుడంటే యేమిటో తెలిసికోవడానికి ఒక సాధనంగా మనస్సు ఉపయోగపడుతుంది. అంటే దాని అర్థము, అట్టి మనస్సు దేని అధికారానికిని లొంగదు; – ఆ అధికారము జ్ఞానానిదిగాని, సమాజానిదిగాని, మతముదిగాని, సంస్కృతిదిగాని లేక పూర్వ సంస్కారములదిగాని దేనిదైనను కావచ్చును.

చూడండి, మనస్సు తాను కూడబెట్టుకొన్న జ్ఞానభారమునుండి పూర్తిగా విముక్తి పొందినప్పుడే సత్యమును దర్శింపగలదు. సత్యదర్శన సమయంలో మరల జ్ఞానమును కూడబెట్టుకోనడంలేదు. ఏమి, కూడబెట్టుకొంటుం దంటారా? ఒకవేళ మీరు అనుభూతి పొందినదానిని గాని, నేర్చుకొన్నదానిని గాని కూడబెట్టుకోవడానికి ఆరంభించిన క్షణమునుండి, ఆ కూడబెట్టుకొన్న జ్ఞానరాశి ఓడకు లంగరు వేసినట్లు మీ మనస్సును పట్టియుంచి, ముందుకు సాగనివ్వదు. ఈ సత్యదర్శన ప్రక్రియలో మనస్సు ఏ దినమున కాదినము – తాను ఆర్జించుకొన్న జ్ఞానమునంతను జారవిడుస్తూ వుంటుంది. అందుచేత అది యెల్లప్పుడును నిత్యనూతనముగా, నిన్నటి అనుభవాలతో దూషితము గాకుండ వుంటుంది. సత్యము జీవము గలది, గతిశీలమైనది; అది స్థితిశీలము కాదు. అట్టి సత్యమును దర్శించే మనస్సుకూడ జీవము కలదై గతిశీలమై వుండవలె. జ్ఞాన భారమునుండి, అనుభవ భారమునుండి విముక్తమై వుండవలె. అట్టి స్థితిలో మాత్రమే సత్యము సాక్షాత్కరిస్తుంది.

దీనినంతను మాటలలో చెప్పితే అర్థం చేసికొనడం కష్టంగా కనబడుతుంది. కాని మీ మనస్సును దానిపై నిల్పితే సులభంగానే అర్థమవుతుంది. జీవితములోని అగాధ విషయాలను తెలిసికోవలెనంటె మనస్సు (జ్ఞాన భార విముక్తమై) స్వతంత్రమై వుండాలి. కాని మీరు జ్ఞానార్జన చేసి, ఆ జ్ఞానమును తరువాత కొనసాగించెడి సత్యాన్వేషణకు ఆధారముగా చేసికొన్న క్షణమునుండి మీ మనస్సు విముక్తము కాదు, మీరు సత్యాన్వేషణ చేయడం లేదు.

1. ప్రశ్న:- నేర్చుకోడానికి కష్టంగా తోచినదేదైనా సరే మేమెందుకంత త్వరగా మరిచిపోతాము?

కృష్ణమూర్తి:- మీరు చదువుకొంటున్నది కేవలం పరిస్థితుల ఒత్తిడి వల్లనేనా? ఇంతకు ఇప్పుడు మీరు భౌతిక శాస్త్రాన్ని, గణిత శాస్త్రాన్ని చదువుతూవున్నా, నిజంగా మీరు న్యాయవాదులు కావాలని కోరుకొంటూవుంటే, మీరు చదివిన భౌతికశాస్త్రాన్ని, గణితశాస్త్రాన్ని త్వరలోనే మరిచిపోతారు. చదువుకోడానికి ఏదైన ప్రలోభనము కల్పిస్తే, ఆశ పుట్టిస్తే మీరు నిజంగా చదువుకొంటారా? కేవలం ఉద్యోగం సంపాదించుకోడం కోసం, పెండ్లి చేసికోడం కోసమే కొన్ని పరీక్షలు పాసు కాగోరినట్లైతే మీరు మీ మనస్సును ఏకాగ్రంచేసి చదువుకోడానికి శ్రమపడతారు. కాని ఒకసారి మీరా పరీక్షలు గనక పాసైపోతే అప్పుడిక మీకు వాటి అవసరముండదు గనక త్వరలోనే చదివిన చదువంతా మరిచిపోతారు – ఏమి, మరిచిపోరా? ఏదో యొక స్థానాన్ని చేరడంకోసం చదువొక సాధనమే అయినట్టయితే మీరు చేరుకోదలచిన స్థానాన్ని చేరుకోగానే, దానికి సాధనమైయున్న చదువుని మరిచిపోతారు. అసలు అటువంటి చదువు చదువే కాదు. కాబట్టి ఎట్టి హేతువుగాని, ఎట్టి ప్రలోభనంగాని లేకుండా కేవలం చదువుమీది ప్రేమచేతనే చదువుకొంటున్నట్టయితే – అప్పుడు మాత్రమే నిజమైన చదువు కొనసాగే స్థితి వుంటుంది.

2. ప్రశ్న:- ప్రగతి అనేమాటకు గల అర్థమేమి?

కృష్ణమూర్తి:- చాలామందికున్నట్లే మీకును ఆదర్శాలుంటాయి, లేవా మీకు? ఆదర్శమనేది యథార్థమైనది కాదు, వస్తుస్థితికి సంబంధించినది కాదు. అది మనముండగోరిన స్థితి, భవిష్యత్తుకు సంబంధించినది. మరి నేను చెప్పేదేమంటే – ఆదర్శాన్ని మరిచిపోండి, ఇప్పుడు మీరున్న స్థితిని మెలకువతో గమనించి చూచుకోండి. మీరుండగోరిన స్థితి కోసం ప్రాకులాడకండి; ప్రస్తుతం మీరున్న స్థితిని అర్థం చేసికోండి. మీరెట్లా వుండాలని అనుకొన్నారో ఆ స్థితిని అందుకోడం కోసమై ప్రయత్నించడంకంటె, వాస్తవంగా ఇప్పుడు మీరున్న స్థితిని అర్థం చేసికోవడం ఎక్కువ ముఖ్యం. ఎందుకని? ఎందుకంటే, ప్రస్తుతం మీరున్న స్థితిని అర్థం చేసికొనడంలో అప్రయత్నంగానే మీలో పరివర్తన ప్రక్రియ – మార్పుదల – ఆరంభమవుతుంది. అట్లుగాక మీరెట్లా వుండాలని అనుకున్నారో ఆ స్థితిని ప్రయత్నించి పొందడంలో, నిజంగా మార్పేమియు లేనట్లే; అదివరకటి పాత పరిస్థితియే మరియొక రూపంలో కొనసాగుతూ వుంటుంది, అంతే. మనస్సు తన అవివేకాన్ని గ్రహించి దానిని వివేకముగా మార్చుకొందామని ప్రయత్నిస్తే – అంటే అదేగదా తానుండాలని కోరుకొన్న స్థితి, దానికై ప్రయత్నిస్తే – ఆ ప్రయత్నము దాని అవివేకాన్నే తెలుపుతుంది. ఆ ప్రయత్నాని కర్థము లేదు, అది వాస్తవమైన మార్పుకాదు. అది తా నూహించుకొన్న తన రూపమును తాను అనుసరించడం, తన ప్రస్తుత స్థితిని అర్థము చేసికొనడాన్ని వాయిదా వేయడం మాత్రమే. మనస్సు తన తెలివి తక్కువతనాన్ని మరియొక రూపంలోనికి మార్చుకొనడం కోసం ప్రయత్నిస్తూ వున్నంతకాలము ఆ మనస్సు తెలివి తక్కువదే. అట్లుగాక "నేను అవివేకినని నాకు

తెలుసు; అయితే అసలు అవివేకమనగా నేమో అర్థము చేసికొనగోరుతాను, దాని గురించి లోతుగా విచారణ చేసి చూస్తాను. అది యెట్లా సంభవిస్తుందో పరిశీలించి చూస్తాను" అని మనస్సు అనుకొంటే, అప్పుడా మనస్సు చేసే విచారణయే – అంటే ఆత్మ పరిశీలనమే – దానిలో మౌలిక పరివర్తనమును కొనితెస్తుంది.

" 'ప్రగతి' అనే మాటకు గల అర్థమేమి?" అసలు 'ప్రగతి' అనేది దేనిలోనైనా వున్నదా? గంటకు రెండుమైళ్ళ వంతున పోయే ఎద్దుబండిని చూస్తాము, గంటకు 600 మైళ్ళు లేక ఇంకా ఎక్కువ వేగంగా పోయే అద్భుతమైన జెట్ విమానాన్ని చూస్తాము. ఇదే ప్రగతి, అవునా? ఇది సాంకేతిక శాస్త్రమందు వచ్చిన ప్రగతి. అదివరకటి కంటె మేలైన రాకపోకల సౌకర్యములు, మేలైన వార్తాప్రసార సౌకర్యములు, మేలైన ఆరోగ్య పరిస్థితులు మొదలైనవి. కాని మరియొక విధమైన ప్రగతికూడ ఏదైనా వున్నదా? కాలక్రమేణ వచ్చెడి మానసిక ప్రగతి అంటే, ఆధ్యాత్మిక ప్రగతి యేమైనా వున్నదా? ఆధ్యాత్మిక ప్రగతి అనబడేది నిజంగా ఆధ్యాత్మికమా? లేక అది కేవలం మనఃకల్పితమా?

చూడండి, మౌలిక ప్రశ్నలు అడగడం చాల ముఖ్యం. కాని దురదృష్టవశాత్తు మౌలిక ప్రశ్నలకు అతి సులభంగా సమాధానాలు ఇవ్వబడతాయి. అట్లు సులభంగా లభించెడి సమాధానంతో మన సమస్య పరిష్కారమైనట్లు, మన సందేహము నివృత్తియైనట్లు తలుస్తాము. కాని అది నిజానికట్లు కాదు. మనం మౌలిక ప్రశ్నను వెయ్యాలి; వేసి ఆ ప్రశ్నను మన మనస్సుమీద పని చేయనియ్యాలి. ఇందలి సత్యాన్ని తెలిసికోడం కోసం దానిని (ఆ ప్రశ్నను) మనలోపల పని చేయనివ్వాలి.

ప్రగతి అంటే సమయంమీద ఆధారపడినది. ఏమి, కాదా? ఇంతకు, ఎద్దుబండినుండి జెట్ విమానందాక రావడానికి మనకెన్నో శతాబ్దాలు పట్టినవి. అదే విధంగా కాలక్రమేణ సత్యమును లేదా దైవమును దర్శింపగలమని మన మనుకొంటాం. మన మిక్కడ వున్నాము? దేవు డల్లంత దూరాన అక్కడనో లేదా మరెక్కడనో చాల దూరాన వున్నాడని అనుకొంటాం. ఆ దూరాన్ని గడవాలంటే, ఆ మధ్యనున్న యెడమును దాటి పోవాలంటే, మనకు సమయం కావాలని అంటాము. కాని దేవుడు గాని సత్యముగాని స్థిరపదార్థము కాదు – అట్లే మనముకూడ స్థిరము కాదు. మనము బయలుదేరడానికి ఒక స్థిర బిందువంటూ లేదు; మనము చేరవలసింది కూడా ఒక స్థిరబిందువు కాదు. కాని మానసిక భద్రత కొఱకై, మనలో ప్రతియొక్కనియందును ఒక్కొక్క స్థిరమైన బిందువున్నదని, అట్లే పరమ సత్యముకూడ ఒక స్థిరమైన బిందువని తలచి, ఆ యభిప్రాయాన్ని వదలక గట్టిగా పట్టుకొని వుంటాము. కాని యిదంతా వట్టి భ్రమ, ఇది సత్యము కాదు. మనము అంతర్గతంగా, ఆధ్యాత్మికంగా వికాసము పొందడానికి, ప్రగతిని సాధించడానికి సమయం కావాలని ఎప్పుడైతే కోరుకుంటామో ఆ క్షణమునుండి మనము చేసే పని ఆధ్యాత్మికము కాదు; కారణమేమంటే – సత్యమునకు కాలముతో పనిలేదు. కాలములో చిక్కుకొన్న మనసు సత్యమును కనుగొనడానికై కాలము కావాలని అడుగుతుంది. కాని సత్యము కాలమునకు అతీతము; దానికొక స్థిరబిందువంటూ లేదు. బుద్ధిపూర్వకంగా గాని, అబుద్ధిపూర్వకంగా గాని కూడబెట్టుకొన్న సమస్త

జ్ఞానరాశినుండి మనస్సు విముక్తమైతే అప్పుడు మాత్రమే అది సత్యమననేమో, దైవమననేమో తెలిసికొన సమర్థమవుతుంది.

### 3. ప్రశ్న:- నేను దగ్గరకు పోగానే పక్షులు ఎగిరిపోతాయి. ఎందుకని?

**కృష్ణమూర్తి:-** మీరు దగ్గరకు పోయినా, పక్షులు ఎగిరిపోకుండా వుంటే ఎంత బాగుంటుందో! మీరు వాటిని తాకగల్గితే, వాటితో స్నేహం చేయగల్గితే ఎంత ముచ్చటగా వుంటుందో! కాని, చూశారూ, మానవులం మనం క్రూరులం; మనం పక్షులను చంపుతాం, నానా హింస పెడతాం, వలలు పన్ని వాటిని పట్టుకొంటాం, పంజరాలలో బంధిస్తాం. అట్లాగ పంజరంలో బంధింపబడిన అందమైన చిలుకను ఒకదానిని ఊహించుకోండి. అది ప్రతి సాయంత్రం తన జతగాని కోసం పిలుస్తూ వుంటుంది. ఇతర పక్షులు విముక్తాకాశంలో విచ్చలవిడిగా ఎగురుతూ వుంటే అది చూస్తూ వుంటుంది. ఇటువంటి పనులన్నీ మనం చేస్తూ వుంటే పక్షులు తమ దగ్గరకు మనం రావడంచూసి భయపడకుండా వుంటాయని అనుకొంటారా మీరు? అయితే ఎవ్వరూ లేనిచోట మీరొక్కరు అటునిటు కదలకుండా ప్రశాంతంగా కూర్చుండి మిక్కిలి సౌమ్యంగా – నిజంగా మంచి మనస్సుతో – వుంటే పక్షులు మీ దగ్గరకు రావడం త్వరలోనే చూడగలరు. మీ తలమీదుగా అవి చాల దగ్గరగా ఎగరడం మొదలుపెడతాయి. అవి అటు నిటు చురుకుగా కదలడాన్ని, వాటి అందమైన గోళ్ళను, అద్భుతమైన బలముగల ఱెక్కలను, అందమైన యీకలను మీరు గమనింపగలరు. కాని అట్లా చేయవలెనంటే మీకెంతో ఓరిమి కావాలి. అంటే మీలో ఎంతో ప్రేమ వుండాలి, భయమంటూ వుండగూడదు. మనలోని భయాన్ని జంతువులు చాల త్వరగా గుర్తిస్తాయని అనిపిస్తుంది. మన భయాన్ని చూచి అవి భయపడి పారిపోతాయి. అందువలన మనలను మనం అర్థం చేసికోవడం చాల ముఖ్యం.

మీరొక చెట్టు క్రింద కదలకుండా కూర్చుండి అప్పుడు ప్రయత్నించండి. కాని యేదో రెండు మూడు నిమిషాలసేపు కూర్చుంటే చాలదు. అంత తక్కువ సమయంలో పక్షులు మీ కలవాటు పడవు. ప్రతిదినము అదే చెట్టు క్రిందికి పోయి ప్రశాంతంగా కూర్చుంటూ వుండండి. మీ చుట్టూ ప్రతిదీ సజీవంగా వున్నట్లు మీరు త్వరలోనే గమనింపసాగుతారు. గడ్డిపరకలు ఎండలో తళతళ మెరుస్తూ వుంటాయి. చిన్న చిన్న పిట్టలు క్షణంసేపు ఆగకుండా ఎప్పుడూ ఏదో యొక పని చేస్తూనే వుంటాయి. పాము మెరుపు మెరిసినట్లు తళుక్కుమని విలక్షణమైన కాంతితో మెరుస్తుంది. గరుడపక్షి ఆకాశంలో ఱెక్కలల్లార్చకుండా ఎంతో ఎత్తున ఎగురుతూ చల్లని గాలిలో ఆనందాన్ని అనుభవిస్తూ వుంటుంది. వీటినన్నిటిని చూచి ఆనందించాలంటే ముందు మీలో నిజమైన శాంతి వుండాలి.

### 4. ప్రశ్న:- మీకును మాకును మధ్య గల భేదమేమి?

**కృష్ణమూర్తి:-** అసలు మన మధ్య మౌలికమైన భేదమేమైనా వున్నదా? మీ శరీరం తెల్లగా అందంగా వుండవచ్చు. నాది నల్లగా వుండవచ్చు. మీరు నాకంటె

చతురులు, చాకచక్యం గలవారై యుండవచ్చు, నాకంటె మీకెన్నో విషయాలు ఎక్కువగా తెలిసియుండవచ్చు. నేనేదో పల్లెలో నివసిస్తూ వుంటే మీరు ప్రపంచమంతా తిరుగుతూ వుండవచ్చు – ఇంకా ఇటువంటి తేడాలు ఏవో కొన్ని వుండవచ్చు. ఆకారంలోను, భాషలోను, సంపాదించుకొన్న జ్ఞానంలోను, నడతలోను, సంస్కృతి సంప్రదాయములలోను తేడా లుండడ మనేది అందరికీ తెలిసిన విషయం. కాని మనము బ్రాహ్మణలమైనా, అబ్రాహ్మణులమైనా, అమెరికనులమైనా, రష్యనులమైనా, జపాను వాండ్లమైనా, చైనావాండ్లమైనా మరెవరమైనా సరే, మనందరి మధ్యగల సమానత్వమే యెక్కువ కాదా? మనందరికిని భయమున్నది, అందరికిని భద్రత కావాలి, ప్రేమ కావాలి, తిండి కావాలి, సుఖం కావాలి. కాని చూశారా, మానవులముగా మనందరిమధ్య గల మౌలిక సమానత్వమును గుఱించిన ఎఱుకను, పైపై కనిపించే భేదభావము నాశనము చేస్తున్నది. ఈ సమానత్వమును అర్థము చేసికొని దానినుండి విముక్తమైతే మనలో గొప్ప ప్రేమ, గొప్ప విచారశీలత వెల్లివిరిస్తుంది. దురదృష్టవశాత్తు మనలో చాలామంది బాహ్యముగా కనిపించెడి యీ జాతి, సంస్కృతి, మత విశ్వాసములు మొదలగువానికి సంబంధించిన క్షుద్ర భేదభావములలో తగులుకొని వాటి మూలాన విభజింపబడి యున్నారు. ఈ మత విశ్వాసములనేవి ఒక శాపము. అవి మనుషులను వేరుచేస్తున్నాయి, పరస్పర విరోధాన్ని పెంచుతున్నాయి. అన్ని విధములైన విశ్వాసములనుండి బయటపడి, అన్ని విధములైన భేదములకును సామ్యములకును అతీతమై యుండిన మనస్సు మాత్రమే సత్యమననేమో కనుగొనడానికి స్వతంత్రత కలిగి వుంటుంది.

5. ప్రశ్న:- నేను పొగ త్రాగుతూ వుంటే మా ఉపాధ్యాయునికి నామీద కోపమెందుకు రావాలి?

**కృష్ణమూర్తి:-** పొగత్రాగడం చిన్నపిల్లలకు మంచిది కాదు. అందువలన పొగ త్రాగవద్దని మీ ఉపాధ్యాయుడు మీతో బహుశా ఎన్నోసార్లు చెప్పియుండవచ్చు. కాని మీరు పొగ త్రాగుతూనే వుంటారు, మానరు. దానిలోని రుచి అంటే మీ కిష్టం. కాబట్టి ఉపాధ్యాయునికి మీమీద కోపం వస్తుంది. అదిసరే, మీరు స్వయంగా దీనిగురించి ఏమని అనుకొంటారు? ఇంత చిన్న వయస్సులో పొగత్రాగే అలవాటేకాదు, ఇంకా ఏ అలవాటైనా సరే, చేసికోవడం మంచిదంటారా? ఇంత చిన్నవయస్సులో మీ శరీరం పొగ త్రాగడానికి అలవాటు పడితే, దాని అర్థం మీరొక దానికి అప్పుడే బానిసలై పోయినారన్నమాట! ఇది చాల దారుణమైన విషయం కాదా? పొగ త్రాగడం బహుశా వృద్ధుల విషయంలో యుక్తమే కావచ్చు. కాని అదికూడ ఎంతో సందేహాస్పదమైన విషయం. దురదృష్టవశాత్తు రకరకాలైన అలవాట్లకు దాసులై పోవడానికి వాండ్ల కేవేవో సాకు లుండవచ్చు. కాని మీరు చాల చిన్న పిల్లలు, పక్వముకాని మనస్సు కలవారు, యువకులు, ఇంకా ఎదుగుతున్నవారు – అటువంటి మీరు దేనికైనా ఎందు కలవాటుపడాలి? ఏ అలవాటులోనైనా ఎందుకు చిక్కుకోవాలి? దానివలన మీ సున్నితమైన మనస్సు కొరడుపారిపోతుంది.

మీ సంవేదన శీలత (సూక్ష్మ గ్రహణశక్తి) తగ్గిపోతుంది. మనస్సు దేనికైనా అలవాటుపడిన క్షణమునుండి అది ఆ గాడిలోనే పోతూ వుంటుంది. అందువలన అది మొద్దుబారి, అభేద్యమై పోతుంది. దాని సున్నితత్వము నశించుతుంది. దేవుడననేమో, అందమననేమో, ప్రేమ అననేమో తెలిసికోడానికి కావలసిన సంవేదనశీలత నశిస్తుంది.

6. ప్రశ్న:- ప్రజలు పులులను ఎందుకు వేటాడుతారు?

కృష్ణమూర్తి:- చంపడంలో వచ్చే ఉత్తేజంకోసం వాటిని చంపుతారు. అటువంటి అనాలోచిత కార్యాలు మనమెన్నో చేస్తూ వుంటాము. ఏమవుతుందో చూద్దామని రెక్కల పురుగుల రెక్కలు ఊడబెరుకుతాం. అనవసరమైన బాతాఖానీలో పరులను గూర్చి చెడ్డగా మాట్లాడుతుంటాం. మన తిండికోసం ప్రాణులను చంపుతాం. శాంతి స్థాపన కోసమని హత్యలు చేస్తాం. మన దేశం కోసం, మన నమ్మకాలకోసం ఇతరులను చంపుతాం. ఈ విధంగా మనలో క్రూర ప్రవృత్తి చాల ఎక్కువగానే వున్నది. ఏమి, లేదంటారా? అది అర్థం చేసికొని, దానిని వదులుకొంటే అప్పుడు పులి తన దారిన తాను పోతూవుంటే చాల వేడుకతో చూస్తూ వుంటాం. బొంబాయి దగ్గర మేమొక సాయంకాలం చాల మందిమి కలిసి, ఆ పనే చేశాం. దగ్గరగా వున్న అడవిలో పులిని చూశానని ఒకరు మాకు చెప్పితే, ఒక స్నేహితుడు మమ్మలిని తన కారులో ఎక్కించుకొని అడవికి తీసికొని వెళ్లినాడు. మేము తిరిగివస్తూ రోడ్డుమీద ఒక మలుపు తిరిగేటప్పటికి తటాలున ప్రత్యక్షమైంది ఒక పెద్ద పులి, రోడ్డుకు మధ్యలో నిలబడి. అది పసుపు, నల్లని చారలతో నున్నగా, సన్నగా, పొడవైన తోకతో చూడడానికి అందంగా కనబడింది. దానిలో ఎంత హొయలు, ఎంత రీవి, ఎంత శక్తి! మా కారుకు ముందుండే ఇంజను దీపాలను ఆర్పివేసినాం. వెంటనే గుఱ్ఱుమంటూ మావైపుకు వచ్చి, మా కారును దాదాపు ఆనుకుంటూ వెళ్ళిపోయింది. అది యెంతో అద్భుతమైన దృశ్యం. చేతిలో తుపాకీ లేకుండా, అటువంటి జంతువును చూస్తూ వుంటే ఎంతో వేడుకగా, ఎంతో తమాషాగా వుంటుంది. అందులోనే గొప్ప అందమున్నది.

7. ప్రశ్న:- మనము దుఃఖభారముచే క్రుంగిపోవడానికి కారణమేమి?

కృష్ణమూర్తి:- దుఃఖమును జీవితములోని ఒక అనివార్యమైన భాగంగా మనము గ్రహిస్తాము. దానిచుట్టు తత్త్వశాస్త్రములు రచియిస్తాము. మనము దుఃఖాన్ని సమర్థిస్తాము, దేవుని దర్శించడానికి దుఃఖము అవశ్యకమని అంటాము, కాని నేను దానికి వ్యతిరేకిని. నే ననేదేమంటే, ఒక మనిషి మరియొక మనిషి యెడల క్రూరముగా ప్రవర్తించడం వల్లనే దుఃఖము కలుగుతున్నదని. అంతేగాక మనము జీవితంలోని అనేక విషయాలను అర్థం చేసికోము కాబట్టి వాటివలన గూడ దుఃఖము కలుగుతున్నది. ఉదాహరణకు మృత్యువు, ఉద్యోగం లేకపోవడం, చాల దైన్య స్థితిలోనున్న బీదవారిని చూడడం - ఇదంతా మనము అర్థము చేసికోము. కాబట్టి తీరని వ్యథ చెందుతుంటాము. మనస్సు ఎంత ఎక్కువ

సున్నితమైనదైతే, అంత ఎక్కువ బాధపడతారు. ఇవన్నీ అర్థము చేసికొనే బదులు మనము దుఃఖమును సమర్థిస్తాము. ఈ క్రుళ్ళిన వ్యవస్థకు విరుద్ధముగా తిరుగబడి దానిని బ్రద్దలు కొట్టుకొని బయటికి వచ్చే బదులు మనము దానితో కేవలం సర్దుకొని పోతున్నాము. దుఃఖమునుండి విముక్తి పొందవలెనంటే ఇతరులకు హాని కలిగించవలెననే కోరికనుండి ముందు మనము విముక్తి పొందవలె. దానితోబాటు ఇతరులకు మంచి చేయవలెననే కోరికనుండి గూడ విముక్తి పొందవలె. ఇంతకును ఆ 'మంచి' అనబడేది గూడ మన పూర్వ సంస్కారముల ఫలితమే కదా!

*27 జనవరి, 1955*

★ ★ ★

# 22. సున్నితమైన మనస్సు

ఇక్కడికి సమీపంలో వున్న ఒక తోటలోని చెట్లనుండి పూలు త్రుంచుకొని పోవడానికి ప్రతి ఉదయం ఒక మనిషి సన్న్యాసి దుస్తులలో వస్తుండేవాడు. అతని చేతులు, అతని కండ్లు పూలకోసం మొగంవాచినట్లుండేవి; అందినంతవరకు ఒక్క పువ్వును గూడ వదలకుండా అన్నీ త్రుంపుకొని పోయేవాడు. వాటినన్నిటిని అతడు ప్రాణంలేని ఒక రాతి బొమ్మకు అర్పించబోతున్నాడనేది స్పష్టం. సూర్యోదయ సమయంలో అప్పుడే విచ్చుకొంటున్న ఆ లేత పువ్వులు చాల అందంగా వుండేవి. పోనీ, వాటిని మెల్లగానైనా త్రుంచడం లేదు, చెట్టునుండి నిర్లక్ష్యంగా పెరికివేసేవాడు. తోటకున్నదంతా చాల దౌర్జన్యంగా ఊడబెరుకుకొని ఖాళీ చేసేవాడు – నిలువు దోపిడీ చేసేవాడు. అతని దేవుడికి పూలరాసులు కావలసి వచ్చినాయి – ప్రాణంలేని రాతిబొమ్మకు ప్రాణమున్న వస్తువులు అవసరమైనాయి!

ఇంకొకనాడు కొందరు చిన్నపిల్లలు పూలు కోయడం చూచినాను. వాటిని వాండ్లు ఏ దేవునికిన్ని అర్పింపబోవడం లేదు. మాట్లాడుతూ మాట్లాడుతూ, అనాలోచితంగా వాటిని త్రుంచి ముక్కలుచేసి దూరంగా పారవేస్తూ వుండినారు. మీరు చేసే యీ పనిని మీ రెప్పుడైనా గమనించారా? మీ రెందు కటువంటి పని చేస్తారో నాకు ఆశ్చర్యం వేస్తుంది. దారిన పోతూ పోతూ మీరొక రెమ్మను విరుస్తారు, దాని ఆకుల నన్నిటిని దూసి పోస్తారు, చివరి కారెమ్మను ఎక్కడో జారవిడుస్తారు. మీరు చేసే యీ అనాలోచితమైన పని మీ దృష్టికెన్నడూ రాలేదా? పెద్దవాండ్లుగూడ ఈ పని చేస్తారు. వాండ్లు తమలో వుండే పశుత్వాన్ని, ప్రాణిమాత్రుల యెడ తమకున్న దారుణమైన నిర్లక్ష్యాన్ని, తమ తమ ప్రత్యేక ధోరణులలో తాముహ్ను వెలిబుచ్చుతారు. ఎవరికిన్ని హాని చేయరాదని కబుర్లు మాత్రం చెబుతారు, కాని వారు చేసే ప్రతి పనీ హానికరమైనదే, నాశనం కలుగజేసేదే.

మీ తలలో తురుముకోవడంకోసంగాని ప్రేమతో ఎవరికన్నా ఇవ్వడం కోసంగాని ఒకటి రెండు పూలు కోసికోడాన్ని అర్థం చేసికోగలం. కాని వాటిని ఊరకనే పెరికి పారవేయడమెందుకు? పెద్దవాండ్లు తమకున్న పేరాశలతో అందవికారంగా కనబడతారు. వాండ్లు చేసే యుద్ధాలలో కసాయివాండ్లలాగా ఒకరి కుత్తుకల నొకరు నరుకుకొంటారు. డబ్బు చూపించి ఒకరినొకరు అవినీతిపాలు చేసికొంటారు. వారు చేసే ఘోరమైన పనులు వేర్వేరుగా వుంటుంటాయి. ఇతర దేశాలలో మాదిరిగా ఇక్కడి యువకులు కూడ వారి అడుగుజాడలలోనే నడుస్తూ వుండడం అందరికీ తెలిసిన విషయమే.

ఇటీవల ఒకనాడు నేనొక పిల్లవానితో కలిసి వాహ్యాళికి వెళ్ళుతూ వుండగా

దారికడ్డంగా రోడ్డుమీద ఒక రాయి కనిపించింది. దానిని అక్కడినుండి నేను తొలగిస్తే "ఎందుకట్లా చేశా" రని ఆ పిల్లవా డడిగినాడు. ఇది దేనిని సూచిస్తుంది? వివేచనా రాహిత్యాన్ని, నిర్లక్ష్యాన్నే గదా సూచించేది? మీ రితరులకు భయంచేత గౌరవం చూపిస్తారు, నిజంకాదా? ఎవరైనా పెద్దమనిషి గదిలోకి వస్తే, వెంటనే ఎగిరిలేచి నిలబడతారు. కాని అది గౌరవం చూపడం కాదు. అది మీ భయాన్ని సూచిస్తుంది. ఎందుకంటే నిజంగా మీలో గౌరవబుద్ధే వున్నట్టయితే, మీరు పూలను ధ్వంసం చేయరు, రోడ్డుమీద అడ్డంగా పడివున్న రాతిని తొలగిస్తారు. చెట్లను పెంచుతారు, తోటను జాగ్రత్తగా చూచుకోవడంలో తోటమాలికి సహాయపడతారు. కాని, పెద్దలంగాని పిల్లలంగాని, మనలో యితరుల కష్టసుఖాలను గూర్చిన ఆలోచన బొత్తిగా వుండదు. ఎందువలన? మనకు ప్రేమ అనేది తెలియకపోవడం వల్లనా?

మామూలుగా ప్రేమ అంటే యేమిటో మీకు తెలుస్తుందా? క్లిష్టమై చిక్కుతోగూడిన స్త్రీపురుషుల ప్రేమాగాదు, దైవప్రేమాగాదు, కేవలం ప్రేమ – అంటే ప్రతిదాని యెడల దయార్ద్ర భావంతో, నిజమైన సౌజన్యంతో వ్యవహరించడం. ఇటువంటి ప్రేమ మీ యింటివద్ద మీ కెల్లప్పుడు లభింపదు, దానికి కారణం మీ తల్లిదండ్రులకు మీపై ప్రేమ చూపడానికి తీరిక వుండదు. ఇంటివద్ద మీకు నిజమైన ప్రేమ లభింపకపోవడంచేత, మెత్తని మనస్సు దయాదాక్షిణ్యములు కరువవడంచేత, కొరడుపారిన మనస్తత్వంతో మీరిక్కడికి వస్తారు; అందరిమాదిరే మీరున్ను ప్రవర్తిస్తారు. మరి మీలోకి అటువంటి సున్నితమైన మనస్తత్వాన్ని ఎట్లా తేగలము? దాని అర్థం, పూలు కోయరాదనే నియమనిబంధనలు పెట్టవలెనని కాదు. కేవలమిట్టి నియమ నిబంధనలచేత మిమ్మాపనినుండి విరమింపజేసినట్టయితే అప్పుడు మీలో భయం చోటుచేసికొంటుంది. ఏ మృదుస్వభావ ముండడంవలన మీరు జనులకుగాని, జంతువులకుగాని, పువ్వులకుగాని హాని కలుగకుండా, అప్రమత్తంగా వుంటారో అట్టి మృదుస్వభావము మీలో ఏ విధంగా రాగలదు?

మనం మాట్లాడుకొనే ఈ విషయాలలో మీకేమైనా అభిరుచి వున్నదా? ఇందులో మీ కభిరుచి వుండి తీరాలి. మృదు స్వభావం కలిగివుండడంలో మీకాసక్తి లేకపోతే మీరు జీవించుచున్నట్లు కాదు, మీరు మృతప్రాయులు. నిజానికి చాలమంది అట్టివారే. వారు దినానికి మూడు పర్యాయములు తిండి తినవచ్చుగాక, ఉద్యోగాలు చేసికొంటూ వుండవచ్చుగాక, బిడ్డలను కనవచ్చుగాక, కార్లలో ప్రయాణం చేయవచ్చుగాక, నాణ్యమైన గుడ్డలు ధరించవచ్చుగాక, అయినా వారు మృతప్రాయులే, జీవిస్తున్నవారిలో లెక్కకు రారు.

సంవేదన శీలురై వుండడమంటే యేమిటో మీకు తెలుసునా? అంటే ప్రతి వస్తువునెడ దయార్ద్ర చిత్తులై వుండడం – ఏదైనా జంతువు బాధపడుతూ వుంటే చూచి దానికేదైనా చేతనైన పరిచర్య చేయడం, దారిలో అడ్డంగా పడివున్న రాతిని ప్రక్కకు తొలగించి వేయడం – ఎంతోమంది చెప్పులు లేకుండా ఆ దారి వెంబడి నడుస్తారు గదా మరి! రోడ్డుమీద పడియున్న యినుప మేకును తీసి దూరంగా పారవేయడం – లేకపోతే దానిమూలాన ఎవరి కారుచక్రానికైనా

రంధ్రం (పంక్చరు) పడవచ్చు గదా! సంవేదనశీలురై వుండడమంటే మానవులు, పక్షులు, పూవులు, చెట్లు – వీటన్నిటియెడ మృదువుగా ప్రవర్తించడం. వారందరు మనవారనీ అవన్నీ మనకు సంబంధించినవనీ కాదు, కాని వాటన్నిటిలోని అద్భుత సౌందర్యమును మనము గమనించి వుండడంచేత. మరి యిట్టి సంవేదన శీలతను ఎట్లు తీసికొనిరాగలము?

మీలో సంవేదనశీలత లోతుగా వున్నట్లయితే, ఆ క్షణము నుండి మీరు సహజంగానే పూలు త్రుంచరు. ఏ వస్తువునూ నాశనం చేయరాదని, ఎవరినీ హింసించరాదని సహజంగానే మీలో బుద్ధి పుడుతుంది. అంటే దాని అర్థం మీకు ప్రతిదాని యెడ నిజమైన ఆదరభావము, ప్రేమ వున్నట్లు. ప్రేమించడమనేది జీవితంలో చాలా ముఖ్యమైన విషయం. కాని ప్రేమ అంటే మన ఉద్దేశ్యమేమిటి? ఒకరు మనలను ప్రేమిస్తున్నారు కాబట్టి అందుకు బదులుగా మనమా మనిషిని ప్రేమిస్తే అది ప్రేమ అనిపించుకోదు. ప్రేమించడమంటే దానికి ప్రత్యామ్నాయంగా మరి దేనినీ కోరకుండా, నిర్హేతుకమైన అద్భుతమైన ప్రేమభావాన్ని మనలో కల్గియుండడం. మీరు చాల తెలివిగలవారు కావచ్చు, అన్ని పరీక్షలు పాసై డాక్టరేట్ డిగ్రీ పొందియుండవచ్చు, ఉన్నత పదవిని సాధించి యుండవచ్చు. కాని యీ సంవేదనశీలత మీలో లేనట్టయితే, యీ సహజమైన ప్రేమ మీలో ఉద్బుద్ధము కాకపోతే మీ హృదయము శూన్యము, మీ జీవితము ఆనంద రహితము అవుతుంది.

కాబట్టి హృదయము ఈ ప్రేమభావంతో నిండి వుండడం చాల అవసరం. అప్పుడు మీరు దేనినీ ధ్వంసము చేయరు, ఎవరి యెడలను నిర్దయగా వ్యవహరించరు, యుద్ధములంటూ ఇక ఉండబోవు. అప్పుడు మీరు ఆనందముతో జీవితము గడుపునట్టి సంపూర్ణ మానవులు. మీ రానందంగా వుంటారు కాబట్టి మీరిక ప్రార్థనలు చేయరు, దేవునికోసం అన్వేషణ కొనసాగించరు. కారణమేమనగా ఆ యానందమే గదా దేవుడు!

మరి యీ ప్రేమ అనేది యెట్లా వస్తుంది? వాస్తవానికి ఈ ప్రేమ విద్యాబోధకుని వద్దనుండి, ఉపాధ్యాయుని వద్దనుండి ఆరంభం కావాలి. గణితశాస్త్రము, భూగోళ శాస్త్రము, దేశచరిత్ర మొదలగు పాఠ్య విషయాలను బోధించడంతో బాటు, ఉపాధ్యాయుడు ఈ ప్రేమ భావాన్ని తన హృదయంలో కలిగివుండి, దాని గురించి మాట్లాడుతూ వుంటే, పదిమంది నడిచే బాటలో అడ్డంగా పడివున్న రాతిని అతడు స్వయంగా తొలగించితే, రోత కలిగించే నీచమైన పనులను తన సేవకునిచేత చేయించకుండావుంటే, తన మాటలలో చేతలలో, మీతోబాటు ఆడుకొనేటప్పుడుగాని తిండి తినేటప్పుడుగాని, లేదా మీతో వున్నా లేక ఒంటరిగా వున్నా అతడీ అద్భుత వస్తువును కలిగియుండి, మీకు దాని గురించి తరచు గుర్తుచేస్తూ వుంటే అప్పుడు మీరుకూడ ప్రేమంటే యేమిటో, ప్రేమించడమంటే యేమిటో తెలిసికోగలరు.

మీ శరీరం శుభ్రంగా కాంతిమంతంగా వుండవచ్చు, ముఖము అందంగా వుండవచ్చు, అందమైన చీరె కట్టుకొని యుండవచ్చు లేదా గొప్ప క్రీడాకారులై యుండవచ్చు. కాని, మీ హృదయంలో గనక ప్రేమ లేకపోతే, మీరొక అందవికారమైన మానవప్రాణి. మీ అందవికారానికి అంతుండదు. అట్లుగాక మీలో ప్రేమ వున్నట్లయితే మీ ముఖము

అందంగావున్న లేకపోయినా అందులో ఒక విధమైన దీప్తి కనిపిస్తుంది. ఒకవిధమైన కళ వుంటుంది. ప్రేమించడమనేది జీవితంలో అన్నిటికంటె గొప్ప విషయము. ప్రేమను గురించి మాట్లాడడం, మానసికంగా దాని అనుభూతిని పొందడం, దానిని పెంపొందించుకోవడం, ఒక నిధివలె భద్రంగా కాపాడుకోవడం ఎంతో అవసరం. అట్లు చేయకపోతే అది త్వరలో క్షీణించిపోతుంది – ప్రపంచము అతి క్రూరమైనది గదా – దానిని నాశనం చేయజూస్తుంది. మీరు చిన్నపిల్లలుగా వున్నప్పుడే మీలో ప్రేమలేకపోతే మనుషులవైపు, జంతువులవైపు, పూలవైపు మీరు ప్రేమతో చూడకపోతే, మీరు పెద్దైన తరువాత మీ జీవితము శూన్యమని తెలిసికొంటారు. మీ రొంటరిగా జీవితం గడుపుతారు. భయము యొక్క నల్లనినీడలు మిమ్మె వదలక వెన్నాడుతూనే వుంటాయి. కాని మీ హృదయంలో ఏ క్షణాన్నైతే ఈ అద్భుతమైన ప్రేమ యనెడి పదార్థము చోటు చేసికొంటుందో, దాని లోతును మీరు తెలిసికొన గల్గుతారో, దానివలన ఆనందము కలిగి అందులో పరవశించి పోతారో, అప్పుడే ప్రపంచమే మారిపోయినట్లుగా మీకనిపిస్తుంది.

1. **ప్రశ్న:- పాఠశాలలోని ఉత్సవములకు ఎల్లప్పుడును ఎక్కువగా ధనవంతులను, ఇతర ప్రముఖులను మాత్రమే ఆహ్వానిస్తూ వుంటారు, ఎందువలన?**

**కృష్ణమూర్తి:-** ఎందువలన అని మీరనుకొంటారు? మీ తండ్రి ఒక ప్రముఖ వ్యక్తిగా వుండాలని మీరు కోరుకోరా? ఆయన లోక్‌సభ సభ్యుడుగా ఎన్నుకొనబడితే, ఆయన పేరు వార్తాపత్రికలలో ప్రచురింపబడితే మీరు గర్వించరా? ఉండడం కోసం మిమ్మల్ని ఒక పెద్ద బంగళాలోనికి మీ తండ్రి తీసికొనిపోతే, లేదా ఐరోపాకు వెళ్ళి, ఒక పెద్ద చుట్ట నోట్లో పెట్టుకొని గుప్పుగుప్పుమని పొగ వదులుతూ తిరిగి వస్తే అప్పుడు మీకెంత సంతోషం!

చూడండి, ధనవంతులున్ను అధికారంగలవారున్ను ఇటువంటి సంస్థలకు చాల ఉపయోగం. సంస్థ వాండ్లను పొగడుతుంది; వాండ్లు సంస్థకు ఏదైనా సహాయం చేస్తారు – ఈవిధంగా ఇది ఉభయతారకం, ఇద్దరికిని సంతోషం కలిగించేది. కాని యిందులో ముఖ్యమైన ప్రశ్న, పాఠశాల తన ఉత్సవాలకు ప్రముఖ వ్యక్తులను ఎందుకాహ్వానిస్తుంది అనేదికాదు. మీరు కూడా ప్రముఖ వ్యక్తిగా వుండాలని ఎందుకు కోరుకొంటారు? బాగా డబ్బున్నవాడిని, పేరున్నవాడిని, గొప్ప అందగాడిని పెండ్లి చేసికోవాలని మీరెందుకు కోరుకొంటారు? ఎందులోనో ఒకందులో గొప్పవారు కావాలని మీరందరు కోరుకోరా? మీకాకోరికలున్నట్టయితే అప్పుడే మీలో అవినీతి బీజములు పడ్డాయన్న మాటే. నేను చేప్పేది మీకర్థమౌతున్నదా?

పాఠశాల ధనవంతులనెందు కాహ్వానిస్తుంది అనే ప్రశ్నను క్షణకాలం పాటు అటుంచండి, ఈ ఉత్సవాలలో బీదవాండ్లు కూడ ఎక్కువగానే వున్నారు. అయితే మీలో ఎవరైనా బీదవాండ్ల పక్కన కూర్చుంటారా? పల్లెప్రజల పక్కన కూర్చుంటారా? నిజంగా ఆ పని చేయగలరా? మరియొక అసాధారణమైన విషయం – సన్న్యాసులు తాము ప్రముఖ స్థానాలలో కూర్చోవడంకోసం ఎంతగా తహతహలాడుతారో, అందరినీ

త్రోసుకుంటూ దారిచేసికొని ముందుకెట్లా వస్తారో మీరు గమనించారా? మనందరికి ప్రాముఖ్యం కావాలి, గుర్తింపు కావాలి. అసలు ఎవరినుండి ఏమిన్నీ కోరనివాడే నిజమైన బ్రాహ్మణుడు. అతడట్లు కోరకపోవడానికి కారణం అతనికున్న గర్వంకాదు, అభిమానం కాదు. దానికి కారణం అతడు తనకుతానే వెలుగు. కాని అదంతా మనమిప్పుడు పోగొట్టుకొన్నాం.

అలెగ్జాండరు భారతదేశానికి వచ్చినప్పుడు అతని గురించిన ఆశ్చర్యకరమైన కథ ఒకటి వున్నది, అది మీకు తెలుసునా? అతడు దేశాన్ని జయించిన తరువాత, ఆ దేశంలో అంత మంచి వ్యవస్థను ఏర్పాటు చేసి, ప్రజలలో నిజాయితీని పెంపొందించి, అవినీతికి ఏమాత్రమున్నా అవకాశం లేకుండా పరిపాలన సాగించిన ప్రధానమంత్రిని చూడగోరినాడట. అప్పుడా దేశపురాజు ప్రధానమంత్రి ఒక బ్రాహ్మణుడని, అతడు తన గ్రామానికి వెళ్ళిపోయినాడని చెప్పగా, అతనిని పిలిపించమని, తాను చూస్తానని అలెగ్జాండరు అన్నాడట. రాజు ప్రధానమంత్రి కోసం కబురు పంపగా అతడు రావడానికి ఇష్టపడలేదట. దానికి కారణం పదిమంది యెదుట తానొక గొప్పవాడుగా నిలబడి పొగడ్తల నందుకోవడం అతని కిష్టము లేదు. దురదృష్టవశాత్తు మనమిప్పుడట్టి స్వభావాన్ని పోగొట్టుకొన్నాము. మనము అంతఃశూన్యులము, మందబుద్ధులము, నిత్యదుఃఖితులము. కాన మానసికంగా భిక్షుకులమైనాము. ఎవరో ఏదో వచ్చి మనకు ఉత్సాహము నివ్వాలి, పుష్టి నివ్వాలి, ధైర్యం చెప్పాలి, మనలను ఆదుకొనాలి. అట్టి వ్యక్తులకోసం వస్తువులకోసం అన్వేషిస్తూ వుంటాము. అందువలన మనము మామూలు వ్యవహారాలను గూడ చెడగొట్టుకొంటుంటాము.

ఎవరో ప్రముఖుడైన ఒక అధికారివచ్చి ఏదో భవనానికి పునాదిరాయి వేయడంలో తప్పేమున్నది? అది మంచిదే. కాని దానివెనుకవున్న ఉద్దేశ్యమే చెడ్డది. మీరెప్పుడైనా పల్లె ప్రజలను చూడడంకోసం వెళ్తారా? వెళ్ళరు. వాండ్లతో మీరు మాట్లాడరు, వాండ్ల అనుభూతిని మీరు పంచుకొనరు. వాండ్లకు తినడానికి ఎంత తక్కువగా దొరుకుతుందో, దినదినము విశ్రాంతి అనేది యెరుగకుండా కలకాలమెట్లా పాటుపడుతూ వుంటారో మీరు స్వయంగా వెళ్ళి చూడరు. కాని నేను మీ దృష్టిని కొన్ని విషయాలవైపు ఆకర్షించి వుండడంచేత అది ఆధారంగా తీసికొని మీరితరులను విమర్శించడానికి మాత్రం సిద్ధమైనారు. చుట్టూ చేరి కూర్చుండి కేవలం విమర్శలు చేస్తూ వుండకండి. అది వృథా. దానిబదులు పల్లెలకుపోయి అక్కడి పరిస్థితులను స్వయంగా చూచి తెలిసికొని, అక్కడ ఏదైనా మీరు చేయగల్గినది చేయండి – ఏదైనా మొక్కను నాటండి, పల్లెప్రజలతో కలిసి మాట్లాడండి, వాండ్ల నిక్కడికి ఆహ్వానించండి, వాండ్ల పిల్లలతో ఆడుకోండి. అప్పుడు దేశమంతటా ప్రేమ వెల్లివిరుస్తుంది. దానితో నూతన సమాజము ఆవిర్భవించడం మీరు చూడగలరు. ప్రేమలేని సమాజము నదులు లేని భూమివంటిది, ఎడారి వంటిది. ఎక్కడైతే నదులుంటాయో అక్కడి భూమి ధనవంతమైనది, సమృద్ధమైనది, కన్నుల విందైనది. మనలో చాలమంది ప్రేమకు నోచుకోలేదు; ప్రేమ అంటే యేమిటో యెరుగకుండానే పెరిగి పెద్దవాండ్లమైనాము. అందువల్లనే మనము నిర్మించుకొన్న సమాజము కూడ అందలి సభ్యుల మాదిరే భయంకరమైనది, అందవికారమైనదిన్ని.

2. ప్రశ్న:- చెక్కిన విగ్రహంలో దేవుడులేడని మీరంటారు. కాని అక్కడే వున్నాడని, మీ హృదయాలలో నమ్మకమున్నట్లయితే ఆ దేవుని శక్తి ప్రకటితమవుతుందని ఇతరులంటారు. మఱి పూజలోని సత్యమేమి?

కృష్ణమూర్తి:- ప్రపంచంలో ఎంతమంది మనుషులున్నారో అన్ని అభిప్రాయాలుంటాయి. అభిప్రాయమంటే యేమిటో మీకు తెలుసును గదా! మీరొక విధంగా చెబుతారు, మరియొకరు మరియొక విధంగా చెబుతారు. ఎవరి యభిప్రాయం వారిది. కాని అభిప్రాయమేదిన్నీ సత్యము కాదు. కాబట్టి ఎంత గొప్పవారి యభిప్రాయమైనాసరే వినిపించుకోవద్దు. దానిబదులు ఏది సత్యమో ఏది కాదో మీయంతట మీరే తెలిసికోండి. రాత్రికిరాత్రి అభిప్రాయాలను మార్చుకోవచ్చును. కాని సత్యము నట్లా మార్చలేము.

సరే, మరి చెక్కిన విగ్రహంలో దేవుడున్నాడా లేడా, అందులో సత్యమున్నదా లేదా అనే విషయాన్ని మీయంతట మీరు తెలిసికొనగోరుతారు, అంతేనా? చెక్కిన విగ్రహమంటే యేమిటి? అది మనస్సుతో ఊహింపబడి, కొయ్యమీదగాని రాతిమీదగాని చేతితో చెక్కబడినది. మనస్సు విగ్రహమును ఊహిస్తుంది. అట్లా మనస్సుచేత ఊహింపబడిన విగ్రహము దేవుడని ఒక లక్షమంది జనులు గట్టిగా బల్లగుద్ది చెప్పినాసరే, మీరది నిజమని అనుకొంటారా?

మనస్సుకు విగ్రహంమీద నమ్మకమున్నట్టయితే, అప్పుడా విగ్రహము మనస్సుకు శక్తి నిస్తుందని మీరంటారు. అందులో మాత్రం సందేహం లేదు. మనస్సు విగ్రహాన్ని సృష్టిస్తుంది. అంతట తాను సృష్టించిన విగ్రహాన్నుండి శక్తిని పొందుతుంది. మనస్సు నిరంతరము చేస్తున్న పని అదే – ప్రతిమలను లేదా విగ్రహాలను సృష్టించడం, వాటినుండి బలాన్ని, సుఖాన్ని, ఏదైనా ప్రయోజనాన్ని పొందడం. అందువలన అట్టి మనస్సు అంతఃశూన్యమైనది, ఆంతరిక దారిద్ర్యముచే పీడింపబడునది. కాబట్టి విగ్రహం కాదు ముఖ్యం, లక్షలాది మనుష్యులు చెప్పేది కాదు ముఖ్యం, మరి ముఖ్యమేమంటే మీ మనస్సు పనిచేసే తీరును అర్థం చేసికోనడమే.

మనస్సు దేవుళ్ళను సృష్టిస్తుంది, నశింపజేస్తుంది. అది దయగలది, దయ లేనిదికూడ. అది యెంతో అద్భుతములైన కార్యములను చేయగల శక్తిగలది. అది అభిప్రాయాలను కలిగి వుండగలదు, భ్రమలను పుట్టింపగలదు, బ్రహ్మాండమైన వేగముతో ప్రయాణము చేయగల జెట్ విమానాలను నిర్మింపగలదు, అందమైన వంతెనలను కట్టగలదు, విశాలమైన రైలు మార్గాలను వేయగలదు, మనిషికంటె మిన్నగా లెక్కలు చేయగల యంత్రాలను కనుగొనగలదు. కాని మనస్సు సత్యమును సృష్టించలేదు. అది సృష్టించ గలిగినది సత్యమును కాదు, కేవలమొక అభిప్రాయమును, ఒక నిర్ణయమును మాత్రమే. కాబట్టి సత్యమంటే యేమిటో మీయంతట మీరు తెలిసికోవడం అవసరము.

సత్యమంటే యేమిటో తెలిసికొనవలెనంటే మనస్సు బొత్తిగా కదలకుండా సునిశ్చలంగా వుండాలి. అట్లా నిశ్చలంగా వుండడమే పూజ చేయడం. పూవుల నర్పించుదామని గుడికి పోవడంగాని, ఆ పోయే దారిలో వున్న బిచ్చగాండ్లను ప్రక్కకు

త్రోసివేయడంగాని పూజకాదు. మీరు దేవతలకు భయపడతారు. కాబట్టి వారిని ప్రసన్నం చేసికొందామని ప్రయత్నిస్తారు. కాని మీరు చేసేది పూజకాదు. మీరు మీ మనస్సును అర్థము చేసికొంటే, అప్పుడది పూర్తిగా నిశ్చలత్వమును పొందితే – మీరుదానిని నిలుకడ పొందునట్లు చేయడానికై ప్రయత్నించకుండా, దానంతట అది నిలుకడ పొందితే – అప్పుడా నిశ్చలతయే, ఆ నిలుకడయే, పూజించడము. మరియును ఆ నిశ్చలతలోనే సత్యము, సుందరము, దైవమని పిలువబడునదేదో అది ప్రత్యక్షమవుతుంది.

3. **ప్రశ్న:- ప్రశాంతంగా కూర్చుండి మన మనస్సు పనిచేసే తీరును గమనిస్తూ వుండమని మీరొకనాడు చెప్పియున్నారు. కాని మనం మన ఆలోచనలను జాగ్రత్తగా గమనించడం మొదలు పెట్టగానే అవి అంతర్ధానమై పోతున్నాయి - ఆగిపోతున్నాయి. మనస్సే ద్రష్ట (చూచేది), మనస్సే దృశ్యము (చూడబడేది) అయినప్పుడు, మన మనస్సును మనమెట్లు దర్శింపగలము?**

**కృష్ణమూర్తి:-** ఇది చాల జటిలమైన సమస్య; ఇందులో అనేక విషయాలు చేరివున్నాయి.

అది సరే, అసలు ద్రష్ట అనేవాడొకడున్నాడా? లేక దర్శించడమేనా జరుగుతున్నది? దయచేసి దీనిని చాల జాగ్రత్తగా అర్థము చేసికోండి. ఆలోచించేవాడంటూ వేరే వున్నాడా లేక కేవలము ఆలోచించడమేనా వున్నది? మొదట్లో ఆలోచించేవాడు లేడన్నది తథ్యము; మొదట్లో వున్నది ఆలోచించడమే. అప్పుడా ఆలోచించడము నుండి ఆలోచించేవాడు సృష్టింపబడినాడు. అంటే ఆలోచించడమనే ప్రక్రియ రెండుగా విభక్తమైనది. ఈ విధంగా విభజనమేర్పడినప్పుడే చూచేవాడు, చూడబడునది అంటే ద్రష్ట మరియు దృశ్యమని విభేదము కనిపిస్తుంది. అందువలన యీ ప్రశ్నవేసిన వ్యక్తి అన్నట్లుగా, మీరు మీ మనస్సును గమనిస్తూ వుంటే, మీరొక ఆలోచనను కనిపెట్టి చూస్తూ వుంటే, ఆ యాలోచన అదృశ్యమై పోతుంది, మాసిపోతుంది. కాని నిజానికి వున్నది దర్శన ప్రక్రియయేగాని ద్రష్టకాదు; దర్శించడమేగాని దర్శించేవాడులేడు, చూడడం మాత్రమే జరుగుతున్నది గాని చూచేవాడు లేడు. మీరొక పూవును చూస్తున్నప్పుడు, సరిగ్గా మీరు చూస్తున్న ఆ క్షణంలో చూచే వ్యక్తి వున్నాడా? లేక చూడడం మాత్రమే జరుగుతున్నదా? పూవును చూస్తూ, "అది యెంత అందంగా వున్నది! అది నాకు కావాలి" అని మీరంటారు. అప్పుడు 'నేను' అనే భావన కలిగినట్లు. కాబట్టి చూచిన మరుక్షణం నుండి కలిగే కోరిక, భయము, ఆశ, ఆకాంక్షల ద్వారా 'నేను' అనే భావన కలుగుతున్నది. 'నేను'ను సృష్టించేవి ఈ కోరిక, భయము మొదలైనవి; అవి లేకుండా 'నేను'కు అస్తిత్వమే లేదు.

ఈ ప్రశ్ననంతను ఇంకా లోతుకుపోయి విచారిస్తే ఎప్పుడైతే మనస్సు మిక్కిలి ప్రశాంతంగా వుంటుందో, సంపూర్ణంగా నిశ్చలమైపోతుందో, ఆలోచనా ప్రవాహము పూర్తిగా ఆగిపోతుందో, అట్లాగిపోవడం వలన అనుభవించేవాడుండడో, పరిశీలించేవాడు వుండడో, అప్పుడున్న ఆ నిశ్చలతలో సృజనాత్మకమైన అవగాహన వుంటుంది. ఆ

నిశ్చలతలో మనస్సు రూపాంతరం పొందుతుంది, దాని స్థితిలో మార్పు వస్తుంది. అయితే మనస్సున కట్టి నిశ్చలత ఎట్టి సాధనవలనగాని, ఎట్టి నియమపాలనం వలనగాని, క్రమశిక్షణ వలనగాని, ఎట్టి అభ్యాసం వలనగాని రాదు. ఒక మూల కూర్చుండి ఏకాగ్రత కోసం ప్రయత్నిస్తూ వుంటే వచ్చేదికాదు ఆ నిశ్చలత. మనస్సు పనిచేసే తీరును, మనస్సు పోయే పోకడలను అర్థము చేసికోగలిగితే ఆ నిశ్చలత సిద్ధిస్తుంది. ప్రజలు ఆరాధించెడి రాతి విగ్రహాము సృష్టించినది మనస్సు. భగవద్గీతను, వ్యవస్థీకృతములైయున్న మతములను, అసంఖ్యాకములైన విశ్వాసములను సృష్టించినది మనస్సు. అందుచే సత్యపదార్థమును తెలిసికొనవలెనంటే మనస్సుచే సృష్టింపబడిన వాటినన్నిటిని అతిక్రమించి పోవలసివుంటుంది. [సత్యము వీటి కన్నిటికిని అతీతమైనది.]

**4. ప్రశ్న:- మనిషంటే కేవలం మనస్సు, మెదడు లేక బుద్ధి ఇంతేనా? లేక ఇంకేమైనా అదనంగా వున్నాదా?**

**కృష్ణమూర్తి:-** ఇదెట్లా తెలిసికోగలరు? శంకరుడో బుద్ధుడో లేక మరియొకరో చెప్పినదానిని నమ్మితే, దానిపై ఊహాపోహలు సిద్ధాంతాలు చేస్తే లేదా వారు చెప్పినదానిని అంగీకరిస్తే, దానికి మీ సమ్మతి తెల్పితే మీరు సత్యాన్వేషణ చేస్తున్నట్లుకాదు, సత్యమేదో తెలిసికోడానికి ప్రయత్నిస్తున్నట్లుకాదు.

మీకున్న పనిముట్టు ఒకేయొకటి, అది మీ మనస్సు. మరి మనస్సే మెదడు లేక బుద్ధి కూడ. కాబట్టి యీ విషయము యొక్క యాథార్థ్యమును తెలిసికోవాలంటే మీరు మీ మనస్సు పనిచేసే తీరును అర్థము చేసికోవలసి వుంటుంది, ఏమి అక్కరలేదా? కుటిలమగు మనస్సు ఋజువుగా చూడనే లేదు. పరిమితమగు మనస్సు అపరిమితమును అనంతమును చూడలేదు. సావధికమగు మనస్సు నిరవధికమగు దానిని చూడలేదు. మనస్సే బోధ కలుగుటకు సాధనము. సత్యబోధ కలుగవలెనంటే, సత్యమును దర్శింపవలెనంటే, తత్సాధనమైన మనస్సు ఋజువుగా నుండవలె, దానిలోని పూర్వసంస్కారములను కడిగివేయవలె, దానినుండి భయమును తొలగించవలె. సంపాదించుకొన్న జ్ఞానమునుండి కూడ మనస్సు విముక్తము కావలె; లేనిచో ఆ సంచితమైన జ్ఞానము మనస్సును మరల్చి మరియొక దిశలో పోనిస్తుంది, సర్వమును వికృతముగా - అంటే సత్యమును అసత్యముగా, అసత్యమును సత్యముగా - చూపిస్తుంది. మనస్సు నూతనములైన వాటిని కల్పింపగలదు, లేనివాటిని ఊహింపగలదు, అంచనాలు వేయగలదు, ఆలోచనలు సాగింపగలదు. మనస్సునకున్న యిట్టి అద్భుతమైన సామర్థ్యమును దూరముగా ఒక ప్రక్కకుంచితేనే గదా అది మిక్కిలి నిర్మలమై, మిక్కిలి సరళమై వుండగలిగేది? ఏలయన నిర్దోషమై, అమాయికమైన మనస్సు మాత్రమే, ఎంతో అనుభవ జ్ఞానమును సంపాదించియుండియు దానినుండి సద్యో విముక్తి పొందగల మనస్సు మాత్రమే, తనకును మెదడుకును - లేదా బుద్ధికిని పరముగా నున్నదేదో దానిని దర్శింపగలదు. అట్లుగానిచో మీరు దర్శించునట్టిది, మీ యనుభవ జ్ఞానముచే రంజితమై వుంటుంది. మరి మీ యనుభవజ్ఞానమో, మీరు పొందిన సంస్కారముల ఫలితమే గదా!

5. ప్రశ్న:- ఆవశ్యకతకును అత్యాశకునుగల తేడా యేమిటి?

కృష్ణమూర్తి:- తేడా మీకు తెలియదా? మీకున్న అవసరాలు ఎప్పుడు తీరినదిన్ని మీకు తెలియదా? మీరు అత్యాశ కలిగివుంటే, ఆ విషయమై ఏదో మీకు చెప్పుతున్నట్లనిపించదా? ఏదైనా చాల చిన్న వస్తువుతో ఆరంభించి చూడండి, మీకు దీని సత్యం తేటపడుతుంది. మీకు గుడ్డలు, నగలు, మరేవైనా సరే చాలినన్ని మాత్రమే వున్నప్పుడు మీరు దానిగురించి పెద్దగా తర్కించరు, తర్కించవలసిన అవసరం కనబడదు. అది మీ రెరుగుదురు. కాని యెప్పుడైతే అవి అవసరాన్ని మించి వుంటాయో, ఆవశ్యకత తన క్షేత్రమును దాటి అత్యాశ యొక్క క్షేత్రములోనికి అడుగుపెడుతుందో ఆ క్షణమునుండి మీరు మీ అత్యాశను గూర్చిన వేదాంతం మొదలుపెడతారు, దానిని గూర్చిన సిద్ధాంతములు లేవదీస్తారు, కారణములు చూపి సమర్థించుకోవడం మొదలుపెడతారు, అందులో తప్పులేదని తగిన వివరణలు ఇచ్చుకొంటారు. ఉదాహరణకు, ఒక మంచి ఆస్పత్రికి ఎన్నో పడకలు కావలసి వుంటాయి. ఉత్తమ ప్రమాణంలో శుభ్రతను పాటించవలసి వుంటుంది. క్రుళ్ళిపోకుండ జేసెడి మందులు, విషక్రిములను నశింపజేసెడి మందులు మొదలగునవెన్నో కావలసి వుంటాయి. ప్రయాణం చేయవలసిన మనిషికి బహుశా ఒక కారు, ఒక ఓవరుకోటు మొదలైనవి కావలసి వుంటాయి. ఇవన్నీ ఆవశ్యకతలు. మీ వృత్తిని మీరు కొనసాగించాలంటే దానికి సంబంధించిన కొంత జ్ఞానము, కొంత నేర్పు కావలసి వుంటాయి. మీరు ఇంజనీర్లు అయినట్టయితే మీకు కొన్ని విషయాలు తెలిసి వుండాలి. కాని ఆ జ్ఞానమే అత్యాశకు సాధనం కావచ్చును. అత్యాశ కారణంగా మనస్సు ఆవశ్యకములైన వస్తువులను తన స్వార్థసాధనకై, తన అభివృద్ధికై ఉపయోగించుకొంటుంది. ఇది చాల సరళమైన ప్రక్రియ అని, జాగ్రత్తగా పరిశీలించి చూస్తే మీకే తెలుస్తుంది. మీకు వాస్తవంగా ఆవశ్యకమైన సామాగ్రి యేదో మీకు తెలిసివుండి, దానితోబాటు అత్యాశ యేవిధంగా ఆరంభమవుతుందో, మనస్సు ఆవశ్యక సామగ్రిని తన ప్రాముఖ్యాన్ని పెంచుకోవడం కోసం ఎట్లా ఉపయోగించుకొంటూ వుంటుందో, మీరు చూడగల్గితే అప్పుడు అత్యాశకును ఆవశ్యకతకును గల భేదమును తెలిసికోవడం ఏమంత కష్టము కాదు.

6. ప్రశ్న:- మనస్సున్ను బుద్ధిన్ని (brain) ఒకటే అయినట్టయితే, ఏదైనా ఒక తలంపో లేదా ఒక తీవ్రమైన కోరికయో తలెత్తినపుడు, బుద్ధి అది మంచిదికాదని, అసుందరమైనదని హెచ్చరిస్తూవున్నా, మనస్సు వాటివెంబడే మామూలుగా పోతూ వుంటుంది. ఎందువలన?

కృష్ణమూర్తి:- వాస్తవంగా జరిగేదేమిటి? ఒక గుండుసూది మీ చేతికి గ్రుచ్చుకొన్నట్టయితే, నాడులు ఆ సంవేదనను మెదడుకు తీసికొనిపోతాయి. మెదడు దానిని నొప్పిగా తెలియజేస్తుంది. అప్పుడు మనస్సు ఆ నొప్పికి వ్యతిరేకంగా తిరుగబడుతుంది. అప్పుడు మీరు ఆ గుండుసూదిని అక్కడి నుంచి తీసివేస్తారు, లేదా మరేదైనా ప్రతిక్రియ చేస్తారు. అదే విధంగా కొన్ని కొన్ని విషయాలు

అసుందరములని, మూర్ఖములని తెలిసినప్పటికిన్ని మనస్సు వాటిని వదిలిపెట్టదు. పొగ త్రాగడం నిశ్చితంగా చెడ్డ అలవాటని మనస్సుకు తెలిసినా, మనిషి దానిని విడిచిపెట్టడు. ఎందుకని? పొగ త్రాగడంవలన కలిగెడి సంవేదన మనస్సుకు ప్రీతిని కలిగిస్తుంది, అంతే. అంతకంటె వేరే కారణం లేదు. గుండుసూదితో గ్రుచ్చినప్పుడు దానివలన కలిగెడి నొప్పిని మనస్సు ఎంత తీవ్రంగా గ్రహించిందో అంత తీవ్రంగా పొగ త్రాగడము నందలి తెలివితక్కువను గూడ మనస్సు గ్రహిస్తే – అది, పొగ త్రాగడాన్ని వెంటనే ఆపివేస్తుంది. కాని ఆ తెలివితక్కువతనాన్ని అంత స్పష్టంగా చూడడం మనస్సున కిష్టము లేదు. కారణమేమంటే, పొగ త్రాగడం దానికొక ప్రీతిదాయకమైన అలవాటుగా పరిణమించినది. ఇదే విధంగా లోభ విషయంలోను, హింస విషయంలోను – మీచేతిమీద గుండుసూదితో గ్రుచ్చినప్పుడు ఎంత బాధ కలిగిందో అంత బాధ లోభమువలన గూడ మీకు గలిగితే, మీరు వెంటనే లోభమును వదిలిపెడతారు. దానిని సమర్థించడానికి ప్రయత్నించరు, దానిని గూర్చి సిద్ధాంతములు చేయరు. అదే విధంగా హింసయొక్క పూర్తి పరిణామ మెట్లుంటుందో మీకు నిజంగా తెలిసివుంటే, అహింసను గూర్చి పెద్ద పెద్ద గ్రంథములను మీరు వ్రాయరు, వ్రాయవలసిన పనిలేదు. ఆ వ్రాత అంతా అర్థము లేనిపని; అది మానసికంగా మీరు అనుభూతి చెందినది కాదు. కేవలం దానిగురించి మాట్లాడుతారు – అంతే. మీరేదైనా తిన్నప్పుడు తీవ్రమైన కడుపునొప్పి వస్తే, మీరింకా దానినే తింటూ వుంటారా? తినరు గదా! దానిని వెంటనే ప్రక్కకు త్రోసివేస్తారు. అదే విధంగా, ఈర్ష్య మరియు పేరాశ విషపూరితములని, దుష్టమైనవని, క్రూరములని, త్రాచుపాము కాటువలె ప్రాణాంతకములని మీరొక్కసారి గ్రహిస్తే, అప్పటినుండి వాటియెడ మెలకువతో వుంటారు. కాని, చూశారూ, మనస్సు ఈ విషయముల గురించి అంత సూక్ష్మ పరిశీలన చేయగోరదు. ఈ విషయాలలో మనస్సుకు కొంత స్వార్థమున్నది, కొంత ప్రయోజనమున్నది. పేరాశ, ఈర్ష్య, అత్యాశ, స్త్రీ వ్యామోహము విష పూరితములనే విషయాన్ని అంగీకరించడానికి మనస్సు నిరాకరిస్తుంది. అందువలన "అలోభమును గూర్చి, అహింసను గూర్చి చర్చిద్దాం. వాటిని ఆదర్శాలుగా పెట్టుకొందాం" అని అంటుంది. ఈ లోపల యీ విష పదార్థాలతో తనపని తాను చేసికొంటూ పోతుంది. అందువలన యీ గుణములెంత దుష్టములో, ఎంత వినాశకరములో, ఎంత విషపూరితములో మీయంతట మీరు తెలిసికొంటే, వెంటనే వాటిని మీరు వదిలిపెడతారు. అట్లుగాక కేవలం "నేనట్లా చేయగూడదు" అని మాత్రం అంటూ, పూర్వపద్ధతిని మాత్రం వదలక, యథాప్రకారం మీ దారిన మీరు పోతూవుంటే మీరు దంభవ్రతులన్నమాట; మీరు చెప్పేదానికి, చేసేదానికిన్ని పొత్తుండదు. కాబట్టి, మీరేదో ఒకదారి త్రొక్కండి – అటో, యిటో – వేడిదారిగాని, చల్లనిదారిగాని.

*31 జనవరి, 1955*

★ ★ ★

# 23. ఏకాంత వాసము

నేటి ప్రపంచంలో కాలక్షేపం కోసం, మనోరంజనం కోసం ఏర్పడిన సాధనములకు అంతమే లేదు. అయితే వాటిల్లో పాల్గొనే నటీనటులు మాత్రం చాల తక్కువ. దాదాపు అందరూ ప్రేక్షకుల్లా, చూచి ఆనందించువారే, మనస్సు ఉల్లాస పరుచుకొనువారే. ఇది చాల ఆశ్చర్యకరమైన విషయం కాదా? ఏమాత్రం తీరిక దొరికినా, మనస్సున కుల్లాసం కలిగించే వినోదములు, వేడుకలకోసం ప్రాకులాడుతాం. మనస్సును ఆకట్టుకొనే యేదైనా పుస్తకాన్నో, నవలనో, పత్రికనో తీసికొని చదవడం మొదలుపెడతాం. అమెరికాలోనైతే రేడియో పెట్టుకొంటాం, టెలివిజన్ చూస్తాం. ఇవేవీ కాకపోతే అంతులేని బాతాఖానీలోకి దిగిపోతాం, అనవసరమైన ముచ్చటలాడుకొంటూ కాలక్షేపం చేస్తాం. మన కెప్పుడూ ఏదోయొక వినోదమో, వేడుకో వుండాలి. ఎంత సేపటికీ మననుండి మనం పారిపోజూస్తాం. మనం ఒంటరిగా వుండడానికి భయపడతాం. ఎవరూ తోడులేకపోతే, ఏదోయొక కాలక్షేపం లేకపోతే – యేమి చేయాలో తోచక – భయపడతాం. పొలాల వెంబడి, అడవుల వెంబడి నడుస్తూ ఏమీ మాట్లాడకుండా పాటలు పాడకుండా, పూర్తి మౌనంతో, మనకు బయటా, మన లోపలా వున్న ప్రపంచాన్ని జాగ్రత్తగా గమనిస్తూ వాహ్యాళి పోయేవారు చాల అరుదు. మనం అటువంటి పనిచేయం. ఎందుకంటే చూడండి, మనలో చాలమందిమి విసుగెత్తి అలసిపోయి వుంటాం. ఎప్పుడూ చదువు, చదువు చెప్పడమో, లేకపోతే ఇంటిపనులు చూచుకోవడమో, ఉద్యోగం చేసికోవడమో – ఇటువంటి నిరానందకరమగు దినచర్యలో పాతుకొనిపోతాం. అందువలన తీరిక సమయంలో మనకేదో వినోదం కావాలి – తేలికైనదిగాని, తీవ్రమైనదిగాని. అందుకోసమని పుస్తకాలు చదువుకొంటాం, లేదా సినిమాకు పోతాం లేదా మతం వైపుకు మనస్సు మరలిస్తాం. ఇవన్నీ ఒకే రకమైనవి. మతంకూడా ఒక విధమైన కాలక్షేప సాధనంగా, మనోరంజన సాధనంగా పరిణమించినది. అది యిప్పుడు విసుగుదలనుండి, నిత్యము చేసే వాడుక పనులనుండి తప్పించుకోడానికొక సాధనంగా ఉపయోగపడుతున్నది.

ఇదంతా మీరు గమనించారో లేదో నాకు తెలియదు. ఎక్కువ మంది ప్రజలు ఏదో యొక పనిలో ఎల్లప్పుడూ నిమగ్నమై వుంటారు – పూజలు చేయడంలోనో, ఏవో కొన్నిమాటలను పలుమారు ఉచ్చరించడంలోనో – జపం చేయడంలోనో, ఏదో యొకదాని గురించి అదేపనిగా చింతిస్తూ వుండడంలోనో మునిగిపోయివుంటారు. దానికి కారణం వారు ఏకాంతంలో వుండడానికి భయపడడమే, ఎట్టి కాలక్షేపము లేకుండా ఏకాంతంగా వుండడానికి మీరు ప్రయత్నించి చూడండి – అప్పుడు

తెలుస్తుంది మీకు, ఎంత త్వరగా మీనుండి మీరు పారిపోవాలని చూస్తారో! మీ స్థితిని మీరు మరిచిపోవాలని చూస్తారో! అందువల్లనే నేటి నవ నాగరక సమాజంలో అదియొక వృత్తిగా వ్యాపారంగా నడిపెడి వినోద కార్యక్రమములు, యాంత్రికమైన కాలక్షేపములు ప్రధానపాత్ర వహిస్తున్నాయి, పెద్దయెత్తున సాగింపబడుతున్నాయి. పరిశీలించి చూస్తే ప్రపంచమంతటా ప్రజలు రానురాను కాలక్షేపములకు లొంగినవారుగా, కృత్రిమ స్వభావులుగా, కేవలము లౌకిక దృష్టిగలవారుగా మారుతున్నట్లు కనిపిస్తుంది. పెరిగిపోతున్న వేడుకలు, విలాసములు, అచ్చవుతున్న అసంఖ్యాకములైన పుస్తకములు, క్రీడావిషయములతో నిండిపోతున్న వార్తాపత్రికల పుటలు – ఇవన్నీ మనము మన మనస్సులను నిరంతరము ఉల్లాసపరిచే వేడుకల. కొఱకై యెంతగా తపిస్తున్నామో తప్పక సూచిస్తాయి. మనము అంతర్గతముగా శూన్యులము, సంవేదనారహితులము, అల్పబుద్ధిగలవారము; మన కితరులతో గల సంబంధాలను, మన సాంఘిక సంస్కారణలను మనమండి మనం తప్పించుకొని పారిపోవడానికి సాధనాలుగా ఉపయోగించుకొంటున్నాము. ఎక్కువమంది జనులు ఎంతగానో మానసికమైన ఒంటరితనమును అనుభవిస్తున్నారు. దీనిని మీరు గుర్తించినారో లేదో నా కనుమానం. ఆ ఒంటరితనమునుండి తప్పించుకొనడానికై దేవాలయాలకో, చర్చిలకో, మసీదులకో పారిపోతాం, నీటుగా దుస్తులు ధరించి సాంఘిక సమావేశాలకు హాజరవుతాం, టెలివిజను చూస్తాం, రేడియో వింటాం, పుస్తకాలు చదువుతాం – ఇంకా ఇటువంటి పనులెన్నో చేస్తుంటాము.

ఒంటరితనమంటే యేమిటో మీకు తెలుసునా? మీలో కొందరికి ఆ మాట క్రొత్తగా కన్పించవచ్చు. కాని దాని భావం మాత్రం మీకు బాగానే తెలిసివుంటుంది. ఒంటరిగా బయటికి వాహ్యాళికి పోవడానికి ప్రయత్నించి చూడండి. లేదా పుస్తకమేదీ లేకుండా, మాట్లాడించేవాండ్లు ఎవ్వరూ లేకుండా ఒంటరిగా వుండడానికి ప్రయత్నించండి. అప్పుడు మీకు తెలుస్తుంది ఎంత త్వరగా విసుగు పుడుతుందో. అప్పుడు కలిగే మానసికానుభూతి మీకు బాగానే తెలుస్తుంది. కాని ఎందుకు విసుగు పుట్టుతుందో తెలియదు. దాని గురించి మీరు విచారణ చేయలేదు, లోతుగా విచారించి చూడలేదు. విసుగుదల అంటే యేమిటో కొంత లోతుగాపోయి విచారించి చూస్తే దానికి కారణము ఒంటరితనమని మీకు తేలుతుంది. ఈ ఒంటరితనమునుండి తప్పించుకోవడం కోసమే మన మందరం కలిసివుందామని కోరుకొంటాం, మనల నెవరైనా రంజింపజేయాలని రకరకాలైన వినోదములు, వేడుకలు కావాలని కోరుకొంటాం. గురువులను, మతమునకు సంబంధించిన కార్యకలాపములను, ప్రార్థనలను లేదా అధునాతనమైన నవలలను ఆశ్రయిస్తాం. మనం మన ఆంతరిక జగత్తులో ఏకాకుల మవడంచేత – ఒంటరితనాన్ని అనుభవిస్తూ వుండడంచేత – బాహ్య జగత్తులో కేవలం ప్రేక్షకులంగానే వుండిపోతాం. అట్లుగాక మనం మన ఒంటరితనాన్ని అర్థం చేసికొని, దానిని అతిక్రమించి ముందుకుపోతే అప్పుడు మాత్రమే మనమీజీవితంలో స్వతంత్రులమగు నటులమౌతాం, ఆట ప్రదర్శించే ఆటగాళ్ళమవుతాం.

ఇంతకున్ను ఎక్కువమంది ప్రజలు ఒంటరి జీవితమెట్లు నడుపుకొనవలెనో

తెలియకనే పెండ్లిండ్లు చేసికొంటారు. ఇంకా యితర విధములైన సాంఘిక సంబంధాల కోసం ప్రయత్నిస్తారు. అయితే మనిషి పెండ్లి చేసికోకుండా ఒంటరి జీవితమే నడుపవలెనని కాదు. కాని ప్రేమ లభిస్తుందని పెండ్లి చేసికొన్నా, జీవితంపై విసుగుపుట్టి మీరు చేసే ఉద్యోగాన్ని మనోరంజనకొక సాధనంగా ఉపయోగించుకొంటున్నా అప్పుడు మీ జీవితమంతా కేవలము కాలక్షేపముల కోసమై చేసే అంతులేని అన్వేషణయైనట్లు గమనింపగలరు. ఒంటరితనము వలన కలిగే యీ విలక్షణమైన భయమును అతిక్రమించి పోగల్గినవారు చాలా తక్కువమంది. కాని దీనిని అతిక్రమించి పోవడం చాల అవసరం. అట్లు అతిక్రమించి పోగల్గినవారే దాని కావలనున్న అమూల్య నిధిని పొందగలవారు.

ఒంటరితనానికిన్ని, ఏకాంతవాసానికిన్ని చాల వ్యత్యాసమున్నది – మీకు తెలుసా? కొందరు బాల విద్యార్థులకు ఒంటరితనమంటే యేమిటో యింకా తెలియకపోవచ్చు. కాని వయస్సు వచ్చిన పెద్దవారికది తెలిసిన విషయమే. ఒంటరితనమంటే అందరితోను, అన్నిటితోను సంబంధము తెగిపోయినట్లనిపించడం, తగిన కారణం లేకుండానే అకస్మాత్తుగా భయ మావహించడం. మనస్సు తాను దేనిమీదను ఆధారపడలేనని తనకే ఆధారమున్ను లేదని, తనలో క్రమ్ముకొని వచ్చుచున్న శూన్యతాభావాన్ని ఏ కాలక్షేపమున్ను తొలగించలేదని గ్రహించిన క్షణమునందు దానికి భయముయొక్క తీవ్రత యెట్టిదో తెలుస్తుంది. అదే ఒంటరితనమంటే. కాని ఏకాంతమనేది దీనికి పూర్తిగా భిన్నమైనది. అది ఒంటరితనాన్ని జాగ్రత్తగా పరీక్షించి చూచి అనుభవంద్వారా దానిని అర్థము చేసికొంటే వచ్చెడి విముక్తస్థితి. అట్టి స్థితిలో మీరు ఇంద్రియ సుఖం కోసం, హాయిగా సకల సౌకర్యాలతో జీవించడంకోసం, ఆత్మ తృప్తికోసం ప్రాకులాడరు. కాబట్టి మానసికంగా మీ రెవరిమీదను, దేనిమీదను ఆధారపడరు, పడనవసరంలేదు. అప్పుడు మాత్రమే మనస్సు సంపూర్ణమగు ఏకాంతస్థితిలో నుంటుంది. అట్టి మనస్సే సృజనాత్మకమైనది.

మన అందరికీ తెలిసినదేయైన యీ ఒంటరిపాటు యొక్క వ్యధను, యీ విలక్షణమైన శూన్యతానుభూతిని ఎదుర్కొనడం, అది వచ్చినప్పుడు భయపడకుండడం, రేడియో పెట్టుకోవడమో, సినిమాకు పారిపోవడమో లేదా ఏదో పనిలో నిమగ్నమై పోవడమో చేయకుండ, దానివైపు మనదృష్టిని పోనిచ్చి పరీక్షించి చూచి, దాని లోతుపాతులు తెలిసికోవడం, దానిని పూర్తిగా అర్థం చేసికోవడం – ఇదంతా విద్యలో నొకభాగము. వణుకు పుట్టించే ఆ వ్యధను, ఆ యారాటమును చవిచూడని మానవుడు ఇంతవరకు లేడు, ఇకమీదట ఉండబోడు. కామసుఖము, దేవుడు, వివిధములైన పనులు, మద్యపానము, కవిత ల్లడము, కంఠస్థము చేసిన పదములను కొన్నిటిని మాటిమాటికి ఉచ్చరించడము – భజనలు చేయడము – ఇటువంటి వివిధ కాలక్షేపముల ద్వారా, వాటి వలన కలిగెడి ఆత్మతృప్తి ద్వారా ఒంటరిపాటు వ్యధనుండి పారిపో జూస్తుంటాము. కాబట్టి ఆ వ్యధ, ఆ యారాటము మనల నావహించినప్పుడు దానిని మన మెన్నటికిని అర్థము చేసికొనము.

అందుచేత, ఒంటరిగా వుండడం వలన వచ్చే బాధనుండి తప్పించుక పారిపోదామనే ఆలోచన పెట్టుకోకుండ, దానిని ఎదుర్కొని, పరీక్షించి చూడండి. మీరు పారిపోతే,

దానిని మీ రెప్పటికిని అర్థము చేసికోలేరు. అది మీ కోసం ఒకమూలన ఎప్పటికిని కాచుకొనే వుంటుంది. అట్లుగాక ఆ ఒంటరిపాటును అర్థం చేసికొని, దానిని దాటి ముందుకుపోగల్గితే అప్పుడు మీకు పారిపోవలసిన అవసరమే కనబడదు. ఆత్మ తృప్తికోసం, మనోరంజనం కోసం ఆరాటపడరు. ఎందువల్లనంటే, మీ మనస్సు అవినాశ్యమైన అదూష్యమైన అక్షయమైన సంపద నొకదానిని కనుగొన్నది!

ఇదంతా విద్యలో నొక భాగము. బడిలో మీరు మీ పరీక్షలలో వ్రాసవడం కోసమై మీ పాఠాలను మాత్రం చదువుతూ వుంటే, అప్పుడా చదువే ఒంటరితనమునుండి తప్పించుకోడానికి ఒక సాధనంగా ఉపయోగపడుతుంది. కొంచె మాలోచిస్తే ఈ విషయం మీకే తెలుస్తుంది. మీ విద్యా బోధకులతో ఈ విషయమై చర్చించండి – వారెంత ఏకాకులుగా నున్నారో, మీరెంత ఏకాకులుగా నున్నారో మీకే తెలుస్తుంది. కాని ఎవరైతే ఆంతరికంగా ఏకాంతమందున్నారో, ఎవరి మనో హృదయములు ఒంటరితనము వలన కలిగెడి వ్యధనుండి విముక్తములో వారే నిజమైన మానవులు; వారే సత్యమును సాక్షాత్కరింప జేసికొనగలరు; త్రికాలాబాధితమైనదేదో దానిని పొందగలరు.

1. **ప్రశ్న:- ఎఱుక (awareness) కును, సంవేదనశీలత (sensitivity) కును గల భేదమేమి?**

**కృష్ణమూర్తి:-** అసలా రెండింటి మధ్యను ఏమైన భేదమున్నదాయని నా అనుమానము. చూడండి, మీరొక ప్రశ్న వేసినప్పుడు మీయంతట మీరే అందలి సత్యమును కనుక్కోడం ముఖ్యం. అంతేగాని ఎవరో చెప్పినదానిని గ్రుడ్డిగా అంగీకరించడం కాదు ముఖ్యం. అందువలన ఎఱుక కలిగివుండడమంటే యేమిటో మనం కలిసి విచారిద్దాం.

వర్షము కురిసి వెలిసిన పిదప నిగనిగలాడుతూ వున్న ఆకులతో అందంగా వున్న చెట్టును మీరు చూస్తారు. నీళ్ళమీదను, రంగురంగుల పక్షుల యీకలమీదను మిలమిల మెరుస్తూవున్న సూర్యకాంతిని చూస్తారు. బరువైన మూటలను నెత్తిపై పెట్టుకొని పట్టణానికి నడిచిపోతూవున్న గ్రామీణులను చూస్తారు. వారు పకపక నవ్వుకోడం వింటారు. కుక్క మొఱగడం వింటారు; అంబాయని దూడ తల్లిని పిలవడం వింటారు. ఇదంతా యెఱుకలోని ఒక భాగమే. అదంతా మీ చుట్టు ప్రక్కల నున్న పరిసరముల గురించిన యెఱుక కాదా? ఇంకా దగ్గరికి వచ్చి చూస్తే, ప్రజలతోను, వివిధములైన అభిప్రాయాలతోను, రకరకాల వస్తువులతోను మీకు గల సంబంధమెట్టిదో గమనిస్తూ వుంటారు. ఉండే యింటిని, నడిచే బాటను మీరేదృష్టిచో చూసేదిన్ని మీరు గమనిస్తూ వుంటారు. ప్రజలు మిమ్ము అనే మాటలకు మీ ప్రతిక్రియ లెట్లావుంటాయో, మీ మనస్సు ఎల్లప్పుడు ప్రతిదానికిని విలువ గట్టడం, మంచిచెడ్డలు నిర్ణయించడం, ఒక దానిని మరియొక దానితో పోల్చడం, తప్పని నిందించడం – ఇవన్నీ ఎట్లా చేస్తూ వుంటుందో మీరు గమనిస్తూనే వుంటారు. ఇది గూడ మీ యెఱుకలో నుండేదే, దానిలోని ఒక భాగమే. ఈ

"ఎఱుక" పైపైవాటితో ఆరంభించి, లోలోతుకు పోతూ వుంటుంది. కాని మనలో చాలమందికి గల ఎఱుక ఎక్కడనో ఒక చోట ఆగిపోతుంది. ఏవేవో చప్పుళ్ళు, పాటలు, అందమైన దృశ్యాలు, అందంకాని దృశ్యాలు – ఇట్లాంటి వెన్నో వింటూ, చూస్తూ వుంటాము. కాని వాటికి మన ప్రతిక్రియలు ఎట్లా వుంటాయో అవి మన యెఱుకలోకి రావు. "అది అందంగా వున్నది" లేదా "అది అందవికారంగా వున్నది" అంటూ మనము వాటిని దాటవేసికొని పోతాం. కాని అందమంటే యేమిటో అందవికారమంటే యేమిటో మనము విచారించం. వాస్తవానికి, ప్రేరణలకు మీ ప్రతిక్రియ లెట్లా వుంటున్నాయో చూడడంగాని, మీ ఆలోచనయొక్క ప్రతి కదలికను, పోనుపోను ఎక్కువ జాగ్రత్తగా గమనించడంగాని, మీ తల్లిదండ్రులు, మీ ఉపాధ్యాయులు, మీ జాతి, మీ సంస్కృతి – వీటి అన్నిటి ప్రభావముచే మీ మనస్సు లెట్లా మలచబడుతున్నాయో తెలిసికొనడంగాని – ఇదంతా ఎఱుకలోని భాగమే కాదా?

మనస్సు తన ఆలోచనాస్రవంతిలోనికి ఎంత లోతుగా దిగిపోయి చూస్తుందో అంత స్పష్టంగా వివిధ రూపాలలోనున్న తన ఆలోచనలన్నీ సంప్రదాయాదుల చేత నిబద్ధములైనవని గ్రహింపగలదు. ఆ యవగాహనతో మనస్సు సహజంగా – తనకు తానే – నిశ్చలమైపోతుంది. అంటే మనస్సు నిద్రలోకి జారుకొంటుందని కాదు. పైగా, మనస్సప్పుడు అసాధారణమైన అప్రమత్తత కలిగి వుంటుంది, నిత్యజాగ్రదవస్థలో వుంటుంది. దానినింక మంత్రములు గాని, జపములు గాని, క్రమశిక్షణ గాని మత్తులోకి దిగజార్చలేవు. మౌనముతో గూడిన ఈ అప్రమత్తత (alertness) గూడ ఎఱుకలోని భాగమే. ఇంకను మీరు లోతుగా పోయి చూస్తే ఎఱుకగల వ్యక్తికిని, దేనిగురించిన యెఱుక గల్గియున్నాడో దానికిని మధ్య భేదము లేదని గూడ తెలిసికొనగలరు.

సరే, మరి సంవేదనశీలత అంటే యేమిటి? రంగును రూపమును గుర్తించడం, ప్రజలు ఏమంటారో దానికి మీ ప్రతిస్పందన మెట్లుంటుందో గ్రహించడం, ఇతరులయెడ సానుభూతి కలిగి, వారి కష్టసుఖాలను పట్టించుకోవడం, ఉత్తమాభిరుచి కలిగి యుండడం, శిష్టాచారములను (good manners) పాటించడం, మొరటుగా ప్రవర్తించక పోవడం, ఎవరినైనా సరే శారీరకంగాగాని, మానసికంగాగాని హింసించక పోవడం, అట్లు హింసించాలనే ఆలోచన గూడా లేకపోవడం, ఏదైనా అందమైన వస్తువును చూచి అట్లే చూస్తూ వుండిపోవడం, ఎవరైనా ఏదైనా చెప్తూతూ వుంటే, విసుగు చెందకుండా, వారు చెప్పినదంతా పరీక్షా దృష్టితో వినడం, తద్వారా మనస్సు సూక్ష్మము, సునిశితమున్నూ అవడం – ఇదంతా సంవేదనశీలత కాదా? కాబట్టి సంవేదనశీలతకున్ను ఎఱుకకున్ను పెద్ద తేడా వున్నదా? ఉన్నదని నేను అనుకోను.

చూడండి, మీ మనస్సు నిందిస్తూ, తప్పొప్పులు నిర్ణయిస్తూ, అభిప్రాయాలు ఏర్పఱచుకొంటూ, తీర్మానాలు చేసికొంటూ వున్నంతకాలము అది సంవేదనశీలమూ కాదు, ఎఱుక గలదిన్నీకాదు. మీరు మనుషులయెడ మొరటుగా ప్రవర్తిస్తూవుంటే, పువ్వులు త్రుంచి వాటిని దూరంగా పారవేస్తూవుంటే, జంతువులకు బాధ కలిగిస్తూ

వుంటే, కుర్చీలు, బెంచీలు మొదలగు వానిమీద మీ పేర్లు చెక్కుతూవుంటే, కుర్చీల కాళ్ళు విరగగొట్టుతూ వుంటే, భోజనానికి వేళకు పోకుండా ఆలస్యంగా పోతూవుంటే, మామూలుగా మంచీ మర్యాదా లేకుండా చెడ్డగా ప్రవర్తిస్తూవుంటే, అదంతా మీలో సంవేదనశీలత లేకపోవడాన్నే సూచిస్తుంది, నిర్లక్ష్యాన్ని, కొరడుపారిన మనస్తత్వాన్ని తెలియచేస్తుంది – ఏమి, తెలియజేయదంటారా? అది అప్రమత్తంగా వుండి తగినట్లు సర్దుకపోవడం చేతగాని మనస్సును సూచిస్తుంది. మృదు స్వభావము కలిగి సంవేదన శీలుడవడంలో విద్యార్థికి విద్య తోడ్పడవలసి యున్నది. విద్యలో అదియొక ముఖ్య భాగము. సంవేదనాపరుడైన విద్యార్థి దేనినీ గ్రుడ్డిగా అనుసరించడు, దేనినీ గ్రుడ్డిగా వ్యతిరేకించడు. జీవిత గమనమునంతను మెలకువతో గమనిస్తూ వుంటాడు. కొరడుపారిన మనస్తత్వంగల వారికంటె మృదుస్వభావము గలవారు జీవితంలో బహుశా యెక్కువ బాధలను అనుభవింపవలసి రావచ్చు. కాని వారు తమ బాధానుభవాన్ని అర్థం చేసికొని, దానిని దాటి ముందుకు పోగల్గినచో వారు అద్భుత విషయాలను దర్శింపగలరు.

2. ప్రశ్న:- ఎవరైనా కాలుజారి పడితే మనమెందుకు నవ్వుతాము?

కృష్ణమూర్తి:- అది యొక విధమైన కొరడుపారిన మనస్తత్వం కాదా? 'సేడిజమ్' అనేది కూడ ఒకటి కలదు. ఆ మాటకు అర్థమేమిటో తెలుసునా? మార్క్వీస్ డి సేడ్ అనే ఒక ఫ్రెంచి రచయిత 1814లో ఒక నవల వ్రాసినాడు. అందులో నొకపాత్ర మనుష్యులను హింసించి, వాండ్లు బాధపడుతూవుంటే చూచి తాను ఆనందిస్తూ వుంటుంది. దానిని బట్టి ఆ రచయిత పేరుమీదుగా సేడిజం అనేమాట వచ్చింది. ఆ మాటకు అర్థమేమంటే – యితరులు బాధపడుతూ వుంటే చూచి తాను ఆనందించడం. కొంతమంది మనుష్యులకు ఇతరులు బాధపడుతుంటే చూచి ఒక వింత తృప్తి కలుగుతుంది. మీలో ఈ స్వభావముందేమో బాగా పరిశీలించి చూచుకోండి. అది పైకి కనబడకపోవచ్చు. కాని అది వున్నట్లయితే, యెవరైనా పడిపోయినప్పుడు నవ్వుదామని బుద్ధి పుట్టడంలో అది వ్యక్తమవుతుంది. అది మీరు గమనించవచ్చు. ఉన్నత స్థితిలో నున్నవారిని క్రిందికిలాగి పడగొట్టుదామని మీకు బుద్ధి పుడుతుంది. ఇతరులను విమర్శిస్తారు, వాండ్లను గురించి లేనిపోని మాటలు చెప్పుకొంటారు. ఇదంతా కొరడుపారిన మనస్తత్వాన్ని, ఇతరులను హింసించుదామనే ఒక విధమైన కోరికను సూచిస్తుంది. కొందరు కావలెనని పగబట్టి ఇతరులకు హాని కలిగిస్తారు. మరికొందరు తెలియక, అనాలోచితంగా, ఏదో ఒక మాట అని, ఒక సైగ చేసి, లేదా ఒక చూపుచూచి హాని కలిగించవచ్చు. కాని ఏ విధంగా హాని కల్గించినా అందులో ఇతరులను హింసించుదామనే ప్రేరణ అంతర్గతంగా వుంటూనే వుంటుంది. ఈ విధంగా విపరీత మార్గాన ఆనంద మనుభవిద్దామనే కోరికను మనలో చాల తక్కువమంది మాత్రమే పూర్తిగా సమూలంగా మానుకోగలరు.

3. ప్రశ్న:- మా ప్రొఫెసరుగా రొకరు మీరు చెప్పే విషయాలు బొత్తిగా ఆచరణ యోగ్యములు కావని అంటారు. 120 రూపాయల జీతంమీద ఆరుగురు

మగపిల్లలను, ఆరుగురు ఆడపిల్లలను పెంచి పెద్ద చేయమని మిమ్మల్ని సవాలు చేస్తున్నారు. ఈ విమర్శకు మీ సమాధానమేమి?

కృష్ణమూర్తి:- మొట్టమొదటిది, నాకేగనక 120 రూపాయల జీతమే అయినట్లయితే నేను ఆరుగురు మగపిల్లలను, ఆరుగురు ఆడపిల్లలను అసలు కననే కనను. ఇక రెండవది, నేనొక ప్రొఫెసరును అయినట్టయితే నా పనికి నేను అంకితమైపోతాను. అంతేగాని దానినొక నౌకరీగా, ఒక ఉద్యోగంగా భావించను. ఈ రెంటికీన్ని గల తేడా మీకు తెలుస్తుందా? ఏ స్థాయిలోనైనా సరే విద్యాబోధనము ఒక వృత్తిగాదు, కేవలం కూలీకోసం చేసే పనికాదు. అది ఒకదానికి అంకితమై పోవడం. 'అంకిత' మనే పదానికి అర్థం మీకు తెలుసునా? అంకితమవడమంటే దేనికో ఒక దానికి సంపూర్తిగా, బదులు కోరకుండా, తన్నుతాను సమర్పించుకోవడం; ఒక యతిలాగా, ఒక తపస్విలాగా, ప్రసిద్ధులైన గొప్ప విద్యాబోధకులలాగా, గొప్ప విజ్ఞానవేత్తలలాగా జీవించడం. అంతేగాని, ఏవో కొన్ని పరీక్షలు పాసై తమ్ముతాము ప్రొఫెసర్లమని చెప్పుకొనే వారిలాగా జీవించడం కాదు. నేను మాట్లాడేది విద్యాబోధనకై తమ్ముతాము అంకితము చేసికొన్నవారి గురించి; డబ్బుకోసం గాకుండా, అది తాను కోరుకొన్న వృత్తి కాబట్టే, దానియందు తమకు ప్రేమ వున్నది కాబట్టే ఉపాధ్యాయులైన వారి గురించి. అటువంటి ఉపాధ్యాయు లెవరైనా వున్నట్టయితే వారు నేను మాట్లాడే విషయాలన్నీ బాల బాలికలకు మిక్కిలి ఆచరణ యోగ్యమగు రీతిలో బోధించవచ్చునని తెలిసికోగలరు. ఎవరికైతే విద్యా బోధనము కేవలం జీవనాధారాన్ని సంపాదించుకోడానికి పనికివచ్చే ఉద్యోగంగా, నౌకరీగా వుంటుందో అటువంటి ఉపాధ్యాయులు, విద్యాబోధకులు, ప్రాచార్యులు (ప్రొఫెసర్లు) మాత్రమే నేను చెప్పే విషయాలు ఆచరణ యోగ్యములు కావని చెబుతారు.

ఇంతకున్ను ఆచరణయోగ్యమంటే యేమిటి? ఆలోచించి చూడండి. ఇప్పుడు మనము జీవిస్తున్న పద్ధతి, విద్య బోధిస్తున్న పద్ధతి, మన ప్రభుత్వములు అవినీతితోను, అంతములేని యుద్ధములతోను నడుపబడుతున్న రీతి – ఇవన్నీ ఆచరణ యోగ్యములంటారా మీరు? పేరాశ (ambition), ఆచరణయోగ్యమా? అత్యాశ (greed) ఆచరణ యోగ్యమా? పేరాశవలన స్పర్థలు పోటీలు పెరుగుతాయి; దానితో మానవత నశిస్తుంది. మానవులకు నష్టం కలుగుతుంది. అత్యాశ మీదను, సంగ్రహణశీలత మీదను, అధికారదాహము మీదను ఆధారపడి కొనసాగే సంఘములో యుద్ధపిశాచము ఎల్లప్పుడు పొంచివుంటుంది. ఘర్షణ, దాని వెంబడి దుఃఖానుభవము తప్పదు. ఇదంతా ఆచరణ యోగ్యమేనా? కాదనుట స్పష్టంకదా! ఆ విషయమే నా యీ అన్ని ప్రసంగాలలోను మీకు తెలియజెప్పడానికై ప్రయత్నిస్తున్నాను.

ప్రపంచంలో ప్రేమ యొక్కటే మిక్కిలి ఆచరణ యోగ్యమైనది. ప్రేమించడము, దయార్ద్ర చిత్తుడై వుండడము, అత్యాశకు పోకపోవడము, పేరాశలు పెట్టుకోకుండడము, ఇతరుల ప్రభావమునకు తలయొగ్గకుండ స్వయంగా ఆలోచించుకోవడము – ఇవన్నీ పూర్తిగా ఆచరణ యోగ్యములైన పనులు. ఇవియే ఆచరణ ప్రధానమును ఆనందమయమును అగు సమాజమును సృష్టింపగలవు. కాని ఏ యుపాధ్యాయుడైతే

తన వృత్తికి దాను అంకితము కాడో, ఎవడైతే ప్రేమించడో, ఎవడైతే తన పేరు చివర కొన్ని అక్షరాలు తగిలించుకొని కేవలం పుస్తకాలనుండి గ్రహించిన సమాచారాన్ని పిల్లల కందించే వ్యాపారం కొనసాగిస్తూ వుంటాడో, అతడు మాత్రమే ఇదంతా ఆచరణ సాధ్యము కాదని చెబుతాడు. అందుకు కారణము అతడు దీనిగురించి అసలు అలోచించకపోవడమే. స్వతంత్రంగా నిలబడడం బొత్తిగా చేతగానట్టి, ఏ సమస్యనైనా సరే స్వతంత్రంగా అలోచించుకొనలేనట్టి పౌరులను తయారుచేయు నేటి నామమాత్ర విద్యావిధానము యొక్క అసమంజసమగు, అస్తవ్యస్తమగు ఆచరణ యోగ్యత కంటే, ప్రేమించడమనేది ఎన్నో మడుంగు లెక్కువగా ఆచరణ యోగ్యమైనది.

చూడండి, ఆ మూల నున్నవారు కొందరు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వుండడాన్ని మనం గమనిస్తూనే, మన గాంభీర్యాన్ని వదలక కొనసాగించడమున్ను ఎఱుకలో నొకభాగమే.

పెద్దవాండ్లతో వచ్చిన కష్టమేమంటే, వాండ్లు తమ జీవిత సమస్యనే తాము పరిష్కరించుకోలేకపోయినా, మీతో “ఏది ఆచరణ యోగ్యమో ఏది కాదో మేము మీకు చెబుతాము, రండి” అని అంటారు. ఉపాధ్యాయవృత్తి యీ దినములలో అధమ వృత్తిగా పరిగణింపబడుతున్నా, నిజానికది జీవితంలో అన్నిటికంటె ఉత్తమమైన వృత్తి. అంతకంటే ఉన్నతమైనది, ఉత్కృష్టమైనది, పవిత్రమైనది మరియొకటిలేదు. కాని ఉపాధ్యాయుడు పూర్తిగా దానికి అంకితమై పోవాలి. తన్నుతాను పూర్తిగా సమర్పించుకోవాలి, తన మనస్సుతో తన హృదయంతో తన జీవిత సర్వస్వంతో విద్యాబోధనము గావించాలి. అట్టి అంకితభావమున్నచోట ఏదైనా సంభవమే – సంభవము కానిదంటూ వుండదు.

4. **ప్రశ్న:- ఆధునిక ప్రపంచంలోని విలాస వస్తువుల ప్రభావముచేత మేము విద్యను పొందుతున్న సమయంలోనే వినాశనమును గూడ పొందుతున్నట్లయితే, అట్టి విద్యవలన కలుగబోవు ప్రయోజనమేమి?**

**కృష్ణమూర్తి:-** మీరు మీ ప్రశ్నలో సరియైన పదములను ఉపయోగించ లేదేమో యని భయపడుతున్నాను. ప్రతివానికిని కొంత సుఖము, కొంత సౌకర్యము కావాలి, అక్కరలేదా? మన మొక గదిలో ప్రశాంతంగా కూర్చుండినప్పుడు, ఆ గదిలో ఒక్క చాపతప్ప మరేసామాను లేకపోయినా, అది శుభ్రంగా, నీటుగా వుంటే బాగుంటుంది. దాని కొలతలు ఒకదాని కొకటి అనురూపముగా వుండాలి. తగిన పరిమాణంలో కిటికీలుండాలి. ఆ గదిలో ఏదైనా పటమున్నట్లయితే అది అందంగా వుండాలి. ఆ గదిలోని పూలపాత్రలో పూవులున్నట్లయితే అవి వానిని తెచ్చిపెట్టిన వ్యక్తియొక్క మంచి మనస్సును ప్రతిఫలింప జేయాలి. ఎవరికైనా తినడానికి మంచి తిండి వుండాలి. నిద్రించడానికి ప్రశాంతమైన ప్రదేశం ఉండాలి. ఇవన్నీ ఆధునిక ప్రపంచం ప్రసాదించిన సౌకర్యములు. ఈ సౌకర్యములవలన కలిగే సుఖం విద్యావంతు డనబడేవానిని చెడగొట్టుతుందా? లేక విద్యావంతు డనబడేవాడే తన పేరాశ, తన అత్యాశ ద్వారా ప్రతి మానవునికుండే మామూలు సుఖ సౌకర్యములను గూడ

చెడగొట్టుతున్నాడా? అభివృద్ధి చెందిన దేశాలలో ఆధునిక విద్య మనుజులను భౌతిక వాదులనుగా మార్చివేయడంచేత, అన్ని సౌకర్యములతో గూడిన భోగమయ జీవితము, అది యే రూపములోనున్నను, మనస్సును కలుషితముచేసి, నశింపజేస్తుంది. ఇక భారతదేశములాంటి బీద దేశములలో బోధింపబడే విద్య సరిక్రొత్త సంస్కృతిని సృష్టించడానికి మిమ్మ ప్రోత్సహించడం లేదు. క్రాంతివాదు లగుటకై మీకు తోడ్పడడము లేదు. క్రాంతివాదులు కావడమంటే, నా ఉద్దేశమేమిటో నేనిదివరకే వివరించియున్నాను. అది బాంబులు విసరడం కాదు, హత్యలు చేయడం కాదు. అట్లా చేసేవారు నిజమైన క్రాంతివాదులు కారు. నిజమైన క్రాంతివాది యెవరంటే వివిధ ప్రలోభనముల నుండి విముక్తుడు, సమాజము యొక్క ఆదర్శముల నుండి విముక్తుడు. సమాజమనగా పెక్కుర సమష్టి సంకల్పమునకు వ్యక్తరూపము. దాని బంధములనుండి విముక్తుడైనవాడే క్రాంతివాది. అట్టి క్రాంతివాది కావడానికై మీరు చదివే చదువు తోడ్పడడం లేదు. పైగా సమాజమున కనుకూలముగా పొమ్మని, లేదా, అంతగానయితే దానిలో కొంత సంస్కారము, కొంత మార్పు మాత్రం తేవచ్చునని బోధిస్తుంది.

కాబట్టి మీరు పొందుతున్న విద్యకాని విద్య మిమ్మ వినాశ పథము వైపు తీసికొనిపోతూ వున్నది గాని, ఆధునిక ప్రపంచ మొసంగిన సుఖసాధనములు కాదు. కార్లు, మంచిరోడ్లు ఎందుకుండ గూడదు? కాని చూడండి, ఆధునిక సాంకేతిక విద్య, నూతన యంత్రసామగ్రి అన్నీగూడ అటు యుద్ధానికైనా ఉపయోగపడుతున్నాయి లేదా, ఇటు కేవలం వినోదం కోసం, తమనుండి తాము తప్పించుకొని పారిపోవడం కోసం ఉపయోగపడుతున్నాయి. అందువలన మనస్సు నూతన యంత్ర పరికరముల మధ్య మరుగుపడి పోతున్నది. వంట చేయడానికి, గదులు ఊడ్వడానికి, గుడ్డలు ఇస్త్రీ చేయడానికి, లెక్కలు వేయడానికి ఇంకా యిటువంటి అవసరమైన రకరకాల పనులెన్నో చేయడానికి ఉపకరించే నూతన యంత్రపరికరాలను, యంత్రాలను, వాటి విడిభాగాలను నిర్మించడమే ఆధునిక విద్యయంటే. ఇటువంటి యంత్రపరికరాల వలన ఆ యా నిత్యావశ్యక కార్యములను చేసికొనడంలో మనకు కాలము కలిసి వస్తున్నది, ఆ పనులు చేసికోవడం తేలికవుతున్నది గూడ. పూర్తిగా క్రొత్తదైన క్షేత్రంలో మన మనస్సు పనిచేయడానికి గాను దానికి కొంత తీరుబాటు లభించడం కోసం, ఆయా యంత్ర పరికరము లుండవలసినదే. కాని, వాటిమధ్య చిక్కుకొని మన మనస్సు దారి తప్పరాదు.

5. **ప్రశ్న:- నా ఒడలి చర్మము చాల నల్లగా వుంటుంది. కనీసం చామన చాయ రంగైనట్టయితే చాలమంది మెచ్చుకొంటారు. నేను వాండ్ల మెప్పును ఎట్లు పొందగలను?**

**కృష్ణమూర్తి:-** మీ చర్మం రంగును మార్చడానికి సహాయపడేవి, మీ ముఖానికి వన్నెదెచ్చేవి వేరే మైపూతలు, క్రీములు, పరిమళ ద్రవ్యములు వుంటాయని నా నమ్మకం. కాని దానితో మీ సమస్య తీరుతుందా? ఇంకా ప్రజల మెప్పు

పొందాలనే కోరిక, సంఘంలో గొప్పగా వుండాలనే కోరిక వుంటూనే వుంటుంది. పదవి కోసం, ప్రతిష్ట కోసం ప్రాకులాడుతూనే వుంటారు. మెప్పుదల కావాలని కోరుకోవడంలో, ప్రాముఖ్యం కోసం ప్రాకులాడడంలో దుఃఖచ్ఛాయలు గాలంలాగా పట్టుకొని వదలవు. మీరు సంఘంలో మెప్పుదల పొందాలని, ప్రముఖులు కావాలని కోరుకొంటూ వున్నంతకాలము మీరు చదువుకొనే చదువు మిమ్ము నాశనం చేస్తుంది. అది, కుళ్ళి భ్రష్టమైపోయిన యీ సంఘంలో ఒక స్థానాన్ని పొందడానికి మీకు సహాయపడి, తద్వారా మిమ్ము నాశనం చేస్తుంది. మనము మన లోభము, మన అత్యాశల ద్వారా, మన ఈర్ష్యాసూయల ద్వారా, మన భయాల ద్వారా యీ వినాశకరమైన సంఘాన్ని సృష్టించినాము. దాని గురించి మాకు తెలియదంటూ దాటవేసినా, అదంతా భ్రమ భ్రాంతి అని అంటూ త్రోసివేసినా, ఆ సంఘంలో మార్పు రాబోదు; అది మారదు. కేవలము సరియైన విద్యమాత్రమే అత్యాశను, భయమును, అధికార దాహమును మన మనస్సుల నుండి తుడిచి వేయగలదు; అప్పుడు మనము సరిక్రొత్త సంస్కృతికి పునాది వేయగలము, నూతన ప్రపంచాన్ని స్థాపించగలము. దీని కంతకును మూలమగు సరియైన విద్య – మన మనస్సు తన్నుతాను నిజంగా అర్థము చేసికొనగోరితే, భయమునుండి విముక్తిని పొందగోరితే, – అప్పుడు మాత్రమే సాధ్యము.

*1 ఫిబ్రవరి, 1955*

★ ★ ★

# 24. క్రమశిక్షణ - శక్తిక్షీణత

మనకున్న చాల పెద్ద సమస్యలలో నొకటి క్రమశిక్షణ సమస్య. ఇది నిజంగా చాల చిక్కుతో గూడిన సమస్య. చూడండి, సంఘము ప్రతి పౌరుని అదుపులో పెట్టవలెనని, క్రమశిక్షణలో వుంచవలెనని, కొన్ని ధార్మిక సాంఘిక నైతికార్థిక మర్యాదల ననుసరించి అతని మనస్సును మలచవలెనని అనుకొంటుంది.

అయితే మరి, క్రమశిక్షణమనేది అసలంటూ అవసరమా? వెంటనే అవును, కాదు అని చెప్పకండి; ముందు దయచేసి జాగ్రతతగా వినండి. మనలో చాలమంది, ముఖ్యంగా మనం చిన్నపిల్లలంగా వున్నప్పుడు, అసలు క్రమశిక్షణ అనేది ఉండగూడదని, ఎవరి యిష్టం వచ్చిన పని వారిని చేసికోనివ్వాలని, అదే స్వతంత్రమని అనుకొంటాము. కాని, క్రమశిక్షణ సమస్యనంతను పూర్తిగా అర్థము చేసికోకుండా, ఊరక క్రమశిక్షణ ఉండాలని, లేదా అక్కరలేదని, మనం స్వతంత్రంగా వుండాలని – ఇట్లా చెప్పడంలో అర్థమేమున్నది?

శ్రద్ధగల క్రీడాకారు డెల్లప్పుడు తన్నుతాను క్రమశిక్షణలో పెట్టుకొంటూ వుంటాడు, నిజంకాదా? ఆటలాడడంలో అతనికి కలిగే ఆనందము, అందుకు తన్ను యోగ్యునిగా చేసికోవలసిన ఆవశ్యకత – వీటి మూలాన అతడు పెందలకడ నిద్రపోతాడు, పొగత్రాగడం మానివేస్తాడు, సరియైన తిండి తింటాడు. మామూలుగా పాటించవలసిన ఆరోగ్య నియమాల నన్నిటిని పాటిస్తాడు. అతడు పాటించే క్రమశిక్షణ ఇతరుల చేత విధింపబడినది కాదు, దానితో అతనికి ఘర్షణ లేదు; క్రీడలలో అతనికిగల అభిరుచి, ఆనందముల యొక్క సహజ ఫలితమే యిది.

సరే, మరి మానవునిలోని శక్తిని క్రమశిక్షణ పెంచిస్తుందా, తగ్గిస్తుందా? ప్రపంచ మంతట మానవులు ఏ మతానికి చెందినవారైనా, ఏ వేదాంత సంప్రదాయానికి చెందిన వారైనా తమ మనస్సుపై తాము క్రమశిక్షణను విధించుకొంటారు – తమ మనస్సును తాము అనుశాసించుకొంటారు. అంటే అందులో అదుపులో పెట్టుకోవడం, నిరోధించడం, సరిదిద్దుకోవడం, అణగద్రొక్కడం ఇవన్నీ వుంటాయి. మరి యిదంతా అవసరమేనా? ఈ క్రమశిక్షణ వలన, ఈ అనుశాసనమును పాటించడం వలన మానవశక్తి వృద్ధి పొందేటట్టయితే అప్పుడది వుండవలసినదే. అప్పుడా క్రమశిక్షణకు అర్థమున్నట్లే. కాని అది మానవశక్తిని కేవలం అణచి వేసేటట్టయితే అప్పుడది చాల హానికరము, వినాశకరము. మన అందరిలోను శక్తి వున్నది. కాని యిప్పుడు ప్రశ్న యేమంటే, ఆ శక్తిని క్రమశిక్షణ ద్వారా ఇంకను బలవత్తరము, సమృద్ధము, అధికము చేయగలమా లేక మనకున్న శక్తిని కాస్తా ఆ క్రమశిక్షణ నాశనం చేస్తుందాయని. ఇదే ప్రధాన సమస్యయని నేననుకొంటున్నాను.

చాలామంది మనుష్యులకు ఎక్కువ శక్తి వుండదు. వాండ్లకున్న ఆ కొంచెం శక్తిని వారున్న సమాజము తన విద్యావిధానంతో, అదుపాజ్ఞలు, బెదరింపులు, నిషేధముల ద్వారా అణచివేసి, నశింపజేస్తుంది. తత్ఫలితంగా, వారా సమాజములో చైతన్యములేని అనుకరణ శీలురైన పౌరులుగా జీవిస్తారు. పోనీ, ఆరంభంలో మరికొంత యెక్కువగా శక్తిగల వ్యక్తికి ఈ క్రమశిక్షణ వలన ఏమైనా మేలు కలుగుతుందా? అతని శక్తి వృద్ధి అవుతుందా? అది అతని జీవితాన్ని సమృద్ధము, జీవశక్తి సంపూర్ణము చేయగలదా?

మీరిప్పుడున్నట్లే చాల చిన్నపిల్లలుగా వున్నప్పుడు మీలో చాల శక్తి వుంటుంది, ఏమి, లేదా? ఆడుకోవాలని, అటునిటు పరుగెత్తాలని, మాట్లాడాలని అనిపిస్తూ వుంటుంది; కదలకుండా ఒకేచోట కూర్చోలేరు; మీలో జీవచైతన్యము నిండి తొణికిసలాడుతూ వుంటుంది. అప్పుడేమి జరుగుతుందో తెలుసునా? మీరు పెరిగి పెద్దవారయ్యే కొద్దీ, మీ ఉపాధ్యాయులు మీ శక్తికొక విశేషరూపము నిస్తూ, వివిధములైన అచ్చులలో పోతపోస్తూ ఆ శక్తిని తగ్గించి వేస్తారు. చివరకు మీరు స్త్రీలు, పురుషులుగా పెరిగి పెద్దవారయ్యేటప్పటికి మీలో అప్పటికింకా మిగిలివున్న కొంచెం శక్తిని సంఘము మీరు ఉత్తమ పౌరులుగా జీవించాలని, ఇట్లా ప్రవర్తించాలని, అట్లా ప్రవర్తించాలని ఆదేశిస్తూ త్వరలోనే పూర్తిగా అణచివేస్తుంది. ఈ విధంగా మీరు చిన్నపిల్లలుగా వున్నప్పుడు మీలో పొంగిపొర్లుతూ వుండే శక్తి, పేరుకు మాత్రమే విద్యయనిపించుకొనెడి విద్యద్వారా, సంఘము మీమీద తెచ్చిపెట్టు ఒత్తిడుల ద్వారా క్రమంగా నాశనం చేయబడుతుంది.

మరి మీకిప్పుడున్న శక్తిని క్రమశిక్షణ ద్వారా బలపరచుకోవడానికి వీలున్నదా? ఇప్పుడు మీలో కొంచెమే శక్తి వున్నట్లయితే దానిని క్రమశిక్షణ ద్వారా వృద్ధి పొందించుకో వీలున్నదా? అట్లా చేయగల్గితే అప్పుడా క్రమశిక్షణకు అర్థమున్నట్లు. అట్లుగాక క్రమశిక్షణ వాస్తవానికి మీ శక్తిని నశింపజేస్తూ వుంటే అప్పుడు క్రమశిక్షణతో మనకు పనిలేదు. దానిని వదులుకోవడం మంచిది.

మనందరిలోను వున్న ఈ శక్తి యేమిటి? శక్తి అంటే ఆలోచించడం, మానసికానుభూతి పొందడం; మఱియును అభిరుచి, ఉత్సాహము, అత్యాశ, ఔత్సుక్యము, మోహము, ఆకాంక్ష, విద్వేషము ఇవన్నీని. ఇంకా బొమ్మలకు రంగులు వేయడం, నూతన యంత్రాలను కనుగొనడం, వంతెనలు కట్టడం, బాటలు వేయడం, పొలాలను సాగుచేయడం, ఆటలాడడం, పాటలు పాడడం, పద్యాలు వ్రాయడం, నాట్యం చేయడం, గుడికి పోవడం, పూజలు చేయడం – ఇవన్నీ శక్తిని తెలియజేసేవే. మరియును ఆ శక్తి భ్రమను పుట్టిస్తుంది, భ్రాంతిని కలుగజేస్తుంది; అనర్థాన్ని, హానిని, దైన్యాన్ని, దుఃఖాన్ని గూడ కలిగిస్తుంది. అత్యుత్తమ గుణములేకాదు, అతి దారుణ గుణములుగూడ మానవునిలోని శక్తిని వ్యక్తీకరింపజేసేవే. కాని, చూడండి, ఆ శక్తిని అదుపులో పెట్టడం, క్రమశిక్షణలో వుంచడం, ఒక దిశగా పోనివ్వడం, మఱియొక దిశకు పోకుండా నిరోధించడం – ఈ పనులన్నీ సమాజము యొక్క సౌకర్యము కొఱకే జరుపబడుతుంటాయి. మనస్సు ఆయా విశేష సంస్కృతుల కనుకూలంగా మలచబడుతుంటుంది. అందువలన దానియొక్క శక్తి క్రమేపి వ్యర్థమైపోతుంది.

కాబట్టి ప్రస్తుతం మన సమస్య యేమంటే, ఈ శక్తిని – ఎక్కువగానో, తక్కువగానో

ప్రతివానిలోను ఏదో యొక రూపంలో ఉన్నట్టి దానిని – వృద్ధి చేసుకోగలమా? దానికి మరికొంత యెక్కువ చైతన్యాన్ని ఇవ్వగలమా? ఒకవేళ ఇవ్వగలిగినట్టయితే, అది యెందుకోసం? ఏమి పని నిమిత్తం? శక్తి దేనికుపయోగపడడానికి? దాని ఉపయోగము యుద్ధము చేయడానికా? జెట్ విమానాలను, ఇంకా అసంఖ్యాకములైన తదితర యంత్రాలను కనిపెట్టడానికా? ఎవరో యొక గురువును పట్టుకొని, అతని వెంటబడడానికా? పరీక్షలు పాసవడానికా? పిల్లలను కనడానికా? ఏదో ఒక తీరని సమస్యను పట్టుకొని, దానిగురించి రాత్రింబగళ్ళు ఎడతెరిపిలేకుండా చింతిస్తూ కూర్చోడానికా? ఇదంతా కాకపోతే, యీ శక్తిని మఱియొక దిశలో మనము ఉపయోగించుకోగలమా? అనగా సర్వకర్మాతీతమైనదేదో దానితోడి సంబంధము చేత మన కర్మలన్నీ సార్థకములగునట్లు మన శక్తిని మనముపయోగించుకొనగలమా? నిజానికి, అత్యాశ్చర్యకరమగు ఆ శక్తికి స్థానముగానున్న మానవుని మనస్సు, సత్యమును అంటే దేవుని అన్వేషింప సాగనిచో, అప్పుడా మనస్సులోని శక్తి యే రూపమున బయటికి వచ్చినను అది వినాశమును, దైన్యమును, దుర్గతిని తప్పక కలిగిస్తుంది. సత్యాన్వేషణకు అపారమగు శక్తి అవసరము. మనిషి ఆ పని (సత్యాన్వేషణ) చేయనిచో, అతడు తన శక్తిని అనర్థకర మార్గములందు వ్యర్థము చేసికొంటాడు. అందువలన అట్టివానిని సమాజము అదుపులో పెట్టవలసి వస్తుంది. మరి దైవమును లేదా సత్యమును అన్వేషించుటకై శక్తిని విడుదల చేస్తూ, ఆ సత్యదర్శన ప్రక్రియలో, జీవితము యొక్క మౌలిక సమస్యలను గూడ అర్థము చేసికొని, సమాజము చేతిలో నాశనము పొంద వీలులేని పౌరుడుగా గూడ వుండగలగడం సాధ్యమా? ఇది మీ కర్థమవుతున్నదా, లేక కొంత క్లిష్టంగా వున్నదా?

చూడండి, మనిషి అంటేనే శక్తి. మరి, మనిషి సత్యమును అన్వేషించకపోతే ఆ శక్తి వినాశకరంగా పరిణమిస్తుంది. అందువలన సమాజమట్టివానిని అదుపులో పెట్టి, అతనిని తన కనుకూలముగా మలచివేసికొంటుంది. దానితో అతని శక్తి అణగారిపోతుంది. ప్రపంచమంతటా ఎక్కువమంది పెద్దవాండ్లకు జరిగినదే అది. బహుశా, ఈ సందర్భంలో మీరు మరియొక ఆసక్తిదాయకమైన సాధారణ విషయమొకటి గమనించి వుంటారు. అదేమిటంటే, ఏదైనా పని చేయవలెనని మీరు నిజంగా సంకల్పించుకొన్నట్లయితే, ఆ క్షణమందే, ఆ పనిచేయడానికి తగిన శక్తి మీకుంటుంది. ఏదైనా ఆట ఆడదామని మీరు చాల ఉత్కంఠతో వుంటే ఏమవుతుంది? మీలో వెంటనే దానికి కావలసిన శక్తి వుంటుంది. ఏమి, వుండదా? అప్పుడా శక్తియే తన్నుతాను అదుపులో వుంచుకొనే సాధనం కూడ అవుతుంది. కాబట్టి మీకప్పుడు బాహ్యమునుండి విధింపబడు క్రమశిక్షణ అక్కరలేదు. సత్యాన్వేషణ జరుగు సమయాన ఆ శక్తి తన క్రమశిక్షణను తాను విధించుకొంటుంది. సత్యాన్వేషణ చేయు వ్యక్తి సహజంగానే ఉత్తమ పౌరుడౌతాడు. అయితే, అతడేదోయొక సమాజ విశేషమునకు గాని, ప్రభుత్వమునకు గాని చెంది వుండడు.

కాబట్టి యదార్థ తత్త్వమును, దేవుని లేక సత్యమును కనుగొనడానికై అవసరమగు ఈ ప్రచండమైన శక్తిని విడుదల జేయడంకోసం విద్యార్థులును వారితో బాటు ఉపాధ్యాయులును కలిసి పనిచేయవలసి వుంటుంది. అట్టి సత్యాన్వేషణ చేయడంలో

క్రమశిక్షణ వుంటుంది. దానితో మీరు నిజమైన మానవులౌతారు, సంపూర్ణ వ్యక్తిత్వముగల వారవుతారు. అంతేగాని కేవలం హిందువని, పార్సీ అని అయా విశిష్ట సమాజమునకుగాని సంస్కృతికిగాని పరిమితమై యుండరు. ప్రస్తుతము జరుగుతున్న విధంగా విద్యార్థియొక్క శక్తిని క్షీణింపజేసే బదులు, సత్యాన్వేషణకై అతడు తన శక్తిని జాగృతము చేసికొనడంలో పాఠశాల సహాయపడగలిగితే అప్పుడు క్రమశిక్షణకు గల అర్థమే వేరుగా కనిపిస్తుంది.

ఇంటిలోను, తరగతి గదిలోను, వసతి గృహంలోను ఏమి చేయవలెనో, ఏమి చేయరాదో మీ కెల్లప్పుడును ఎవరో ఒకరు చెబుతూనే వుంటారు; దానికి కారణమేమై వుంటుంది? నిజానికి దానికి కారణము మీ తల్లితండ్రులున్ను, మీ ఉపాధ్యాయులున్ను – సమాజంలోని తక్కిన వారివలెనే – మానవుని అస్తిత్వమునకు గల ఒకేయొక పరమోద్దేశమగు దేవుని కనుగొనడం, అంటే సత్యమును సాక్షాత్కరింప జేసికొనడమన్న విషయాన్ని గ్రహింపకపోవడమే. ఏ కొద్దిమంది విద్యాబోధకులైనా సరే, దీనిని అర్థం చేసికొని సంపూర్ణ మనోయోగముతో సత్యాన్వేషణకై పూనుకొంటే, అట్టివారే నూతన విద్యావిధానమునకు కారకులై, సరిక్రొత్త సమాజమును సృష్టింపగలరు.

మీ చుట్టూ వున్న మనుష్యులలో పెక్కుమంది – మీ తల్లితండ్రులు, ఉపాధ్యాయులతో సహా – ఎంత అల్పశక్తిమంతులో మీరు గమనించలేదా? వారి శరీరములు ఇంకను వయసు మీరినవి, ముసలివి కాకపోయినా, వారుమాత్రం మానసికంగా అప్పుడే మెల్లమెల్లగా మరణిస్తున్నారు. ఎందువలన? వారు సంఘము చేతిలో బాగా దెబ్బలు తిని దానికి పూర్తిగా లొంగిపోయినందువలన. చూడండి, మన మనస్సు ఒక అద్భుతమైన వస్తువు; దాని శక్తి అమోఘము. అది అణుశక్తి చాలిత జలాంతర్గాములను, అతివేగవంతములగు జెట్ విమానములను నిర్మింపగలదు. అద్భుతమగు గద్య పద్యములను రచింపగలదు. అది యీ ప్రపంచమును సౌందర్య శోభితము గావింపగలదు, సమూల విధ్వంస మొనరింపగలదు గూడ. అటువంటి అసాధారణ సామర్థ్యము గల మనస్సును అర్థము చేసికొనడం మరియు దేవుని లేక సత్యమును సాక్షాత్కరింపజేసికొనడం – ఇదే మానవుని శక్తికి ప్రధాన ప్రయోజనము. అట్టి ప్రధాన ప్రయోజనమును విస్మరిస్తే ఆ శక్తి విధ్వంసక శక్తిగా పరిణమిస్తుంది. అప్పుడా సమాజము "వ్యక్తి యొక్క శక్తిని అనుకూలముగా మలచి, అదుపులో నుంచవలె"నని అంటుంది.

కాబట్టి ప్రేమను, సత్యమును లేదా దేవుని అన్వేషించడంలో వ్యక్తిలోని శక్తిని విడుదల జేయడమే విద్య యొక్క పరమ ప్రయోజనమని నా కనిపిస్తున్నది. తద్వారా విద్య వ్యక్తిని ఉత్తమ మానవునిగా, కాబట్టి ఉత్తమ పౌరునిగా సరిదిద్దగలదు. కాని యిదంతా పూర్తిగా అవగాహన చేసికోకుండా, కేవలము క్రమశిక్షణను పాటించడం అర్థంలేని పని. అది అత్యంత వినాశమును తెచ్చిపెడుతుంది. మీలో ప్రతియొక్కడు ఉత్తమ విద్యను పొంది, బడి వదలి, బయటి ప్రపంచంలోనికి అడుగిడినప్పుడు, మీరు పూర్ణ చైతన్యవంతులు, ప్రజ్ఞావంతులుగా వుండకపోతే, సత్యదర్శనమునకై మీయందు శక్త్యుత్సాహములు పొంగిపొరలుచుండకపోతే, మీరు సంఘముచేత కబళించబడతారు; మీరు ఊపిరాడకుండా అణగద్రొక్కబడి నాశనము చేయబడతారు; జీవిత శేషమంతా

దుఃఖ దైన్యములతో గడుపుతారు. నదీ ప్రవాహము తన గట్టులను తాను నిర్మించుకొన్నట్లే సత్యాన్వేషణ జరుపుతున్న శక్తి గూడ తన క్రమశిక్షణను తాను సృష్టించుకొంటుంది; దానికి బయటినుండి యే రూపంలోనైనా సరే విధింపబడు క్రమశిక్షణతో పనిలేదు. నది సముద్రమును జేరినట్లుగా ఆ శక్తి తన విముక్తిని, తన స్వాతంత్ర్యమును తాను పొందుతుంది.

1. ప్రశ్న:- బ్రిటిషువారు భారతదేశమును పాలించడానికై ఎందువలన వచ్చిరి?

**కృష్ణమూర్తి:** చూడండి, ఎక్కువ శక్తి, ఎక్కువ చైతన్యము, ఎక్కువ సామర్థ్యము, ఎక్కువ ఉత్సాహము కలవారు తక్కువ బలముగల పొరుగువారికి అటు అంతులేని దుఃఖమునైనా కలిగిస్తారు, ఇటు ఎనలేని సుఖమునైనా కలిగిస్తారు. ఒకప్పుడు భారతదేశము ఆసియా ఖండమంతట భగ్గుమని ఒక వెలుగు వెలిగినది. అప్పుడు భారతీయులలో సృజనాత్మకమైన ఉత్సాహము పొంగిపొరలినది. వారు చైనాకు, జపానుకు, ఇండోనేషియాకు, బర్మాకు మతమును దెచ్చి వ్యాప్తిగావించిరి. తక్కిన జాతులు వర్తక వ్యాపారములు కొనసాగించెడివి. అది కూడ అవసరమై యుండి యుండవచ్చు. అయితే దానితోబాటు వచ్చే దుఃఖ దైన్యములు దానికున్నాయి – కాని జీవితము నడిచే తీరే అట్టిది. అందులో వింత యేమిటంటే, సత్యమును లేదా దేవుని అన్వేషించేవారు అంతకంటె మించి ప్రజ్వరిల్లుతారు. వారు తమలోనే కాదు ఇతరులలోను గూడ అసాధారణమైన శక్తిని విడుదల చేస్తారు. నిజమైన క్రాంతి వాదులంటే వారే; సామ్యవాదులు కాదు, సమాజవాదులు కాదు, కేవలం సంఘసంస్కర్తలున్ను కాదు. విజేతలు, పరిపాలకులు వస్తారు, పోతారు. కాని మానవ సమస్యలో ఎన్నటికిని మార్పు రాదు. మన మందరము ఇతరుల మీద అధికారము చలాయించగోర్తాము, లేదా ఇతరులకు లోబడగోర్తాము, లేదా ఇతరులను నిరోధింపగోర్తాము. కాని సత్యాన్వేషకుడైన మానవుడు సర్వసంఘములనుండి, సర్వసంస్కృతులనుండి విముక్తుడు; పూర్ణ స్వేచ్ఛగలవాడు.

2. ప్రశ్న:- ధ్యాన సమయములోనైనా సత్యమును దర్శింపగలమని మాకు తోచదు. అందువలన సత్యమంటే యేమిటో మీరు దయచేసి చెప్పగలరా?

**కృష్ణమూర్తి:** క్షణకాలం పాటు సత్యమును గూర్చిన ప్రశ్న నటుంచి ముందు ధ్యానమనేమో విచారిద్దాం. మీ గ్రంథములు, మీ గురువులు మీకు బోధించే ధ్యానమునకును నా ధ్యానమునకును చాల భేదమున్నది; అవి రెండును పూర్తిగా వేరైనవి. ధ్యానమంటే మీ మనస్సును మీరు అర్థము చేసికొనే ప్రక్రియ. మీ ఆలోచనా ప్రక్రియను మీరు అర్థము చేసికోకపోతే, అంటే మిమ్మల్ని మీరు అర్థం చేసికోకపోతే – మీరేమి ఆలోచించినా అదెల్ల నిరర్థకము. అట్టి ఆత్మజ్ఞానమనే పునాది లేకుండా, చేసిన ఆలోచన ఉపద్రవము తెచ్చిపెడుతుంది, అనర్థమునకు దారి తీస్తుంది. ప్రతి ఆలోచనకు సార్థక్యమున్నది. ఆ సార్థక్యాన్ని – అంటే ఏ ఒకటి రెండు ఆలోచనల సార్థక్యాన్ని మాత్రమే కాదు, ప్రతి ఆలోచన యొక్క సార్థక్యాన్ని

– అయా ఆలోచనలు తలెత్తునప్పుడే – మనస్సు చూడజాలకపోతే, అప్పుడు, కేవలం ఒక భావనమీద, ఒక ప్రతిమమీద, లేదా కొన్ని పదముల సముదాయంమీద మనస్సును కేంద్రీకరింప జేయడం ఒక విధమైన ఆత్మసంమోహనమే (self-hypnosis) అవుతుంది. అయితే దానినే అందరు ధ్యానమని పిలుస్తారు.

కాబట్టి మీరు ప్రశాంతంగా కూర్చొని వున్నా, మాట్లాడుతున్నా, ఆడుతున్నా ప్రతి ఆలోచన యొక్క సార్థక్యాన్ని, మీలో కలిగే ప్రతి ప్రక్రియను మీరు గమనిస్తున్నారా? అది మీ యెఱుకలోకి వస్తున్నదా? ప్రయత్నంచేసి చూడండి, మీకే తెలుస్తుంది, మీ ప్రతి ఆలోచన యొక్క గమనాన్ని మీ యెఱుకలోనికి తేవడం – మీరు దానిని నిరంతరము గమనిస్తూ వుండడం – ఎంత కష్టమో! దానికి కారణము, ఆలోచనలు ఒకదానిమీద నొకటి అతివేగంగా వచ్చిపడి పేరుకొనిపోతూ వుండడం, ప్రోగుపడిపోతూ వుండడం. కాని మీరు ప్రతి ఆలోచనను పరీక్షించి చూడదలచుకొంటే, ప్రతి ఆలోచనలోని విషయాన్ని మీరు నిజంగా చూడదలిస్తే, అప్పుడు మీ ఆలోచనల వేగం తగ్గడం గమనింప గలరు, మీరు వాటిని పరీక్షింపగలరు. ఈ విధంగా ఆలోచనల వేగము తగ్గడము, ప్రతి ఆలోచనను పరీక్షించడము – ఇదే ధ్యాన ప్రక్రియ. మీరది లోతుగా చేయసాగితే, ప్రతి ఆలోచనను మీ యెఱుకలోకి తేగల్గితే, అప్పుడు మీ మనస్సు – ఏదైతే యింతవఱకు ఒకదానితో నొకటి ఘర్షణపడుతూ విశ్రాంతి యెరుగని ఆలోచనలతో నిండియున్న ఉగ్రాణముగా, గిడ్డంగిగా (store-house) వున్నదో ఆ మీ మనస్సు – ప్రశాంతించడం, క్రమంగా పూర్ణ నిశ్చలత్వమును పొందడం మీరు గమనింపగలరు. అప్పుడిక తొందరపాటు వుండదు, నిర్బంధముండదు, ఏ విధమైన భయమున్ను వుండదు. ఈ నిశ్చలత్వంలో సత్యమన్నదేదో అది భాసిస్తుంది, సాక్షాత్కరిస్తుంది. అట్టి స్థితిలో సత్యమును దర్శించే వ్యక్తిగా తదనుభావాన్ని పొందే వ్యక్తిగా వేరే 'మీరు' ఉండరు. కాని మనస్సు నిశ్చలము కాగానే ఆ నిశ్చలమైన మనస్సులోనికి సత్యము వస్తుంది. ఎప్పుడైతే మీరు ఉంటారో ఆ క్షణమందు అనుభవించేవాడు – భోక్త – వున్నట్లు. మరి అనుభవించే వాడు కేవలం ఆలోచన ఫలితము. ఆలోచించడమే లేనప్పుడు ఆలోచించే వాడెట్లు వస్తాడు?

**3. ప్రశ్న: మన మొక తప్పు చేసి, ఎవరైనా మన తప్పును మనకు చూపించినా, మళ్ళీ మనమదే తప్పును ఎందుకు చేస్తాము?**

**కృష్ణమూర్తి:** మీరేమనుకొంటారు? మీరు పూలెందుకు కోస్తారు? మొక్కల నెందుకు విరిచివేస్తారు? సామానెందుకు చెడగొట్టుతారు? చిత్తుకాగితాలెందుకు అంతట విరజిమ్ముతారు? ఆ పనులు చేయవద్దని కనీసం ఒక డజను సార్లైనా మీకు ఎవరో ఒకరు తప్పక చెప్పి వుంటారనే నా నమ్మకం. అయినా మీ రాపనులెందుకు చేస్తారు? చెప్పేదంతా జాగ్రత్తగా వినండి, మీకే తెలుస్తుంది. మీ రాపనులు చేసేటప్పుడు అనాలోచితంగా చేస్తారు; మీ మనస్సు దానిమీద వుండదు. నిజంకాదా? మీరు అసావధానంగా వుంటారు, ఆలోచించరు. మీ మనస్సు నిద్రకు జారుకొంటుంది. అందువల్లనే యిటువంటి స్పష్టంగా బుద్ధిహీనములైన

పనులను చేస్తుంటారు. మీరు నిండుతెలివిలో లేనప్పుడు, అక్కడ మీ మనస్సు పూర్తిగా లేనప్పుడు ఏవో కొన్ని పనులు చేయవద్దని ఊరక మీకు చెప్పడంలో ప్రయోజనం లేదు. మీరు ఆలోచనాపరులు, నిజమైన ఎఱుక గలవారు, ఆనందముతో చెట్లను, పక్షులను, నదిని, భూమి యొక్క అద్భుత సంపదను సౌందర్యమును అవలోకింపగలవారు కావడంలో విద్యాబోధకుడు మీకు సహాయపడగల్గినట్లయితే, అప్పుడు మీ కేమాత్రము సైగ చేసినా సూచన చేసినా చాలును, వెంటనే గ్రహిస్తారు. ఎందువల్లనంటే అప్పుడు మీ మనస్సు చాల సున్నితంగా వుంటుంది, వెంటనే గ్రహింపగల శక్తి కలిగి వుంటుంది. మీ చుట్టు బయట లోపల వున్న ప్రతిదానిని మీరు అప్రమత్తంగా గమనిస్తూ వుంటారు.

దురదృష్టవశాత్తు మీ సున్నితమైన మనస్సు, మీ సంవేదనశీలత, క్రమంగా నాశనము చేయబడుతుంది. దానికి కారణం పుట్టినప్పటి నుండి చనిపోవువరకు, "ఇది చేయండి, అది చేయకండి" అని అంటూ మీ కెప్పుడూ చెబుతూనే వుండడం. తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, సంఘము, మతము, మతగురువు – వీరితోబాటు మీకున్న ఆశలు, ఆకాంక్షలు, అత్యాశలు, ఈర్ష్యాసూయలు – ఇవన్నీ 'ఇది చేయండి అది చేయకండి' అంటూ చెప్పుతూనే వుంటాయి. ఈ విధి నిషేధముల నుండి విముక్తి పొందడంతో బాటు, మీ సున్నితమైన మనస్సును అట్లే నిలుపుకోవలెనంటే దానికెంతో విచారశీలత (thoughtfullness) వుండాలి; ఎంతో వివేకము, సానుభూతి వుండాలి. అప్పుడు మీరు సహజంగానే దయాళురై మనుషులను పీడింపరు, చిత్తుకాగితాలను అంతటా వెదజల్లరు. బాటలో రాయి పడివుంటే, దానిని తీయకుండ దాటుకొని పోరు. మరి విద్యయొక్క ఉద్దేశం, నిజానికి, కొన్ని అక్షరాలను మీ పేర్ల చివర తగిలించుకోవడానికై యిప్పించడం కాదు; మీలో ఈ విచార శీలతను మేల్కొలిపి మిమ్ము సంవేదన శీలురుగా, కోమల హృదయులుగా, నిత్య జాగరూకులుగా, అప్రమత్తులుగా, దయాళురుగా వుండునట్లు చేయడమే.

## 4. ప్రశ్న:- జీవితమంటే యేమిటి? మనమెట్లు సుఖంగా జీవింపగలము?

**కృష్ణమూర్తి:** ఒక చిన్నపిల్లవాడినుండి వచ్చిన ఒక చాల మంచి ప్రశ్న – జీవితమంటే యేమిటి? మీరొక వ్యాపారస్థుణ్ణి అడిగినట్లయితే, జీవితమంటే వస్తువుల నమ్మడం, డబ్బు సంపాదించడం అని చెబుతాడు. కారణమేమంటే ప్రొద్దున నుండి రాత్రిదాకా అతడు చేసేపని అదే గనుక. అదే ప్రశ్న ఆశలు, ఆకాంక్షలు గలవాణ్ణి అడిగితే అతడు జీవితమంటే ఆశయ సాధనకోసం, ఆశాసాఫల్యం కోసం చేసే సంఘర్షణ అని అంటాడు. పదవిని ప్రభుత్వాధికారాన్ని చేజిక్కించుకున్న వ్యక్తికే, ఒక సంస్థకు గాని, దేశానికి గాని అధిపతియైన వానికి జీవితమంటే తాను చేయదలచుకొన్న పనులతో నిండివుంటుంది. కూలివానికి, – ముఖ్యంగా ఈ దేశంలోని కూలివానికి – జీవితమంటే ఒక్కదినము గూడ విశ్రాంతి యెరుగని ఎడతెగని పని. అతని జీవితంలో కనిపించేవి మాలిన్యము, దైన్యము, కడుపునిండ తిండి లేకపోవడమున్ను.

మరి, యీ పోరాటము, ఈ ప్రయాస, ఈ తిండిలేక పస్తుండడం, దైన్యమనుభవించడం – వీటన్నింటితో మనిషి సుఖంగా జీవింపగలడా? జీవింపలేడనేది స్పష్టము. కాబట్టి అతడేమి చేస్తాడు? అతడు ప్రశ్నింపడు, జీవితమంటే యేమిటని అడుగడు. దాని బదులు సుఖమును గూర్చిన తత్త్వవిచారణ మొదలు పెడతాడు. అందులో మునిగిపోతాడు. ఇతరులను తన స్వార్థం కోసం ఉపయోగించుకొంటూనే తాను సర్వమానవ సౌభ్రాతృత్వము గురించి ఉపన్యసిస్తుంటాడు. జీవాత్మను, పరమాత్మను, మరి దేనినో కల్పించుకొని, తనకది తుదకు శాశ్వత సుఖాన్ని అనుగ్రహిస్తుందని నమ్ముతాడు. ఇంతకు సుఖమనేది దానికోసం ప్రాకులాడుతున్నంత కాలము చేతి కందదు. అదియొక ఆనుషంగిక ఫలము, మరియొక దానితోబాటు వచ్చెడి గౌణఫలము, ప్రధాన ఫలము కాదు. ఎక్కడనైతే మంచితనమున్నదో, ప్రేమ ఉన్నదో, పేరాశ లేదో, మనస్సు ప్రశాంతంగా వుండి సత్యాన్ని అన్వేషిస్తూ వుంటుందో అక్కడ సుఖము తనంతటు తానే, కోరకుండానే వస్తుంది.

## 5. ప్రశ్న:- మనలో మనము ఎందుకు కొట్లాడుకొంటాము?

**కృష్ణమూర్తి:** వృద్ధులు కూడ ఈ ప్రశ్నను అడుగుతారని అనుకొంటాను, ఏమి, అడగరా? మన మెందుకు దెబ్బలాడు కొంటాము? రష్యాకు విరుద్ధంగా అమెరికా, పాశ్చాత్య దేశాలకు వ్యతిరేకంగా చైనా నిలబడుతున్నాయి, ఎందుకని? మనము మాట్లాడేది శాంతిని గురించి, కాని సిద్ధమయ్యేది యుద్ధానికి. ఎందుకని? నేననుకోవడం, మానవులలో పెక్కుమందికి ఒకరితో నొకరు పోటీపడడమంటే, పోరాడడమంటే ఇష్టమని. ఇది స్పష్టంగా కనిపించే వాస్తవవిషయం. అట్లుగాకపోతే మనము దానిని ఎప్పుడో మానివేసి వుండేవాళ్ళం. పైగా, పోరాడడంలో జీవలక్షణమగు భావావేశముంటుంది. అదికూడ ఒక వాస్తవ విషయమే. మనము సజీవంగా వుండవలెనంటే వివిధ రూపాలలో సంఘర్షణ అవసరమని అనుకొంటాము. కాని అటువంటి జీవితము మిక్కిలి చెరుపు కలిగిస్తుంది. సంఘర్షణ లేకుండా జీవించే మార్గమొకటున్నది. అది కలువ పూవులాంటి జీవితము, వికసించుచున్న పూవులాంటి జీవితము. అది పోరాడదు, దానికి దేనితోను సంఘర్షణ లేదు. అది అట్లా వుంటుంది, అంతే. దేనికైనా దాని సహజ స్థితియే ఉత్తమమైన స్థితి. కాని మనం అందుకోసంగా చదివింపబడలేదు. మనం చదువుకొన్నది ఇతరులతో పోటీపడడానికి, పోరాడడానికిన్ని. మనం సైనికులుగా, న్యాయవాదులుగా, రక్షకభటులుగా, ప్రొఫెసర్లు (ప్రాచార్యులు)గా, ప్రిన్సిపాలురుగా, వ్యాపారస్థులుగా వుండడం కోసం చదివింపబడ్డాము. అందరు ఎత్తుగా ఆకాశంలో స్వారీ చేయగోరేవారే. మనకందరికీ విజయం కావాలి, సఫలత కావాలి. బయటికి ఎంతో వినయాన్ని అణకువను నటించేవారే ఎక్కువమంది. కాని లోపల, అంతర్గతంగా, నిజమైన వినయము గలవారే సుఖపడేవారు. వారెవరితోను పోరాడరు, పోటీపడరు.

6. ప్రశ్న:- మనస్సు ఇతర మానవులనే గాకుండా తన్ను తాను గూడ దురుపయోగం చేసికొంటుంది, ఎందువలన?

**కృష్ణమూర్తి:** దురుపయోగమంటే మన ఉద్దేశమేమిటి? పేరాశలు పెట్టుకొన్నది అత్యాశ కలది అసూయతో నిండినదైన మనస్సు, అంధ విశ్వాసముల చేతను సంప్రదాయముల చేతను బరువెక్కిన మనస్సు, దయా దాక్షిణ్యములు లేనిది ప్రజలను తన స్వార్థంకోసం ఉపయోగించుకొనునట్టిది అగు మనస్సు – అటువంటి మనస్సు తన ఆచరణచేత అనర్థాన్ని సృష్టిస్తుంది. సంఘర్షణతో నిండిన సమాజాన్ని నిర్మిస్తుంది. ఇది తెలిసిన విషయము. మనస్సు తన్ను తాను అర్థము చేసికోనంతవరకు దాని ఆచరణ తప్పక వినాశమునకే దారితీస్తుంది. తన్ను గురించిన జ్ఞానము తనకు లేనంతవరకు మనస్సు వైరమును వృద్ధి పొందిస్తూ వుంటుంది. అందువల్లనే మీ గురించి మీరు స్వయంగా తెలిసికోవడం చాల అవసరం, కేవలము పుస్తకాలనుండి నేర్చుకోవడమే కాదు. ఆత్మజ్ఞానాన్ని యే పుస్తకమున్ను మీకు బోధింపదు. ఆత్మజ్ఞానమును గురించిన సమాచారమును పుస్తకము అందజేయవచ్చు. కాని దానికిన్ని స్వయంగా ఆచరణలో మిమ్ము మీరు తెలిసికోవడానికిన్ని భేదమున్నది. ఇతరుల తోడి సంబంధమనే అద్దంలో మనస్సు తన్నుతాను చూచుకొన్నప్పుడు ఆ ప్రత్యక్ష దర్శనము ద్వారా ఆత్మజ్ఞానము సిద్ధిస్తుంది. మరి యీ ఆత్మజ్ఞానము లేనిదే, ప్రపంచంలో మనము సృష్టించిన యీ గందరగోళాన్ని, యీ భయంకరమైన దైన్యాన్ని మనము తొలగించలేము.

7. ప్రశ్న:- సాఫల్యము నన్వేషించు మనస్సు, సత్యము నన్వేషించు మనస్సుకంటె వేరైనదా?

**కృష్ణమూర్తి:** సాఫల్యము నన్వేషించినా సత్యము నన్వేషించినా మనస్సు ఒకటే. కాని సాఫల్యము నన్వేషించుచున్నంత కాలము అది సత్యమును దర్శింపలేదు. సత్యమును అర్థము చేసికొనడమంటే అసత్యములోని సత్యమును చూడడం మరియు సత్యమును సత్యముగా చూడడం.

*3 ఫిబ్రవరి, 1955*

★ ★ ★

# 25. జీవితములోని ఆనందము

మనుషులు పెద్దవారయ్యేకొద్ది జీవితములోని ఆనందము నంతను పోగొట్టు కొంటున్నట్లుగా కనిపిస్తుంది. అదెందువలన అని మీరెప్పుడైనా ఆశ్చర్యపడలేదా? ప్రస్తుతం మీలో ఎక్కువమంది చిన్నపిల్లలు, చాల వరకు సుఖంగానే వున్నారు. మీ కేవేవో చిన్న చిన్న సమస్యలుండవచ్చు, పరీక్షలు కొంత ఆందోళన కలిగించవచ్చు. ఇటువంటి సమస్యలున్నా, మీ జీవితంలో ఒక విధమైన ఆనందమున్నది, ఏమి, లేదంటారా? మీరు జీవితాన్ని హృదయ పూర్వకంగా, స్వేచ్ఛగా గ్రహిస్తారు. మీరు దేనివైపైనా స్వేచ్ఛగా, సంతోషంగా చూస్తారు. మరి మనం పెద్దయ్యే కొలది మన దృష్టి కందనిదై ఎంతో మహత్త్వము కలిగియున్నదేదో దాని యొక్క ఆనందమయ సందేశమును పోగొట్టుకొంటున్నట్లుగా తోస్తుంది. ఇది యెందువలన? మనలో ఎంతోమంది యుక్తవయస్సు అనబడేది వచ్చేటప్పటికి మనస్సు మొద్దుబారి, అనావృతమగు ఆకాశమును, అద్భుతావహమగు భూమిని, అందలి అందమును, ఆనందమును గమనింప సమర్థులము కాలేకపోతున్నాము; వాటియెడల ఉదాసీనుల మవుతున్నాము. ఇది యెందువలన?

మనలో మనము ఈ ప్రశ్నను వేసికొన్నప్పుడు దానికి అనేక సమాధానాలు మన మనస్సులో మెదులుతాయి. మన మన సొంత పనులలో మనమంత యెక్కువగా మునిగిపోయి వుంటామనేది ఒక సమాధానము. మనమొక వ్యక్తిగా నిలబడాలని, సంఘములో ఒక స్థానాన్ని సంపాదించుకోవాలని, సంపాదించుకొన్న స్థానాన్ని నిలబెట్టుకోవాలని తంటాలు పడుతుంటాము. మనకు పిల్లలుంటారు; ఇంకా ఇతర బాధ్యతలుంటాయి. అందుకోసం డబ్బు సంపాదించుకోవలసివుంటుంది. ఈ బాహ్యవిషయాలన్ని మనలను త్వరలోనే క్రుంగదీస్తాయి. దానితో మనము జీవించడంలోని ఆనందాన్ని పోగొట్టుకొంటాము. మీ చుట్టూ వున్న పెద్దల ముఖాలను ఒకసారి చూడండి. వారిలో ఎక్కువమంది ఎంత విచారంగా వున్నారో, ఎంత చింతాక్రాంతులై జబ్బుపడ్డవాండ్లలాగ వున్నారో, ఎంత ఉదాసీనంగా ఎవరితోనైనా కలియడానికి జంకుతూ దూరంగా ఎట్లా వున్నారో, ఒక్కొక్కసారి చిరచిరలాడుతూ మొగంమీద చిరునవ్వు అనేది లేకుండా ఎట్లా ఉంటారో గమనించి చూడండి. ఎందుకని ఇట్లా వుంటారో మీలో మీరు ప్రశ్నించుకోరా? ఒకవేళ ప్రశ్నించుకొన్నా కేవలమేవో సమాధానాలతో విచారణలతోనే మనం చాలమంది తృప్తిపడిపోతామని అనిపిస్తుంది.

నిన్న సాయంత్రం ఒక పడవను చూశాను. అది యేటి కెదురుగా తెరచాప

నెత్తి, పడమట గాలి త్రోస్తూ వుంటే మిక్కిలి వేగంగా పోతూ వుండినది. అది ఒక పెద్ద పడవ; దాని నిండా పట్నం తీసికొనిపోవడం కోసం వంటచెఱకు ఎక్కించబడి వున్నది. సూర్యుడస్తమిస్తూ వున్నాడు, విశాలమైన ఆకాశాని కెదురుగా ఈ పడవ యొక్క సౌందర్యం అద్భుతమైనది. పడవవాడు కేవలం చుక్కాని పట్టుకొని త్రిప్పుతున్నాడు. అందులో ప్రయత్నమూ లేదు, శ్రమా లేదు. చేయవలసిన పనంతా గాలే చేస్తూవున్నది. అదే విధంగా మనలో ప్రతియొక్క వ్యక్తి తన జీవితంలోని సంఘర్షణను, ప్రయాసను వానికి సంబంధించిన సమస్యలను అర్థము చేసికోగల్గితే అప్పుడు మనంగూడ ప్రయత్నరహితంగా, సుఖంగా, ముఖంమీద చిరునవ్వుతో జీవింపగలమని అనుకొంటాను.

దాదాపు మన జీవితమంతా యీ సంఘర్షణతోనే గడిపివేస్తాం. మనం చేసే యీ ప్రయత్నమే యీ పెనుగులాటే మనలను నాశనం చేస్తూన్నది. మీరు మీ చుట్టూ వున్న పెద్దవాండ్లను గనక గమనించి చూస్తే వాండ్లల్లో ఎక్కువమంది జీవితము తమలో తమతో, తమ భార్యలతో, భర్తలతో, తమ యిరుగు పొరుగు వారితో, తమ సంఘంతో, పోరాడుతూనే గడిచిపోవడం చూడగలరు. ఈ అంతులేని సంఘర్షణ మన శక్తిని నాశనం చేస్తున్నది. ఆనందమయమైన నిజంగా సుఖమయమైన జీవితం గడిపేవాడు ఈ పెనుగులాటలో చిక్కుకొనడు. ప్రయత్నరహితంగా జీవించడమంటే మురిగిపోవడం కాదు, మీ బుద్ధి మందగించిందని, మీలో చుఱుకుదనం పోయిందని కాదు. పైగా నిజానికి బుద్ధిమంతులు, అద్భుతమైన ప్రజ్ఞ గలవారు మాత్రమే యీ శ్రమ నుండి యీ పెనుగులాట నుండి విముక్తి పొందగల్గినవారు.

కాని చూడండి, ప్రయత్నరహిత స్థితిని గురించి వినగానే మనమట్లా వుందామని కోరుకొంటాము? సంఘర్షణ, నిరోధము లేని స్థితిని సాధింపగోరుకొంటాము. అందుచేత దానిని మనము మన ధ్యేయంగా మన ఆదర్శంగా పెట్టుకొని దానికోసం గట్టి ప్రయత్నం చేస్తాము. కాని మనమెప్పుడైతే అటువంటి ప్రయత్నం చేస్తామో అప్పుడే, ఆ క్షణమందే మనము మన జీవితంలోని ఆనందాన్ని పోగొట్టుకొన్న వాండ్లమౌతున్నాము! మళ్లీ మనం ప్రయత్నంలోను పెనుగులాటలోను తగులుకొనడం సంభవిస్తుంది. మనం పడే ప్రయాస యొక్క ఉద్దేశంలో తేడా వుండవచ్చు కానీ ప్రయాసపడడంలో తత్త్వతః తేడా వుండదు. ప్రయాస అంతా ఒకటే. మనం పడే ప్రయాస సంఘ సంస్కరణ కోసం కావచ్చు, దేవుని ప్రత్యక్షం చేసికోవడం కోసం కావచ్చు, తనకు తన భార్యకు లేక భర్తకు మధ్య గాని, తనకును తన పొరుగువానికి మధ్యగాని గల సంబంధాన్ని బాగుపరచుకోవడం కోసం కావచ్చు. ఇందుకోసం గంగాతీరాన కూర్చుండి ఎవరో యొక గురువు పాదాలను ఆశ్రయించి వారికి పాదపూజ చేయవచ్చు, ఇంకా యిట్టివి ఎన్నైనా చేయవచ్చు. శ్రమ, పెనుగులాట లేదా ప్రయాస అంటే యిదే. కాబట్టి మనం పడే ప్రయాసకు ఉద్దేశ్యమేమిటి అనేది కాదు ప్రధానం; అసలు ప్రయాసపడడమంటే యేమిటో అర్థం చేసికోవడం ప్రధానం.

మరి, 'ఈ క్షణము దేనికోసమున్ను ప్రయాస పడడం లే'దని మాట వరుస కొక క్షణకాలం పాటు మాత్రమే ఎఱుక గల్గివుండడం కాకుండ, శాశ్వతంగా ఎట్టి

ప్రయాస ఎట్టి ప్రయత్నము లేకుండా వుండడం సాధ్యమా? అట్లుండ కల్గితే అప్పుడు మనస్సు ఉత్తమాధమ భేదభావము లేని ఆనందమయ స్థితిని పొందగలదు.

మనకున్న కష్టమేమంటే – మన మనస్సు తాను నికృష్టమైన దానినని భావించికొని మరియొక విధంగా వుండడంకోసం మరియొక స్థితిలోనికి మారడంకోసం పరస్పర విరుద్ధములైన తన రకరకాల కోరికలనుండి బయటపడడంకోసం గట్టి ప్రయత్నము చేస్తుంటుంది, పెనుగులాడుతుంటుంది. మనస్సెందువలన ఇంతగా పెనుగులాడుతుందో దానికి కారణాలు మనం వివరించి చెప్పుకోనక్కరలేదు. ఆలోచనా పరుడైన ప్రతి వ్యక్తికేని తనకు లోపలను బయటను ఎందుకింత ఘర్షణ వున్నదో తెలుస్తుంది. మన ఈర్ష్య, మన లోభము, మన ఆశలు, ఆకాంక్షలు, నిర్దయతోగూడిన సామర్థ్యమునకు మూలమగునట్టి పోటాపోటీ – ఇవన్నీ ఇప్పటి ప్రపంచంలోగాని, రాబోయే ప్రపంచంలో గాని మన పెనుగులాటలకు, మన ఘర్షణలకు కారణము లనడం స్పష్టము. కాబట్టి మన పెనుగులాటలకు మన ఘర్షణలకు కారణం తెలిసికోవడం కోసం మనస్తత్వశాస్త్ర గ్రంథములను అధ్యయనం చేయవలసిన అవసరం లేదు. మనకు ప్రధానంగా కావలసిందేమంటే, యీ ఘర్షణలనుండి యీ పెనుగులాటలనుండి మన మనస్సు పూర్తిగా విముక్తి పొందగలదేమో తెలిసికోవడమే.

ఇంతకున్ను మనము పెనుగులాడుతున్నామంటే ఆ పెనుగులాట, ఆ సంఘర్షణ మనమున్న ప్రస్తుత స్థితికిని మనముండవలసిన లేదా మనముండగోరిన స్థితికిని మధ్య గల సంఘర్షణ. దీని కిప్పుడు వివరణ లిచ్చుకోవడం, సమాధానాలు చెప్పుకోవడం గాకుండా అసలీ సంఘర్షణ జరిగే తీరునంతను పూర్తిగా అర్థము చేసికోగలమా? అట్లా అర్థం చేసికోడం వలన ఆ సంఘర్షణయే అంతమవుతుంది! గాలితోబాటు పోతూవున్న ఆ పడవవలె మనస్సు గూడ ఎట్టి ఘర్షణ లేకుండ వుండగలదా? అసలు సమస్య యిది. అంతేగాని, ఘర్షణలేని స్థితిని ఎట్లు సాధించాలి అనేది కాదు. అట్టి ఘర్షణలేని స్థితిని సాధించడం కోసం చేసే ప్రయత్నమే ఘర్షణ ప్రక్రియ, ఘర్షణ జరిగే తీరు. కాబట్టి అట్టి స్థితి యెన్నటికిని సిద్ధించదు. కాని అంతములేని యీ ఘర్షణలో మనస్సు ఏవిధంగా చిక్కుకొంటూ వుంటుందో ఏ క్షణమున కాక్షణము మీరు గమనించి చూస్తూవుంటే, – దానిని మార్చడం కోసం ప్రయత్నించకుండా – మీరు 'శాంతి'యని పిలిచే ఒకానొక స్థితిని మీ మనస్సులోనికి బలవంతంగా ప్రవేశపెట్టడం కోసం ప్రయత్నించకుండా – వాస్తవంగా ఉన్న స్థితి యేమిటో దానిని మీరు గమనించి చూస్తూ వుంటే అప్పుడు మనస్సులోని ఘర్షణ, దానంతట అదే ఆగిపోవడం మీరు గమనింపగలరు. అట్టి స్థితిలో మనస్సు నేర్చుకోగలిగినది అపరిమితము. అట్లు నేర్చుకోవడమంటే కేవలం సమాచారాన్ని సేకరించడం కాదు, మనస్సు యొక్క పరిధికి అవతలవున్న అద్భుతమైన సంపదలను కనుగొనడము. ఆ సంపదలను దర్శింపగల మనస్సులో ఆనందముంటుంది.

మిమ్ము మీరు పరిశీలించి చూచుకొంటూ వుంటే మీరు ప్రొద్దున నుండి రాత్రిదాకా యెట్లా శ్రమ పడుతూ వుంటారో మీలో ఎంత ఘర్షణ వుంటుందో ఈ ఘర్షణలో మీరెంతగా మీ శక్తిని వృథా చేసికొంటున్నారో చూచుకోగలరు.

దేనికోసం మీరు తంటాలు పడుతున్నారో కేవలం వివరింప ప్రయత్నిస్తే మీరు మీ వివరణలలో దారి తప్పి పోతారు. మీ పోరాటమూ, కొనసాగుతూ వుంటుంది. అట్లాగాక వివరణలు, సమాధానాలు ఇచ్చే బదులు ప్రశాంతంగా మీరు మీ మనస్సును పరిశీలిస్తూ వుంటే – మరి, మీ మనస్సును తనలోని ఘర్షణను తాను ఎట్టి ఆటంకము లేకుండా తెలిసికోనిస్తే – అప్పుడసలు సంఘర్షణమే లేనట్టి ఒక విధమైన స్థితి సిద్ధించడం మీరు చూడగలరు. అందులో అద్భుతమైన ఎఱుక వుంటుంది. ఆ జాగ్రత్ స్థితిలో ఉత్కృష్టము నికృష్టమను భేద భావముండదు. గొప్పవాడు, తక్కువవాడనే తేడా వుండదు. అక్కడ గురువుకు స్థానము లేదు. మనస్సు పూర్తిగా మేల్కొని వుండడం వలన అట్టి అసంగత విషయాలన్నీ పోతాయి. పూర్తి మెలకువలో నున్న మనస్సే ఆనందమయమగు మనస్సు.

1. **ప్రశ్న:- నేనొక పని చేయదలచినాను. అందుకోసమై చాలసార్లు ప్రయత్నించి నప్పటికిన్ని విజయం పొందలేకపోయినాను. ఇప్పుడందుకోసమై ప్రయత్నం చేయడం మానివేయనా, లేక పట్టుదలతో ప్రయత్నం చేస్తూనే వుండనా?**

**కృష్ణమూర్తి:** విజయం పొందడమంటే ఒక చోటికి వచ్చి చేరడం, ఒక స్థానాన్ని అందుకోవడం. మనము విజయం పొందడాన్ని పూజిస్తాం, పూజించమా? ఒక బీదపిల్లవాడు పెరిగి పెద్దవాడై కోటీశ్వరుడైతే, లేక ఒక మామూలు విద్యార్థి ప్రధానమంత్రి అయితే అతనిని అందరు మెచ్చుకొంటారు, చాల గొప్ప చేస్తారు. అందువలన ప్రతి బాలుడు ప్రతి బాలిక ఏదో ఒక విధంగా విజయం సాధించాలని ఆశిస్తారు.

అయితే, విజయము లేదా సాఫల్యమంటూ అసలు ఏదైనా వున్నదా? లేక అది ఒక భావన యేనా? ఆ భావన వెంటదవిలి మనిషి దానిని అందుకొన ప్రయత్నిస్తున్నాడా? మీరొక చోటికి వచ్చి చేరిన క్షణమందే మరికొంత దూరంలో, దానికింకా ముందు, మీరు పోయి చేరుకోవలసిన చోటు మరియొకటి కనిపిస్తుంది. ఇట్లా దీని కంతముండదు. ఏ దిశలోనైనా సరే మీరు సఫలత పొందడంకోసం ప్రయత్నిస్తూ వున్నంతకాలం మీలో ఘర్షణ, పెనుగులాట, పోరాటము తప్పవు, ఇది నిజంకాదా? మీరొక చోటికి వచ్చి చేరుకొన్నా, మీకు విశ్రాంతి ఉండదు. కారణమేమంటే, మీరింకా పైపైకి పోగోరుతారు. ఇంకా ఎక్కువెక్కువగా వేటివేటినో పొందగోరుతారు. ఏమి, మీకు అర్థమవుతున్నదా? సఫలత కోసం ప్రయత్నం చేయడమంటే ఇంకా ఎక్కువెక్కువగా కావాలని కోరుకోవడం. ఈ విధంగా ఎల్లప్పుడు ఇంకా ఎక్కువ కావాలి, ఇంకా ఎక్కువ కావాలి అని కోరుకొంటూ వుండే మనస్సు తెలివి గల మనస్సు కాదు. అది మధ్యమమైనది, తెలివి తక్కువది. కారణమేమంటే, ఇంకా ఎక్కువెక్కువగా కావాలని కోరుకొనే కోరికలో అంతర్నిహితమై సంఘ నిర్దిష్ట మార్గమున జరిగెడి నిరంతర ప్రయత్నము, నిరంతర సంఘర్షణము చేరి వుంటుంది.

ఇంతకు సంతుష్టి అంటే యేమిటి? అసంతుష్టి అంటే యేమిటి? అసంతుష్టి

అంటే అధికం కోసం సంఘర్షణ – అంటే ఇంకా ఎక్కువెక్కువగా కావాలని, అందుకోసం ప్రయత్నించడం, పెనుగులాడడం. సంతుష్టి అంటే ఆ సంఘర్షణ, ఆ పెనుగులాట అంతమవడం. అయితే, అధికం కోసం సంఘర్షణ యెట్లు జరుగుతున్నదో ఆ ప్రక్రియ ఎట్లు సాగుతున్నదో, దానిని మనస్సెందుకు కోరుకొంటుందో అవగాహన చేసికోకపోతే మీకు సంతుష్టి లభింపదు.

ఉదాహరణకు మీరొక పరీక్షలో తప్పిపోతే, ఆ పరీక్ష మళ్ళీ వ్రాయవలసి వస్తుంది. ఏమి, వ్రాయవలసి రాదా? అసలు పరీక్షలనేవి, ఏవిధంగా చూచినా మిక్కిలి దురదృష్టకరమైనవి. అవి మహత్త్వపూర్ణమైన విషయాన్ని దేనినీ సూచించవు. మీ తెలివి తేటల నిజమైన విలువను గూడ అవి తెలుపవు. పరీక్షలు పాసవడం ప్రధానంగా జ్ఞాపకశక్తిలోగల నేర్పు, అది దాని చమత్కారము. లేదా అది అదృష్టం మీద ఆధారపడిన విషయం. అయినా పరీక్షలు పాసవడానికి మీరు గట్టిగా ప్రయత్నిస్తారు. ఒకవేళ మీరందులో విజయం పొందకపోతే మళ్ళీ మళ్ళీ ప్రయత్నిస్తూనే వుంటారు. దైనిక జీవితంలో గూడ మనలో చాలమందికి అట్లే జరుగుతూ వుంటుంది. ఏదో యొక దానికోసం మనమెప్పుడూ ప్రయత్నిస్తూనే వుంటాము. కాని దేనికోసం మనమింత శ్రమ పడుతున్నామో అది అంత యెక్కువ శ్రమపడవలసినంత ముఖ్యమైనదాయని క్షణకాలమాగి విచారించము; అది శ్రమకు తగిన విలువ కలదేనా యని మనలో మనమెన్నడును ప్రశ్నించుకోము. అందువలన దానికి విలువలేదనే విషయాన్ని మనము తెలిసికొనలేకపోయినాం. అందుచేత మన తల్లితండ్రులు, మన సమాజము, మన గురువులు, పరమ గురువులు – వీరందరి అభిప్రాయాన్ని ఎదిరించి మనము నిలబడలేకపోయినాం. 'ఇంతకంటె అధికము' అనే మాటకు గల ప్రాధాన్యమును, దాని పూర్తి అర్థమును మనము బాగా గ్రహించినప్పుడే, విజయము – అపజయము, సాఫల్యము – వైఫల్యము – ఈ విధంగా ఆలోచించడం మానివేయగలము.

పరీక్షలలోనే కాదు, జీవితంలో గూడ అపజయం పొందడమంటే, తప్పులు చేయడమంటే మనమెంతో భయపడతాం. తప్పు చేయడమంటే చాల భయంకరమైన విషయంగా ఎంచబడుతుంది. ఎందుకంటే, దానికి మనలను విమర్శిస్తారు, తిడతారు. కాని మీరసలు తప్పు ఎందుకు చేయరాదు? ప్రపంచంలో అందరు తప్పులు చేయడం లేదా? మన మొకరం తప్పంటూ చేయకపోతే ప్రపంచ మీదారుణమైన గందరగోళ పరిస్థితి నుండి బయట పడుతుందా? మీరు తప్పులు చేయడానికి భయపడేటట్లయితే మీ రెన్నటికిని నేర్చుకోలేరు. పెద్దవాండ్లు ఎప్పుడూ తప్పులు చేస్తూనే వుంటారు. కాని మీరు మాత్రం తప్పులు చేయకూడదని మందలిస్తుంటారు. ఆ విధంగా మీలో వుండే చొరవను అణగగొట్టివేస్తారు. ఎందువలన? వారి భయ మేమిటంటే, మీరు ప్రతిదానిని పరిశీలిస్తూ, ప్రశ్నిస్తూ, పరీక్షించి చూస్తూ, తప్పులుచేస్తూ, తుదకు మీరు స్వయంగా తెలివి పొందినవారై, మీ తల్లితండ్రులు, సంఘము, సంప్రదాయముల అధికారమునుండి విడివడి తప్పించుకొని పోతారేమో యని వారి భయము. అందువల్లనే విజయము పొందడమనే ఆదర్శాన్ని మీ ముందుపెట్టి దానిని అనుసరించమని మీతో చెబుతారు. విజయము గౌరవ ప్రదమైనదిగా లెక్కింపబడడం

మీరు గుర్తించగలరు. ఆఖరికి సన్న్యాసి గూడ తన ఆధ్యాత్మిక సాధనలనబడే వానిద్వారా గౌరవ ప్రదమైన స్థితిని పొందకపోతే, అతని నెవరును గుర్తించరు, అతని నెవరును అనుసరింపరు, అతనికి శిష్యులుండరు.

కాబట్టి మనమెల్లప్పుడును 'విజయము' 'సాఫల్య'మను పదములలోను 'ఇంతకంటె అధిక'మనే పదములోను ఆలోచిస్తూ వుంటాము. గౌరవనీయమగు సమాజమే అధికమనే పదానికి విలువ కట్టుతుంది. అంటే, దానినే మరియొక విధంగా చెప్పితే, సంఘము చాల జాగ్రత్తగా ఆలోచించి ఒక మర్యాదను స్థిరపరుస్తుంది. దాని ననుసరించి మీరు పొందినది జయమో అపజయమో నిర్ణయిస్తుంది. కాని మీరు ఏ పనైనా మనస్ఫూర్తిగా దానిమీద ప్రేమతో చేయగోరినట్లయితే అప్పుడు మీకు సాఫల్య వైఫల్యములతో సంబంధము లేదు. తెలివి గల వ్యక్తి యెవరైనా సరే చేసేది అంతే. కాని దురదృష్టవశాత్తు తెలివి గల వ్యక్తులు, అంటే ప్రాజ్ఞులు చాల అరుదు. మీకీ విషయాలన్ని ఎవ్వరున్ను చెప్పరు. ప్రాజ్ఞుడు చేయవలసినదెల్ల యేమంటే ఉన్న వాస్తవాలను చూడడం, సమస్యను అర్థం చేసికోవడం – అంటే దాని భావం, సాఫల్యము, వైఫల్యము అనునట్టి పదములలో ఆలోచించకుండడం. మనము చేసే పనిమీద మనకు ప్రేమ లేనప్పుడు మాత్రమే మన మీ సాఫల్య వైఫల్యమనే పదములలో ఆలోచిస్తాము.

2. **ప్రశ్న:- మౌలికంగా మనమేల స్వార్థపరులము? మనమెంత నిస్స్వార్థంగా వుందామని ప్రయత్నించినా, మన స్వప్రయోజనములు అడ్డు వచ్చేటప్పటికి కేవలం స్వార్థపరాయణులమై ఇతరుల ప్రయోజనములను లెక్కచేయము; వారి అభిరుచుల యెడ ఉదాసీనత వహిస్తాము.**

**కృష్ణమూర్తి:** ఎవరైనా తమ్ము తాము స్వార్థపరులమనిగాని నిస్స్వార్థపరులమనిగాని చెప్పకొనరాదు. ఇది చాల ముఖ్యమని నేను అనుకొంటాను. కారణమేమంటే పదములు మనస్సుమీద అసాధారణమైన ప్రభావాన్ని కలిగివుంటాయి. ఒక మనిషిని 'నీవొక స్వార్థపరుడ'వని అంటే అతనికొక పెద్ద శిక్ష విధించినట్లే. అతనినే ప్రొఫెసరువని పిలిచినారనుకోండి. అప్పుడతనితో మీరు వ్యవహరించే తీరులోనే తేడా కనబడుతుంది. అతనిని మహాత్ముడవని పిలిచినారనుకోండి. వెంటనే అతని చుట్టు ఒక తేజోవలయము మీకు కనిపిస్తుంది. న్యాయవాది, వ్యాపారస్థుడు, గవర్నరు, నౌకరు, ప్రేమ, దేవుడు – ఇటువంటి మాటల యెడల మీ ప్రతిక్రియ లెట్లా వుంటాయో మీరు గమనించి చూచుకొంటే అవి మీ నరముల మీదను మీ మనస్సు మీదను ఒక వింత ప్రభావాన్ని కలుగజేస్తున్నట్లు మీరు స్వయంగా తెలిసికోగలరు. ఏదైనా ఒక విశిష్టమైన వృత్తిని తెలియజేసే పదము మనలో దానికి సంబంధించిన హోదాను జ్ఞాపకానికి తెస్తుంది. కాబట్టి మొట్టమొదట జరగవలసిన పని యేమిటంటే, కొన్ని కొన్ని పదాలతోబాటు, కొన్ని కొన్ని భావాలను అనాలోచితంగా జతకలిపే అలవాటు నుండి మనము విముక్తులం కావాలి. ఏమి, కానక్కరలేదా? స్వార్థమనే పదము ఏదో మిక్కిలి దోషయుక్తమై అపవిత్రమైన దానిని దేనినో సూచిస్తుందని

భావించడానికి మన మనస్సు అలవాటుపడింది. అందువలన మీ రాపదమును దేని గురించైనా ఉపయోగిస్తే వెంటనే మీ మనస్సు దానిని నిందించసాగుతుంది. కాబట్టి "మనమెందువలన మౌలికంగా స్వార్థపరుల"మని మీరు ప్రశ్న వేసినప్పుడు ముందుగానే ఆ ప్రశ్నలో నిందాభావము ధ్వనిస్తున్నది.

కొన్ని కొన్ని పదములు వినగానే మీలో నాడీమండలమునకు సంబంధించిగాని, మనోభావములలోగాని, బౌద్ధికంగాగాని – అంగీకార రూపంలోనో తిరస్కారరూపంలోనో లేదా నిందా రూపంలోనో, స్తుతి రూపంలోనో – ప్రతిక్రియలను కలిగిస్తాయి. ఉదాహరణకు మిమ్ములను మీరు అసూయాపరులుగా భావించుకొన్నప్పుడు ఇక దాని గురించిన విచారణకే అవకాశముండదు; వెంటనే ఆ విచారణకు ఆటంక మేర్పడుతుంది. అసూయ అనే సమస్యను లోతుగా పరిశీలించడము ఆగిపోతుంది. అదేవిధంగా చాలమంది తాము మానవ సౌభ్రాతృత్వం కోసమై పని చేస్తున్నట్లు చెప్పకొంటారు. కాని చేసే పనులన్నీ అందుకు వ్యతిరేకంగా వుంటాయి. అయినా వారి కా విషయమే తెలియదు. దానికి కారణము సౌభ్రాతృత్వమనే పదము వారిలో ఒక విశిష్ట భావాన్ని కలుగజేసి వుంటుంది. ఒక ప్రత్యేకమైన అర్థంలో దానిని గ్రహించి వుంటారు. ఆ భావానికి వారప్పడే లొంగిపోయి వుంటారు. వారింక దానిగురించి విచారణయే చేయరు. ఆ మాట వారి నాడీ మండలము మీదను మనోభావాల మీదను ఎట్టి ప్రభావము చూపిస్తున్నప్పటికిని దానికి ప్రాముఖ్యమీయక అసలు యథార్థ మేమో కనుగొనడానికి వారు బొత్తిగా ప్రయత్నించరు.

కాబట్టి కొన్ని కొన్ని పదములతో సంబద్ధములై వాటితోబాటు కలిగే నిందా ప్రశంసాభావములకు మన మనస్సులో చోటీయకుండా అందరి యథార్థ తత్త్వములను, అందలి వాస్తవికాలను మనము చూడగలమా అనే విషయాన్ని ప్రయోగముల ద్వారా పరీక్షించి తెలిసికొనడం మొట్టమొదట చేయవలసిన పని. ఆ విధంగా నిందా ప్రశంసా భావములకు మీ మనస్సులో చోటీయకుండా మీరు వాస్తవికాలను చూడగలిగినట్లయితే, ఆ చూచే ప్రక్రియలోనే మనస్సు తనకును వాస్తవికాలకును మధ్య కట్టుకొన్న అడ్డుగోడలన్నీ కూలిపోవడం మీరు కనుగొనగలరు.

ప్రజల చేత గొప్పవాడని పిలువబడే ఒక వ్యక్తిని మీరేవిధంగా సమీపిస్తారో, ఊరక మీలో మీరు పరిశీలించి చూచుకోండి. గొప్పవాడనే పదము మిమ్ము ప్రభావితము చేసియున్నది. వార్తా పత్రికలు, పుస్తకాలు, అతని అనుయాయులు – అందరు అతనిని గొప్పవాడని చెప్పతుంటారు. ఆ మాటలను మీరు నమ్మినారు. లేదా దానికి విరుద్ధమైన అభిప్రాయం మీరు కలిగి వుంటారు. "వీడెంత తెలివి తక్కువ మనిషి, వీడా గొప్పవాడు? కానేకాదు" అని మీరనుకొంటారు. అట్లుగాకుండా మీరు మీ మనస్సును ఇటువంటి బాహ్య ప్రభావాల నుండి విముక్తము చేసికొని కేవలం యథార్థ విషయాలను చూడగల్గితే, వాస్తవ మేమిటో చూడగల్గితే అప్పడు మీ రనుసరించే మార్గము వేరుగా వుంటున్నట్లు తెలిసికోగలరు. అదేవిధంగా 'పల్లెటూరి మనిషి' అనే మాట వినగానే దానితోపాటు మనస్సునకు తోచెడి నిర్భర దారిద్ర్యము, మాలిన్యము, మురికి – ఇవిగాని, ఇంకా ఇటువంటివేవైనా సరే మన ఆలోచనలను ప్రభావితము చేస్తాయి. కాని మన మనస్సు వాటి ప్రభావమునకు లొంగక, దానినుండి

విముక్తమై దేనినీ నిందించక, దేనినీ ప్రశంసించక కేవలం పరిశీలనాదృష్టితో చూస్తూవుంటే, అప్పుడా మనస్సు స్వాత్మనిష్ఠము కాదు. అప్పుడిక స్వార్థము నిస్స్వార్థముగా మారడంకోసం ప్రయత్నించడమనే సమస్యే వుండదు.

3. **ప్రశ్న:- పుట్టినది మొదలు చచ్చిపోవువరకు వ్యక్తి యెల్లప్పుడు ప్రేమ కోసం పరితపిస్తూ వుంటాడు. అతనికా ప్రేమ లభ్యం కాకపోతే అతడు తక్కిన తన తోడివారివలె గుండె నిబ్బరము కలిగి ధైర్య విశ్వాసములతో శాంతంగా వుండలేడు. ఎందువలన?**

**కృష్ణమూర్తి:** అతని తోడి వారికి ధైర్య విశ్వాసములుంటాయని మీరనుకొంటున్నారా? ఉండవు. వారు గర్వంతో ఠీవిగా నడవవచ్చు, దర్పం చూపవచ్చు. కాని పైకి కనబడే ఆ ధైర్య విశ్వాసాల వెనుక చాలమంది మెదడులు ఖాళీ, వాటిల్లో ఏమీ వుండదు. వారు స్తబ్ధులు, వారి బుద్ధి మట్టము, వారిలో నిజమైన ధైర్య విశ్వాసాలుండవు. అది సరే, అసలు మన మితరుల ప్రేమ నెందుకు కోరుకొంటున్నాము? మీ తల్లితండ్రులు, మీ ఉపాధ్యాయులు, మీ స్నేహితులు మిమ్ము ప్రేమించాలని మీరు కోరుకొనడం లేదా? మీరు పెద్దవారైతే మీ భార్య, మీ భర్త, పిల్లలు లేదా మీ గురువు మిమ్ము ప్రేమించాలని కోరుకొంటారు. ప్రేమ కోసమై యీ అంతులేని తపన ఎందుకని? ఇక చెప్పేది జాగ్రత్తగా వినండి. మీరు ప్రేమించరు కాబట్టే మీ రితరుల ప్రేమ కోసం తహతహలాడుతున్నారు. కాని మీరు ప్రేమించ సాగితే ఆ క్షణము నుండి మీ తహతహ అంతమవుతుంది. అప్పటి నుండి ఎవరో యితరులు మిమ్ము ప్రేమిస్తున్నారా లేదా అనే ప్రశ్న వుండదు. దానిని గురించి విచారించనే విచారించరు. మీ రితరులనుండి ప్రేమను కోరుకొంటున్నంతవరకు మీలో ప్రేమ లేనట్లే. మీలో ప్రేమ లేకపోతే మీరు సౌందర్యహీనులు, క్రూరులు. అందువలన ఎవరైనా మిమ్మెందుకసలు ప్రేమించాలి? ప్రేమలేనిచో మీరు మృతప్రాయులు; మృత పదార్థము ప్రేమను యాచిస్తే అది యింకను మృతపదార్థమే. అట్లుగాక మీ హృదయము ప్రేమతో నిండి వుంటే, అప్పుడు మీరు ప్రేమించమని ఎవరినీ అడగనే అడగరు; ప్రేమభిక్ష పెట్టుమని మీరు మీ భిక్షాపాత్రను ముందుకు చాచరు. ఏమీలేని వారే తమ పాత్రను నింపమని అడిగేవారు. ప్రేమశూన్యమగు హృదయము ప్రేమకోసమై గురువుల వెంటబడినా, ఇంకా అనేక విధాల ఎంతగా ప్రయత్నించినా, అది యెన్నటికిని ప్రేమతో నింపబడదు.

4. **ప్రశ్న:- పెద్దవాండ్లు దొంగతనమెందుకు చేస్తారు?**

**కృష్ణమూర్తి:** అప్పుడప్పుడు మీరు దొంగిలించరా? ఒక చిన్నపిల్లవాడు తనకు కావలసిన దానిని వేరే పిల్లవాని దగ్గరినుండి దొంగిలించి తీసికోవడం మీరెరుగరా? మనం పిల్లలమైనా పెద్దలమైనా జీవితమంతా ఇట్లాగే జరుగుతుంటుంది. అయితే పెద్దవాండ్లు తాము చేసే దొంగతనాన్ని ఇంకొంత ఉపాయంగా ఇంకొంత నేర్పుగా అందమైన మాటలు చెబుతూ చేస్తారు. వాండ్లకు ధనం కావాలి, అధికారం కావాలి,

హోదా కావాలి. అందుకోసమై వాండ్లు ఇతరుల కన్ను గప్పుతారు, ఉపాయాలు పన్నుతారు, కారణాలు చెప్పి సమర్థించుకొంటారు. వాండ్లు దొంగిలిస్తారు. కాని దానిని దొంగతనమని అనరు. దానికేదో గౌరవనీయమైన పేరు పెడతారు. మరి, అసలు మన మెందుకు దొంగిలిస్తాము? మొట్టమొదటిది, ఇప్పుడు సంఘం వున్న తీరును బట్టి చాలమందికి జీవితావశ్యకములైన వస్తువులు కూడ దొరకకుండ పోతున్నాయి. కొందరికి తగినంతగా తిన తిండి, కట్ట గుడ్డ, ఉండ నీడ లేవు. అందువలన వాండ్లిటువంటి పనులేవో చేస్తారు. వాండ్లు గాకుండ సంఘ వ్యతిరేకు లనబడేవారు కొందరుంటారు. వాండ్లకు తగినంత తిండివున్నా సరే, దొంగతనం చేస్తుంటారు. వాండ్లకు దొంగతనం ఒక వినోదం వంటిది, తాత్కాలికోద్రేకాన్ని కలిగిస్తుంటుంది. అంటే దాని భావం, వాండ్లకు నిజమైన విద్య లభింపలేదని. నిజమైన విద్య అంటే జీవితము యొక్క మహత్త్వమును, దాని అర్థమును తెలిసికోవడం; అంతేగాని కేవలం పరీక్షలు పాసవడం కోసం పాఠాలు బట్టీ పట్టడం కాదు. ఇది కాకుండా ఉన్నత స్థాయిలో దొంగతన మొకటున్నది – ఇతరుల అభిప్రాయాలను, ఇతరుల జ్ఞానాన్ని దొంగిలించడం. ఇంకా ఇంకా కావాలి అని మనము కోరుతున్నామంటే దాని అర్థం మనం దొంగతనం చేస్తున్నట్లే.

మన మెందువలన ఎల్లప్పుడు అడుగుతూ వుంటాం, యాచిస్తూ వుంటాం, కోరుతూ వుంటాం, దొంగిలిస్తూ వుంటాం? దానికి కారణం మనలో అంతా శూన్యమే; అంతరికంగా మానసికంగా మనం ఖాళీ పీపాల వంటి వాళ్లం. మనలోపల ఏమీ లేకపోవడం చేత అంతఃశూన్యులమవడంచేత వస్తువులను దొంగిలించియేకాదు, ఇతరులను అనుకరించి కూడ మనలను మనం నింపుకోవడానికి ప్రయత్నిస్తూ వుంటాము. అనుకరణ ఒక విధమైన దొంగతనం. “మీరెందుకును పనికిరారు, మీలో ఏమిన్నీలేదు; ఆయన గొప్పవాడు, అందువలన ఆయనను అనుకరిస్తే ఆయన గొప్పతనంలోని కొంతభాగం మీకున్ను దక్కుతుంది” – ఇటువంటి భ్రష్టాచారము, మానవజీవిత మంతటా మొదటి నుండి తుదివరకు నిండివుంది. దాని నుండి విముక్తి పొందినవారు ఏ కొద్దిమందో! కాబట్టి ఈ అంతరిక శూన్యతను ఎప్పటికైనా నింప సాధ్యమా? అనేది తెలిసికోవడం ముఖ్యం. మనస్సు తన్ను తాను నింపుకోడానికి ప్రయత్నిస్తూ వున్నంతకాలము అది ఖాళీగానే వుంటుంది. మనస్సు తనలోని ఖాళీని తనలోని శూన్యతను నింపుకోడానికి చేసే ప్రయత్నమునే మానివేస్తే అప్పుడా శూన్యత కిక అస్తిత్వమే వుండదు. అప్పుడది స్వయంపూర్ణము.

*4 ఫిబ్రవరి, 1955*

★ ★ ★

# 26. సత్యము - మనస్సునకందనిది

మీకు తెలుసా, చాల ప్రశాంతంగా కూర్చుంటే ఎంత బాగుంటుందో! తిన్నగా కూర్చోండి, అటునిటు ఒరగకుండా, వంగకుండా, సమతూకంగా, ఠీవిగా. అట్లా కూర్చోవడం ఎంత ముఖ్యమో ఆ ఆకులులేని చెట్లవైపు చూడడంగూడ అంతే ముఖ్యం. ప్రాతఃకాల కాంతిరేఖలతో తెలుపెక్కిన ఆ నీలాకాశాని కెదురుగా ఆ చెట్లు ఎంత అందంగా నిలబడి వున్నాయో మీరు గమనించారా? ఆకులన్నీ రాలిన వట్టి కొమ్మలు చెట్టుయొక్క అందాన్ని వెల్లడి చేస్తాయి. చెట్లు చిగిరించే వసంత ఋతువులోగాని, ఎండలు కాసే గ్రీష్మ ఋతువులోగాని, వెన్నెల కాసే శరదృతువులోగాని, ఆకులురాలే హేమంత ఋతువులోగాని ఎప్పుడైనాసరే చెట్ల సౌందర్య మద్భుతము. ఋతువులతోబాటు వాటి సౌందర్యముకూడ మారుతూ వుంటుంది. దీనిని గుర్తించడం ఎంత ముఖ్యమో మనము మన జీవిత విధానాలను గూర్చి ఆలోచించడం కూడ అంతే ముఖ్యము.

రష్యాలో వున్నా, అమెరికాలో వున్నా, భారతదేశంలో వున్నా మనమందరము మానవులము. మానవులముగా మన అందరి సమస్యలు ఒకటే. వాటిలో భేదము లేదు. అసలు మనలను మనము హిందువులముగా అమెరికనులముగా, రష్యనులముగా, చైనా వారముగా ఇట్లా వేర్వేరుగా భావించుకోవడం సమంజసమైన పని కాదు. రాజకీయ భేదములు, భౌగోళిక భేదములు, జాతి భేదములు, ఆర్థిక భేదములున్నవనుట నిజమే. కాని ఆ భేదములకు ప్రాధాన్యమిస్తే పరస్పర విరోధము విద్వేషము పెచ్చు పెరిగిపోతాయి. ప్రస్తుతానికి అమెరికావారు తక్కినవారికంటె మించి సంపన్నులై అభివృద్ధిలో నుండి యుండవచ్చు – అంటే దాని అర్థం, వారివద్ద నానా యంత్ర పరికరాలు, రేడియోలు, దూరదర్శిని యంత్రాలు*, ఆహారధాన్యాలతో సహా అన్నీ యెక్కు వెక్కువగానే వుంటాయి. మరి యీ దేశంలోనో, ఎక్కడ చూచినా ఆకలిచావులు, కశ్మలము, మితిమీరిన జనాభా, నిరుద్యోగము. కాని మన మెక్కడ వున్నా సరే ఎట్లున్నా సరే, మన మందరము మానవులము; మానవులముగా మనం సమస్యలను సృష్టించుకొంటూ వుంటాము. అయితే హిందువులముగా, అమెరికనులముగా, ఆంగ్లేయులముగా లేదా తెల్లవారముగా, నల్లవారముగా, గోధుమరంగువారముగా, పసుపురంగు వారముగా – ఇట్లా వేరువేరుగా మనలను మనం భావించుకొనడంచేత, అనవసరంగా మనమధ్య మనం అడ్డుగోడలను నిర్మించుకొంటున్నామనే విషయాన్ని గ్రహించడం చాల ముఖ్యం.

---

* ఆనాటికవి యింకను భారతదేశానికి ప్రచురంగా వచ్చియుండలేదు.

ఇప్పుడు మనకున్న ఒక పెద్ద కష్టమేమిటంటే – ప్రపంచమంతటా ఆధునిక విద్య యొక్క ప్రధానలక్ష్యం మనలను కేవలం సాంకేతిక నిపుణులముగా తయారుచేయడం. జెట్ విమానాల నెట్లు నిర్మించవలెనో, సిమెంటురోడ్ల నెట్లా వేయవలెనో, కార్లనెట్లా తయారుచేయవలెనో, అత్యాధునికమైన న్యూక్లియర్ జలాంతర్గాముల నెట్లా నడపవలెనో మనం నేర్చుకొంటున్నాం. ఈ సాంకేతిక విద్యలో మునిగిపోయి మనం మానవులమనే మాటనే మరిచిపోతున్నాం. అంటే – మనము మనసా కల్పితములైన వస్తువులతో హృదయాలను నింపుకొంటున్నాం. అమెరికాలో స్వయంచాలిత యంత్రము (automation) గంటలకొలది చేయవలసియున్న శారీరక పరిశ్రమనుండి రానురాను అధికాధిక కార్మికులకు విశ్రాంతి నిప్పిస్తున్నది. త్వరలోనే యీ దేశంలో గూడ ఆ మార్పు రాబోతున్నది. అప్పుడు లభించే యీ తీరిక సమయాన్ని మనమెట్లా ఉపయోగపరచుకోవాలి అనే చాల తీవ్రమైన సమస్య మనల నెదుర్కొంటుంది. వేలకొలది కార్మికులు పనిచేసే పెద్దపెద్ద కర్మాగారాలు బహుశా యే కొద్దిమంది సాంకేతిక నిపుణుల చేతనో నడుపబడవచ్చు. అప్పుడు మిగిలిన కార్మికుల గతి యేమౌతుంది? వారికింక రోజంతా తీరికయే, ఏం చేస్తారు ఆ మిగిలిన కాలమంతా? ఈ సమస్యను మరి తక్కిన మానవ సమస్యలను నేటి విద్యావిధానం లెక్కలోకి తీసుకోకపోతే, మన జీవితాలు సారహీనములౌతాయి, నిరర్థకాలవుతాయి.

ఇప్పుడును మన జీవితాలు పూర్తిగా అర్థరహితములు సారహీనములే. కాదా? మీకు కళాశాల డిగ్రీ వుండవచ్చు, పెండ్లి చేసికొని ధనవంతులై యుండవచ్చు, తెలివితేటలుండవచ్చు, ఎంతో విషయపరిజ్ఞానముండవచ్చు, అత్యాధునిక గ్రంథములు చదివి యుండవచ్చు. కాని మనఃకల్పితములగు వస్తువులచే మీ హృదయము నింపుకొంటున్నంతవరకు మీ జీవితము సారహీనము సౌందర్య రహితమునగుట తప్పదు. అట్టి జీవితమునకర్థ మేమంతయుండదు. మనః కల్పితములగు వస్తువులు హృదయమునుండి కడిగివేయబడినప్పుడే జీవితములోనికి అందము వస్తుంది, అర్థముంటుంది.

చూడండి, ఇదంతా మనందరి వ్యక్తిగత సమస్య; మనకు సంబంధములేని ఊహాకల్పిత సమస్య కాదు. మానవులమైన మనకు మనముండే భూమిని గురించిన అందలి వస్తువుల గురించిన జాగ్రత్త యెట్లు తీసికొనవలెనో తెలియకపోతే, మనకు మన పిల్లల నెట్లా ప్రేమించవలెనో తెలియకపోతే, కేవలం మన గురించే మనము చూచుకొంటూవుంటే, కేవలం మన వ్యక్తిగతమైన లేదా మన జాతి యొక్క విజయాభ్యుదయములతోనే మనకు సంబంధమైనట్టయితే మనము మన యీ ప్రపంచాన్ని భయంకరంగా తయారుచేస్తాము. మనమాపని అప్పుడే మొదలుపెట్టినాముకూడ. ఒక దేశము చాల సంపన్నమైనది అయితే కావచ్చు. కాని దాని సంపద, మరియొక దేశము ఆకలితో అల్లాడిపోతూ వున్నంత కాలము, విషముతో సమానము. మనమంతా ఒకే మానవజాతి, మనందరికి ఈ భూమిలో భాగమున్నది. ప్రేమపూర్వకమైన శ్రద్ధ చూపిస్తే ఈ భూమి మన కందరికిని సరిపడ తిండి, గుడ్డ, నీడ ఈయగలదు.

కాబట్టి విద్యయొక్క కర్తవ్యము ఏవో కొన్ని పరీక్షలు పాసవడం కోసం మిమ్ము తయారుచేయడం మాత్రమేకాదు, ఈ జీవిత సమస్యనంతటిని అర్థము చేసికొనడంలో మీకు సహాయపడవలెను కూడ. జీవిత సమస్యయంటే అందులో కామవాంఛ, జీవనాధారాన్ని సంపాదించుకోవడం, సుఖసంతోషాలతో నవ్వుకోడం, చొరవ కలిగివుండడం, చిత్తశుద్ధి కలిగివుండడం, లోతుగా ఆలోచింపగల్గివుండడం – ఇవన్నీ చేరివుంటాయి. దేవుడనగా నేమిటో కనుగొనడం కూడ మన సమస్యయే, అదే మన జీవితానికి అసలు పునాది. సరియైన పునాది లేనిదే ఇల్లు చాలకాలము నిలబడలేదు గదా! దేవుడు లేక సత్యమననేమో తెలిసికొనడానికై మనము ప్రయత్నించకపోతే మానవుడెంతో చాతుర్యముతో కనిపెట్టిన నూతన యంత్రపరికరములన్నియు (inventions) అర్థరహితములైపోతాయి.

దీనినంతా అర్థము చేసికొనడంలో అధ్యాపకుడు మీకు సహాయపడగలిగి వుండవలెను. మీరు దీనిని చిన్నతనంలోనే అర్థము చేసికోడానికి ఆరంభింపవలెగాని అరవయ్యేండ్లు వచ్చిన తరువాత కాదు. అరవయ్యేండ్ల వయస్సులో మీరు దేవుణ్ణి కనుగొనలేరు. ఆ వయస్సులో ఎక్కువమంది జీవితంలో అలసిపోయి వుంటారు. అంతము సమీపించి వుంటారు. మీరు చాల చిన్నపిల్లలుగా వున్నప్పుడే సత్యాన్వేషణ ఆరంభించాలి. మానవులు తమకు తాము సృష్టించుకొనే రకరకాల తుపానులలో పడిపోకుండ నిలవడం కోసం చిన్నప్పుడే మీరు మీ యింటికి సరియైన గట్టి పునాది వేయ గలిగివుండాలి. అప్పుడు మీరు సుఖంగా జీవింపగలరు. కారణమేమంటే – మీ సుఖమప్పుడు మరి దేనిమీదను ఆధారపడి వుండదు. అది చీరెసారెలమీదను, నగలు నాణ్యములమీదను, కార్లు, రేడియోల మీదను, ఒకరి ప్రేమమీదగాని తిరస్కారంమీదగాని ఆధారపడివుండదు. మీరు సుఖంగా వుండడానికి కారణము మీ దగ్గర ఏదో వుందనికాదు; పదవి, పాండిత్యము, అధికారము, ఐశ్వర్యము వున్నాయనికాదు. మీ జీవితము స్వతహాగా అర్థవంతమవడమే దానికి కారణము. అయితే ఆ జీవిత సార్థక్యమును, ఏ క్షణమున కాక్షణము మీరు సత్యాన్వేషణ చేస్తూ వున్నప్పుడే పొందగలరు. సత్యము ప్రతిదానిలోను ఉన్నది. అది క్రైస్తవుల చర్చిలో, హిందువుల మందిరంలో, మహమ్మదీయుల మసీదులో లేదా కర్మకాండలలో వెదికితే దొరికేది కాదు.

సత్యమును కనుగొనవలెనంటే, దానిమీద అనేక శతాబ్దాలనుండి పడి పేరుకొని పోయిన దుమ్మును ఎట్లా దులపవలెనో దానినెట్లా తొలగించవలెనో ముందు మనము తెలిసికోవలసి వుంటుంది. ఇంతకు దయచేసి నా మాట వినండి – సత్యాన్వేషణమే నిజమైన విద్య. ఏ కొంచెం తెలివి గలవాడైనా పుస్తకాలు చదివి, సమాచారాన్ని సేకరించి, ఒక హోదా సంపాదించుకొని దోపిడీ విధానము కొనసాగింపవచ్చు. పరులను తన స్వార్థమునకై ఉపయోగించుకొనవచ్చు. కాని అది విద్యకాదు. ఏవో కొన్ని పాఠ్య విషయాలు చదవడం విద్యలో అత్యల్ప భాగము మాత్రమే. జీవితంలోని అధికభాగంకోసం మనం చదివింపబడలేదు. అందుకు సరియైన మార్గము కూడ మనవద్ద లేదు. ఆ మార్గమును తెలిసికొనడమే విద్య.

ఏ సత్యముతోడి సంబంధముచే మన దైనిక జీవనము, మన రేడియోలు, కారులు, విమానములు - ఇవియన్నియు సార్థకము లౌతున్నాయో, ఆ సత్యము, తనయందు వీటినన్నిటిని కలిగియుండడమే గాక, వీటి కతీతముగా కూడ - అంటే సర్వవ్యాపకమై వుంటుంది. అట్టి సత్యమును దర్శించుటకు సహాయపడునదే విద్య. ఆ విద్య నిజమైన మతమును తెలిసికొనుటతో ఆరంభించవలెను. నిజమైన మతమునకు పురోహితులు పూజారులతోగాని, గుడులు గోపురములతోగాని, తమతమ మతములకు సంబంధించిన పిడివాదములతోగాని, నమ్మకాలతోగాని సంబంధము లేదు. నిజమైన మతమంటే నిర్హేతుకమైన ప్రేమ కలిగివుండడం, ఔదార్యము కలిగివుండడం, మంచివాడై వుండడం. అప్పుడే మనము నిజమైన మానవుల మనిపించుకొంటాము. కాని ఆ మంచితనము, ఆ ఔదార్యము, ఆ ప్రేమ సత్యాన్వేషణ ద్వారానే లభిస్తాయి, వేరే మార్గమున లభింపవు.

దురదృష్టవశాత్తు ఈ విశాలమైన జీవితక్షేత్రమంతయు పేరుకు మాత్రము విద్యయైన నేటి విద్యచేత ఉపేక్షింపబడినది. అర్థమేమంత లేని పుస్తకాలలోను, అంతకంటె నిరర్థకములైన పరీక్షలు పాసవడంలోను మీరెల్లప్పుడు నిమగ్నమైవుంటారు. వాటివలన మీకేదైనా ఉద్యోగం దొరకవచ్చు; అదే దానివలన ఉపయోగం. కాని ఇక కొద్దికాలంలో ఎక్కువ కర్మాగారాలు దాదాపు పూర్తిగా యంత్రముల చేతనే నడపబడతాయి. అందువలన మన తీరిక సమయమెక్కువౌతుంది. ఆ తీరిక సమయాన్ని సరియైన మార్గంలో - అంటే ఏవో ఆదర్శాలను సాధించడంలో గాకుండా మనకిప్పుడేమీ తెలియనిదై బొత్తిగా అజ్ఞాతంగా వుండివున్న మన జీవితంలోని విశాల భాగాన్ని దర్శించి అర్థం చేసికోవడంలో - ఎట్లా ఉపయోగించుకోవాలో మనమిప్పటినుండే నేర్చుకోవాలి. నేర్పుగా వాదములు గావిస్తూ వుండే మనస్సుకాదు సర్వస్వము; దానికతీతంగా విశాలమై అప్రమేయమైన దొకటున్నది. అది అత్యంత సుందరమైనది. దానిని మనస్సు గ్రహింపజాలదు, దానికది అర్థము కాదు. అనంతము, అప్రమేయమగు (immensity) నద్దానిలో ఆనందపారవశ్యమున్నది, మహిమ (glory) వున్నది. అందులో జీవించడము మరియు దానియొక్క అనుభూతిని పొందడమే విద్య. అటువంటి విద్య మీకు లేనిచో, మీరు బడి వదలి బయటి ప్రపంచములోనికి పోయినప్పుడు, - గడచిన తరముల వారు సృష్టించి పెట్టిన యీ భయంకరమైన గందరగోళాన్ని మీరు శాశ్వతం చేస్తారు.

కాబట్టి ఉపాధ్యాయులారా, విద్యార్థులారా! దీని గురించి మీరంతా ఆలోచించండి. అది బాగాలేదని ఇది బాగాలేదని తప్పులెన్నకండి; సరియైన మతమననేమో విచారణ చేయడానికై, దానిని ప్రేమించడానికై, దాని గురించి పనిచేయడానికై, దానిలో జీవించడానికై ఉపయోగపడే సంస్థ నొకదానిని సృష్టించడంకోసం మీరంతా కలిసి, చేతులు చేతులు కలిపి, పని చేయండి, అందుకు సహాయపడండి. అప్పుడు జీవితము అద్భుతముగా సుందరము, సుసంపన్నము అవుతుంది. ప్రపంచంలోని బ్యాంకు ఖాతాలన్నీగూడ దానిముందు ఎందుకును కొఱగావు.

1. ప్రశ్న:- మనిషికింత జ్ఞానం ఎట్లా లభించింది? అతడు భౌతికంగా ఎట్లు పరిణతి చెందినాడు? ఇంత గొప్ప శక్తి సామర్థ్యాలు అతని కెక్కడినుండి వచ్చినవి?

**కృష్ణమూర్తి:** "మనిషి కింతజ్ఞానం ఎట్లా లభించింది?" ఇది చాలా తేలిక. మీకు కొంత తెలుసు, దానిని మీరు మీ పిల్లలకు అందజేస్తారు. దానికి వారు మరికొంత జ్ఞానము కలిపి తమ పిల్లలకు అందజేసి కొంటారు. ఈ విధంగా యుగాల కొలది జరుగుతూ వచ్చింది. కొంచెం కొంచెంగా మనము జ్ఞానాన్ని ప్రోగుచేసికొంటూ వుంటాము. మన ముత్తాతలకు నేటి జెట్ విమానాలను గురించిగాని; విద్యుచ్ఛక్తి యొక్క అద్భుత చమత్కారాలను గురించిగాని బొత్తిగా తెలియదు. కాని జిజ్ఞాస, కుతూహలము, అవశ్యకత, యుద్ధము, భయము, అత్యాశ – ఇవన్నీ జ్ఞానము క్రమక్రమముగా అభివృద్ధి అవడానికి తోడ్పడినవి.

సరే, మరి యీ జ్ఞానము గురించి వింత విషయ మొకటున్నది. మీకెంతో తెలిసివుండవచ్చు, ఎంతో సమాచారాన్ని రాసులకొలది మీరు సేకరించివుండవచ్చు కాని జ్ఞానమేఘముచే ఆవృతమైన మనస్సు, తాను సేకరించిన సమాచారముతో బరువెక్కిన మనస్సు సత్యమును దర్శింపజాలదు. నూతనముగా దేనినీ కనుగొనలేదు. ముందే కనిపెట్టబడిన దానిని దేనినైనా, మనస్సు తన జ్ఞానముయొక్క సహాయముతో ఉపయోగమునకు తేవచ్చును. కాని నూతనముగా కనిపెట్టబడునదేదైనా సరే, అది మౌలికము. అది జ్ఞాననిరపేక్షము – అంటే ఇంతవరకు కూడబెట్టుకొన్న జ్ఞానముతో సంబంధము లేకుండా, అది మనస్సులో తటాలున విచ్చుకొన్నట్లు, బ్రద్దలయినట్లు, భగ్గుమనినట్లు తనంతతానే స్ఫురిస్తుంది. ఇట్టి విస్ఫురణము, ఇట్టి హఠాద్దర్శనము అత్యావశ్యకము. చాలమంది, ముఖ్యంగా ఈ దేశంలో, జ్ఞానభారము చేత, సంప్రదాయముచేత, స్థిరాభిప్రాయములచేత, తల్లితండ్రులు, ఇరుగుపొరుగువారు ఏమంటారో అనే భయంచేత ఎంతగా అణగిపోయినారంటే, వారిలోని మనోధైర్యమంతా నశించిపోయినది. వారు మృతప్రాయులు – జ్ఞానభారము వలన మనస్సునకు కలిగే ఫలితమిది. జ్ఞానము ఉపయోగకరమే; కాని దానితోబాటు మరియొకటి లేకపోతే అది వినాశకరము గూడాను. దీనిని నేటి ప్రపంచ సంఘటనలు రుజువు చేస్తున్నాయి.

ప్రపంచమంతటా ఏమి జరుగుతున్నదో చూడండి. అత్యాశ్చర్యకరములయిన వెన్నో నూతనముగా కనిపెట్టబడినవి – విమానమింకా ఎన్నో మైళ్ళ దూరమున వున్నప్పుడే అది వస్తున్న సంగతిని కనిపెట్టి చెప్పగలిగిన రాడారు యంత్రములు, సముద్రము అడుగునకుబోయి ఒక్కసారి గూడ బయటికి రాకుండా నీళ్ళ లోపలనే వుంటూ ప్రపంచమంతను చుట్టిరాగల జలాంతర్గాములు, బొంబాయినుండి వారాణసికి లేదా న్యూయార్కుకు నేరుగా మాట్లాడగల్గడమనే వింత – ఇదంతా జ్ఞానము వలన వచ్చిన ఫలితము. కాని మనలో తప్పక ఉండవలసినది మరియొకటి మనవద్ద లేదు. అందువలన జ్ఞానము దురుపయోగము చేయబడుతున్నది – యుద్ధము, విధ్వంసము, దైన్యము, దుఃఖము, లక్షలకొలది ప్రజలు తిండిలేక బాధపడడము, వాండ్లకు దినమునకొక పూట తిండి – ఒక్కొక్కసారి అదికూడ వుండదు.

ఇటువంటి విషయాలన్నీ మీకు బొత్తిగా తెలియనే తెలియదు. మీకు తెలిసినదెల్లా బనారసులోనో, ఢిల్లీలోనో, బొంబాయిలోనో ఏదో ఒక మారుమూల ప్రాంతంలో మీ పుస్తకాలు, మీకున్న చిన్నచిన్న సమస్యలు, మీకు గల చిన్నచిన్న సరసాలున్ను సరదాలున్ను. చూడండి, మనకెంతో జ్ఞానముండవచ్చు. కాని దానితోబాటు ఉండవలసినది మఱియొకటి – దేని సహాయముతో మానవుడు జీవిస్తాడో, దేనిలోనైతే అందము, ఆనందము, పరమ సుఖము ఉన్నవో – అది లేకుండుటవలన మనలను మనము నాశనము చేసికొనబోతున్నాము.

ఇక భౌతికంగా కూడ ఇట్లే జరిగినది. భౌతికంగా మనిషి ఇట్లే క్రమపరిణతి చెందినాడు. మరి అతనికి ఇంత అధికమైన శక్తిసామర్థ్యాలు ఎక్కడినుండి వచ్చినాయి? క్రొత్తక్రొత్త యంత్రములను కనిపెట్టినవారు, క్రొత్తక్రొత్త ప్రదేశాలను పరిశోధించినవారు, వివిధరంగాలలో క్రొత్తక్రొత్త వాటిని వెదికి ప్రకాశమునకు దెచ్చినవారు – ఇటువంటి గొప్పవారం దరికి అపరిమితమైన శక్తిసామర్థ్యాలు వుండియుండాలి. కాని మనలో చాలమందికి గల శక్తిసామర్థ్యాలు అత్యల్పము, కాదా? మనం చిన్న పిల్లలముగా వున్నప్పుడు ఆటలాడుకొంటాము, ఎగతాళి చేసికొంటాము, నాట్యమాడుతాము, పాట పాడుతాము. కాని మనం పెద్దవాండ్లమయ్యేటప్పటికి ఆ శక్తి అంతా త్వరలోనే నశించిపోతుంది. అది మీరు గుర్తించలేదా? మనం అలసిపోయి ఉసూరుమనే గృహిణులమన్నా ఔతాము లేదా, ఏదో కార్యాలయానికి, దినం తరువాత దినం, నెల తరువాత నెల పోయి గంటల తరబడి పనిచేస్తూ వుంటాం – కేవలం జీవనాధారం సంపాదించుకోవడం కోసం. అందువలన సహజంగానే మనలో వున్న శక్తి అంతా దాదాపుగా నశిస్తుంది. ఒకవేళ మనలో గనక శక్తి వున్నట్లయితే యీ క్రుళ్ళిన సంఘాన్ని నాశనంచేసి వుండేవాళ్ళం. సంక్షోభం తెచ్చిపెట్టేవాండ్లం. అది సంఘాని కిష్టముండదు. కాబట్టి మనలోవుండే ఆ శక్తిని విద్యద్వారా, సంప్రదాయాల ద్వారా, మతమనబడేదాని ద్వారా, సంస్కృతి అనబడేదాని ద్వారా అణచివేస్తుంది. చూడండి, నిజమైన విద్య యొక్క కర్తవ్యమేమంటే మనలోని శక్తిని మేల్కొలిపి దానిని ప్రజ్వలింపజేయడం; అది మధ్యలో ఆగిపోకుండ, బలంగా దృఢంగా తీవ్రంగా వుండునట్లు చూడడం; అది తన్నుతాను సహజంగానే అదుపులో వుంచుకొంటూ సత్యాన్వేషణకై స్వయంగా పనిచేయునట్లు చూడడం. అప్పుడాశక్తి అపారము, అనంతము అవుతుంది. అప్పుడది మరి యేమాత్రము దైన్యమును కలిగించదు సరికదా స్వయంగా నూతన సమాజమును సృష్టిస్తుంది.

నేను చెప్పేదానిని శ్రద్ధగా వినండి, ఏదోలే, యని ప్రక్కకు త్రోసివేయకండి. ఇది చాల ముఖ్యమైన విషయం. ఊరక, అంగీకరించితిమనిగాని, అంగీకరించలేదనిగాని చెప్పవద్దు. చెప్పుతూ వున్న విషయాలలో సత్యమున్నదా లేదా యని మీ యంతట మీరు తెలిసికోండి. నిర్లక్ష్యంగా వుండవద్దు; అటు ఉడుకుగానైనా వుండాలి లేదా ఇటు చల్లబడైనా పోవాలి. ఇందులో సత్యమును మీరు చూచినట్లయితే, దాని గురించి మీరు నిజంగా వేడెక్కి వున్నట్లయితే, ఆ వేడిమి, ఆ శక్తి వృద్ధిపొంది నూతన సమాజమును నిర్మిస్తుంది. అది కేవలం ప్రస్తుతమున్న సంఘంలోనే తిరుగబడి, ఆ

విధంగా తన్నుదాను వ్యర్థము చేసికొనదు. ప్రస్తుత సంఘంలోనే తిరుగబడడమంటే, తానున్న చెఱసాల గోడలకు రంగుపూసి అలంకరించడమే.

కాగా, మన ప్రస్తుత సమస్య, ముఖ్యంగా విద్యకు సంబంధించినంతవరకు ఏమిటంటే, మనకున్న శక్తి, అది యెంతైనాగానీ, దానిని ఎట్లా నిలబెట్టుకోవాలి, దానికింకా ఎక్కువ ఉత్తేజాన్ని, ఇంకా యెక్కువ తీవ్రంగా ప్రజ్వరిల్లగల వేగాన్ని ఎట్లా కలిగించాలి అని. దీనికెంతో అవగాహన అవసరం కాబోతుంది. ఎందువల్లనంటే అసలు ఉపాధ్యాయలకే సాధారణంగా చాల తక్కువ శక్తి వుంటున్నది. వారు కేవలం తమ జ్ఞానభారంతో క్రుంగిపోయి వున్నారు, తమ తమ సొంత సమస్యలలో పూర్తిగా మునిగిపోయివున్నారు. కాబట్టి, యీ సృజనాత్మకశక్తిని మేల్కొల్పడంలో వారు విద్యార్థికి సహాయపడగల స్థితిలో లేరు. అందువలన ఈ విషయాల గురించిన అవగాహన విద్యార్థులకెంత అవసరమో ఉపాధ్యాయులకును అంతే అవసరము.

**2. ప్రశ్న:- నేను మతం మార్చుకొంటానని అంటే మా తల్లితండ్రులకెందుకని అంత కోపం వస్తుంది?**

**కృష్ణమూర్తి:-** మొట్టమొదటిది, వారికి తమ మతమునందు మమకారమెక్కువ. వారి ఉద్దేశంలో అదొక్కటే ప్రపంచంలో మతమని పిలవడానికి అర్హమైనది. ఒకవేళ కాకపోయినా, అన్ని మతములకంటె తమ మతమే గొప్పదని మాత్రం తలుస్తారు. అందువలన సహజంగానే మీరు గూడ ఆ మతమునే అనుసరింపవలెనని వారి కోరిక. అంతేగాకుండ మీరుగూడ వా రాలోచించినట్లే ఆలోచించాలని, వారి సంప్రదాయాన్ని, వారి జాతిని, వారి తెగను అంటిపెట్టుకొని వుండాలని కోరుకొంటారు. ఇవి కొన్ని కారణాలు. పైగా, చూడండి, మీరు మరియొక మతాన్ని అనుసరించడం మొదలుపెట్టితే, మీ కుటుంబానికి మీరొక కంటకంలాగా తయారై సంకటం తెచ్చిపెడతారు.

కాని మీరొక మతం వదిలిపెట్టి మరియొక మతంలోకి చేరినా ఏమయినట్టు? కేవలం మీరొక చెఱసాలనుండి మరియొక చెఱసాలలోనికి మారినట్లే కదా? చూడండి, మనస్సు ఒక నమ్మకాన్ని వదలకుండా పట్టుకొని వున్నంతకాలము అది చెఱసాలలో బందీయైవున్నట్లే. మీరు హిందువుగా జన్మించి క్రైస్తవ మతం పుచ్చుకొంటే మీ తల్లితండ్రులు కోపపడవచ్చు; కాని అది అల్పవిషయము. ఇక్కడ ప్రధానమైన విషయమేమంటే – మీరు వేరొక మతంలోనికి మారినప్పుడు ప్రాత నమ్మకాలను వదిలిపెట్టి, వాటిబదులు క్రొత్త నమ్మకాలను స్వీకరించినట్లు. ఇది మీరు తెలిసికోడం చాలముఖ్యం. మీరింకొంచెం ఎక్కువ చురుకుగా, ఇంకొంత యెక్కువ యిదిగా లేక అదిగా వుండవచ్చు. కాని మీరింకా నమ్మకాల చెఱలో, హఠవాదాల చెఱలోనున్నట్లే.

కాబట్టి మతములు మార్చవద్దు. మార్చడమంటే చెఱసాల నాలుగు గోడలమధ్యనే తిరుగుబాటు చేసినట్లు. దాని బదులు చెఱసాల గోడలను బ్రద్దలుకొట్టి బయటికి వచ్చి దేవుడన ఎవరో, సత్యమన నేమో వెదకి తెలిసికోండి. అప్పుడు దానికి అర్థముంటుంది. దానివలన మీకు అపరిమితమైన జీవశక్తి, అత్యధికమైన సామర్థ్యము

లభిస్తాయి. అంతేగాని కేవలం ఒక చెఱసాల నుండి మరియొక చెఱసాలకు పోవడం, ఏ చెఱసాల మంచిదోయని కలహించడం – ఇదంతా చిన్నపిల్లల చేష్ట.

నమ్మకమనే చెఱసాల నుండి దానిని బ్రద్దలు కొట్టుకొని బయటపడాలంటే పరిణతి చెందిన మనస్సు కావాలి, ఆలోచనాశీలమగు మనస్సు కావాలి. మరియొక చెఱసాలతో పోల్చడం బదులు, తానున్న చెఱసాల యొక్క స్వభావాన్ని అర్థము చేసికోగల మనస్సు కావాల. దేనినైనా అర్థం చేసికోవాలంటే దానిని మరియొక దానితో పోల్చడం వలన ప్రయోజనం లేదు. పోల్చడంద్వారా అవగాహన కలుగదు. అసలా వస్తువునే పరీక్షించి చూడడంవలన అవగాహన కలుగుతుంది. వ్యవస్థీకృతమైన మతము యొక్క స్వభావమును పరీక్షించి చూచినట్లయితే, అన్ని మతములు – హిందూమతంగాని, బౌద్ధమతంగాని, మహమ్మదీయమతంగాని, క్రైస్తవమతంగాని, ఇటీవలి కాలంలో మతము యొక్క రూపం ధరించి వచ్చిన సామ్యవాదము (కమ్యూనిజం) గాని, – పరమార్థతః అన్నీ ఒకేవిధమైనవని మీరు చూడగలరు. చెఱసాలను అర్థము చేసికొన్న క్షణమునుండి – అంటే నమ్మకమునకు, మతవిధులకు, మతగురువులకు సంబంధించిన విషయముల నన్నింటిని స్పష్టంగా చూచి తెలిసికొన్న క్షణమునుండి, మీరింక ఏ మతమునకును చెందరు. ఏలన అసలు నమ్మకమునుండి విముక్తి పొందిన వ్యక్తి మాత్రమే అన్ని నమ్మకములకును అతీతముగా నున్న అప్రమేయమగు దానిని దర్శింపగలడు.

### 3. ప్రశ్న:- శీలనిర్మాణమునకు నిజమైన మార్గమేది?

**కృష్ణమూర్తి:** శీలము కలిగి వుండడమంటే తప్పకుండా అసత్యమున కెదురొడ్డి నిలవగల్గడం, సత్యము నాశ్రయించి దానిని వదలకుండడం. కాని శీలనిర్మాణము మిక్కిలి కష్టమైన పని. ఎందువల్లనంటే మనలో చాలమందికి, తాము స్వయంగా ఏమి ఆలోచిస్తారో అది తెలిసికొనడంకంటె పుస్తకము, ఉపాధ్యాయుడు, తల్లిదండ్రులు, ప్రభుత్వము ఏమి చెబుతున్నారో అది చాల ముఖ్యమని తోస్తుంది. జీవితంలో సుఖం వచ్చినా దుఃఖం వచ్చినా దాని ప్రభావానికి లోనుగాకుండా, తనకు తాను ఆలోచించుకోవడం, సత్యమేదో తెలిసికొని దానిపైన దృఢంగా నిలబడడం – ఇదే శీలనిర్మాణమునకు తోడ్పడునట్టిది.

ఉదాహరణకు, మీకు యుద్ధంలో నమ్మకం లేదు. దానికి కారణం ఎవరో సంస్కర్తగాని, ఎవరో మతప్రవక్తగాని చెప్పడం కాదు. దానిని మీయంతట మీరు ఆలోచించి తెలిసికొన్నారు. మీరు దానిని గురించి పరిశోధన చేసినారు. సమస్యను లోతుగా పరిశీలించి చూచినారు, దానిపైకి మీ ధ్యానమును పోనిచ్చినారు. చంపడం తప్పని తెలిసికొన్నారు. తినడంకోసం చంపినా, ద్వేషము చేత చంపినా, దేశప్రేమ అనబడే దానికోసం చంపినా – దేనికోసం చంపినా, చంపడం చంపడమే. అది తప్పని మీరు దృఢంగా భావిస్తే, దానికోసం జైలుకు పోవలసివచ్చినా, కొన్ని దేశాలలో జరుగుతున్నట్లుగా మీరందుకోసం చంపబడినా, ఏమి జరిగినా సరే, మీరు తెలిసికొన్న ఆ సత్యంకోసం గట్టిగా నిలబడగల్గితే అప్పుడు మీరు శీలవంతులైనట్లు. అప్పుడు

శీలమునకు గల అర్థమే వేరు. అది సంఘముచే అలవాటు చేయింపబడిన శీలము కాదు.

కాని చూడండి, మనలను ఈ దిశవైపు పోవుటకెవ్వరును ప్రోత్సహించరు. అటు అధ్యాపకునికిగాని ఇటు విద్యార్థికిగాని స్వతంత్రంగా ఆలోచించుకొని ఏది సత్యమో తెలిసికోడానికి, ఆ తెలిసికొన్న సత్యముపై నిలబడడానికి, అసత్యమును పోవీడడానికిన్ని తగిన శక్త్యుత్సాహములు లేవు. కాని మీరిది చేయగల్గితే అప్పుడు మీరు ఏ రాజకీయ నాయకునిగాని, ఏ ధార్మిక నాయకునిగాని అనుసరింపరు, అనుసరింపగోరరు. అప్పుడు మీకు మీరే వెలుగవుతారు. మీరు చిన్నపిల్లలుగా వున్నప్పుడే గాకుండా జీవితమంతా ఆ వెలుగును దర్శించడం, దానిని పెంపొందించుకొనడమే విద్య.

4. ప్రశ్న:- దేవుని సాక్షాత్కరింప జేసికోవడంలో వయస్సునకు గల ప్రాధాన్య మేమి?

కృష్ణమూర్తి:- వయస్సంటే యేమిటి? మీరు జీవించిన సంవత్సరాల సంఖ్యయా వయస్సంటే? అది ఒక విధమైన వయస్సు. మీరు ఫలానా సంవత్సరంలో పుట్టినారు. ఇప్పుడు మీ వయస్సు పదునైదు, లేదా నలభై, లేదా అరవై. మీ శరీరము క్రమంగా ముసలిదైపోతున్నది. అట్లే మనస్సుకు గూడ జీవితమందలి రకరకాల అనుభవాల భారము చేత, దైన్య దుఃఖములచేత, అలసట ఆయాసములచేత ముసలితనము వస్తుంది. అటువంటి మనస్సు సత్యమును దర్శింపలేదు. లేతదై, నిర్మలమై, అమాయకమైన మనస్సు మాత్రమే సత్యమును దర్శింపగలదు. కాని అమాయకతకు వయస్సుతో సంబంధము లేదు. పసిబిడ్డే కాదు అమాయకంగా వుండేది – ఒకవేళ ఆ పసిబిడ్డ అమాయకంగా ఉండకపోవచ్చుగూడ – కాని, అనుభవశేషమును తనలో నిలుపుకోకుండా అనుభవింపగల మనస్సే అమాయకమైన మనస్సు. మనస్సు అనుభవింపవలసినదే, అది తప్పని సరి. అది ప్రతిదానికిని ప్రతిస్పందింపవలసినదే – నదికి, జబ్బుపడిన జంతువుకు, దహించడం కోసం తీసికొని పోబడుతున్న మృతశరీరానికి, బాట వెంబడి బరువులను మోసికొని పోతూవున్న పల్లెటూరి బీదప్రజలకు, జీవితమందలి యాతనలకు, దుఃఖములకు – అన్నిటికిని ప్రతిస్పందింపవలసినదే. లేకపోతే ఆ మనస్సు అప్పటికే మృతమైనట్లు. అయితే అనుభవము యొక్క అకట్టుకు లోనుగాకుండా అది ప్రతిస్పందింప గలిగివుండాలి. మనస్సునకు ముసలితనమును తెచ్చిపెట్టేవి – సంప్రదాయము, అనుభవాల నిలవ, జ్ఞాపకాల బూడిద. గత దినపు స్మృతులకు, గతకాలపు సుఖదుఃఖముల కన్నింటికిని ప్రతిదినమును మరణించు మనస్సే నిత్యనూతనము, నిర్మలము, అమాయకమును అయిన మనస్సు. అట్టి మనస్సునకు వయస్సు లేదు. అట్టి అమాయకత లేకుండ, మీకు పదేండ్లున్నా, అరవయ్యేండ్లున్నా దేవుని దర్శింపలేరు.

*7 ఫిబ్రవరి, 1955*

★ ★ ★

# 27. ధార్మిక జీవనము

మనలనందరిని, ముఖ్యంగా ప్రస్తుతం చదువుకొంటూ వుండి, త్వరలోనే బడి విడిచిపెట్టి బయటకు పోయి ప్రపంచాన్ని ఎదుర్కొన వలసియున్న విద్యార్థులను ఎదుర్కొనే పెక్కు సమస్యలలో సంస్కరణ సమస్య ఒకటి. వివిధ వర్గముల ప్రజలు – సమాజవాదులు, సామ్యవాదులు ఇంకా రకరకాలైన సంస్కర్తలు – ప్రపంచంలో, స్పష్టంగా అవసరమని తెలిసియున్న కొన్ని మార్పులను తేవడానికై శ్రద్ధతో ప్రయత్నిస్తున్నారు. ఏవో కొన్ని శ్రేయోరాజ్యములున్నప్పటికిని ప్రపంచం మొత్తం మీద యింకను ఆకలి చావులు, పస్తులు తప్పడంలేదు. లక్షల కొలది ప్రజలకు కట్టుకోడానికి తగినంత గుడ్డ లేదు, నిద్రపోవడానికి తగినంత స్థలము లేదు. ఇందుకోసం, మరికొంత సంక్షోభము, మరికొంత దుఃఖము, మరికొంత సంఘర్షణ కలిగించనట్టి సంస్కరణము ద్వారా సమూల పరివర్తనము తేగలమా? ఎట్లు తేగలము? అసలు సమస్య అదికాదా? దేశచరిత్రను కొంతవరకు చదివి చూస్తే, నేటి రాజకీయాల పోబడిని గూడ గమనిస్తే మనము సంస్కరణమని దేనినంటామో అది యెంత వాంఛనీయమైనా యెంత ఆవశ్యకమైనా, తనతోబాటు ఎల్లప్పుడును సంక్షోభాన్ని, సంఘర్షణను వేరే రూపములలో తప్పకుండా కొనితెస్తుందని మనకు స్పష్టమవుతుంది. మరి యీ విధంగా వచ్చే సంక్షోభము రాకుండా చేయడానికై ఇంకా ఎక్కువ శాసనములు చేయడం, ఇంకా ఎక్కువ ప్రతిబంధకములు, మరల ప్రతిబంధకములపై ప్రతిబంధకములు అవసరమౌతూ వుంటాయి. సంస్కరణ వలన క్రొత్త సంక్షోభములు ఏర్పడతాయి; వీటిని సరిచేయబోతే మరల మరికొన్ని సంక్షోభములు సృష్టింపబడతాయి. ఈ విధంగా ఈ విషవలయము కొనసాగుతూనే వుంటుంది. ఇప్పుడు మన మెదుర్కొంటున్న సమస్య యిది. ఈ విధానానికి అంతమున్నట్లు కనబడదు.

మరి యీ విషవలయాన్ని ఛేదించడ మెట్లాగ? అయితే సంస్కరణ అవసరమన్న విషయాన్ని మాత్రం మరచిపోకండి. కాని యింకా ఎక్కువ సంక్షోభమును కల్పించకుండా, సంస్కరణ అనేది సాధ్యమా? ఏ కొంచెం ఆలోచనా పరుడగు వ్యక్తియైనా శ్రద్ధ తీసికోవలసిన ప్రధాన సమస్యలలో ఇది ఒకటిగా నాకు కనిపిస్తుంది. ఎటువంటి సంస్కరణ అవసరమనేది కాదు ప్రశ్న. ఏ స్థాయిలో అనేదిన్ని కాదు. మరల మరల సంస్కరణలను కోరుతూ వుండే ఇతర సమస్యలను పుట్టించకుండా, అసలేదైనా సంస్కరణమంటూ చేయడం సాధ్యమా అనేది ప్రశ్న. సంస్కరణల తరువాత సమస్యలు, వాటిని తీర్చడానికి మరల సంస్కరణలు – ఇట్టి అంతములేని యీ క్రమమును, ఈ విషవలయాన్ని, భంగము చేయడంకోసం ఎవరైనా ఏమి

చేయాలి? చిన్న బడిలో గాని, పెద్ద విశ్వవిద్యాలయంలోగాని, – ఊహల రూపంలో గాకుండా, మాటలతో సిద్ధాంతములతో గాకుండా, కేవలం తర్క వితర్కములతో గాకుండా, దాని గురించి పుస్తకాలు వ్రాయడం ద్వారా గాకుండా, నేరుగా ఆ సమస్యను ఎదుర్కొనడం ద్వారా దానిని పరిష్కరించే మార్గమేదో తెలిసికోవడం తప్పకుండా విద్యయొక్క కర్తవ్యము. సంస్కరణమనే యీ విషవలయంలో మనిషి చిక్కుకొన్నాడు. ఇందులో ఒక సంస్కరణము మరియొక సంస్కరణమునకు దారి తీస్తూనే వుంటుంది. ఇటువంటి యీ విషవలయాన్ని ఛేదించక పోయినట్లయితే, మన సమస్యలకు పరిష్కారముండదు.

మరి యీ విషవలయాన్ని ఛేదించడానికి ఎటువంటి విద్య కావాలి? ఎటువంటి ఆలోచనావిధానము కావాలి? మనం చేసే పనులన్నిటిలోను సమస్యలు వృద్ధి పొందకుండా వుండవలెనంటే మనమెట్లు ఆచరించుకొనవలె? ఒక సంస్కరణము మరియొక సంస్కరణమునకు దారితీయునట్టి యీ జీవిత విధానమునుండి విముక్తినీయగల ఆలోచనా సరళి – అది యే దిశగాపోవునదైనను – ఉన్నదా? దానినే మరియొక విధంగా చెప్పితే, ప్రతిక్రియనుండి పుట్టని ఆచరణమంటూ ఉన్నదా?

అధిక దుఃఖమునకు దారితీయునట్టి యీ సంస్కరణప్రక్రియయే అవసరములేని జీవితవిధాన మొకటున్నదని నే ననుకొంటున్నాను. దానిని ధార్మిక జీవనమని పిలువవచ్చును. నిజముగా ధార్మికుడైన వ్యక్తికి సంస్కరణముతో సంబంధము లేదు. సాంఘిక జీవనమందు కేవల మేదో మార్పును తీసికొని రావడంలో అతనికి శ్రద్ధ లేదు. పైగా అతడు సత్యాన్వేషకుడు కాబట్టి అతని సత్యాన్వేషణయే సంఘమును మార్చి వేయగల శక్తి గలది. అందువలన విద్యార్థికి గూడ సత్యాన్వేషణలో తోడ్పడమే విద్య యొక్క ప్రధాన కర్తవ్యము; కేవలము తత్కాలమందున్న సంఘము యొక్క చట్రములో ఇమడడంకోసం విద్యార్థిని తయారుచేయడం కానేకాదు.

మనం చిన్నవాండ్లముగా వున్నప్పుడే దీనిని అర్థము చేసికోవడం చాల ముఖ్యమని నే ననుకొంటాను. పెద్దవాండ్ల మయ్యేకొలది మనము మన చిన్నప్పటి అల్పములగు వినోదములను, వేడుకలను, మన కామవాంఛలను, క్షుద్రములైన ఆశలను, ఆకాంక్షలను క్రమక్రమముగా విడిచిపెట్టసాగినప్పుడు – ప్రపంచము నెదుర్కొంటున్న బ్రహ్మాండమగు సమస్యలను మనము స్పష్టంగా చూడగలుగుతాము. అందుకేమైనా ప్రతిక్రియ చేద్దామని, ఏదోవిధంగా పరిస్థితిని మెరుగు పరుద్దామని యెంతో కోరుకొంటాము. కాని మనము సంపూర్ణ ధార్మికులము కానిచో ఇంకా ఎక్కువ సంక్షోభాన్ని, ఇంకా ఎక్కువ దుఃఖాన్ని సృష్టిస్తాము. మరి నిజమైన మతమునకు పూజారులతో, పురోహితులతో, గుళ్ళతో, గోపురములతో, మతమందలి పిడివాదములతో, వ్యవస్థీకృతమగు విశ్వాసములతో ఎట్టి సంబంధమును లేదు. ఇవేవీ నిజమైన మతము కానే కాదు. ఇవన్నీ మనలను ఒక విశేషమైన ఆలోచనా పద్ధతికిని ఒక విశిష్టమైన ఆచరణ విధానానికిన్ని కట్టుబడి వుండునట్లు చేయడానికై సంఘముచే ఉపయోగింపబడు సాధనములు. అవన్నీ మన ఆశలను, భయములను, సులభముగా నమ్మేడి మన స్వభావమును సంఘము తన స్వార్థమునకై ఉపయోగించుకొనెడి సాధనములు. నిజమైన మతమనగా సత్యమును లేదా దేవుని అన్వేషించి కనుగొనడం. ఈ అన్వేషణకు అపరిమితమైన

శక్తి కావాలి, విశాలమగు బుద్ధి వుండాలి, సూక్ష్మ విచారణ చేయగలగాలి. ఈ విధంగా అప్రమేయమగు సత్యమును అన్వేషించడంలోనే సరియైన సంఘసేవ వున్నది. అంతేగాని ఏదో సంఘసంస్కారణ మనబడేదానిలో లేదు.

సత్యమును కనుగొనవలెనంటే అఖండమగు ప్రేమ వుండవలె, అన్నింటితోను మనిషికి గల సంబంధ మెట్టిదో దానిని గూర్చిన ఎఱుక ఉండవలె. అంటే తన వ్యక్తిగతమగు ప్రగతితోను, తన వ్యక్తిగతమగు కార్యసిద్ధులతోను అతనికి సంబంధము లేదు. సత్యాన్వేషణయే నిజమైన మతము; సత్యాన్వేషణ చేయువాడే ధార్మిక పురుషుడు. అట్టి మానవుడు తన ప్రేమకారణమున సమాజమునకు బాహ్యముగా వుంటాడు. అందువలన సమాజము గురించి అతడేమి ఆలోచించినా అది, సమాజములోనే వుంటూ దాని సంస్కారణతో సంబంధము పెట్టుకొన్న వా డాచరించెడిదానికి పూర్తిగా భిన్నమైనది. సంస్కర్త క్రొత్త సంస్కృతిని ఎన్నటికిని సృష్టింపలేడు. నిజమైన ధార్మికుడు చేయు సత్యాన్వేషణమే సరిక్రొత్త సంస్కృతిని స్వయంగా సృష్టింప గలుగుతుంది. అదొక్కటే మనకున్న ఆశ. చూడండి, సత్యాన్వేషణ వలన మనస్సులో భగ్గుమని సృజనాత్మకత ప్రజ్వరిల్లుతుంది. అదే నిజమైన క్రాంతి, నిజమైన తిరుగుబాటు. కారణమేమంటే, యీ అన్వేషణలో మనస్సు సమాజముయొక్క ఆజ్ఞలు అనుమతుల చేత దూషితమై యుండదు. వాటినుండి విముక్తుడై యున్నందున ధార్మికుడు సత్యమును తెలిసికొనగలడు. ఏ క్షణమున కాక్షణము జరిగెడి సత్యదర్శనమే నూతనసంస్కృతిని సృష్టింపగలదు.

అందువలన మీకు సరియైన విద్యాబోధన జరగడము చాల ముఖ్యము. అందుకోసం ముందు మీ అధ్యాపకుడు స్వయంగా సరియైన విద్యను పొందియుండవలెను. అప్పు డతడు విద్యాబోధనను కేవలము తనకొక జీవనాధార సాధనముగా భావింపడు. తా నప్పుడు విద్యార్థికి మత సంబంధమైన పిడివాదములను విడిచిపెట్టడంలోను, ఏ మతమునకును ఏ నమ్మకమునకును బందీకాకుండా వుండడంలోను తోడ్పడగలడు. మతము యొక్క ఆధిపత్యము క్రిందనో లేదా కొన్ని ఆదర్శాలను పాటించడం కొఱకో ఒకటిగా చేరిన ప్రజలు సంఘసంస్కారణమీద శ్రద్ధ చూపుతారు. అట్టి సంస్కారణ కేవలము చెఱసాల గోడలను బాగుచేసి అలంకరించడం వంటిది. నిజమైన ధార్మిక పురుషుడే నిజమైన తిరుగుబాటుదారు, నిజమైన క్రాంతివాది. అందుచేత మనలో ప్రతియొక్కడును నిజమైన ధార్మిక పురుషుడు కావడంలో తోడ్పడడమే విద్యయొక్క ప్రధాన కర్తవ్యము. ఆ మార్గమున పయనించితేనే మనకు విముక్తి కలదు.

1. **ప్రశ్న:- సంఘసేవ చేయవలెనని నా కోరిక. కాని దానినెట్లా ఆరంభించవలెనో తెలియదు.**

**కృష్ణమూర్తి:-** సంఘసేవ ఎట్లా ఆరంభించాలి అనేది కాకుండ, అసలు మీ రెందుకు సంఘసేవ చేయగోరుతున్నారో తెలిసికోవడం చాల ముఖ్యమని అనుకొంటాను. ఎందుకని మీరు సంఘసేవ చేయగోరుతున్నారు? ప్రపంచంలో

వుండే దుఃఖాన్ని చూచి – ఆకలి చావులు, రోగాలు, దోపిడీ విధానము, భయంకరమైన దారిద్ర్యము, దాని ప్రక్కన గల బహూళైశ్వర్యము యొక్క క్రూరమైన ఉపేక్షాభావము, మానవుల మధ్యగల పరస్పర విరోధము – వీటినన్ని చూచి సంఘసేవ చేయగోరుతున్నారా? అదేనా కారణము? మీ హృదయంలో ప్రేమ వుండడంచేత స్వార్థసిద్ధిని లెక్కచేయక, సంఘసేవ చేయగోరుతున్నారా? లేక మీనుండి మీరు తప్పించుకొని పారిపోవడం కోసం సంఘసేవ మీకొక సాధనమా? మీ కర్థమవుతున్నదా నేను చెప్పేది? ఉదాహరణకు, పూర్వాచారం ప్రకారం చేసే వివాహములోని అసౌందర్యమును చూచి, అందలి చెడును చూచి, "నేను పెండ్లి చేసికోను" అని చెప్పి, దాని బదులు సంఘసేవలో మునిగి పోదలచినారా? లేక సంఘసేవ చేయండని బహుశా మీ తల్లిదండ్రులు మిమ్ము ప్రేరేపించియున్నారా? లేక మీరొక ఆదర్శాన్ని పాటించదలచుకొన్నారా? మీరు చేసే సంఘసేవ మీనుండి మీరు తప్పించుకొని పారిపోవడాని కొక సాధనంగా వున్నట్లయితే, లేక సంఘము గాని, నాయకుడు గాని, మతగురువు గాని లేదా మీయంతట మీరే నిర్దేశించుకొన్న ఆదర్శాన్ని మీరు కేవలం పాటిస్తున్నట్లయితే అప్పుడు మీరు చేసే సంఘసేవ ఏదైనా సరే, అది మరికొంత దుఃఖాన్ని మరికొంత దైన్యాన్ని కలిగిస్తుంది. అట్లుగాక మీ హృదయంలో ప్రేమ వున్నట్లయితే, మీరు సత్యాన్వేషణ చేస్తూవున్నట్టయితే, ఆ విధంగా మీరు నిజమైన ధార్మిక పురుషులైనట్లయితే, మీలో పేరాశ లేకపోతే, కార్యసిద్ధి ప్రధానమై దానికోసం మీరు ప్రాకులాడుతూ వుండకపోతే, మీ యీ మంచి గుణం వలన పేరు ప్రతిష్ఠలు రావాలని కోరుకోకపోతే – అప్పుడు మీరు జీవించే జీవితమే సంఘములో సమూల పరివర్తనమును కొనితేవడంలో తోడ్పడగలదు.

ఇది అర్థంచేసికోవడం చాల ముఖ్యమని నేను అనుకొంటాను. ఇప్పుడు మీలో ఎక్కువమంది చిన్న పిల్లలు. ఈ విధంగా మనం చిన్నపిల్లలంగా వున్నప్పుడు మనమేదో చేద్దామని అనుకొంటాం. సంఘసేవ అనేది అందరు చెప్పుకొంటూవుంటే మీరును వింటారు. దాని గురించి పుస్తకాలు వివరిస్తాయి, వార్తాపత్రికలు ప్రచారం చేస్తాయి. సంఘసేవకులకు శిక్షణ నివ్వడంకోసం పాఠశాలలుంటాయి. ఇంకా ఇట్లే ఏవేవో వుంటాయి. కాని చూడండి, ఆత్మజ్ఞానము లేకుండా, అంటే మిమ్ము మీరు అర్థంచేసికోకుండా, మీ కితరులతో గల సంబంధాలను అర్థం చేసికోకుండా మీరు చేసే సంఘసేవ యేదైనా సరే, నోటిలో బూడిదలాగా నిరుపయోగమవుతుంది, పీడాకరమవుతుంది.

సంతోషియైన మానవుడే నిజమైన క్రాంతివాది; ఆదర్శవాదీ కాదు, దీనుడైన పలాయనవాదీ కాదు. సంతోషియైన మానవుడంటే ఎంతో ఆస్తి గలవాడు కాదు, ఏవేవో వస్తువులు గలవాడు కాదు. సంతోషి యైన మానవుడంటే నిజమైన ధార్మిక పురుషుడు. అతని జీవితమే సంఘసేవ. కాని అసంఖ్యాకమైన మామూలు సంఘసేవకులలో మీరును ఒకరైనట్లైతే, మీ హృదయము శూన్యముగా వుంటుంది. మీరు మీ ధనాన్ని ఇతరులకు ఇచ్చివేయవచ్చుగాక, ఇతరులను ఒప్పించి వారిచేత వారి ధనాన్ని గూడ ఇప్పింప వచ్చుగాక, అద్భుతములైన సంస్కరణలను మీరు

సాధింప వచ్చుగాక; అయినను మీ హృదయము శూన్యమై మీ మనస్సు ఊహలతో సిద్ధాంతములతో నిండివున్నంత కాలము మీ జీవితము నిరానందము, నిరుత్సాహ పూరితము, పరిశ్రాంతము. కాబట్టి మొట్టమొదట మిమ్ము మీరు అర్థము చేసికోండి. అప్పుడా ఆత్మజ్ఞానమునుండి సమ్యగాచరణము సహజంగా సిద్ధిస్తుంది.

## 2. ప్రశ్న:- మనిషి ఎందువలన మొండిదేఱి, దయావిహీనుడౌతాడు?

**కృష్ణమూర్తి:-** అది చాలా తేలిక, కాదా? విద్య కేవలము పుస్తకజ్ఞానాన్ని అందజేయ డము విద్యార్థిని ఉద్యోగానికి తయారుచేయడమే తన కర్తవ్యముగా ఎంచుకొన్నప్పుడు, కేవలము ఆదర్శాలను అతని ముందుంచి, స్వార్థమును సంపాదించుకొనుటయందే శ్రద్ధ చూపుమని బోధించినప్పుడు, మనిషి మొండిదేఱి, దయావిహీనుడవడంలో సందేహము లేదు. చూడండి, మనలో చాల మంది హృదయాలలో ప్రేమ లేదు. మన మెప్పుడు మిలమిల మెఱసెడి నక్షత్రాలవైపు ప్రేమతో చూడము. గుసగుసలాడెడి నీళ్ళను చూచి ఆనందించము. జలజల ప్రవహించు సెలయేటి నీటిపై వెన్నెలల లాస్యాలు తిలకించము. ఆకాశములో ఎత్తుగా నెగిరెడి పక్షిని గూడ గమనించము. మన హృదయవీణ మూగవోయినది, అందులోనుండి సంగీతము వినిపించదు. మన కెప్పుడును తీరిక లేదు. మన మనస్సులు మానవకోటి సముద్ధరణకై వేసెడి పెద్ద పెద్ద ప్రణాళికలతో, ఉన్నతాదర్శ భావనలతో నిండియుంటాయి. అందులో మరిదేనికిని చోటులేదు. సౌభ్రాతృత్వము గురించి మనము నోటితో బాహాటముగా ప్రకటిస్తూ వుంటాము. కాని మన కంటిచూపు దానిని ప్రత్యాఖ్యానము చేస్తూ వుంటుంది. అందువలన మనకు బాల్యమందే సరియైన విద్యాబోధన జరగడం చాల ముఖ్యము. అప్పుడు మన మనస్సులు, మన హృదయములు విశాలములై, సంవేదనాశీలములై సున్నితములై సోత్కంఠములై వుంటాయి. కాని మనలోనికి భయము చేరినప్పుడు ఆ ఉత్కంఠ, ఆ శక్తి, హఠాత్తుగా ప్రజ్వరిల్లెడి ఆ అవగాహన – అవన్నీ నాశనమై పోతాయి. మనలో చాల మంది భయపీడితులే. మనము మన తల్లి తండ్రులకు, మన ఉపాధ్యాయులకు, మత గురువుకు, ప్రభుత్వానికి, మన పైయజమానికి – అందరికీ భయపడతాము. అసలు మనలను చూచి మనమే భయపడుతూ వుంటాము. అందువలన మనకు జీవితమే భయంకరము, అంధకారమయము. మనిషి నిర్దయుడగుటకు ఇదే కారణము.

## 3. ప్రశ్న:- మనస్సున కేది తోస్తే అది చేయకుండా నిగ్రహించుకొంటూనే, మనిషి తన స్వతంత్రమునకు దారి వెదకికొనగలడా?

**కృష్ణమూర్తి:-** మనము బాల్య కౌమార దశలలో వున్నప్పుడే కాదు, జీవిత పర్యంతము, వాస్తవంగా మనమేమి చేయగోరుతామో తెలిసికొనడం చాల కష్టమైన పనులలో నొకటని మీకు తెలుసునా? అసలు మీరు త్రికరణ శుద్ధిగా, ఆసక్తితో ఏమి చేయగోరుతారో మీ యంతట మీరు తెలిసికోకపోతే, తుదకు మీకు బొత్తిగా ఆసక్తి లేనిపని యేదో చేస్తూ కాలం వెళ్ళబుచ్చవలసి వస్తుంది. అప్పుడు మీ

జీవితము దుర్గతి పాలౌతుంది. మీ జీవితంలో ఆనందము లేకపోవడంచేత సినిమాలలోనో, త్రాగుడులోనో, అసంఖ్యాకమైన పుస్తకాలు చదవడంలోనో, ఏదో యొక సంఘసంస్కరణ కార్యములోనో – ఇటువంటివాటిల్లో చిత్త విక్షేపము కొఱకై ప్రయత్నిస్తారు.

అందువలన మీ తల్లిదండ్రులు, మీరున్న సంఘము మిమ్ము ఏ పనైనా చేయమని కోరితే వారి మాటను పట్టించుకోకుండా, నిజంగా మీరు మీ జీవితమంతా ఆసక్తితో చేయగోరిన పని యేదో తెలిసికోవడంలో అధ్యాపకుడు మీకు సహాయపడగలడా? అసలిదే నిజమైన ప్రశ్న, కాదా? ఎందువల్లనంటే, మీరు మనఃస్ఫూర్తిగా, ప్రేమతో ఏ పని చేయగోరుతారో దానిని మీరు తెలిసికోగల్గినట్టయితే అప్పుడు మీరు స్వతంత్ర మానవులు; అప్పుడు మీలో దానికి కావలసిన సామర్థ్యము, మనోధైర్యము, చొరవ వుంటాయి. కాని, మీరు నిజంగా దేనిని ప్రేమతో చేయగలరో తెలిసికోకుండా మీరు న్యాయవాదులో, రాజకీయనాయకులో లేక ఇంకేదేదో అయినట్లయితే అప్పుడు మీకు సుఖముండదు, ఇతరులకు సుఖముండదు. ఆ వృత్తియే మిమ్ము మీరు నాశనం చేసికోడానికి, ఇతరులను నాశనం చేయడానికిన్ని సాధనమవుతుంది.

మీరు ప్రేమతో ఏపని చేయగోరుతున్నారో మీయంతటు మీరు తప్పక తెలిసికోవాలి. సంఘంలో ఇమిడిపోవడం కోసమై అందుకు తగిన వృత్తిని ఎన్నుకొందామని ఎప్పటికిని అనుకోకండి. అట్లా అనుకొంటే మీ రిష్టపడే వృత్తియేదో మీరెన్నటికిని తెలిసికోలేరు. మీ రేదైనా పనని ప్రేమతో చేయగోరితే, అప్పుడిక ఎన్నుకొనే సమస్యే లేదు. ఏ పని మీదనైనా మీకు ప్రేమ వుంటే, మీ రా ప్రేమనే తన పని తాను చేసికోనివ్వండి. అప్పుడది యేమి చేసినా, అది సరియైన పనే అవుతుంది. కారణమేమంటే, ప్రేమ ఫలితంకోసం ప్రాకులాడదు; అనుకరణలలో చిక్కుకోదు. కాని మీరు ప్రేమించని పనికోసం మీ జీవితాన్ని అర్పిస్తే, మీ కెన్నటికిని విముక్తి వుండదు.

మనస్సున కేదితోస్తే అది చేయడం, ప్రేమించిన పనిని చేయడం కాదు; ఆ పనిని ప్రేమతో చేస్తున్నట్లు కాదు. నిజంగా ఏ పనిని మీరు ప్రేమతో చేయగోరుతున్నారో దానిని తెలిసికొనవలెనంటే ఎంతో అన్వేషణ, ఎంతో లోచూపు అవసరం. కేవలం జీవనాధారము సంపాదించుకోడానికి అవసరమనే దృష్టితో మీ రేపనినీ ఆరంభించకండి. కాని దేనిని మీరు ప్రేమతో చేయగలరో తెలిసికోగల్గినట్లయితే జీవనాధారమును గూర్చిన సమస్య దానంతట అదే తీరుతుంది.

## 4. ప్రశ్న:- పవిత్రమైన జీవితం గడిపేవారు మాత్రమే భయరహితులుగా వుంటారనేది నిజమా?

**కృష్ణమూర్తి:-** పవిత్రత, పాతివ్రత్యము, ఇంద్రియనిగ్రహము, సౌభ్రాతృత్వము, అహింస – ఇటువంటి ఆదర్శములను పెట్టుకోవద్దు; వాటి కర్థము లేదు. ధైర్యంగా వుండడంకోసం ప్రయత్నించవద్దు; అది కేవలం భయానికి ప్రతిక్రియ మాత్రమే. నిర్భయంగా వుండాలంటే అపారమగు అంతర్దృష్టి వుండాలి; భయము – అది

పనిచేసే తీరు, దానికిగల కారణము – వీటిని గూర్చి పూర్తి అవగాహన వుండాలి.

చూడండి, మీరు భద్రతను కోరుకుంటూ వున్నంతకాలము భయముంటుంది – వివాహములో భద్రత, ఉద్యోగములో భద్రత, మీ పదవిలో, మీ బాధ్యతలో – జవాబుదారీలో – భద్రత, మీ ఉద్దేశములలో మీ నమ్మకాలలో భద్రత, ప్రపంచంతో మీకుగల సంబంధములో భద్రత, లేదా దేవునితో మీకుగల సంబంధములో భద్రత. ఏ క్షణమందైనా మనస్సు, ఏ రూపంలోనైనా సరే, ఏ స్థాయిలోనైనా సరే, భద్రతకోసం తన సంతృప్తికోసం ప్రయత్నిస్తుందో, ఆ క్షణమునుండి తప్పని సరిగా భయముంటుంది. అందుచేత ఈ భయము పనిచేసే తీరు ఎఱిగియుండడం, దానిని అర్థము చేసికొనడం చాల ముఖ్యము. ఇది పవిత్రత అని పిలువబడే దానికి సంబంధించిన విషయము కాదు. ఏ మనస్సైతే హెచ్చరిక గలిగి జాగరూకమై గమనిస్తూ వుంటుందో, ఏ మనస్సైతే భయవిముక్తమో ఆ మనస్సే అమాయకమైన మనస్సు. మరి అమాయకమైన మనస్సు మాత్రమే సత్యమును, పరమార్థమును, దేవుని అర్థముచేసికోగలదు.

దురదృష్టవశాత్తు ఈ దేశమునందు, ఇతరదేశములందువలె, ఆదర్శములు అత్యధిక ప్రాముఖ్యమును వహించి యున్నాయి. ఆదర్శమంటే ఉండగోరిన స్థితి. "నేను అహింసా వాదినై యుండాలి. నేను మంచి వాడనై యుండాలి" – ఇట్లాగా ఆదర్శము – అంటే ఉండగోరిన స్థితి – ఎప్పటికిని చాలదూరమందు ఎక్కడనో వుంటుంది. అది ప్రస్తుతముండే స్థితికాదు. నిజానికి ఆదర్శములనేవి మనకొక శాపము వంటివి. కారణమేమంటే, మీరు వాస్తవికాలను ఎదుర్కోవలసి వచ్చినప్పుడు ఆదర్శములు అడ్డువచ్చి మిమ్ము సరిగా సరళంగా తిన్నగా ఆలోచించుకోనీయవు. ఆదర్శము అనగా ఉండగోరిన స్థితి అంటే దాని భావము ప్రస్తుతమున్న స్థితి నుండి తప్పించుకొని పారిపోవడం. ప్రస్తుతమున్న స్థితి ఒక తథ్యము, ఒక వాస్తవికము; దానికి మీరు భయపడుతుంటారు – మీ తల్లితండ్రులు ఏమంటారో అని, ప్రజ లేమనుకొంటారో అని మీరు భయపడుతుంటారు. సంఘానికి భయపడతారు. వ్యాధికి భయపడతారు, మృత్యువుకు భయపడతారు. మరి మీరున్న ప్రస్తుత స్థితిని యథాతథంగా ఎదుర్కొంటే – అది మీకు దుఃఖమును కలుగజేస్తూ వున్నాసరే – దాని వైపు పరిశీలనగా లోతుగా మీ మనోదృష్టిని సారించి చూస్తే దానిని మీరు అర్థము చేసికొంటే అప్పుడు మీ మనస్సు మిక్కిలి తేలిక పడుతున్నట్లు తేటదేరుతున్నట్లు గమనింపగలరు. ఆ విధంగా మనస్సు తేటదేరినప్పుడు భయము అంతర్థానమవుతుంది. దురదృష్టవశాత్తు ఆదర్శములకు సంబంధించిన అసంగతములగు సిద్ధాంతములలో మనకు బోధన జరిగినది. కాని వాటి అన్నింటి ఉద్దేశము ఒకటే – చేయవలసిన పనిని మరియొకనాటికి వాయిదా వేయడమే. కావున అవి అన్నియు అర్థరహితములు, యుక్తియుక్తములు కావు.

ఉదాహరణకు, అహింస అనే ఆదర్శము మీకున్నది. కాని మీరు అహింసాపరులా? కాదు. కాబట్టి మీలోవున్న హింస నెందుకు ఎదుర్కొనరు? మీరున్న వాస్తవ పరిస్థితి నేల చూచుకొనరు? మీలో వున్న దురాశను, మీలో వున్న పేరాశను, మీ రనుభవించు ఇంద్రియసుఖములను, మీ చిత్త విక్షేపములను పరిశీలించి చూచుకొని,

వాటినన్నిటిని అర్థము చేసికొనసాగితే, అప్పుడు ప్రగతి కొరక సాధనంగా, ఆదర్శ సిద్ధికొరక సాధనంగా మీ రూహించిన కాలము అంతమవడాన్ని మీరు గమనింపగలరు.

చూడండి, మనస్సు తాను సాధింపదలచిన దానిని సాధించడం కోసం అవసరమని కాలమును కల్పించుకొంటుంది. అందువలన అట్టి మనస్సు ఎన్నటికిని ప్రశాంతముగా నిశ్చలముగా ఉండజాలదు. నిశ్చలమైన మనస్సు – దానివెనుక వేలకొలది సంవత్సరాల అనుభవాల రాసులు ఉన్నప్పటికిన్ని – అది అమాయకమైనది, నిర్మలమైనది, నిత్య నూతనమైనది. అందువలన అట్టి మనస్సు పరస్పర సంబంధములో తన యునికి వలన తలెత్తిన సమస్యలను తాను సులువుగా పరిష్కరించుకొనగలదు.

**5. ప్రశ్న: మనిషి తన కోరికలకు తాను బలి అవుతున్నాడు; అవి అనేక సమస్యలను సృష్టిస్తుంటాయి. అతడు కోరికలు లేని స్థితిని ఎట్లు సాధించుకొనగలడు?**

**కృష్ణమూర్తి:-** కోరికలు లేని స్థితిని సాధింప గోరుకొనడం కేవలం మనస్సు చేసెడి కుయుక్తి. కోరికలవలన దుఃఖము కలగడం చూచి, ఆ దుఃఖము నుండి తప్పించుకోవడం కోసం మనస్సు 'కోరిక లేని స్థితి'ని ఆదర్శంగా ఊహించికొని, "ఆ యాదర్శాన్ని ఎట్లా సాధించుకోగలను?" అని అడుగుతుంది. అప్పుడు జరిగే దేమిటి? కోరికలు లేకుండా వుండడంకోసం మీరు కోరికలను అణచుకోవడం మొదలు పెడతారు; ఏమి, అట్లా చేయరా మీరు? మీరు కోరిక యొక్క గొంతు పిసుకుతారు, దానిని అణచివేసి చంపడానికి ప్రయత్నిస్తారు. అప్పుడు కోరికలులేని స్థితిని సాధించితిమని అనుకొంటారు – ఇదంతా వట్టి అబద్ధం, కేవలం భ్రాంతి.

కోరిక అంటే యేమిటి? అది ఒక శక్తి కాదా? మీ శక్తిని మీరు ఎప్పుడైతే అణగగొట్టుకొంటారో ఆ క్షణమే మిమ్ము మీరు ఉత్సాహశూన్యులుగా, జీవము లేని వారినిగా చేసివేసికొన్నారు. అదే జరిగినది భారతదేశంలో! ధార్మిక పురుషులని చెప్పబడే వారందరు తమతమ కోరికల నిట్లే అణచివేసికొన్నారు. అట్లా చేయకుండా ఆలోచనాపరులై విముక్తి పొందినవారు చాలా కొద్దిమంది మాత్రమే!! కాబట్టి కోరికలను చంపుకోడంకాదు ముఖ్యము, కోరిక అనే శక్తిని అర్థము చేసికొని, దానిని సరియైన మార్గమున ఉపయోగించుకోవడం ముఖ్యం.

చూడండి, మీరు చిన్న పిల్లలుగా వున్నప్పుడు మీలో శక్తి పొంగి పొరలుతూ వుంటుంది – కొండలను దాటుదామని, చుక్కలను చేరుకొందామని. అది మీలో కోరికలను పుట్టిస్తుంటుంది. అప్పుడు సంఘము ప్రవేశించి మీ రాశక్తిని చెఱసాల నాలుగు గోడల మధ్యనే పట్టి బంధించి వుంచమని ఆదేశిస్తుంది. ఆ చెఱసాలనే మర్యాద అని, గౌరవనీయత అని పేరుపెట్టి పిలుస్తుంది. విద్య ద్వారా, అనేక రూపములైన అదుపుల ద్వారా, ఆంక్షల ద్వారా ఆ శక్తి క్రమేపి అణగద్రొక్కివేయబడుతుంది. కాని అసలు మీకు కావలసినది ఇంకా ఎక్కువ శక్తి, తక్కువ శక్తి కాదు. కారణమేమంటే, అపారమైన శక్తి గనక లేకపోతే, మీరు సత్యమును ఎన్నటికిని కనుగొనలేరు. కాబట్టి శక్తిని ఎట్లా అణచివేసికోవాలి, ఎట్లా తగ్గించుకోవాలి అనేది కాదు ప్రశ్న. దాని నెట్లా నిలుపుకోవాలి, ఎట్లా

వృద్ధి పొందించుకోవాలి, నమ్మకము యొక్క గాని, సంఘము యొక్క గాని ఆదేశములతో సంబంధము లేకుండా ఆ శక్తి నెట్లా స్వతంత్రముగను అవిచ్ఛిన్నముగను ప్రవర్తింపజేయాలి అనేది ప్రశ్న. అట్లా చేయగలిగితే, అదే సత్యముదిశగా, దేవుని దిశగా చేసెడి పయనమవుతుంది. అప్పుడు శక్తికి గల అర్థమే వేరుగా వుంటుంది. ప్రశాంతమగు సరస్సులో ఒక రాతిని విసరినప్పుడు వలయములు వలయములుగా అలలు పుట్టి, ఆగిపోకుండా విశాలమవుతూ వ్యాపిస్తాయి. అట్లే సత్యము దిశగా శక్తి చేయు పయనము నూతన సంస్కృతి తరంగములను సృష్టిస్తుంది. అప్పుడా శక్తి అనంతము, అప్రమేయము. ఆ శక్తియే దేవుడు.

*8 ఫిబ్రవరి, 1955*

★ ★ ★

# ఈ పుస్తకం గురించి...

జిడ్డు కృష్ణమూర్తి ఈ శతాబ్దిలోని ప్రపంచ ప్రసిద్ధ తత్త్వవేత్తలలో ఒకరు. ఆయన పుట్టింది ఆంధ్రప్రదేశ్‌లోని చిత్తూరు జిల్లా మదనపల్లిలో; పెరిగింది అనిబెసంట్ పోషణ క్రింద, ఇంగ్లండులో. ఆయననందరు ఆప్యాయంగా కృష్ణజీ అని, J.K. అని పిలిచేవారు.

మానవుని సర్వబంధవిముక్తుని, సంపూర్ణ స్వతంత్రుని చేయడమే ఆయన జీవిత లక్ష్యము. బాలబాలికలు భయరహితమైన వాతావరణంలో పెరుగుతూ విద్యనభ్యసింప వలెనని, స్వతంత్రముగా నాలోచింప సమర్థులై సత్యాన్వేషణ చేయవలెనని, అప్పుడే వారు నూతన సంస్కృతికి బాటలు వేయగలరనివారిచ్చిన సందేశము. దానిని ఆచరణలో పెట్టవలెననే ఉద్దేశముతో కృష్ణమూర్తి ఫౌండేషనువారు భారత దేశములోను, ఇంగ్లండులోను, అమెరికాలోను కొన్ని ఉత్తమ పాఠశాలలను నెలకొల్పి యున్నారు.

వారణాసిలోని కృష్ణమూర్తి ఫౌండేషనువారి 'రాజ-ఘాట్ బెసంట్ స్కూలు' విద్యార్థులనుద్దేశించి 1954-55 లో కృష్ణజీ చేసిన 27 ప్రసంగాలకు పరిష్కరింప బడిన వాటికి అనువాదమే ఈ పుస్తకము.
దీనికి తెలుగులో 'ఈ విషయమై ఆలోచించండి' అని పేరు పెట్టబడినది. మఱి, ఆ విషయమేదో పుస్తక మంతా చదివినవారికి అర్థమవుతుంది.

